శ్రీః

# ఎఱ్ఱయ తీర్చిన హరివంశము



ర చ న :


డా॥ సంధ్యావందనం గోదావరీబాయి

ఎం. ఏ. (తెలుఁగు) ఎం. ఏ. (సంస్కృతము) పి హెచ్. డి., బి ఇడి.

ప్రథమ ముద్రణము :
ప్రతులు — వేయి
క్రోధన అధిక శ్రావణము
ఆగష్టు — 1985





మూల్యము : 50 రూపాయలు

ప్రతులకు :-

**Dr. S. GODAVARI BAI,**
**3/51 A, IInd Road,**
**New - Town**
**ANANTAPUR.**

ముద్రణ :

వెరైటీ ప్రింటర్స్,
ఏలూరు.

# అంకితము



నా ఆరాధ్య దైవమునకు

పవమాన పుత్రునకు

శిరసా మనసా

నమశ్శతాంజలులతో

ఈ పరిశోధన పుష్పార్పణము.



"This Book is Published with the Financial Assistance of Tirumala Tirupati Devasthanams under their Scheme Aid to Publish Religious Books"

# కరదీపిక

శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయము పి. హెచ్. డి పట్టమును పడసిన పరిశోధన గ్రంథము డాక్టర్ యస్ గోదావరీబాయి రచించిన "ఎఱ్ఱయ తీర్చిన హరివంశము" ఈమె సంస్కృతాంధ్ర సాహిత్యములందు సమప్రావీణ్యము కల పరిశోధకురాలు అగుటచే, పరిశోధనము పైపైమెఱుగులు వెలార్చక, లోలో వెలుగులు వెదఁజల్లినది.

ఇంతకు ముందు "తెలుగులో హరివంశములు" అని ఒక పరిశోధనగ్రంథము వెలువడినది. అది విస్తృత పరిధి కలది. అందువలన అందు సంస్కృతాంధ్ర హరివంశ సమ్యక్పరిశీలనము గౌణమైనది. ఇందు ప్రధానము ఇది కేవలము సంస్కృతాంధ్ర హరివంశ సమగ్రపరిశీలనమే. సకలచరాచర ప్రపంచమునకు త్రిమూర్తులవలె, బహుళాంధ్రోక్తి మయప్రపంచమునకు నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలు త్రిమూర్తులు. వీరి కవిత విరాట్ స్వరూపము వివిధభంగుల, విభిన్నదృష్టుల నిరంతరము దర్శనీయము.

ఇందు హరివంశము భారతపరాంశమని బుధులు చెప్పుటకు గల హేతువు సప్రమాణముగ నిరూపింపఁబడినది. ఎఱ్ఱన హరివంశము పురాణము, కావ్యమును అను విషయము సోపపత్తికముగ ప్రతిపాదింపఁబడినది. "జగదర్చితంబగు ప్రబంధంబు నిర్మింప నుపక్రమించితిని" అనిన ఎఱ్ఱాప్రెగ్గడ ఆంతర్యము చక్కగ ఆవిష్కరింపఁబడినది. ఎఱ్ఱన కవిత్వములోని వర్ణనాత్మకత ప్రయోజనాత్మకముగ ప్రస్తరింపఁబడినది రూపచిత్రణములోని భావజీవము, రసోపస్కారము, పాత్రోపయోగము విశదీకరింపఁబడినది. ఎఱ్ఱన గ్రామీణ జీవనచిత్రణము ఎంత స్వతంత్రమో, సూక్ష్మపరిశీలనాత్మకమో, నిసర్గసుందరమో, ఆంధ్రదేశీయమో – అనుపదము మూలమును అనుశీలించి నిర్ధరింపఁబడినది. ఈ సంస్కృతాంధ్ర హరివంశ తారతమ్య నిరూపణము, పరిశోధన గ్రంథమునందంతట పర్యాప్తమై యున్నది. మూలము నుండి వదలిన భాగములకు కారణములు తెలుపఁబడినవి. హరివంశ రచనము నందు ప్రతిఫలించిన ఎఱ్ఱన వ్యక్తిత్వము సమీకరింపఁబడినది. హరివంశమునందు గర్భితమైన ధర్మధ్వని వ్యాకరింపఁబడినది. ఇట్లు "ఎఱ్ఱన తీర్చిన హరివంశము" కూలంకషముగ, క్షోదక్షమముగ, పరిశోధకురాలి ప్రజ్ఞాపాటవములకు దీటుగ కలదు

కవిత్రయమునందు ఎఱ్ఱన ఒకడైనను; అరణ్యపర్వశేషము భారత మధ్య భాగము, హరివంశము భారత చరమభాగమును అయినను. నన్నయ తిక్కనల గురించి సాగినంత విమర్శన వ్యాపారము, పరిశోధనవ్యాసంగము ఎఱ్ఱన గురించి సాగలేదు. సాగిన కొంత ముద్రణభాగ్యము నందలేదు. అంతేకాదు నన్నయ మహాకవి. తిక్కన మహాకవి అను కైవారగానములేకాని, ఎఱ్ఱన మహాకవి అను వైతాళిక గానము మ్రోయలేదు. ఉపరి మహాకవి పోతనకు మార్గదర్శి ఎఱ్ఱన. ఇది కూడ ఇంకను వెలుగుముఖము చూడలేదు. ఒక విధముగ నన్నయ మహాకవి మఱొక విధముగ తిక్కన మహాకవి ఇంకొక విధముగ పోతన మహాకవి. వేఱొక విధముగ ఎఱ్ఱన మహాకవి. ఎఱ్ఱన ఎంత మహాకవియో అంత జాగృతి కలిగించునదీ పరిశోధన గ్రంథము.

పరిశోధనగ్రంథము సంఘటించి, పరమపట్టమును స్వీకరించి, పరిశోధనకు స్వస్తివాక్యము పలుకుట సామాన్యలక్షణము. పరమ పట్టభద్రులైనను పరిశోధనకు స్వాగత వాక్యము పలుకుట ధీమాన్య లక్షణము. సామాన్యలక్షణము కాక ధీమాన్య లక్షణము కల డాక్టర్ యస్ గోదావరీబాయి "ఎఱ్ఱనకృతులు - రసప్రస్థానము" అను ఇంకొక పరిశోధన గ్రంథమును సంతరించుటయేగాక, ఎఱ్ఱయపీఠము వారి అత్యుత్తమ గ్రంథబహుమానమును బడయుట అత్యంత ప్రశంసాపాత్రము. అది కూడ త్వరలో సహృదయులను అలరించునుగాక.

అరుదైన గోదావరీనామధేయము, అరుదైన పరిశోధన కేదారములను ఇంకను పండించి ఇతోధికాభ్యుదయము నందుగాక.

- ఆచార్య కోర్లపాటి శ్రీరామమూర్తి
ఎం. ఏ., పిహెచ్. డి , డి. లిట్



ఆచార్య
శలాక రఘునాథశర్మ
తెలుగు శాఖ
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయము

శ్రీ వేంకటేశ్వరపురం
అనంతపురం - 515003
26-7-1985

# అ భి నం ద న

ఆర్షవాఙ్మయములో శ్రీమన్మహాభారతము ఒక విజ్ఞాన సర్వస్వము. హరి వంశమును "భారత పరాంశమని యింపారగఁ జెప్పుదురు బుధులు". పరాంశ మనగా పరమార్థముగల భాగమని నేను గ్రహించు నర్థము శ్రీకృష్ణపరతత్త్వము అందు బహుధా ప్రపంచిత మయినది. "భగవాన్ వాసుదేవోఽపి కీర్త్యతేఽత్ర సనాతనః" అని భారతమును గూర్చి వ్యాసవచనము. కావున హరివంశము పరమ పురుషార్థమైన మోక్షధర్మమును వక్కాణించు పరమోత్కృష్ట గ్రంథరాజము. ఒక విధముగా అది జ్ఞానకాండ.

ఆంధ్ర వాఙ్మయములో ఎఱ్ఱన "సర్వమార్గేచ్ఛా విధాతృడు"గా యోగ్యతమ ప్రశంసకు పట్టయినవాడు. తెలుగు చదువు ఆరంభించిననాటి నుండియు నాకాతనిపై ఒక ప్రత్యేకమైన ఆత్మీయత కలదు. అది నాటినుండి నేటివరకు క్రమాభివృద్ధి మార్గమునే అవలంబించుచున్నది. ముఖ్యముగా అతని పరిణత ప్రజ్ఞయు, ప్రసన్న కవితా మాధుర్యమును, వినయశీలమును ముచ్చట గొలుపు విషయములు. "శైలా ఇవోన్నతాః సన్తః కిన్తు ప్రకృతి కోమలాః" అను సూక్తిని సమన్వయించుకొనటకు ఎఱ్ఱయ చక్కని తావు

అనంతపురములో సంస్కృత భాషా-ఆర్ష విజ్ఞానముల ప్రచారమే జీవిత పరమావధిగా పెట్టుకొన్న మహనీయులు కీర్తిశేషులు బ్రహ్మశ్రీ వేదమూర్తులు మేడవరం సుబ్రహ్మణ్య శాస్త్రిగారు. వారిది ఒక విచిత్రమైన గురుకులము. వైచిత్రి ఏమనగా అట్టి దొకటి యున్నదని అనంతపుర వాసులకు అనేకులకు తెలియకపోవుటయే. వారు సుమారు ఆరుపదులకు పైబడిన కాలమును ఆ గురుకులమును అట్లే నిర్వహించిరి. వారు స్వీకరించిన గురుదక్షిణ కతిపయ ఛాత్రుల గుండెలలో నిండిన గౌరవము మాత్రమే. శ్రీవారి ప్రియతమ శిష్య డా॥ (కుమారి) సంధ్యావందనం గోదావరీబాయి.

గురువుల వలన నేర్చిన విద్యను అధ్యాపనముతో అనుభవమునకు తెచ్చుకొని కేవలము దానిని సద్వినియోగము చేయవలయునను తాత్పర్యముతో ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశాధ్యయనముపై ఆమె పరిశోధనకు గడంగినది. ఈ దినములలో ఆర్ష సాహిత్యమువైపు చూపు నిలుపుటకు సంద్రైన పాండిత్యముతో పాటు కొండంత ధైర్యసాహసములును కావలయును. అధ్యయనాధ్యాపనములు తప్ప ఇతర వ్యాసంగములపై మనసును ప్రసరింపనీని నిష్ఠ. చేపట్టిన కార్యమును – శరీరరుగ్ణతను కూడ పరిగణింపక – నిర్వహించు దీక్ష, విషయమును సునిశితముగా ఆమూలము పరిశీలించు ప్రజ్ఞ అనునివి కుమారి గోదావరీబాయి సాహిత్యమూర్తికి వాసియు వన్నెయు చెడని భూషణములు. వాని మనోజ్ఞకాంతుల సముదాయ రూపమే "ఎఱ్ఱయ తీర్చిన హరివంశము" అను నీ గ్రంథము.

ఆమె ఈ గ్రంథమున ఎఱ్ఱయ హరివంశమును మూలగ్రంథముతో తులనాత్మకముగా పరిశీలించి శ్రీ వ్యాస భగవానుని ఇతిహాసమును ఎఱ్ఱయ ఇతిహాసధర్మము చెడని కావ్యముగా ఎంతసమర్థముగా తీర్చెనో వివిధ దృక్కోణములనుండి పరీక్షించి నిరూపించినది. పరీక్షకుల సత్య ప్రశంసలకు పాత్రయైనది. హరివంశమును, అట్టి గ్రంథములను అధ్యయనము చేయగోరు ఆంధ్ర 'విద్యార్థి' లోకమునకు ఈ గ్రంథము ఆరని జ్యోతినిచ్చు కరదీపికగా నలరారునని పూర్ణవిశ్వాసము. ఇది ఆమె సత్కృతికి నా అక్షరాభినందన.

ఇతిశమ్.

—రఘునాథశర్మ.



# ము ం దు మా ట

"ఎఱ్ఱయ హరివంశము - విమర్శనాత్మక పరిశీలనము" అను పేరిట 1983వ సంవత్సరమున శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయము వారి "డాక్టరేటు" పట్టమునకు నాచే సమర్పింపఁ బడిన సిద్ధాంత వ్యాసమిది. ఆ వ్యాసమే "ఎఱ్ఱయ తీర్చిన హరివంశము" అను పేర ముద్రితమై వెలసినది.

ఎఱ్ఱాప్రెగ్గడ రచించిన హరివంశమును మూలముతో పోల్చి విమర్శనాత్మకముగ పరిశీలించుటయే ఈ నాపరిశోధన విషయము.

ఇంతకు పూర్వము ఎఱ్ఱయ కృతులపైనను, తెలుఁగులోని హరివంశముల పైనను పరిశోధనలు గావింపబడినవి. కాని కేవలము ఎఱ్ఱయ హరివంశముపై మాత్రము సమగ్రపరిశోధన జరుగలేదు. అదియును మూలముతో తులనాత్మక పరిశీలన గావించుట ఈ నాపరిశోధన ప్రత్యేకత.

ఎఱ్ఱయ హరివంశమును మూలముతో పోల్చిచూచు సందర్భమున మూలమునకు మెఱుగులు దిద్దిన సన్నివేశములను ఎత్తిచూపితిని. ఇది మూలమును కించపఱచు నుద్దేశముతోఁగాదు. మూలరచననాటి దేశకాల పరిస్థితులు వేఱు. ఆ కాలమున, ఆదేశమున వ్యాసభగవానుఁ డుచితమని యెంచినది - ఎఱ్ఱయనాటి కనుచితము లయి నేడును ఉచితము కాదని మనము భావింపవచ్చును అట్లుచితము కాదని చూపినంత మాత్రమున మూలమునెడ గౌరవములేదని తలంపరాదు.

ఎఱ్ఱయ దృష్టి కావ్యదృష్టి. వ్యాసునిదృష్టి పురాణదృష్టి వ్యాసునిపురాణదృష్టికి సమంజసమనిపించినది ఎఱ్ఱయ కావ్యదృష్టి కనుచితమై యుండవచ్చును. కనుకనే – ఎఱ్ఱయ పునరుక్తులని తోచిన వాని ననువదింపలేదు - కథాగతికి భంగము కలిగించు వర్ణనలను తొలఁగించెను.

హరివంశమునకు భారతముతోఁగల సంబంధమును వివిధ దృష్టి కోణములతో పరిశీలించితిని.

ఎఱ్ఱయ హరివంశమునఁగల పురాణ కావ్యలక్షణములను పరిశోధించితిని. పురాణమును కావ్యముగా మలఁచినపుడు కొన్ని మార్పులవసరములు. రసపోషణ దృష్టితో కొన్ని సవరణలు చేయవలసి యుండును. కనుకనే ఎఱ్ఱయ మూలమున సుదీర్ఘ వర్ణనలను సంక్షిప్తపఱచియు, విసుగు జనించు ధర్మబోధలను తొలఁ

గించియు, కావ్యముగా రూపొందించినాఁడు కనుక నిట్లు మూలముతో తులనాత్మక పరిశీలన గావించునెడ మూలమును పేర్కొని దీర్ఘములని, పాఠకులకు విసుగు జనింప వచ్చునని భీతి కలిగినను సుదీర్ఘములగు మూలశ్లోకములను యథాతథముగ పొందు పఱచితిని. పురాణ లక్షణములతోనొప్పు హరివంశము కావ్యముగా రూపొందినది.

పురాణ లక్షణములగు – సృష్టి ప్రతిసృష్టి, వంశము, మన్వంతరము, వంశాను చరితము – మున్నగు వానిని హరివంశమున చూపు పట్టుల – రాజులు, రాజుల వంశము, సంతానము, మనువంశరాజుల పరిపాలనావ్యవస్థ విసుగు జనించు సుదీర్ఘ మగు పట్టికగా మాఱినది. అయినను పురాణ లక్షణములకు సమగ్రమగు లక్ష్యముల చూపు సందర్భమున నిట్టి విశద వివరణ చేయక తప్పినది కాదు.

ఎఱ్ఱయకు గల ప్రబంధ పరమేశ్వరత్వము హరివంశము వలననే యని సహేతుకముగా నిరూపించితిని. వర్ణనాత్మకశైలి కాద్యుఁడగు ఎఱ్ఱయ వర్ణనాత్మకత – హరివంశమున – ప్రకృతి చిత్రణమునందు, వస్తు చిత్రణమునందు, చేష్టావర్ణనము నందును, భావ ప్రకటనమునందును – ఎన్నిభంగుల రసస్ఫోరకముగా రూపొందినదో పరిశీలించితిని. వర్ణనాత్మకత కితఁడే యాద్యబ్రహ్మయనుట సార్థకమని నిరూపించితిని.

ఎఱ్ఱయకు గ్రామీణ జీవనము నందభినివేశము మిక్కుటము. ఆ యభినివేశము ఆతని గ్రామీణ జీవిత చిత్రణమునందన్ని కోణముల నుండి సమీక్షించి మూలముతో తులనాత్మక పరిశీలన గావించితిని.

మూలమునందలి కొన్ని ఘట్టములను ఎఱ్ఱయ పూర్తిగా తెనిఁగింపక తొలఁగించినాడు. ఆయాఘట్టములను తొలఁగించుటకు కారణముల నన్వేషించితిని.

ఎఱ్ఱయ రచనల యందలి అవతారికలను, మూలమునలేని సన్నివేశము లను వర్ణనలను, ఆధారముగా గొని యాతని వ్యక్తిత్వమును నిర్ణయించుటకు కొంతవఱకు కృషిసల్పితిని.

ఎఱ్ఱయ దృష్టిలో హరివంశ రచనా ప్రయోజనమును పరిశీలించితిని. నా యీ పరిశోధన ఆంధ్రభాషాభిమానుల కేమాత్ర ముపకరించినను నా పరిశ్రమ సఫలమైనదిని యాశించుచు

వినతితో

**Dr. సంధ్యావందనం గోదావరీబాయి**

# కృతజ్ఞతలు

సాహిత్యమొక అపార పారావారము ఈ పారావారమున ప్రవేశించి మథించిన కొలది, మథించిన వారి మేధ కొలది అందమూల్యార్థములు ధ్వనించుచునే యుండును. గుణరత్నములు కనిపించుచునే యుండును.

ఆంధ్ర సాహిత్యమున పరిశోధన సలిపి సంస్కృత భాషలో తులనాత్మక పరిశీలన గావించి యేదేని యొక సిద్ధాంత వ్యాసమును స్థాపింపవలయుననునది నా చిరకాల వాంఛ.

నా యీ వాంఛకు అక్షరరూపమును కల్పింప నవకాశము నొసంగి, అనుమతి నిచ్చిన భగవాన్ సత్యసాయిబాబావారికి నా ప్రథమ ప్రణామాంజలి. కళాశాల యాజమాన్య సభ్యులకు, ప్రిన్సిపాల్ డాక్టర్ హేమలతగారికి నా కృతజ్ఞతలు.

శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయమున అభ్యర్థిగా పరిశోధన గావింప నవకాశము కల్పించిన ఆచార్య కోరాడ మహాదేవ శాస్త్రిగారికి, ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావుగారికిని నా కృతజ్ఞతలు.

నా మనస్తత్త్వమును గుర్తించి నాయభినివేశమునకు తగిన విషయమునే పరిశోధన కొసంగి, శరీరదుగ్మతచే పరిశోధన ఆగిపోయినపుడంతయు ప్రోత్సహించి నాగ్రంథమున కీరూపము వచ్చువఱకుకు పర్యవేక్షకులై నిలిచిన ఆచార్య శలాక రఘునాథశర్మగారికి నా కృతజ్ఞతాశతములు.

మూలము నామూలాగ్రముగ పఠించి తులనాత్మక పరిశీలన చేయగలుగు నంతటి సంస్కృతాభినివేశము నాలో కలుగుటకై, కారణభూతులు - కీర్తిశేషులు వేద మూర్తులు బ్రహ్మశ్రీ మేడవరం సుబ్రహ్మణ్య శాస్త్రిలుగారు వారికి నా నమస్సుమాంజలులు.

మేధాసంపన్నులు, పాండితమండితులు, కవితల్లజులు నయిన సోదరసమానులు శ్రీమాన్ పుట్లూరు శ్రీనివాసాచార్యులు ఈ పరిశోధనను శుద్ధప్రతిగా వ్రాయనంగీకరించుట నాభాగ్య విశేషము. వారికి నాహార్దికాభివందనములు.

పరిశోధన గ్రంథము రూపొందు వఱకును కుడియెడమలుగా నిలిచిన నాసోదరీ సోదర బృందమునకు శుభాశీస్సులు. మాతృశ్రీకి ప్రణామాంజలులు.

ప్రత్యక్షముగను, పరోక్షముగను నాపరిశోధనకు సాయమొనర్చిన మహానుభావులెందఱో - మఱెందఱో వారందరికీ నా వందనములు.

అస్వస్థత వలననో మఱేకారణము వలననో పరిశోధన కుంటుపడినపుడు నాలోని జడభావమును పోద్రోలి అదృశ్యహస్తమై పరిపూర్ణ చైతన్యమును పూరించి ఏకాగ్రత కల్గించి పరిశోధన నడపించిన అతీత శక్తికి - నాఆరాధ్యదైవమునకు - పవమాన పుత్రునకు శిరసా మనసా నమస్కృమాంజలులతో ఈ పుష్పార్పణము.



# విషయానుక్రమణిక


1. హరివంశము - భారతముతో సంబంధము 1 - 14

భారతమునకు హరివంశము పరిశిష్టము - అనుబంధము - పూరకము - ఖిలము. భారతమున అప్రధానముగా నుండిపోయిన తత్త్వమును ప్రధానముగావించి రచించిన కావ్యము హరివంశము. భారతీయుల ఆధ్యాత్మిక విశ్వాసమును ప్రతిబింబింపఁ జేయునది హరివంశము. ఖిలమగు హరివంశము లేనిదే భారతమునకు సమగ్రతలేదు

2. ఎఱ్ఱయ - హరివంశము 15 - 51

ఎఱ్ఱయ వంశము - తలిదండ్రులు - నివాసస్థలము - ఎఱ్ఱయ నాఁటి రాజకీయ పరిస్థితులు - ఎఱ్ఱయ కృతులు - రచనాకాలము- గ్రంథముల పౌర్వాపర్యముల గుఱించిన వాదములు - నిర్ణయము.

3. ఎఱ్ఱయ హరివంశము-పురాణకావ్య సమన్వయము 52 - 111

భారతీయ వాఙ్మయము వేదములు, స్మృతులు - వాని ప్రాముఖ్యము పురాణములు - పంచలక్షణములు - ఎఱ్ఱయ హరివంశమునందలి పురాణలక్షణములు - ఎఱ్ఱయ హరివంశమునందలి కావ్యలక్షణములు - మూలముతో తులనాత్మక పరిశీలనము - ఎఱ్ఱయ హరివంశము పురాణ లక్షణములు గల కావ్యము - కావ్యము, ప్రబంధము ఆనాటికి సామాన్యవాచకములు. కనుక ఎఱ్ఱయ కావ్యము ప్రబంధము. ఎఱ్ఱయ ప్రబంధ పరమేశ్వరుఁడు.

4. ఎఱ్ఱయ ప్రబంధ పరమేశ్వరుఁడు 112 - 119

ఎఱ్ఱయకుఁగల ప్రబంధ పరమేశ్వరత్వమునకుఁగల కారణములు - పలువుర పలురకముల వాదములు - ఎఱ్ఱయకు హరివంశరచన వలననే "ప్రబంధ పరమేశ్వరత్వము" - కలిగినది - అందులకు హేతువులు. ప్రబంధమునకు జీవప్రాయములగు వర్ణనలే హరివంశకర్తకు ప్రబంధ పరమేశ్వరత్వము సమకూర్చినవి.

5. ఎఱ్ఱన - వర్ణనాత్మకత : 120 - 178

ఎఱ్ఱన వర్ణనాత్మక శైలికి ఆద్యబ్రహ్మ ఈ వర్ణనలు వస్తువర్ణన మని, రూపచిత్రణమని, భావచిత్రణమని మూడు విధములు. అందులో వస్తువర్ణన - గ్రీష్మర్తువర్ణన- మూలముతో తులనాత్మక పరిశీలన - వర్షాకాలవర్ణన - మూలముతో తులనాత్మక పరిశీలన- ఎఱ్ఱయ పాటించిన ఔచిత్యము - శరత్సమయ వర్ణనలు - ప్రకృతి వర్ణనలో - భావిని సూచించునవి - కథానాయకునితో సామ్యము కలిగినవి - తాదాత్మ్యము చెందినవి.

6. ఎఱ్ఱయ హరివంశము - రూపచిత్రణ : 179 - 208

శబ్దశక్తులు - అందులో వ్యంజనాశక్తివలన వ్యంగ్యము గోచరించును వ్యంగ్యప్రధానమైన కావ్యముత్తమము - ధ్వనిభేదములు- అవివక్షితవాచ్యధ్వని, వివక్షితాన్య పరవాచ్యధ్వని, అవివక్షిత వాచ్యధ్వని - లక్షణామూలము - భేదములు. వివక్షితాన్యపర వాచ్యధ్వని - అభిధామూలము-భేదములు. ఎఱ్ఱయ రూపవర్ణనలు రసమునకుద్దీపనములుగా, భావధ్వనులుగా, రసస్ఫోరకములుగా నున్న కొన్ని ఘట్టములను ఉదహరించుట జరిగినది.

7. ఎఱ్ఱయ - మనోభావ వర్ణన :- 209 - 242

ఎఱ్ఱయ మనోభావ వర్ణనా వైదగ్ధిని చాటు కొన్ని ఘట్టముల పరిశీలన నరకాసురవధ - పరిశీలన - వివిధ ధ్వని భేదములతో అందలి సన్నివేశముల సమన్వయము - శ్రీకృష్ణుడు శివునిగురించి తప మొనరించుటకై కైలాసమునకేగు ఘట్టము- అందలి చమత్కారము కంసుని మరణమున తద్భార్యలు విలపించిన ఘట్టము అందలి రసపుష్టి - వామదేవ భరద్వాజులు శ్రీకృష్ణు నెఱిగి స్తుతించుట ఘంటాకర్ణుని ముఖమున వెలువడిన భావములు - ఎఱ్ఱయ వర్ణనా నిపుణతకు నిదర్శనములు

8. ఎఱ్ఱయ గ్రామీణ చిత్రణ : 243 - 301

ఎఱ్ఱయ గ్రామవైభవము – మూలముతో తులనాత్మక పరిశీలన– వలసపోవు విధానము – పశువుల రోగములు – క్రూరమృగములు పల్లీయుల పెట్టుబాధలు– గోపాలురు వ్యాధిగ్రస్తులై పడు బాధలు– శాంతిపూజలు – జాతరలు దేవతలు, భూతములు – ఆవేశములు గ్రామమునందలి బాలుర క్రీడలు – సామూహిక ఉత్సవములు – కుటుంబపద్ధతి – ఇంద్రోత్సవము – పర్వతపూజ – ఉత్సవ సంరంభములు – గ్రామీణుల విశ్వాసములు – పల్లె జీవితమున ఆంధ్రతాముద్ర.

9. ఎఱ్ఱయ మూలమునందలి వదలిన ఘట్టములు– త్యాగ హేతువులు : 302 - 327

ఎఱ్ఱయ మూలమునుండి అనువదింపక తొలఁగించిన భాగములు – తొలఁగించుటకు హేతువుల నిర్ణయము.

ఆర్యాస్తుతి – నానావ్రతములు – పిండారక తీర్థయాత్ర – షట్పుర వధ – అంధకాసురవధ – భానుమతీ హరణము – నికుంభవధ – వజ్రనాభుని తపస్సు – హంసడింభకుల చరిత్ర – వీనిని ఎఱ్ఱయ అనువదింపనందుకు కారణములు.

పునరుక్తములు పునరుక్తాభాసములు, కథాగతికి భంజకములు, కావ్య తత్త్వాపకర్షకములు–వస్తు, పాత్రరస పోషణకు భంగము కలిగించునవి – వీనిని తొలఁగించి హరివంశమునకు ప్రబంధత్వము చేకూర్చినాఁడు.

10. ఎఱ్ఱయ – వ్యక్తిత్వము : 328 - 392

ఎఱ్ఱయ తన్నుగూర్చి చెప్పుకొనిన విషయములు, ఇతరులాతనిని ప్రశంసించిన విధానము, మూలమునుండి గావించిన మార్పులకు కారణములు – బిరుదములు – వీనినాధారముగాఁగొని ఇతని వ్యక్తిత్వము కొంతవఱకు నిర్ణయింపఁబడినది. సాధుసమ్మతుఁడు – గిరిశపదభక్తి, గోవిందగుణాధారము కలవాఁడు, నిత్యసౌమ్యవతి, ఆత్మసంయమనము గలవాఁడు, శివకేశవులందు సమాన ప్రతిపత్తి

గలవాఁడు, గురుభజన పరాయణుఁడు, సత్యాభిమాని, భక్తిభావ భరితుఁడు, ఉచితజ్ఞుఁడు, సూక్ష్మపరిశీలనాదక్షుఁడు, దాక్షిణ్య ధనుఁడు, పరమసాత్త్వికుఁడు, సందర్భోచిత వర్ణనావైదగ్ధి గల వాఁడు, భక్త్యావేశమున తన్మయత్వము నొందు భాగవతుఁడు, ఆంధ్రతత్త్వమును, ఆంధ్రాచారములను, ఆంధ్ర విశ్వాసములను ఆదరించువాఁడు. స్త్రీలయెడ గౌరవము, గోవులయెడ ప్రీతి కలిగిన వాఁడు. నిరాడంబరజీవి పరనిందాసహిష్ణువు. మతోన్మాదమున కితని చిత్తము దూరము.

11. హరివంశము - ధర్మధ్వని : 393 - 401

హరివంశమున ధర్మము వ్యంజితము ఎఱ్ఱయ దుష్టశిక్షణ-శిష్టరక్షణ జరుగగలదని ఆశ్వాసించెను ఉత్సాహము, కర్తవ్యనిష్ఠ, భగవద్భక్తి ప్రోత్సాహింపఁబడినవి. హరిహరాభేదతత్త్వము స్థాపితము ధర్మము శాశ్వతమని, అధర్మము జయించినను తాత్కాలికమే అని తెలియఁజేసినాఁడు ఎఱ్ఱయ.

రసానందముతోపాటు ధర్మబోధ జరిగినది... "సర్వకార్య సాఫల్యమునకు భగవంతుని కృప అవసరము. మానవుడు నిమిత్త మాత్రుఁడు. కర్మయందే మానవునకధికారముకాని కర్మఫలము నందధికారము వలదు. శాశ్వతానందదాయకమగు భగవంతునిలో సాయుజ్యమునకై ప్రతిమానవుఁడు యత్నింపవలెను. అని బోధింపబడినవి.

విశ్వకళ్యాణమే సత్కావ్య ధ్యేయము. అది యీహరివంశ మూలమున కాంక్షితము.

12. ఉపసంహారము : 402

13. ఉపయుక్త గ్రంథ సూచిక : 403 - 404

---

# 1. హరివంశము - భారతముతో సంబంధము

"ఇద మంధం తమః కృత్స్నం జాయేత భువనత్రయం
యది శబ్దాహ్వాయం జ్యోతి రాసంసారం నదీప్యతే ॥"

భారతీయ సాహిత్యమున ఆదిభాషగా వెలసినది సంస్కృతము. ఈ సంస్కృత మున - ఆదికవియై వెలసిన వాఁడు వాల్మీకి మహర్షి. ఆ మహర్షి తర్వాత సంస్కృత మున ఎన్నఁదగిన మహనీయమూర్తి వ్యాసుఁడు.

వ్యాసుఁడు పంచమవేదమగు మహాభారతమును లక్షగ్రంథ పరిమితముగా జనసామాన్య విజ్ఞానమునకై వెలయించెను. లోకసంగ్రహాపేక్షనుఁగోరి అష్టాదశ పురాణములను నిర్మించెను. ఆత్మానందమును కాంక్షించి, హరివంశమును, భాగవత మును రచించెను ఈ హరివంశము భారతీయులకు ఇహపరసాధకము.

మహాభారతమువంటి విస్తృత గ్రంథము మఱియే సాహిత్యము నందునులేదు. చతుర్విధ పురుషార్థములే కావ్యమునకు ప్రయోజనము. అనేకోపాఖ్యానములకిది నెలవు, ఆధ్యాత్మిక తత్త్వప్రతి పాదకములగు కథలిందు కోకొల్లలు, ధర్మతత్త్వమును నిరూపించు ఉపాఖ్యానము లిందు లెక్కకు మిక్కిలి.

"ధర్మేచార్థేచ కామేచ మోక్షే చ భరతర్షభ!
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్ క్వచిత్"

అని వ్యాస భగవానుఁడు భారతమహిమను వాక్రుచ్చినాఁడు. ధర్మార్థ కామ మోక్షములకు సంబంధించిన దంతయు భారతమున గలదు. ఇందులేనివి మఱెందును లేవు.

ధర్మతత్త్వజ్ఞుల కిది ధర్మశాస్త్రము. ఆధ్యాత్మ విదులకిది వేదాంతము. లాక్షణి కులకిది పరమలక్ష్య సంగ్రహము, ఐతిహాసికుల కిది ఇతిహాసము. పరమపౌరాణికు లిద్దానిని పురాణమని సేవింతురు. అట్టి మహాభారతమునకు ఖిలమై వెలసినది హరి వంశము.

భారతాంతర్భాగము భగవద్గీత. ఇది జ్ఞాన, భక్తి; కర్మయోగముల కూడలి: అపూర్వ వేదాంతగ్రంథము: మానవ జీవితమునకు మార్గదర్శి: భారతదేశమునకు అమూల్య సారస్వత సంపద: విజ్ఞాన భాండాగారము ఇహపరసాధకము: ముక్తికి కాణాచి - అట్టి భగవద్గీత భారతమునకే కాదు,, భారతీయులకేకాదు, సమస్త విశ్వము

నకే అమూల్యాలంకారము. భగవద్గీతలో ఉపదేష్ట శ్రీకృష్ణుడు. గ్రహీత అర్జునుఁడు. ఆ ఉపదేష్ట వంశ చరిత్రను, మహిమలను తెలుపు మహోన్నతగాథయే హరివంశము. ఇది భారతమునకు ఖిలమైనది. భారతేతిహాసమునకు సూత్రధారియైన శ్రీకృష్ణుని మాహాత్మ్యము నభివర్ణించునది. 'ఖిల' మనగా పరిశిష్టము.

"హరివంశ స్తతః పర్వం పురాణం ఖిల సంజ్ఞితమ్
భవిష్యత్పర్వ చాప్యుక్తం ఖిలేష్వే వాద్భుతం మహత్ ॥
మ. భా. 1-69

ఈ హరివంశము - హరివంశపర్వమని, విష్ణుపర్వమని, భవిష్యపర్వమని మూఁడు పర్వములలో నొప్పారు చున్నది.

ఈ హరివంశమును "సర్వశ్రుతి సమూహోఽయం" అని వర్ణించినారు.

"మన్వాది భారతం కేచిత్
ఆస్తీకాది తథాపరే
అథోపరి చరా ద్యన్యే
విప్రా స్సమ్యగ ధీయతే"
(ఆది పర్వము - భారతము-60)

అని ఆదిపర్వ ప్రథమాధ్యాయమున చెప్పఁబడినది. "నారాయణం నమ స్కృత్య" నుండి భారతగ్రంథ ప్రారంభమని కొందఱు, ఉపరిచర వసుచరిత్ర మాదిగా దీని ప్రారంభమని మఱి కొందరు గ్రహించుచున్నారు ఆ భారతమునకు పరిశిష్టగ్రంథము హరివంశము. "యచ్చ శాఖాంతరస్థం శాఖాంతరే ప్రయోజనవశాత్ పద్యతే తత్ ఖిలమ్" అని వాఖ్య -

అనఁగా ఒక గ్రంథమున ముఖ్యప్రతిపాద్యము కాకపోయినను, ప్రయోజనము ననుసరించి చేర్చుకొనఁదగిన విషయముగల గ్రంథ భాగము. అదే ఖిలము.

భారతమున ముఖ్యముగా ప్రతిపాదింపఁదగిన విషయము కౌరవపాండవుల గాథ. తద్ద్వారా అధర్మనాశము, ధర్మజయము సూచింపఁబడినవి. అచ్చట ధర్మోప దేష్టయగు శ్రీకృష్ణచరిత్రము గాని, వృష్ణివంశపు విస్తృత కథగాని ముఖ్య ప్రతిపాద్య ములుకావు. కాని, అతని చరిత వినని దే భారతపాఠకులకు తృప్తి కలుగదు. కనుక దాని ప్రయోజనము అతి ముఖ్యమైనది. కావున భారతమున 'ఖిలము'గా హరివంశము కూర్పఁబడినది.

ఇట్టి ఖిలభాగములు వేదములలోను, పురాణములలోను కనిపించుచున్నవి. ఈ హరివంశము నందలి విషయము శ్రీకృష్ణ చరితము. కృష్ణావతార మహిమను తెలియఁజేయుట, అది భారతకథకు సాక్షాత్సంబంధి కాకపోయినను, సూత్రధారియగు కృష్ణ సంబంధముచే ప్రాముఖ్యము వహించినది. కావున భారతమునకు "ఖిలమై" యొప్పారినది.

శ్రీ వెలూరి శివరామ శాస్త్రిగారు-ఆంధ్ర హరివంశ పీఠికయందు "హరివంశము భారతమునకు ఖిలము. 'ఖిల' మనఁగా పరిశిష్టము. ఆదిపర్వము మొదలుకొని స్వర్గారోహణపర్వము వఱకును గల గ్రంథము భారతమనియు, హరివంశముతోఁ గలసిన గ్రంథమును మహాభారత మనియు అందురు." అని వ్రాసియున్నారు.

హరివంశము భారతమునకు ఖిలమే గాదు. పూరకము. హరివంశము లేనిదే భారతము సంపూర్ణము గాదు. అందుల కనేక దృష్టాంతములు గలవు. సూతుఁడు హరివంశమున "వృష్ణ్యంధకుల చరిత్ర"ను విన నిచ్చగించినాఁడు.

ముప్పదవ అధ్యాయమున హరివంశమున—

"యథా తే కథితం పూర్వం మయా రాజర్షి సత్తమ"

అని యయాతి చరిత్రను ప్రారంభించినాఁడు. [ 30-31 ]

"ఓ రాజర్షి సత్తమా! పూర్వము నాచేత నీకు చెప్పఁబడినట్లుగ"- అని ఆ ప్రారంభము. ఈ "పూర్వము చెప్పఁబడుట హరివంశము నందుకాదు. భారతమున- కనుక భారత భాగమును హరివంశమునకు పూర్వభాగముగనే నిశ్చయించి చెప్పుటచే హరివంశము భారతపూరకమని చెప్పక చెప్పుచున్నది.

2) మఱొక ఉదాహరణ - 1-32-12

ముప్పది రెండవ అధ్యాయమున హరివంశమున - ఆకాశవాణి కథనము -

"త్వం చాస్య ధాతా గర్భస్య
సత్యమాహ శకుంతలా"

అని మహాభారతము నందలి శకుంతలోపాఖ్యానమును సూచన గావించుట జరిగినది. ఇది భారతమునకు అనుబంధముగా తెలుపుచున్నది.

3) భవిష్యపర్వమున మహాభారత శ్రవణఫలము తెలుపఁబడినది. మహాభారతము స్వర్గారోహణ పర్వముతో అంతమైనది. అచ్చట ఫలశ్రుతిలేదు. భారతము శతపర్వ యుతమని తెలుపఁబడినది. ఆ శతపర్వ సమావేశము హరివంశముతో కూడినపుడే. కనుక హరివంశము భారతమున కుత్తర భాగము.

(4) అనుశాసన పర్వమున –

శ్రీకృష్ణుని కైలాసగమనము సంక్షేపముగ సంకేతితమైనది. ఇదే వృత్తాంతము హరివంశమున విస్తృతముగ వర్ణింపఁబడినది. హరివంశము శ్రీకృష్ణచరితము ప్రధానముగాఁ గలది. కనుక భారతమున సంగ్రహముగా నున్న శ్రీకృష్ణ కైలాస గమనమునకు విస్తృతరూపమొసంగఁబడినది. కనుక భారతమునకు అనుబంధగ్రంథమే హరివంశము.

(5) ఆనంద వర్ధనాచార్యుఁడు ధ్వన్యాలోకమున "హరివంశము మహాభారతోప సంహారము" – అని వివరించినాడు.

(6) "భారతము" – (భా. I-1)

"నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్"

అను నమస్కార శ్లోకముతో ప్రారంభింపఁబడినది.

హరివంశము గూడ అదే "నారాయణం నమస్కృత్య" అను శ్లోకముతోనే ప్రారంభమైనది.

భారతము జయనామకము, హరివంశము గూడ జయశబ్దముచేతనే వ్యవహృతమైనది.

"జయత్యనేన సంసారమితి జయోగ్రంథః" – వ్యాఖ్యసంసార సాగరమున లౌకికావస్థలయందు, ధర్మాధర్మ నిర్ణయమునకు వ్యవహారజ్ఞానమునకు భారతము నాశ్రయింప వలసియుండును. సంసార సాగరోత్తరణమునకు, సులభశాంతికి, మోక్ష ప్రాప్తికి, హరివంశతత్త్వమును పూర్ణముగ గ్రహింపవలసినదే; కనుక రెండును జయనామక గ్రంథములే. రెండును ఒకే నాణెమునకు రెండు పక్షములు. హరివంశ గ్రంథావతారికయందు భారతము పొగడఁ బడినది. కనుక రెండును పరస్పరాను బంధము కలవని తెలియుచున్నది.

భారతమునకు ఫలశ్రుతి హరివంశమునందు గలదు. భారతమున మొత్తము పదునెనిమిది పర్వములకు హరివంశపర్వములకు వరుసఁగా ఫలశ్రుతి పఠింపఁబడినది. హరివంశమునందే – హ. భవిష్య. 132-90

"భారత శ్రవణే రాజన్ పారణే చ నృపోత్తమ।
సదా యత్నవతాభావ్యం శ్రేయస్తు పరమిచ్ఛతా॥

పరమకల్యాణమును కాక్షించువాఁ డెల్లప్పుడు హరివంశ సహిత మహాభారతమును వినుటకు పారణ చేయుటకు ప్రయత్నింపవలయును.

"భారతం సర్వశాస్త్రాణా ముత్తమం భరతర్షభ।
భారతాత్ ప్రాప్యతే మోక్ష స్తత్వమేతత్ బ్రవీమితే॥"
(హ. భవిష్య. 132-93)

"క్రియతేఽసారసంసారే వాంఛితస్యైవ కారణమ్।
హరివంశస్య శ్రవణమితి ద్వైపాయనోఽబ్రవీత్ ॥"
132-97

భారతమునకు శాంతిమంత్రము హరివంశమునందే పఠింపఁబడినది.

"సర్వ స్తరతు దుర్గాణి సర్వోభద్రాణి పశ్యతు
సర్వేషాం వాంఛితా అర్థా భవంత్యస్యచ పారణాత్ ॥
132-101

"ఇదం మయాతే పరికీర్తితం మహత్
శ్రీకృష్ణ మాహాత్మ్య మపార మద్భుతం।
శృణ్వన్ పఠన్నాశు సమాప్నుయాత్ ఫలం
యచ్చాపి లోకేషు సుదుర్లభం మహత్ ॥
(హ. భవిష్య. 135-17)

భారత హరివంశములకు కవి ఒక్కఁడే, ప్రార్థనాశ్లోకము ఒక్కటే, ఫలశ్రుతియు నొక్కటే. రెండు గ్రంథముల ప్రధానాశయము నొక్కటే కనుక హరివంశము భారతమున కనుబంధమును, పూరకము ననుటలో సందేహములేదు.

హరివంశమునందలి గ్రంథావతారికయందు ప్రశ్నించు విధానము భారతమున కిది అనుబంధమనియే తెల్పుచున్నది. భారత మీ యవతారికయందు పొగడఁబడినది. వ్యాస, శౌనక సూతులే హరివంశ భారతములను నడపినవారు. భారతము కౌరవ పాండవుల గాథను వివరించుచున్నది. కురుక్షేత్రయుద్ధమును వర్ణించుచున్నది. ధర్మాధర్మముల సంఘర్షణను ప్రదర్శించుచున్నది. అధర్మ నాశమును, ధర్మస్థాపనను ప్రోత్సహించుచున్నది. ఆ ధర్మసంస్థాపనాచార్యుఁడు శ్రీకృష్ణుడు. అతఁడు భారతమున సూత్రధారియై సంగ్రామమును నడపించినవాఁడు. అప్రధానుఁడుగా ఆ గ్రంథమున నుండి పోయినాడు. ఆ సూత్రధారి మహిమములను ప్రధానముగ వర్ణించు చరిత్రయే హరివంశము.

"యుధిష్ఠిరో ధర్మమయో మహాద్రుమః
స్కంధోఽర్జునో భీమసేనోఽస్య శాఖాః
మాద్రీసుతౌ పుష్పఫలే సమృద్ధే
మూలం కృష్ణో బ్రహ్మచ బ్రాహ్మణాశ్చ॥

మ భా. ఆ. అను 66

ధర్మస్వరూపమగు పుణ్యమయ మహాద్రుమము ధర్మరాజు. ఆ ధర్మరాజు భారతమున నాయకుఁడు. అర్జునుడా వృక్షమునకు స్కంధము. ఆ వృక్షశాఖలు భీమసేనుఁడు. మాద్రీసుతులు సమృద్ధములగు పుష్పఫలములు. ఆ మహావృక్షమునకు మూలము శ్రీకృష్ణుఁడు, బ్రహ్మము, బ్రాహ్మణులు. జ్ఞాన స్వరూపుఁడగు శ్రీకృష్ణుఁడు ఆధర్మవృక్షమునకు మూలము. "జ్ఞానస్య మూలం బ్రహ్మ" జ్ఞానమునకు మూలము బ్రహ్మ. "తత్సంప్రదాయ ప్రవర్తకత్వాత్" ఆ సంప్రదాయ ప్రవర్తకులగుటచే బ్రాహ్మణులును మూలమే. జ్ఞానమునకు బ్రహ్మమూలము, ఆబ్రహ్మతత్త్వమును బోధపఱచు బ్రాహ్మణులును మూలము. కనుక ధర్మమహావృక్షమునకు శ్రీకృష్ణుఁడు, బ్రహ్మ, బ్రాహ్మణులు మూలము. ఇచ్చట బ్రహ్మ - శ్రీకృష్ణుఁడు-ఇరువురును సమానులే! కృష్ణుఁడు జ్ఞాన స్వరూపుఁడు.

జ్ఞానస్వరూపము బ్రహ్మ, శుద్ధ జ్ఞానస్వరూపుఁడు శ్రీకృష్ణ పరమాత్మ. అట్టి జ్ఞానమె ధర్మాభివృద్ధికి మూలకందము. కావున భారతమున ధర్మస్థాపన జరిగినది శ్రీకృష్ణుని మూలమున. ధర్మవృక్షమునకు మూలమువంటివాఁడు శ్రీకృష్ణుడు. ఆ ధర్మస్థాపనకై సాధనము కురుక్షేత్ర సంగ్రామము. హరివంశము ధర్మస్థాపనాచార్యుని మహిమాభివర్ణన, అవతార నిరూపణము. కనుక భారతమునకు హరివంశమునకు వృక్షమునకు మూలమునకుఁ గల సంబంధము కలదు.

భారతీయులు ఆధ్యాత్మికతత్త్వమే ప్రధానముగాఁ గలవారు.

"యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్"

భగ. 4-7

—అని భగవానుని వాక్కు.

ధర్మమునకు గ్లాని సంభవించినపుడు అధర్మమునకు అభ్యుదయము కలిగినపుడు భగవానుఁడు తన్నుతాను సృజించుకొనుచున్నాఁడు. అధర్మమును నాశ

మొనరించుచున్నాఁడు. ధర్మస్థాపన గావించుచున్నాఁడు అదియే హరివంశమున వర్ణింపఁబడినగాథ. శ్రీకృష్ణుని అవతారతత్త్వ వివరణము భారతమున అప్రధానముగ నుండిపోయినది. కనుక ఆ తత్త్వమును ప్రధానముగావించి రచించిన కావ్యము హరివంశము.

"భగవాన్ వాసుదేవోఽపి కీర్త్యతేఽత్ర సనాతనః"—

మ భా. I - 193

అని వ్యాసవాక్కు. భారతావతారిక.

ఈ భారతావతారిక యందలి సనాతనుఁడగు వాసుదేవుని కీర్తన హరివంశమున జరిగినది కనుక 'అత్ర' అను పదమున కర్థము భారతానుబంధ గ్రంథమగు హరివంశమునకే చెల్లును. కనుక భారతము హరివంశము భిన్నగ్రంథములు కావు.

వాసుదేవోఽపి - ఈ 'అపి' శబ్దము వాసుదేవునిఁ గూడ స్తుతింతునని భారతానంతర హరివంశమును సూచించు చున్నది.

భారతమున - భా. 1

"ధర్మేచార్థేచ కామేచ మోక్షేచ భరతర్షభ
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్ క్వచిత్"

అని భారతప్రాశస్త్యము గలదు.

కనుక ధర్మార్థకామమోక్షములకు ఖనియై వెలసిన భారతగ్రంథమున లేని విషయములు మఱెందును లేవు-అని తెలియుచున్నది చతురాశ్రమములకు, పురుషార్థములకు, ధర్మసాధనకు సాధనభూతమైనది. భారతము. హరివంశము చతుర్థ పురుషార్థమగు మోక్షమునకు బాట వేయునది. ఆత్మానందమునకు మార్గదర్శకమైనది అతీంద్రియ తత్త్వప్రకాశమునకు దివ్యజ్యోతిగా వెలుగొందినది.

భారతాది పర్వమునందు - భా. I

"అజ్ఞాన తిమిరాంధస్య లోకస్యతు విచేష్టతః
జ్ఞానాంజన శలాకాభిః నేత్రోన్మీలన కారకమ్"

భారత మహత్త్వము తెలుపఁబడినది.

అజ్ఞాన మనెడి తిమిరమున దారితెన్నులు తెలియక సంచరించు లోకమునకు జ్ఞానమనెడి అంజన శలాకచే నేత్రములను తెరిపించునది. భారతము. అనఁగా అజ్ఞానమును తొలగించి జ్ఞానమును ప్రసాదించునది భారతము.

"ధర్మశాస్త్ర మిదం శ్రేష్ఠ మర్థశాస్త్ర మిదం పరమ్
కామశాస్త్ర మిదం చాగ్ర్యం మోక్షశాస్త్ర మిదం పరమ్॥
భా. 1

అని భారతము శ్రేష్ఠమగు ధర్మశాస్త్రమని, ఉత్కృష్టమగు అర్థశాస్త్రమని అగ్రశ్రేణికిఁ జెందిన కామశాస్త్రమని, ఉత్తమగు మోక్షశాస్త్రమని పేర్కొనఁబడినది.

ధర్మార్థ కామమోక్షములతో సమానముగ మోక్షమును పరిగణించునది భారతమైన ఆధ్యాత్మిక తుష్టినందించునది హరివంశము.

జీవిత సంగ్రామమున అధర్మప్రవృత్తిని నిర్మూలించునది ధర్మప్రవృత్తిని ప్రేరేపించునది భారతమైన పరతత్త్వ మహిమను బోధించి ఆత్మానందమును చేకూర్చునది హరివంశము.

జీవితకాలమున ధర్మాచరణకై, భారతము ప్రేరేపించిన జీవితానంతర భవబంధ విమోచనమునకై, పరతత్త్వమునందు సాయుజ్యమునకై దారి చూపునది హరివంశము.

భారతీయు లనాదిగా నాచరించు సంప్రదాయములకు, ఆచారములకు, వ్యవహారములకు ప్రతీకగా నిలచినది భారతము. భారతీయుల ఆధ్యాత్మిక విశ్వాసములను ప్రతిబింబింపఁజేయునది హరివంశము.

భారతగ్రంథమునకు, సంఘటనలకు, ధర్మాధర్మాచరణలకు, సర్వత్ర ప్రేరకుఁడై నడిపించిన అవతారపురుషుని కథలను తనివితీర గ్రోలనిదే తృప్తి కలుగదు, అట్టి శాశ్వత సంతృప్తిని కలిగించునదే హరివంశము.

భారతము సంసారసాగరమున ధర్మాధర్మ ద్వంద్వమున మునుగువాని నుత్తరింపఁజేయు నౌక, ఆ జీవిత సాగరమును దాటుటకై ప్రేరేపించి, శాశ్వత సౌఖ్యము చేకూర్చునది హరివంశము.

కనుక హరివంశములేని భారతము గమ్యము లేని తరణివంటిది. భగవంతుఁడగు శ్రీకృష్ణుని యవతారమును, చరిత్రను, వంశ వర్ణనలను ప్రధానము గావించి, వినిపించు గ్రంథము హరివంశము.

మహాభారతమున అసంపూర్ణముగ నుండిపోయిన తత్త్వమును పూర్తిచేయుటయే హరివంశ రచనోద్దేశ్యము.

శ్రీకృష్ణుని చరిత్ర భాగవతమునందు, బ్రహ్మవైవర్తమునందు, హరివంశమునందును గలదు. శ్రీకృష్ణుని చరిత్ర ఉపనిషత్తులు మొదలుగ పురాణముల వఱకు విభిన్న భావములతో వికసితమైనది.

మహాభారతము నందలి శ్రీకృష్ణుఁడు – యుధిష్ఠిరరూప ధర్మవృక్షమునకు మూలముగా అంతర్గతుఁడై నిలచినాఁడు. కాని బహిరంగముగా ప్రకాశింపలేదు. అరణ్యపర్వమున - మార్కండేయమహర్షి, "ప్రళయ కాలమున జగత్తు నాత్మసాత్తు గావించి వట పత్రమున శయనించిన వాఁడే శ్రీకృష్ణుఁడు" అన్నాఁడు.

శాంతి పర్వమున "నారాయణ వృత్తాంతము" శ్రీకృష్ణుని పరబ్రహ్మ స్వరూప ముపై అధికముగా ప్రకాశము చూపుచున్నది.

నరనారాయణులే శ్రీకృష్ణ తత్త్వము, భీష్మపర్వమున కృష్ణస్తుతి, సభాపర్వ మున - శ్రీకృష్ణున కగ్రపూజ, శిశుపాల విరోధము–భీష్ముఁడు శ్రీకృష్ణుని భగవత్తత్త్వ మును తెలియఁజేయుట- ఇట్టి ఘట్టములు శ్రీకృష్ణుని భగవత్స్వరూపమును తెలియఁ జేయునవి భారతమునఁ గలవు.

ఆ మహాభారతమునందే కొన్ని పట్టులు - కృష్ణుని దైవ స్వరూపమును వదలి మానవ స్వరూపమును ప్రస్తుతపఱచుటయుఁగలదు.

అశ్వమేధ పర్వమున – అనుగీతలో కొందరు బ్రాహ్మణులు కృష్ణుని శపింపఁ బూనుట అతనిని మానవునిగా తెలుపుచున్నవి.

సభాపర్వము, అరణ్యపర్వము– శాంతిపర్వము వీనియందు శ్రీకృష్ణుని గోపాల రూపవర్ణన గోచరించును.

పతంజలి మహాభాష్యమున కృష్ణుఁడు "కంస నిహంత"గా పేర్కొనఁబడి నాఁడు. పాణిని అష్టాధ్యాయిలో శ్రీకృష్ణుఁడు వాసుదేవుఁడుగా కనిపించును. "వృష్ణీనాం వాసుదేవోఽస్మి" అని తన్ను తెలుపుకొనినాఁడు.

ఛాందోగ్యోపనిషత్తులో శ్రీకృష్ణుఁడు దేవకీపుత్రుఁడు. అంగీరసునితో బ్రహ్మ విద్యను నేర్చుకొనినాఁడు.

హరివంశము నందలి శ్రీకృష్ణుఁడు విష్ణుని యవతారము. ఇందలి శ్రీకృష్ణుఁడు లీలామానుషవిగ్రహుఁడు. ఇదియొక ఉత్తమ తత్త్వమును ప్రతిపాదించు నుత్కృష్ట గ్రంథము.

వ్యాసభగవానుఁడు - భారతమున తనకాలపు సాంఘిక పరిస్థితులను చిత్రించి నాఁడు. రాజకీయ వ్యవహారములను, విశదీకరించినాఁడు. ఆచారవ్యవహారములను వర్ణించినాఁడు. యుద్ధ తంత్రములను, సాంసారిక సమస్యలను, పరిష్కారములను, అత్యంతసహజముగ చిత్రించి, జనసామాన్యమునకు భారతీయులకు మహాభారతమును పరమప్రామాణిక గ్రంథముగా రూపొందించినాఁడు. మహాభారతమున పాండవులు

ధర్మస్వరూపులు - "యుధిష్ఠిరో ధర్మమయోమహాద్రుమః" ఆ ధర్మమయ మహా వృక్షమునకు మూలము వలె సుదృఢ స్వరూపము నొసంగువాఁడు వాసుదేవుఁడు.

మహాభారత హరివంశములు రెండును మానవుని ఇహపరములందును తరింపఁ జేయఁగల ప్రబలసాధనములు. భారతీయున కీరెండును రెండు నేత్రముల వంటివి. ఏయొక్క కన్ను లేకున్నను దృష్టిదోషము తప్పదు.

హరివంశపు ప్రారంభాధ్యాయములో మహాభారతము శ్రేష్ఠమని తెలుపఁబడినది. భారతము, భారతకథ, భారతప్రశంస-తరువాత హరివంశమాహాత్మ్య వర్ణన మున్నది. వివిధ వృత్తాంతముల - పౌరాణిక దృష్టితోఁగూడ మహాభారతము, హరివంశము-వీని పరస్పర సంబంధము కనిపించుచున్నది.

ద్వారకావాసులగు యాదవుల వినాశము - విస్తృత వివరణ మౌసల పర్వమున నున్నకారణమున హరివంశమున వదలివేయఁబడినది. హరివంశమున కృష్ణచరిత్రకు ప్రాధాన్యమున్నను, ద్వారకానాశము వదలివేయఁబడినది ఇది విష్ణుపర్వమున సంకేత మాత్రమున నున్నది. మౌసల పర్వమున విస్తృతముగ గలదు. కనుక మహాభారత మునకు ఖిలము - అనుబంధము హరివంశమనుటలో సందేహము లేదు.

హరివంశము మహాభారత భాగమనుటకు మరికొన్ని ప్రమాణములను పరిశీలింప వచ్చును.

(1) మహాభారత పర్వసంగ్రహములో హరివంశ సమావేశము గలదు.

"హరివంశ స్తతః పర్వం పురాణం ఖిల సంజ్ఞితమ్"
"భవిష్యత్ సర్వ చాప్యుక్తం ఖిలేష్వేవాద్భుదం మహత్"
(మహా భా. ఆది. ప. 69)

అని యున్నది. కనుక భారతమునందలి పర్వసంగ్రహములోనే హరివంశము కలుప బడియున్నది. ఇది భారతాంతర్గతమే యని చెప్పుచున్నది.

ఇఁక "పూర్వత్ర అనుక్త పరిశిష్టం వస్తు ఖిలశబ్దవాచ్యం"

అని బృహదారణ్యకోపనిషత్తు - ఆనందగిరి వ్యాఖ్య (5-1) తెలియఁజేయుచున్నది. ముందు ఏకారణము చేతనైన చెప్పఁబడకుండ మిగిలిపోయిన గ్రంథ విషయమును తెలుపుట ఖిలమందురు. భారతాంతర్గతమై భారతభాగముగా చెప్పఁబడినను వస్తువు కథైక్యమునకు భంగము కలుగఁజేయునను కారణముచే శ్రీకృష్ణచరిత్ర అచ్చట ప్రధా

నము కాలేదు. దానినే హరివంశమున తెలుపుటచే ఖిలమై వెలసినది. కనుక హరి వంశము ఖిలము, భారతాంతర్గతము.

భారతము లక్షగ్రంథ పరిమితము

"లక్షంతు చతురో వేదాః లక్షం భారత మేవచ"

(ఖండము 37-శౌనకోక్త పురాణ పరిశిష్టము)

భారతము లక్షగ్రంథ పరిమితమని పద్మ, స్కాంద, మత్స్యభాగవతాది పురాణము లందు సాక్ష్యము గలదు.

భారతము లక్షగ్రంథ పరిమితమని నిర్ధారణ చేయవలయునసిన హరివంశపర్వ' విష్ణుపర్వ, భవిష్యపర్వశ్లోకములను గూడ చేర్చవలసి యుండును, అప్పుడే ఆ శ్లోకముల సంఖ్యలక్షకు సరిపోవును,

ధ్వన్యాలోక కర్త - ఆనందవర్ధనుఁడు

"సత్యం శాస్త్రస్యైవ రసస్యాంగిత్వం మహాభారతే మోక్షస్యచ సర్వపురుషార్థేభ్యః ప్రాధాన్యమ్, అయంచ నిగూఢ రమణీయార్థో మహాభారతావసానే హరివంశ వర్ణనే చ సమాప్తిం విదధతా కవివేధసా కృష్ణద్వైపాయనేన సమ్యక్ స్పష్టీకృతః"-

- అని నుడివి యున్నాఁడు

మహాభారతమున అంగిరసము శాంతము. సర్వపురుషార్థముల కంటెను మోక్షమునకు ప్రాధాన్యము, ఈ నిగూఢమగు రమణీయార్థము - మహాభారతావసానమున హరివంశ వర్ణనచే పూర్తిచేసి కవిబ్రహ్మయగు వేదవ్యాసుఁడు చక్కగా స్పష్టము గావించినాఁడు. - ఇది సారాంశము.

దీనిని బట్టి మహాభారతమున అంగిరసము శాంతమని సర్వపురుషార్థములలో శ్రేష్టమగు మోక్షమునకే భారతమున ప్రాధాన్యమొసంగఁబడిన దని - ఈ నిగూఢార్థము, రమణీయభావము భారతావసానమగు హరివంశమున స్పష్టీకృతమైనదని తెలుపఁబడినది. దీనిచే "భారతావసానే హరివంశవర్ణనేన" అనుటచే భారతావసానమున వ్రాయఁబడిన భారతభాగమే హరివంశమనియు భారతమున అంగిరసమగు శాంతము. భారతమున అంతిమ భాగమగు హరివంశమున పుష్టినొందినదనియు తెలియుచున్నది.

2. భారతమున మోక్షమునకే ప్రాధాన్య మొసంగబడినదనియు, ఈనిగూఢ రమణీయార్థము హరివంశవర్ణనలోనే సంపూర్ణమైనదని తెలియుచున్నది.

కనుక హరివంశము లేనిదే భారతము అపూర్ణము.

మహాభారతమున - అనుశాసన పర్వమున - శ్రీకృష్ణుని కైలాస గమనము సంక్షిప్తముగ సంకేతితమైనది. ఇదే వృత్తాంతము హరివంశమున విస్తారముగ వర్ణింపఁబడినది.

"భగవన్ కేన విధినా" - అను స్వర్గారోహణపర్వ ప్రారంభము హరివంశ మున లభించును

గరుడ పురాణమున మహాభారత హరివంశముల సంక్షిప్త కథాసారము ఏకముగా లభించును.

భారతమున కౌరవపాండవ సంగ్రామము ముఖ్యము. ధర్మ విజయము ధ్యేయము. ఈధర్మసాధనకు సాధనభూతుఁడు శ్రీకృష్ణుఁడు. అతని వంశ చరిత్ర వర్ణించుటయే హరివంశధ్యేయము.

ఎఱ్ఱయ హరివంశమున వేమభూపాలుఁడు ఎఱ్ఱయతో -

"కం. భారత పరాంశమని యిం
పారఁగఁ జెప్పుదురు బుధులు హరివంశము నీ
వా రమ్యకథఁ దెనుంగుఁగ
ధీరోత్తమ! నిర్వహించి తెలుపుము మాకున్"—

(హ. వ. I - 1.40)

అని నుడివినట్లు కలదు. హరివంశము భారతమునకు పరాంశమని వ్రాకుచ్చి నాఁడు. "పర" అనగా ఉత్కృష్టమని కావచ్చును. "మిగిలిన" - కావచ్చును. "మోక్షజ్ఞాన సంబంధమగు భాగ" మనియు కావచ్చును.

కనుక భారతమునందలి ఉత్కృష్టభాగము హరివంశము. భారతమున మోక్ష జ్ఞాన సంబంధమగు విషయమును తెలుపు భాగము హరివంశము. భారతమున అంగి రసనుగు శాంతమును పుష్టినందించునది హరివంశము. భారతసంగ్రామమునకు సూత్రధారియగు శ్రీకృష్ణుని రంగస్థలమున ప్రదర్శించునది హరివంశము కనుక ఎన్ని విధముల పరిశీలించినను, హరివంశము లేనిదే భారత సమగ్రత లేదని తెలియు చున్నది. భారతము హరివంశమును ఒకే గ్రంథమున పూర్వాపరములు.

భారతము మంగళాంతముకాలేదు. పాండుపుత్రుల మహాప్రస్థానముతో అంత మైనది. ఫలశ్రుతి లేదు. ఇది పాఠకుని మనస్సున నిర్వేదము కలిగించునట్టిది. ఇది భారతీయుల సాహిత్యమునకు చెల్లదు. 'మంగళాంతం హి సాహిత్యమ్' అని భారతీయుల భావన.

"అస్త్రత్వబంధకాంతార పరివర్తన పాంసులాం
వాచంశౌరి కథాలాప గంగయైవ పునీమహే"

అని వ్యాసుఁడు తాను అసత్త్వబంధమును రచించుటచే తన వాక్కు పాంసులమైనదని ఆ వాక్కును శౌరికథాలాపముచే పరిశుద్ధ మొనర్తునని తెలుపుకొనెను.

అపరిశుద్ధమైన తనవాక్కును పరిశుద్ధమొనర్చుకొనవలసియున్నది. భారతావసానమును చదివి నిర్వేదమునొందిన పాఠకునకు నూతనోత్సాహమును కలుగఁజేయవలసియున్నది. భగవత్కథాలాపముచే ఆత్మశాంతిని కలిగింపవలసియున్నది. అందుకే హరివంశమును పరిగ్రహించినాఁడు.

భారతము నందలి ఈ శ్లోకము హరివంశము భారతాంతర్గతమే యని నిరూపించుటకు మఱొక హేతువగుచున్నది.

"వాసుదేవస్య మాహాత్మ్యం, పాండవానాంచ సత్యతామ్
దుర్వృత్తం ధార్తరాష్ట్రాణా ముక్తవాన్ భగవాన్ ఋషిః
(భారతము 1-1-59)

"వ్యాసమహర్షి భారతము నందు వాసుదేవుని మాహాత్మ్యమును, పాండవుల ఋజుప్రవర్తనను, ధార్తరాష్ట్రుల దుష్టచరితమును తెలిపినాఁడు" - అని ఈశ్లోకము కాని నిజమునకు వాసుదేవుని మహిమ హరివంశమునందే విస్తృతముగా వర్ణింపఁబడినది.

ఇట్లు భారత హరివంశములను కలిపి ఒకే గ్రంథముగా తలంచి యారెండింటి యందలి విషయమును తెలియఁజేయుట చూడ వ్యాసమహర్షి దృష్టియందు భారతాంతర్భాగమే హరివంశమని తెలియుచున్నవి.

తెలుఁగు హరివంశమునందును ఫలశ్రుతి –

"భారత శ్రుతి రతులకు భవ్యయాన
దివిజ సుఖములు సులభంబు లవుట యరుదే
ముక్తి పదము తదీయాంగమునను గల్గుఁ
దత్కథామూర్తి విష్ణుకీర్తనము గాదె"

(హ. వ. II – 10–338)

"వ. శ్రీమహాభారతంబు హరివంశోత్తంబుగా నఖిలంబును యథాశ్రుత వ్యాఖానంబుగాఁజేసి మమ్ము నారాధింపఁగలిగే నే ధన్యుండ నైతి" – అని

భారతమునకు ఫలశ్రుతి హరివంశము నందే పఠింపబఁబడినది. ఇట్లెన్ని భంగుల పరిశీలించినను, భారతము హరివంశము ఒకే నాణెమునకుచెందిన రెండు భాగములని, హరివంశములేని భారతము గమ్యములేని తరణివంటిదని, భారతము హరివంశము పరస్పర పూరకములని తెలియుచున్నది.

# 2. ఎఱ్ఱన - హరివంశము

ఆంధ్రసాహిత్య ప్రపంచమున త్రిమూర్తుల యొక్క స్థానము నధిష్ఠించిన నన్నయ - తిక్కన - ఎఱ్ఱాప్రెగ్గడలు కవిత్రయ బిరుదమున వెలుగొందుచున్నారు.

వాగనుశాసనుఁడగు నన్నయ, కవిబ్రహ్మయగు తిక్కనల తర్వాత ప్రబంధ పరమేశ్వరుఁడై సాహిత్యలోకమున యుగకర్తగా భాసించినవాఁడు ఎఱ్ఱయ. ఇతని రచనలు రామాయణము, హరివంశము. అరణ్యపర్వశేషము, నృసింహపురాణములు, 'కవిసర్పగారుడము' అను మఱొక గ్రంథమును రచించినట్లు ప్రతీతి. ఇతని రామాయణము నేటికిని అనుపలభ్యము. కవిసర్పగారుడమును గుఱించిన విశ్వసనీయములగు ఆధారములు లేవు. అరణ్యపర్వశేషమును "తద్రచనయకా" యని నన్నయ పేరిటనే వెలయించినాఁడు. మిగిలిన నృసింహపురాణ హరివంశములలో నృసింహపురాణము క్షేత్రమాహాత్మ్యమును వర్ణించు రచన. ఈతని హరివంశము శ్రీకృష్ణచరిత్రమును వివరించు గ్రంథము.

ఎఱ్ఱాప్రెగ్గడ తన నృసింహపురాణ పీఠికలో చెప్పుకొనిన పద్యమున తాతను గుఱించి ఇట్లు చెప్పుకొనినాడు.

సీ. ప్రజ్ఞాపవిత్రుఁ డాపస్తంబ సూత్రుండు
శ్రీవత్సగోత్రుఁ డూర్జిత చరిత్రుఁ
డగు బొల్లనకుఁ బోలమాంబకుఁ బుత్రుండు
వెలనాటి చోడుని వలన మిగుల
మన్నన గన్న భీమన మంత్రి పౌత్రుండు
పేరమాంబామనః ప్రియుడు పోత
మాంబికావిభు సూర్యనార్యు మజ్జనకుని
బొల్లధీనిధికిని బోలమకును

గీ॥ జన్ననకును నను జన్మనిఁ గన్నతండ్రి
వేఁగినాటిఁ గరాపర్తి వృత్తిమంతుఁ
డలఘుఁ డెఱ్ఱ పోతసూరి కంసారి చరణ
కమల మధుకర పత సార విమల యశుఁడు.

అయిన తాత యితని మనసున గోచరించి నృసింహ పురాణమును రచింపు మనినాఁడఁట !

ఈ పద్యమువలన నెఱ్ఱన వంశవృక్షము నిట్లు తెలిసికొనవచ్చును.

వెలనాటి చోడుని వలన మిగుల మన్నన గన్న భీమనమంత్రి పౌత్రుండు ఎఱ్ఱయకు తాత. ఆతని పేరు ఎఱపోత సూరి. ఇతఁడు పూర్ణపురుషాయుష జీవితుఁడు




ఎఱ్ఱన తండ్రి సూరనార్యుఁడు. తల్లి పోతాంబ. ఎఱపోతసూరి పితామహుఁడు. పేరమాంబ పితామహి. వెలనాటి చోడునివలన మిగుల మన్నన గనిన భీమనమంత్రి యీతని తాతకు తాత. బొల్లన, ప్రోలన, జన్ననలను వారలీ కవికి పెదతండ్రులు. ఈతని గురువు శంకరస్వామి నియోగి బ్రాహ్మణ సూచకముగా పేరునకు తరువాత మంత్రి, అమాత్య, ప్రెగ్గడ పదములను జేర్చుట చిరకాలాను గతమైన ఆచారము.

ఎఱ్ఱాప్రెగ్గడ యని పిలుచుచున్నారు. ఈశ్వర భక్తుఁడగుటచే శంభుదాసుఁడు. ఇది లక్షణాభిధేయము

ఎఱ్ఱయ తాఁతయగు నెజపోతసూరి వేఁగినాటి కరాపర్తి వృత్తిమంతుఁడఁట! ఈ కరాపర్తిని గుఱించి వాదోపవాదములు గలవు.

## శ్రీ వేదాల తిరువెంగళాచార్యులు - మహాభారతోపన్యాసములు -

"ఈ మహనీయుని తాత వేఁగినాటిలోని కరాపర్తి గ్రామములో వృత్తిమంతుఁడై యుండెనఁట! వర్ణసామీప్యము వలన నిది యిప్పటి రంగవోలు తాలూకాలోని 'అమ్మనబోలు' ప్రక్కనున్న రైల్వే స్టేషను గ్రామమైన 'కరవది' యని నేను భావించు చున్నాను. దీని నిప్పటికిని కొంతమంది 'కరావది' యని వాడుదురు. ఇంచు మించుగా నీ ప్రదేశ మంతయు పూర్వము వేఁగినాటి లోనిదేనేమో! అంతేకాక యీ 'కరవది'కి కొలఁది దూరము నుండియే పాకనాఁడు ప్రారంభమగును. అఁటగడ్లూరు లోనే కదా మన కవీశ్వరుఁడును, అతని తలిదండ్రులు పోతమాంబా సూరనార్యులును గూడ నివసించి యుండిరి.

చివరి రోజులలో నీ కవీశ్వరుఁడు కరవది గ్రామమునకు చేరువ 'గుండ్లకమ్మ' ఏటి యొద్దుననున్న చదలువాడ గ్రామముననే కదా కాపురముండి చదలువాడ వారని యింటిపేరొందినది. కనుక 'కరవది' సమీప గ్రామముల కేఁగిరనుటయే యుక్తము."

"కరాపర్తి - కరావర్తి యుండనోపు కరావర్తి యనఁగా కరము=పన్ను. పన్నులను వసూలు చేయు వృత్తివంటిదని శ్రీ నిడదవోలు వెంకటరావుగారు తమ పరిశోధన వ్యాసమునందు సూచించిరి." (Feb–March - పరిశోధన 1956)

"ఎఱ్ఱన పూర్వులు పాకనాటి కరావర్తి వృత్తిమంతుల నఁగఁ బన్నులు గ్రహించు నేటి గ్రామాధికారి లేదా గ్రామీణ కరణమువంటి వృత్తియం దుండినవాఁడు."

ఇట్లు 'కరాపర్తి'ని గుఱించి యొక గ్రామనామమని వృత్తినామ మని మత ములు గలవు.

## శ్రీమతి యశోదా రెడ్డిగారు - తెలుగులో హరివంశములు -

"ఎఱ్ఱాప్రెగ్గడను గూర్చి పేర్కొనిన తరువాత కవులెవ్వరును ఎఱ్ఱా ప్రెగ్గడ పూర్వులు కరాపర్తివాసులని పేర్కొనలేదు. కాని వేఁగినాట గల గుడ్లూరు, చదలు

పాడ నిలయులని మాత్రము చెప్పినట్లు ఆధారములు గలవు. కావున 'కరాపర్తి' యను నది ఉద్యోగ సూచకమై యుండును."

నిడదవోలు వెంకటరావుగారు, శ్రీమతి యశోదారెడ్డి గారల అభిప్రాయమే సరియైనదని నా అభిప్రాయము. వీరి ప్రకారము 'కరాపర్తి' యనునది, ఉద్యోగమై యుండును గాని గ్రామనామము కాఁజాలదు. అని తలంతును.

1. ఎఱ్ఱాప్రెగ్గడను గూర్చి పేర్కొనిన తరువాత కవులెవ్వరును ఎఱ్ఱాప్రెగ్గడ పూర్వులు కరాపర్తివాసులని పేర్కొనలేదు కాని, వేఁగినాఁటఁగల గుడ్లూరు చదలువాడ నిలయులని మాత్రము చెప్పినట్లు ఆధారములు గలవు. కావున 'కరావర్తి' యనునది యుద్యోగ సూచకమై యుండును.

శ్రీ వేదాల తిరువెంగళాచార్యుఁడు చెప్పినట్లు ఎఱ్ఱయది 'కరవది'యను గ్రామమే అయి యుండిన, కరవదికి కొంత దూరములో ప్రారంభమైన పాకనాటిలో గల గుడూరునే తెలిపినవారు, 'కరవది'ని మాటమాత్రమైనను ఎవ్వరును తడవకుందురా? ఎఱ్ఱయ తాత 'కరాపర్తి'యను వృత్తిమంతుఁడు. వేఁగినాట ఎఱ్ఱయ పూర్వులు ఆ కరాపర్తి యుద్యోగము చేయుచుండు వారు

ఎఱ్ఱయ అరణ్యపర్వములో తన్ను గురించి యిట్లు చెప్పుకొనినాఁడు.

సీ. భవ్యచరిత్రుఁ డాపస్తంబ సూత్రుండు
శ్రీవత్స గోత్రుండు శివపదాబ్జ
సంతత ధ్యాన సంసక్త చిత్తుఁడు సూర
నార్యునకును బోతమాంబికకును
నందనుండిఁ బాకనాటిలో నీలకం
ఠేశ్వర స్థానమై యొసఁకి మెసఁగు
గుడ్లూరు నెలవుగ గుణ గరిష్ఠత నొప్పు
ధన్యుండు ధర్మైక తత్పరాత్ముఁ

గీ॥ డెఱ్ఱనార్యుండు సకల లోకైక విదితు
డయిన నన్నయ్య భట్ట మహా కవీంద్ర
సరస సారస్వతాంశ ప్రశస్తి దన్నుఁ
జెందుటయు సాధుజన హర్ష సిద్ధిఁగోరి — భా. అరణ్య 7-467

అని ఎఱ్ఱయ స్వయంగా చెప్పుకొనిన రీతిగా నితఁడు "భవ్యచరితుఁడు, ఆపస్తంబ సూత్రుఁడు, శ్రీవత్స గోత్రుఁడు. శివపదాబ్జ సంతత ధ్యాన సంసక్త చిత్తుఁడు. సూరనార్యుఁడితని తండ్రి. పోతమాంబిక తల్లి. పాకనాటిలో నీలకంఠేశ్వరస్థానమై యెసఁగమెసగుఁ గుడ్లూరు ఇతని నెలవు గుణగరిష్ఠత నొప్పు ధన్యుఁడితఁడు. ధర్మైక తత్పరాత్ముఁడు." అని తెలియుచున్నది.

జక్కన తన విప్రనారాయణ చరిత్రయందు -

"దురితహరుఁ బ్రబంధ పరమేశ్వరునిఁ జెద
లాడ నిలయు నాదు వంశకర్త
ధన్యమూర్తి శంభుదాసు నెఱ్ఱాప్రెగ్గ
డనునుతింప బ్రహ్మకును దరంబె"

యని ఎఱ్ఱయను తన వంశకర్తగా, చదలువాడ నిలయునిఁగా పేర్కొనినాఁడు.

కనుక విప్రనారాయణ చరిత్రవలన నితఁడు చదలువాడ నిలయుండని తెలియుచున్నది.

కావున తాతకాలమున కరాపత్రి వృత్తి మంతులై, తండ్రికాలమున చదలువాడ చేరియుండ వచ్చును. అచ్చట నితనిఁగాంచి, పాండిత్యమును గుర్తించి మల్లపృథివీనాథుఁ డితనిని తన అన్నయు నద్దంకి రాజధానిగా నేలువాఁడును అగు వేమారెడ్డి కర్పించినాఁడు, ఎఱ్ఱయ రామాయణహరి వంశముల రచించి యాతని కంకితమొసంగినాఁడు. అరణ్యపర్వశేషరచన నాటికి గుడ్లూరును చేరినాఁడు. రామాయణ హరివంశ రచనల కాలమున నద్దంకి సమీపమున చదలువాడ యందుండెననియు, ననంతరము నీలకంఠేశ్వరస్థానమగు గుడ్లూరులో తన చివరి దినములు గడపె ననియు విశ్వసింపవచ్చును.

ఎఱ్ఱయ యాంధ్రుల చరిత్రలో మిక్కిలి విషాదము నొందిన కాలమును, మఱల మహోన్నతినందిన కాలము చూచినాఁడు. అతనిని ముందు వేమారెడ్డి సోదరుఁడగు మల్లారెడ్డి ఆదరించినాడు. ఆతఁత్రి తోడ సముపేతుఁ జేసినాఁడు. పిమ్మట తన యన్నయు, రెడ్డిరాజ్య స్థాపకుఁడును నగు వేమారెడ్డి కర్పించినాఁడు. దీనికాధారము హరివంశమునందలి పద్యమే: వెమారెడ్డి ఎఱ్ఱయతోఁబలికి నట్లుఁగ గలదు

"నా తమ్ముండు ఘనుండు మల్లరథి నీనాథుండు నిన్నాతత
శ్రీతోడన్ సముపేతుఁజేసి యెలమిం జేపట్టి మాకిచ్చుటం
జేతో మోదమెలర్ప రామకథ ముంజెప్పించి యత్యుత్తమ
ఖ్యాతిం బొందితి నింక నేను దనియన్ గావ్యామృతాస్వాదనన్"
హ. వ I - 1-39

కనుక చదలువాడ నిలయుఁడగునెఱ్ఱనను మల్లారెడ్డి చేపట్టి వేమారెడ్డికి సమర్పించినట్లుఁగఁ గలదు. అతఁడు రామాయణముం జెప్పించి యానందించినాడు. ఉత్తమ ఖ్యాతినిఁ గాంచినాఁడు. కాని, కావ్యామృతాస్వాదనచేఁ దనియలేదు. కనుక హరివంశమును రచింపుమనినాఁడు.

ఎఱ్ఱయ రామాయణమును వేమారెడ్డి కంకిత మొసంగినాఁడు. హరివంశమునుఁ గూడ నాతనికే సమర్పించినాడు. ఈ వేమారెడ్డి యద్దంకిని రాజధానిఁగాఁ జేసికొని, యేలినట్లుగ క్రింది పద్యము వలన దెలియుచున్నది.

తే. గీ॥ "తనకు నద్దంకి తగు రాజధానిగాఁ బ
రాక్రమంబున బహుభూము లాక్రమించి,
యనుజ తనుజ బాంధవ మిత్రజనుల కిచ్చె
నెదురె యెవ్వారు వేమ భూవిభాశ్వర నకు"
I - 1-23

కనుక చదలువాడలో నివసించు నెఱ్ఱయతో మల్లారెడ్డికి ముందు పరిచయమైనది. అతఁడితనిని అద్దంకి నివాసియగు వేమారెడ్డి కర్పించినాఁడు. అనుటయే సమంజసము.

## ఆనాటి రాజకీయ పరిస్థితులు :-

అది క్రీ శ. 1323వ సంవత్సరము. ఢిల్లీ సుల్తాను ఓరుగల్లు నగరమును స్వాధీనము చేసికొని ప్రతాపరుద్రునీ బంధితుఁనిఁగా గొనిపోయెను కాకతీయ సామ్రాజ్యము అస్తంగతమైనది. ఆ ఢిల్లీ సుల్తాను ఓరుగల్లుపై దండెత్తి ప్రతాపరుద్రుని చేతిలో ప్రాణమాత్రా వశిష్టుఁడై పాఱిపోయినాఁడు. ఆ యుద్ధమున ప్రతాపరుద్రునికిఁ దోడ్పడిన నాయకులతనికాలమున విధేయులు. కొంతకాలమునకు హఠాత్తుగా ఢిల్లీ సుల్తాను తిరిగి యోరుగల్లుపై దండెత్తివచ్చి యసహాయుఁడైన ప్రతాపరుద్రుని బంధి

తుని జేసెను. ఓరుగల్లు నాక్రమించుకొనిన ఢిల్లీ సుల్తాను చిరకాలము సింహాసనమును దక్కించుకొనలేదు. ప్రతాపరుద్రుని సామంత నాయకులలో శౌర్యపరాక్రమములుగల మునుసూరి ప్రోలయ కాపయ సోదరులు తక్కిన నాయకులతో మంత్రాలోచన చేసి పరాక్రాంతమైన దేశమునకు విమోచనమును కలిగించుటకై వారి వారి సేనల నాయత్తపఱచి, యోరుగల్లును స్వాధీనము చేసికొని సుల్తాను పరిపాలనము నంతమొందించిరి. ఆ యుద్ధ విజయానంతరము సామ్రాజ్యము ఛిన్నాభిన్నమైనది. ఏకకార్యార్థమై పూనుకొనిన నాయకులలో పెక్కురాంధ్రదేశమును కొన్ని భాగములుగా వంచుకొని స్వతంత్ర పరిపాలనము చేయఁదొడఁగిరి. ఆ విభజనలో కృష్ణానది కుత్తరభాగమున నోరుగల్లును రాజధానిఁగా మునుసూరు సోదరులు కొంత, రాచకొండ దేవరకొండ రాజధానులుగా రేచెర్ల వెలమనాయకులు కొంత, కృష్ణకు దక్షిణభాగమును రెడ్డిరాజులును పంచుకొనిరి.

రెడ్డి రాజ్యము కృష్ణాగోదావరీ నదుల మధ్యభాగముననేగాక సింహాచలము వఱకును వ్యాపించినది.

ఆనాఁడు వెలసిన స్వతంత్రరాజ్యములలో నెక్కువగ రాజకీయ ప్రాభవము సారస్వత ప్రాభవము నెఱపినది రెడ్డి రాజ్యము. ఆరాజ్యమునకు ప్రథమమున నద్దంకి నగరము రాజధాని. ఆ రాజ్య సంస్థాపకుఁడు ప్రోలయ వేమారెడ్డి.

ఈ వేమారెడ్డి క్రి. శ. 1324 మొద 1349 వఱకు రాజ్యమొనర్చెనని చరిత్రకారులు వ్రాసియున్నారు. కొందఱు క్రి శ. 1325-1353 వఱకు నని నిర్ణయించినారు. ఇతఁడు జీవించి యుండఁగనే యితని పెద్దకుమారుఁడైన పోతయచమూపతి (అనపోతారెడ్డి) సేనానాయకుఁడుగను, యువరాజుగను నుండెనని హరివంశము నందలి క్రింది పద్యములు తెలుపుచున్నవి.

శా. "వేమక్ష్మాధిపు కూర్మిపుత్రుఁడు దయావిభ్రాజి యవ్యాజతే
జోమార్తాండుఁడు కీర్తనీయసుగుణ స్తోమంబులందేమియున్
రామస్ఫూర్తికి లొచ్చుగాక సరియై రాజిల్లు రాజార్చితుం
డామువ్వాయణుఁడెందుఁబోతయ చమూపాగ్రే సరుండిమ్మహిన్

హ. వ. I - 1-30

ఈ వేమారెడ్డి కూర్మిపుత్రుఁడు చమూపాగ్రేసరుఁడు అవ్యాజ తేజోమార్తాండుఁడు. కీర్తనీయ సుగుణ స్తోమంబులందేమియును రామస్ఫూర్తికి తగ్గక రాజిల్లు

వాఁడు. ఈ పోతయ యువరాజ పదవి నధిష్ఠించియుండ, సోదరుఁడగు మల్లారెడ్డి సర్వవిధముల చేదోడై యుండ వేమారెడ్డి రాజకార్యముల నిర్వహించినాఁడు.

మల్లచమూపతి సమస్త ద్వీపాంతరముల నుండి రత్న సముదాయమును తెచ్చి సోదరుని నిరంతరము అర్చించువాఁడు. నిర్వంచక సోదరత్వమున నిత్యము నితడు వేమారెడ్డి నారాధించువాఁడు

ఇట్లు పుత్రుఁడు యువరాజై యుండ నగ్రజుఁడాది రాజన్యతుల్యాచార నిధియై యొప్పుచుండ అన్నచమూపతియు, మల్లభూపతియు దైతేయారికి మాఱుట చేతుల క్రియచే దోడై యుండ వేమారెడ్డి రాజ్యమేలినాఁడు

అతఁడు క్రి. శ. 1325 మొదలు క్రీ. శ. 1353 వఱకు ప్రజాక్షేమంకర ముగ, శత్రు భయంకరముగ రాజ్యపాలనము గావించినాఁడు.

ఆ రాజు ఆస్థాన కవియే ఎఱ్ఱాప్రెగ్గడ. ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమునకు కృతి కర్త కాగా వెమారెడ్డి కృతి భర్తయై ఆనందించినాఁడు.

## ఎఱ్ఱాప్రెగ్గడ కృతులు - రచనాకాలము

ఎఱ్ఱన కృతులలో లభ్యములైనవి మూఁడు. హరివంశము, నృసింహ పురాణము భారతారణ్యభాగమును- నామ మాత్రావశిష్టమైన రామాయణము నాలుగవది. వీనిలో ఏది పూర్వము, ఏది పరము అను విషయము పండితులలో గొప్ప వివాదమునకు గుఱియైనది.

హరివంశ పురాణమున – ఎఱ్ఱయను వేమారెడ్డి పిలిపించి,

"నా తమ్ముండు ఘనుండు మల్లరథినీ నాథుండు............

కావ్యామృతాస్వాదనన్"

అని చెప్పినట్లుగ ఎఱ్ఱయ తెలిపినాఁడు.

ఆ పద్య భావమును బట్టి –

వేమారెడ్డి సోదరుఁడగు మల్లారెడ్డి యెఱ్ఱయనుఁ బ్రీతితోఁ జేపట్టినాఁడు. అన్నకు సమర్పించినాఁడు. వేమారెడ్డి యాత్మానందము కలుగునట్లుగ రామకథఁ జెప్పించి, ఖ్యాతిఁ నొందినాఁడు. అయినను, కావ్యామృతస్వాదన యందలి తృష్ణ తనియలేదు. రామాయణముఁ జెప్పించన ఁ దనియలేదు. కావున హరివంశమును రచింపు మనుటచే – రామాయణము తరువాత హరివంశమని తెలియుచున్నది.

కనుక "ఎఱ్ఱయ రామాయణము రచించిన తరువాతనే హరివంశము రచించినాడు" - అనుటలో నేరెకిని సందియములేదు.

ఇఁక నృసింహ పురాణమున నెఱ్ఱయ తాత ఎఱపోత సూరి భావమున నావిర్భవించి -

"ఉన్నత సంస్కృతాది చతురోక్తి పదంబులఁ గావ్యకర్తయై
యెన్నికయె ప్రబంధ పరమేశుఁడనంగ నరణ్యపర్వశే
షోన్నయ మాంధ్రభాష సుజనోత్సవ మొప్పఁగ నిర్వహించి తా
నన్నయ భట్ట తిక్కకవినాథుల కెక్కిన భక్తి పెంపునన్"

నృ. పీఠిక - 17.

—అని పలికినాఁడఁట!

దీనినిఁబట్టి అరణ్యపర్వ శేషోన్నయము నృసింహ పురాణ రచనారంభము నాటికే ముగిసిపోయినదని తెలియుచున్నది. కనుక నరణ్యపర్వ శేషపూరణము పూర్వమనియు, నృసింహ పురాణ రచన పరమనియు స్థిరమగుచున్నది.

ఈ నిర్ణయమున కవుల చరిత్ర వ్రాసిన పర్వులకును ఏకాభిప్రాయమే, కాని ఏ జంట పూర్వము, ఏ జంట పరము అనుటలో గొప్ప వాగ్వాదములు చెలరేగినవి. అన్నింటిని క్రోడీకరించి, సమీక్షించి, నా యంగీకృతాభిప్రాయమును తెలియఁజేయుచున్నాను.

## గ్రంథముల పౌర్వాపర్యముల గుఱించిన వాదము - నిర్ణయము

(1) హరివంశకాలము నాటికి మల్లారెడ్డి శౌర్యపరాక్రమోపేతుఁడై జీవించియుండెననుటలో సందియములేదు. ఎందులకన ఎఱ్ఱయ హరివంశమున -వేమారెడ్డి యనుంగు తమ్ముఁడు మల్లారెడ్డిని గుఱించి తెలిపినాఁడు.

ఎఱ్ఱన మల్లారెడ్డిని పొగడుచు -

శా॥ "బాహాదర్పమునం బ్రతీప ధరణీ పాలావళిం దోలి యు
త్సాహోదగ్రుఁడు మోటుపల్లిఁ గొని సప్తద్వీప సద్వస్తు సం
దోహంబుం దన కిచ్చు నెచ్చెలి సముద్రుం బ్రీతిఁ బోషించుచున్
మాహాత్మ్యంబు వహించె మల్లరథినీ నాథుండు గాఢోద్ధతిన్"

అని తెలిపినాఁడు. దీనినిఁబట్టి -

మల్లరథినీ నాథుడు బాహుదర్పముతో శత్రురాజుల పాఱఁద్రోలినాఁడు. ఉత్సాహోన్నతుఁడై మోటుపల్లిని కైవసము గావించుకొనినాఁడు సప్తద్వీపములనుండి సద్వస్తు సందోహమును దెచ్చు సముద్రయాన స్థానమును తిఁగి పోషించినాఁడు. అట్టి మాహాత్మ్యము గలవాఁడు మల్లారెడ్డియని తెలియుచున్నది.

భుజ బలముచే శత్రురాజులను పాఱఁద్రోలుట, సముద్రమును హస్తంగతము గావించుకొనుట, ఎఱ్ఱయను వేమారెడ్డి కర్పించుట, - వంటి కార్యములలో నిమగ్నుడగు మల్లారెడ్డి సంపూర్ణయౌవనము నందుండి యుండునుగదా। ఆరోగ్యవంతుఁడుగా నుండినవాఁడు, మిక్కిలి బలశాలి యుత్సాహవంతుఁడు నని తెలియుచున్నది. ఈ యుత్సాహము, బలము, ఆరోగ్యమును యౌవనవంతులలోనె మిక్కిలిగా కనిపించును.

మల్లారెడ్డి యెడఁగల మక్కువచేతను, వాతఁడు చూపిన యాదరమును మఱువలేకను, హరివంశము నందలి యాశ్వాసాంతము లందంతటను ఎఱ్ఱయ మల్లారెడ్డి ఘనతను స్మరించుకొనినాఁడు.

కం॥ "సకల ద్వీపాంతర ర
త్నకలాప నిరంతరార్చనా కలనారం
భక కురుమలూరి పురనా
యక మల్లచమూ వరేణ్య హరి నిషేవ్యా!"
(హ. వ. I-1-198)

ఈ పద్యము వలన మల్ల చమూపతి కురుమలూరి పురనాయకుఁడు. సమస్త ద్వీపాంతరముల నుండి రత్నసముదాయముల తెచ్చి, సోదరుని నిరంతరము నర్చించువాఁడు అని తెలియును.

కం॥ "సర్వ ధురీణ గుణోదయ
సర్వజ్ఞోదాత్త వృత్త సంసిద్ధియశో
గర్వితి మల్లచమూవర
నిర్వంచక సోదరత్వ నిత్యారాధ్యా!" (I-2-237)

మల్ల చమూవరుఁడు సర్వధురీణ గుణోదయుఁడు, యశో గర్వితుఁడు, ఉదాత్తవృత్తుఁడు. సర్వజ్ఞుఁడు, నిర్వంచక సోదరత్వమున వేమారెడ్డి నిత్యమారాధించువాఁడని తెలియుచున్నది.

కం॥ "రామాయణ హరివంశ
శ్రీమన్మధుర ప్రసంగ సిద్ధచిర యశ
స్సామర్థ్య కరణ నిపుణా
శ్రీమల్ల చమూవరేణ్య సేవిత హృదయా"
(I-3-249)

రామాయణ హరివంశముల మధుర ప్రసంగములచే చిరయశమును పొందిన సామర్థ్యము గలవాఁడు వేమారెడ్డి. శ్రీ మల్లచమూవర సేవిత హృదయుఁడు.
(ఉ. భా. ఆ. 1) 183

కం॥ "శ్రీమల్ల చమూ వల్లభ
సామాజిక చతురుపాయ సామర్థ్య నమ
త్సామంతోజ్జ్వల వైభవ
సామగ్రీ లబ్ధ సకల సౌభ్రాత్ర సుఖా!"
హ. వ II - 1-183

"శ్రీ మల్లచమూవల్లభుఁడు సామదానాది చతురుపాయములతో సామంతుల నవనతుల గావించుటలో దిట్ట. అట్లు చతురుపాయముల ప్రయోగించి సామంత రాజుల నోడించి, మహావైభవములను, సామగ్రులను భ్రాతయగు వేమారెడ్డి కర్పించెడి వాఁడు. అట్టి సౌఖ్యము నందినవాఁడు వేమారెడ్డి."

కం॥ "బహు జలధి ద్వీపాంతర
మహీశ్వర ప్రహిత కనక మణిమౌక్తిక హ
స్తిహ యాద్యర్పణ సేవా
బహుమత మల్లరథినీశ భక్తిప్రీతా!"
II - 2-189

మహీశ్వరులు ద్వీపద్వీపాంతరముల నుండి బహువిధ కనకమణి మౌక్తికములను, హస్తిహయాదులను - అర్పించి, వేమారెడ్డిని సేవించుచుండిరి. ఇట్టి ప్రియ కార్య కర్తయగు మల్లరథినీశుని భక్తిచే ప్రీతుఁడైన వాఁడు వేమారెడ్డి.

కం॥ "ధీయుక్త మల్లరథి నీ
నాయక మంత్ర ప్రయుక్త నయపూర్వక కా
ర్యాయత్త ఖడ్గ విభవ
స్ఫాయద్విషువాభి పోష ! భాసురపోషా !

(ఉ. 3. ఆ 247)

"మల్లరథినీ నాధుఁడు గొప్ప ధీమంతుఁడు. అతని కార్యాలోచనచే, రాజనీతి ప్రయోగముచే కార్యాయత్తుఁడై వేమారెడ్డి ఖడ్గవైభవము గలవాడై, రాత్రింబవళ్ళు రాజ్యము నభివృద్ధి పఱచువాఁడు."

కం॥ "రత్నాకర నాయక గుణ
రత్నోజ్జ్వల రెడ్డి మల్ల రాజిత శశ్వ
ద్యత్నాంతక ద్వీపాంతర
రత్నాలంకృత సమస్త రాజ్యరమాంగా !"

హ. వ II - 5-219

సముద్రుని వలె గుణ రత్నములచే ప్రకాశించువాఁడు మల్లారెడ్డి. మాటికి ద్వీపాంతరముల రెడ్డి రత్నములఁ దెచ్చి వేమారెడ్డి నలంకరించువాఁడు.

కం॥ "శ్రీమల్లచమూపతి సే
వామధురిమ నిత్యసుముఖ వామవిచార
వ్యామూఢ విముఖ ! అర్చిత
వామార్థాంగ వరతత్త్వ ! వాసవసత్త్వా !"

హ. వ. II-7-285

హరివంశకాలము నాటికి విధముగా ననుదినము సోదరునికి రాజకార్యము లందు కుడి భుజమై మెలఁగుచుండిన వాఁడు మల్లచమూపతి యని తెలియుచున్నది.

కనుక హరివంశ రచనాకాలము నాఁటికి మల్లారెడ్డి సంపూర్ణ స్వస్థచిత్తుఁడు, సోదరునకన్నివిధముల రాజకార్యములందు సాయమొనర్చు చుండినాఁడు - అనుట తథ్యము

క్రీ. శ 1345 నకు పూర్వము మల్లచమూపతి స్వర్గస్థుఁడయ్యెనని ధరణి కోట శాసన మూలాధారముగాఁ తెలియుచున్నది. శా. శ. 1267-అనఁగా క్రీ. శ 1345వ

సం॥మున వేమారెడ్డి తనసోదరుఁడగు మల్లారెడ్డి పుణ్యము కొఱకు అమరావతి యందలి యమరేశ్వరాలయమున కైదు స్వర్ణశిఖరములెత్తించి వ్రాయించిన శాసనాధార మొకటి గలదు. అనఁగా నప్పటికే మల్లారెడ్డి చనిపోయినాఁడు. వీరస్వర్గము నలంకరించిన మల్లారెడ్డి పేరిట వేమారెడ్డి దానమది.

"అమరేశ్వరాలయమునందలి - శాసనము" :-

"త్రిపురాంతక దేవదివ్య శ్రీపాద పద్మారాధకులైన శ్రీమతు వేమయరెడ్డింగారు తమ తమ్ముండు మల్లయరెడ్డింగారికి, అక్షయ పుణ్యముగాను గుడిమీఁది సువర్ణ కలశాలు ఐదున్ను పసిండి పట్టణమున్ను కల్పాంతర స్థాయిగాను సమర్పణసేసిరి"

(South Indian Inscriptions - Vol. 6 No. 213-
Vol. VII. శా. శ 1267 రెడ్డి సంచిక **Page 14)**

కనుక నీ శాసనము నాఁటికి మల్లారెడ్డి కాలధర్మము నొందినాఁడు. కాన అంతకు పూర్వమే హరివంశ రచన జరిగినది.

2) "శ్రీ పర్వతము - అహోబిలము" దీనికి వేమారెడ్డి మెట్లు కట్టించినాఁడు.

వేలూరి శివరామశాస్త్రిగారి - హరివంశ పీఠిక -

"క్రీ. శ. 1330 సం॥ మొదలు క్రీ. శ. 1353 వరకును వేమన వేయించిన శాసనము లిప్పటికిని కనిపించుచున్నవి. వీనిలో శ్రీశైల సోపానప్రసక్తియు, అహోబల సోపానప్రసక్తియు గలదు -" శ్రీపర్వతాహోబల నిర్మిత సోపాన" యని కనిపించుచున్నది. పిమ్మట వేయించిన పెద్దశాసనము లందన్నిఁటను నీమాట యున్నది. నూఱేండ్ల పిదప శ్రీనాథుఁడు -

కం॥ "శ్రీ పర్వత సోపాన
స్థాపక వేమక్షితీశ సామ్రాజ్యశ్రీ
వ్యాపారి ముఖ్య యన్వయ
దీపక ! యలకాధిరాజ దేవయ తిప్పా!"

అని హరవిలాసమునను -

"రాజ్యం వేమస్య చిరమకరోత్ ప్రాజ్యదానైకతానో
భూమీ దేవైర్భువ మురుభుజో భుక్తశేషామభుఙ్క్త"

"శ్రీశైలాగ్రాత్ ప్రభవతి పథి ప్రాప్త పాతాళగంగే
సోపానాని ప్రమథ పదవీ మారురుక్షుశ్చకార"

యని సంతాన సాగరమను చెఱువును ప్రతిష్ఠచేసినపుడు వేసిన ఫిరంగిపురము శాసనమునను జెప్పియున్నాఁడు.

ఇంతటి ఘనమైన యీసోపాన నిర్మాణ ప్రస్తావనము హరివంశమున లేదు. కాను యణమును మనమెఱుఁగము.

అట్లు యాసోపానస్థాపన యెఱ్ఱాప్రెగ్గడ ఎఱుఁగఁడని నిర్ధారణ చేసితి మేని, దానితోఁబాటితఁడీ నిర్మాణమునకు పూర్వమే శరీరమును చాలించినాఁడని నిర్ధారించినట్లే యగును. అది సరికాదు. ఎఱ్ఱాప్రెగ్గడ యిదియొక విశేషముగా తలంపలేదనుట సమంజసము కాదు. వేమారెడ్డి హేమాద్రి చెప్పిన దానముల 'తు. చ' తప్పక చేసినాఁడని తెలిపినాడు. ఇదియసాధారణమగు నిర్మాణము. శ్రీశైలమునకు నేటేఁటఁ బోవు యాత్రికులనుఁ గూడ ప్రమథ పదవి కెక్కించు సోపానములే యివి. ఇట్టి సోపానములఁ గట్టించినవారి ప్రస్తావనము శాసనములందే కాక గ్రంథములందును సుపరిచితము

కనుక హరివంశకాలమునాఁటికీ సోపాననిర్మాణము జరుగలేదని యొప్పుకొనిన తప్పక హరివంశరచనము క్రీ. శ 1335 నకు పూర్వమే జరిగి యుండవలయును.

చాగంటి శేషయ్యగారు - కవితరంగిణి

"వేమారెడ్డి శ్రీశైలమునకు పాతాళగంగకు సోపానపంక్తిని నిర్మించెనని ఈతని వంశీయులు వ్రాయించిన అనేక శిలాశాసనములలో వర్ణింపఁబడి యున్నది.

"శ్రీపర్వతము - అహోబలములకు మెట్లు కట్టించెను. ఈ రెండు కార్యములు క్రీ. శ. 1335 నాఁటిదగు రామతీర్థ శాసనము వలన తెలియుచున్నది. ఈ విషయ మెందువలనో హరివంశమునఁ జెప్పఁబడలేదు. పోనీ, ఈ విషయమంత ప్రముఖమైనది కాదేమో! అనిన అట్టిదియుకాదు. వేమారెడ్డి తమ్ముఁడు మల్లారెడ్డి సముద్రయానమును హస్తంగత మొనర్చుకొనినది తెలిపినాఁడు. అట్టిది వేమారెడ్డియే వేయించిన సోపానముల ప్రసక్తిని తెలుపఁడా? వేమారెడ్డి జయించిన అగ్రహారాది దానములనే పేర్కొనెనే! ఇంత ప్రముఖమైన సోపాన నిర్మాణము తెలిసియుండిన ఎఱ్ఱయ వ్రాసి యుండఁడా? కనుక హరివంశ రచనాకాలము నాఁటికి శ్రీశైలాహోబల సోపాన నిర్మాణము జరుగలేదని భావించుటయే సర్వవిధముల సమంజసము. కనుక శ్రీశైలాహోబల సోపాన నిర్మాణమునకు పూర్వమే హరివంశ రచన జరిగియుండు ననుట తథ్యము. హరివంశ రచన జరిగి యుండును.

(3) వేమారెడ్డి అనుజుఁడు దొడ్డారెడ్డి. ఇతని ప్రసక్తి హరివంశమున లేదు. ఎందులకు ? అను నవొక ప్రశ్న.

క్రీ. శ. 1340వ సంవత్సరపు ముట్లూరు శాసనము నందు -

"సింధో శ్రీరివ దొడ్డయా ద్గుణనిధేర్జాతాన్నమాంబా తత
స్సాన త్తత్పురుషో త్తమస్య దయితా సాసూత పశ్చాత్క్రమాత్
సాధ్వీ వీరమసూత మాచనృపతిం శ్రీవేమ పృథ్వీపతిం
దొడ్డక్ష్మాభుజ మన్న భూమిరమణం శ్రీమల్లభూవల్లభమ్"

అని గలదు.

క్రీ. శ. 1345వ సం॥పు ఆతుకూరి శాసనము నందు -

"అగ్రే మాచ నృపాల మున్న పథశ్శ్రీ వేము పృథ్వీపతిం
పశ్చాద్దొడ్డయ భూప మన్నయనృపం శ్రీమల్లయ క్ష్మాపతిమ్"

అని వారి క్రమము తెలుపఁబడినది.

ముట్లూరు శాసనము - "మాచ, వేమ, దొడ్డ, అన్న, మల్లభూవల్లభులు వరుసగా అన్నమాంబాపుత్రులు" అని తెలుపుచున్నది.

ఆతుకూరి శాసనము - వారి క్రమమును బలపఱచుచు మొదటివాఁడు మాచ విభుఁడని, రెండవవాఁడు వేమా భూపాలుఁడని. అనంతరము దొడ్డనృపతియని, తరువాతివాఁడన్నయ నృపతి యనియు, కడపటివాఁడు మల్లయ క్ష్మారమణుఁడనియు, పేర్కొనుచున్నది.

హరివంశమున "ఆది రాజన్య తుల్యాచార నిధి మాచవిభుఁడు పూర్వజుఁడనియు. తమ్ములు - అన్న మల్లవిభులనియు నెఱ్ఱయ తెలుపుచున్నాఁడు. కాని ఎఱ్ఱయ దొడ్డారెడ్డిని గురించి తెలుపలేదు. కావున -

దొడ్డారెడ్డి హరివంశ రచనా కాలము నాఁటికి -

(1) పుట్టియుండఁడు - లేదా

(2) మరణించి యుండును - లేదా

(3) గ్రంథమున కెక్కి మన్ననలను, పొగడ్తలను ఏ మాత్రము పొందఁ జాలని పరిస్థితి యందైనను నుండవలెను. లేదా జీవించి యున్నను గ్రంథము లందలి ప్రసిద్ధికెక్కలేని దయనీయ స్థితియందైన నుండవలెను. లేదా

(4) దొడ్డారెడ్డి అన్నయగు పెమారెడ్డితో ప్రబలమగు వైమనస్య మేర్పడి, పరమ శత్రువై యుండవచ్చును. శత్రువులతో చేరి యుండవచ్చును. ఆనాఁటి తురుష్కులలోఁ గలసి యుండవచ్చును.

పై శాసనములందు పెమారెడ్డి యనంతరము జన్మించినవాఁడు దొడ్డారెడ్డియని తెలుపబడి యున్నది. అన్నయ మల్లయామాత్య విభులు తరువాతివారు. పెమారెడ్డి అనుజులను గురించి హరివంశము నందిట్లు కలదు –

కం॥ "దైతేయారికి మాఱుట
చేతులక్రియ నొప్పి రెండుఁ జేదోఁడై వి
ఖ్యాతులు తమ్ములు వేమ
క్ష్మాతల పతి కన్న విభుఁడు మల్లప్రభుఁడున్"
(హ. వ. I – 1–24)

వ. "ఆ యిరువురి యందును –

ఉ॥ "అన్న చమూవరుండు సకలార్థ సమన్వితుఁ డన్నదాన సం
పన్నుఁ డభిన్న బాహుబల భాసి భవాంఘ్రిసరోజ పూజనా
సన్నుతి తత్పరాత్ముఁ డవసన్నవిరోధి ప్రసన్న భావుఁడ
భ్యున్నతి శాలి కీలిత శుభోదయుఁ డూర్జితుఁ డయ్యె నెయ్యెడన్"
(I – 1–26)

వేమభూపతికి అన్నవిభుఁడు, మల్లప్రభుఁడు చేదోడు వాదోడై రాజకార్యము లందు సాయపడుచుండిరి అందన్న భూపతి సకలార్థ సమన్వితుఁడు. అన్నదాన సంపన్నుఁడు. శౌర్యశాలి – శివభక్తుఁడు.

మల్లచమూపతి – మోటుపల్లిని క్షేపసము గాపించుకొని సప్తద్వీపముల నుండి సద్వస్తు సందోహమును దెప్పించి యిచ్చు సముద్రునిఁ బ్రీతితో పోషించినాఁడు.

ఇట్లు వేమారెడ్డి యనంతరము జనించిన అన్నయ మల్లయల ఘనకార్యముల గురించి ఎఱ్ఱయ తెలిపెనే కాని దొడ్డయను నామమాత్రము తడవలేదు.

హరివంశము నాటికి దొడ్డారెడ్డి జన్మించి యుండలే దందుమా: అది పొసఁగదు. దొడ్డారెడ్డి యనంతరము అన్నయమల్లయలు జన్మించి యువకులై రాజునకు చేదోడు వాదోడై యుండ నాఁటికి పూర్వుఁడుగా తెలుపఁబడు దొడ్డయ జన్మించి యుండఁడనుట పొసఁగదు.

'క్రమము సరిగాలేదు. దొడ్డారెడ్డి చివరివాఁడై యుండవచ్చునేమో' అందు మనిన హరివంశక్రమము - శాసనములలోని క్రమము ఏమాత్రము తప్పలేదే ? మఱి అందఱి వయస సరియైనపుడు ఒక్క దొడ్డారెడ్డి విషయముననే శాసనములు క్రమము తప్పియుండునా ? కనుక నిదియును పొసంగదు.

'దొడ్డారెడ్డి యేలేఁడు' అందుమా: అట్లయినచో పైశాసనము లన్నింటిని విశ్వసింపక పోవలసివచ్చును.

'సన్నియోగ విశిష్టానాం సహవా ప్రవృత్తిః సహవా నివృత్తిః' అని సర్వ లను విశ్వసింపక పోవలసి వచ్చును. అప్పుడిక వేమారెడ్డియు నుండఁడు. అతని యను జులునుండరు అతని యాస్థానము నుండదు. ఆస్థానము నందలి ఎఱ్ఱయ యుండఁడు. ఆతని హరివంశస్థితియు సంశయాస్పదమై మొదటికే మోసము వచ్చును. కనుక దొడ్డా రెడ్డియే జన్మించి యుండఁడనుట పొసఁగదు.

దొడ్డారెడ్డి హరివంశ రచనాకాలమునాటికి మరణించి యుండు ననునదొక వాదము. అతఁడు హరివంశరచనా కాలము నాఁటికి మరణించెనే యనుకొందము. మరణమొక దోషము కాదుగదా ! జీవితులైనపుడు మహాకార్యము లాచరించి పరా క్రమవంతులై తమ జీవితములను ప్రజాకార్యక్రమములకు సాహసోపేత చర్యలకు వినియోగించి అల్పాయుష్కులై వీరమరణము పొందిన వారెందఱు లేరు. అభిమన్యుఁడు అల్పాయుష్కుఁడు కాఁడా ! అట్టి వారిని గ్రంథములు మఱచినావా ? వారిని ప్రశంసించుటకు గ్రంథకర్తలు వెనుకాడిరా ! కనుక దొడ్డారెడ్డి మరణించి యున్న మరణమొకదోషముకాదు కనుక హరివంశ కర్త ఆతనిని స్మరింప కుండుట వేఱొకకారణ ముండి యుండును.

దొడ్డారెడ్డి యనుజన్ములే యువకులై రాచకార్యములందు సర్వతోముఖ వ్యాప్తిని కల్గియుండిరి. కీర్తిప్రతిష్ఠల నార్జించి యుండిరి. కనుక నొకవేళ అతఁడు మర ణించియే యున్నను తన జీవిత కాలములో శౌర్య పరాక్రమముల దిఙ్మాత్రముగానైన

వెలయించియుండును. కనుక కీర్తిశేషుఁడుగనైన పొగడ్తలంది యుండును. లేక ఎఱ్ఱయ వేమారెడ్డి వంశ ప్రముఖులను మాత్రము వర్ణించి, ఆ ప్రధానుఁడుగ నుండిన దొడ్డారెడ్డిని వదలెననుకొందమా ? అదియును పొసఁగదు.

వేమారెడ్డి యనుజ, తనుజ మాతులురను, బాంధవులను పేరుపేరున వర్ణించిన ఎఱ్ఱయ దొడ్డారెడ్డి పేరునుకూడ నుచ్చరింప వలదనుకొను నంతటి యవివేకి కాఁడు. అతఁడనామకుఁడై, యగస్త్యభ్రాతవలె నుండవచ్చుననుటయు సమంజసముకాదు. అప్రసిద్ధులు నామస్మరణమునకును నోచుకొనునంతటి యపరాధులు కారుగదా ; కాని యొకటి యూహింపవచ్చును. శారీరకముగనో, మానసికముగనో యగ్మతపొంది పేరు ప్రఖ్యాతులు లేక దొడ్డయ దయనీయ స్థితిలో నుండియుండవచ్చును. కావ్యకర్తల కతిశయోక్తులు సహజములు గదా ; లేనిది ఉన్నట్లుగ నెందుకు వర్ణింపలేరు ? అని యడుగవచ్చును.

ఎఱ్ఱయ శూన్యమునుండి అతిశయోక్తుల పుట్టించు మిథ్యా రచయిత కాఁడు. అయిన వేమారెడ్డిని సోదరులను పొగడిన పొగడ్త లన్నియు సత్యములేనా ? యని అడుగవచ్చును. సత్యవంతుఁడగు కవీశ్వరుఁడు మిథ్యాస్తుల గావింపఁడు. గోరంతలును లేనప్పుడు కొండంతలు సృష్టించుటెట్లు ? దొడ్డారెడ్డి ఆ గోరంత స్థితిలోనునుండ లేదేమో ; ఒకరి స్తుతులు - స్తుతిగ్రహీతకే మాత్రమును బాధ కల్గింపకుండ వలెను. ఒక మహా దరిద్రుని 'నీవు కుబేరుడ' వనిన అతఁడు బాధపడునే కాని యుబ్బిపోవడు ఒక కురూపిని 'నీవు మన్మథుఁడవు' అనిన కించపడునే కాని సంతోషింపడు. దొడ్డారెడ్డిదియు అట్టిస్థితియై యుండవచ్చును. ఇతరుల దయనీయ స్థితిని పొగడి హాస్యాస్పదుల గావించు కుసంస్కారి కాడెఱ్ఱయ. కనుక నట్టి పరిస్థితులలో నా వ్యక్తిని తడవకుండుటయే సమంజసమని తలంచి ఎఱ్ఱయ వదిలివేసి యుండును. తమ స్తుతిపాఠములచే నెవరికిని ప్రయోజనము సిద్ధింపనిచో సౌఖ్యము చేకూరనిచో నట్టివానిని తొలగించు కొనుటయే లెస్సకదా ; ఎఱ్ఱయయు నట్టికార్యమె జేసియుండును. 'నామమాత్రమైనను తెలుపరాదా' యనిన వృథానామస్మరణ ప్రజలకావ్యక్తి స్థితిని ఎత్తి చూపుటయే యగును.

ఎఱ్ఱన హరివంశము కావ్యముకాని, శాసనముకాదు. శాసనములు యథార్థతత్త్వమును తెలుపుటకు వెనుకాడవు, కనుకనే పై శాసనములు ప్రోలయపుత్రుల సంఖ్యను యథాతథముగా తెలిపినవి. వారిస్థితిగతులతో శాసనములకు నిమిత్తములేదు.

ఎఱ్ఱయ హరివంశము కావ్యము గనుక ఎవరిని ఎంతవఱకు వర్ణింపఁదగునో, అంత మాత్రమే వర్ణించి తక్కిన వారిని వదలివేసినది. ఏ శాసనములైనను, దొడ్డారెడ్డి శౌర్య పరాక్రమములను, దానధర్మాది గుణగణములను వర్ణించినవా ? అసిన నట్టిదియు నింతవఱకు కానరాదు. కనుక దొడ్డారెడ్డికి మతిభ్రమణమో, భయంకరమగు శారీరక దుర్మతయో కలిగియుండవచ్చును.

లేదా - మఱియొక కారణ మూహింపవచ్చును -

దొడ్డయ అన్నదమ్ములలో నిముడక వ్యతిరేక ప్రవృత్తి గలవాఁడై యుండ వచ్చును. రాజ్యలాభకాంక్షచేత అన్నదమ్ములతో కలహించి యుండవచ్చును. ఎంతో అన్యోన్యముగా నుండు నీ యన్నదమ్ములతోఁబాటు శత్రుత్వము నెఱపు అతనిని గూడ వర్ణించుట వేమారెడ్డికి క్రోధము కలిగించుట వంటిదని ఎఱ్ఱయగుర్తించి యుండ వచ్చును. కనుకనే తనహరివంశను కావ్యముగనుక, కావ్యము శాసనములవలె చారి త్రక సత్యములను యథాతథముగా కోరదు గనుక దొడ్డారెడ్డిని నిపుణముగా తొలగించి యుండవచ్చును.

ఈ రెండు కారణములుతప్ప వేఱేమియు దొడ్డారెడ్డిని ఎఱ్ఱయ వదలివేయుటకు కనిపింపవు

ఎఱ్ఱయ హరివంశరచన నాఁటికి దొడ్డారెడ్డి జీవించియే యుండెననియు, అయి నను నాతని స్థితిగతులు గ్రంథము లందెక్కఁజాలనివై యుండవచ్చుననియు, లేదా అన్నదమ్ములతో వ్యతిరేకించి కలహకారకుఁడై వేమారేడ్డి క్రోధమునకు పాత్రుఁడై యుండవచ్చుననియు, తెలియుచున్నది.

ఆనాటికి శ్రీశైలాహోబల సోపానముల నిర్మాణము ఇంకను జరుగలేదు.

కనుక హరివంశరచన శ్రీశైలాహోబల సోపానముల నిర్మాణమునకు ముందే జరిగినది.

ఈ రెండు కార్యములు క్రీ. శ 1335 నాఁటిదగు రామతీర్థ శాసనము వలన తెలియుచున్నది.

కనుక క్రీ. శ 1335 కు పూర్వమే హరివంశరచన జరిగినది. హరివంశము నందు "అనవేమారెడ్డి" ప్రశంస ఎచ్చటను లేదు. కావున ఎఱ్ఱయ అనవేమారెడ్డి నెఱుంగునో యెఱుఁగఁడో యని సందేహింప వలసి యున్నది. ఎఱ్ఱయ -

5)

ప్రోలయ వేమారెడ్డిని జ్యేష్ఠపుత్రుఁడగు అనపోతారెడ్డిని స్తుతించినాఁడు. ప్రోలయ వేముని అన్నకుమారుఁడగు కోమటిరెడ్డిని వర్ణించెను కాని హరివంశము నందెచ్చటను అనవేముని పేరైనను ఎత్తలేదు. ఆ యనవేముఁడేటో యనామకుఁ డను కొందమా :

అనవేమారెడ్డి రెడ్డిరాజ్యమును పరిపాలించిన ప్రముఖులలో నొకఁడని చరిత్ర ఘోషించుచున్నది. వీరేశలింగం పంతులుగారి కవులచరిత్రలో నిట్లుతెలిపియున్నారు.

ప్రోలయ వేమారెడ్డి
క్రీ. శ 1320 – 1349




కనుక అనవేమారెడ్డి జన్మించుటకు పూర్వమే హరివంశరచన జరిగినది.

"ఎఱ్ఱన 1280వ సం॥ ప్రాంతముల యందు జననమొంది, 1350 సం॥ ప్రాంతమువఱకు జీవించియుండును." (వీరేశలింగం పంతులుగారు – కవుల చరిత్ర)

"వేలూరి శివరామశాస్త్రి – హరివంశ పీఠిక"–లో

"క్రీ. శ. 1323లో కాకతీయ సామ్రాజ్య మస్తమించిన పిదపనే ప్రోలయ వేమయ అద్దంకికి ఏలిక యాయెను. చరిత్ర పరిశోధకులు చేసిపెట్టిన కృషివలన మనము క్రీ. శ 1330 నాఁటి నుండియే ప్రోలయ వేమయ శాసనములను చూడఁ గలుగు చున్నాము. క్రీ. శ. 1323 నకు వెనుక ప్రోలయగాని, ప్రోలయ తండ్రి వేమనగాని, అతని తండ్రిగాని సారంగపాణికిఁ బిదప నాయకులలయినటు లాధారము దొరకనంత వఱకు క్రీ. శ. 1323 నకు పిదప అద్దంకి వేమయ ఏలుబడిలోనికి వచ్చెనని యనుకొనుటయే క్షేమము. ఈ పైఁజెప్పిన కారణములచే క్రీ. శ. 1323 విప్లవము పిదప ఆఱేఁడేండ్లకు వేమయ అద్దంకి రాజధానిగా బహుభూమి లాక్రమించె

నని నిశ్చయింప వచ్చును. కావున క్రీ. శ. 1330 - 1335 సంవత్సరముల నడుమ ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణ హరివంశముల రచించెనని చెప్పవచ్చును.''

"వేమారెడ్డి యద్దంకిని రాజధానిగాఁజేసికొని యేలినాఁడు. ఈ యద్దంకి యంతకు పూర్వము సింఘణ దేవుని యేలుబడియందున్నటుల గానిపించు చున్నది. క్రీ. శ. 1254 వఱకు సింఘణ దేవుని శాసనములు కానవచ్చు చున్నవి. తరువాత క్రీ. శ. 1255 లో సారంగపాణి యద్దంకి ప్రభువైనట్లు శాసనాధారము వలన తెలియు చున్నది. మనుమసిద్ధి క్రీ. శ. 1255 - 1263 వఱకు సారంగపాణి వశమై యుండె నని చెప్పవచ్చును. తరువాత నీ యద్దంకి స్థితిగతులను గూర్చి తెలియదు."

రెడ్డి సంచిక - హరివంశ పీఠిక —

"క్రీ. శ. 1330 ప్రాంతమున వర్వేఱు శాసనమున అద్దంకి ప్రోలయవేమునకు రాజధానియైనట్లు గానవచ్చుచున్నది. కనుక హరివంశము క్రీ. శ. 1330 తరువాతిది"

హరివంశము క్రీ. శ. 1335 పూర్వము రచింపఁబడినది. క్రీ. శ. 1330 క్రీ. శ. 1335 మధ్యకాలమున రచింపబడినది.

"రామాయణ హరివంశములు పూర్వరచనలు, ఆరణ్యపర్వ శేష. నృసింహ పురాణములు తరువాతి జంట"యని తెలుపవచ్చును కాని, అరణ్యపర్వశేష, నృసింహ పురాణములే మొదటి జంట యను వారి వాదనలును గలవు.

"చాగంటి శేషయ్య - కవి తరంగిణి" —

"ఆరణ్య పర్వశేషమును ప్రథమమున రచించుట కాతనికి సంశయము కలుగక పోయియుండవచ్చును. నన్నయ, తిక్కనలు వదలిన భారతభాగమును కీర్తికాంక్షాపరుఁడై భారతలోపమును పూరించుట కుత్సహించవచ్చును."

కీర్తికాంక్షా పరుఁడైన వాఁడెవఁడును నన్నయ తిక్కనల వంటి యుగకర్తలు పూరింపఁగా మిగిలిన భాగమును ఏయనుభవమును లేక పూరించుట కుత్సహింపఁడు. నిజముగ కీర్తికాంక్షాపరుఁడైనచో మొట్టమొదట స్వపరవివేకము నేర్పఱచు కొనవల యును. కవిత్వమును రచించి, కొంతవఱకు కీర్తిప్రతిష్ఠల నార్జించిన తరువాతనే దిగ్గంతుల వంటి కవీశ్వరులు పూరింపని భాగమును చేపట్టఁగలఁడు, తన కవితా శక్తిని కొంతవఱకు పరీక్షించుకొనవలయును. అప్పుడే తనసామర్థ్యము ననుసరించి కవిత్వమునకు పూనుకొనఁగలడు. కనుక కీర్తికాంక్షాపరుఁడైన కవి చేయవలసిన పని

అదికాదు. మొదట నొకటి రెండు ప్రఖ్యాత గ్రంథముల రచించి, ఖ్యాతి నార్జించిన పిదపనే మహాకవులు వదలిన భాగములను పూరింప ప్రయత్నింపఁగలఁడు."

(2) "తద్వచనయకా" అని అరణ్యపర్వ శేషమును నన్నయ పేరిటనే రచించుట సామాన్య విషయము కాదు. అనుభవజ్ఞుఁడైనగాని, మఱొక కవిశ్రేష్ఠుని అనుకరింతునని పూనుకొనలేఁడు. అనుభవ హీనుఁడై యట్లు ప్రవర్తించినను హాస్యాస్పదుఁడు కాక తప్పదు. అట్లు హాస్యాస్పదుఁడగు నంతటి యవివేకి కాఁడు ఎఱ్ఱయ. అదియు శేషభాగ రచనను." అతుకు తెలియకుండ పూరించిన నైపుణి" రచనలో తొలిదశలో నున్న వానికి సాధ్యము కానిపని. కనుక అరణ్యపర్వ శేషము, నృసింహ పురాణము మొదటి జంట కాదు.

నృసింహ పురాణమున — పీఠిక - 13

"కతిపయాక్షర పరిగ్రహ జనితంబైన నైసర్గిక చాపలంబు కతంబున" - "రాయంచలు గూయఁ గ్రౌంచమును నావలఁ గూయఁ గడంగు భంగి" రచియింపఁ బూనితినని తెలుపుకొనినాఁడు అందులే నదియే ప్రథమ ప్రయత్నమనిరి. కాని, నృసింహ పురాణమున భారత రచనా ప్రసంగము కలదు కదా ! కనుక నది ప్రథమ ప్రయత్నము కాదు, "రాయంచలు" అనునవి వినయ సూచకమైన పదములు.

"కతిపయాక్షర పరిగ్రహ జనితమగు నైసర్గిక చాపలము" అతఁడు రచనా రూపమున ప్రదర్శించి యుండవలెను. ఈ 'నైసర్గిక చాపలము' అరణ్యపర్వ శేష రచనయే యందుమా ? అది సరికాదు. ఎఱ్ఱన సంయమ ఉత్సాహముతో నుద్రేకియై పూర్వాపరముల పరీక్షింపక, దిగ్దంతులవంటి నన్నయ తిక్కనలు వదలిన భారత భారతీ సముద్రమునకు జలసంధిగా పూరించునంతటి సాహసమును చేసి యుండఁడు. అదియు ప్రప్రథముననే అట్టి యవివేకమును చేసియుండఁడు. కనుక పూర్వము కొన్ని గ్రంథములు రచించి తన సామర్థ్యమును నిర్ణయించుకొని యుండును. ఆ గ్రంథములందే తన నైసర్గిక చాపలము ప్రదర్శించి యుండును. అవియే హరివంశ రామాయణములు.

ఎఱ్ఱయ తాత ఎఱపోతసూరి భావమున నావిర్భవించి, నృసింహ పురాణమును రచింపుమనినాఁడఁట ! అతఁడు "ఉన్నత సంస్కృతాది చతురోక్తి పదంబుల కావ్య కర్తవై ఎన్నికమై ప్రబంధ పరమేశుఁడనంగ నరణ్యపర్వ శేషోన్నయ మాంధ్రభాష సుజనోత్సవ మొప్పఁగ నిర్వహించితే !" అనెనఁట !

ఇచ్చట "ఉన్నత సంస్కృతాది చతురోక్తి పదంబుల కార్యకర్తవై" - "ప్రబంధ పరమేశుఁడనంగ" నరణ్య పర్వశేషోన్నయము గావించినాఁడఁట! "కావ్య కర్త యనఁగా "కావ్యములకుఁగర్త" "కావ్యమునకుఁ గర్త" కావచ్చును. కావ్య కర్తయై యారణ్యపర్వశేషరచనఁ గావించినాఁడు. కనుక నరణ్యపర్వశేషరచనకు పూర్వమే యితఁడు కావ్యకర్త! కనుక నాకావ్యములు-రామాయణ హరివంశములేయై యుండును. ఇట్లు ఉన్నత సంస్కృతాది చతురోక్తి పదంబులతోఁ గూడిన కావ్యము లకు కర్తయై తరువాత ప్రబంధ పరమేశుఁడనంగ నరణ్యపర్వశేషమును ఉన్నయము గావించినాఁడు.

ఈ పద్యభావము గూడ ఇందుకు దోహదమొసంగు చున్నది.

సీ॥ "భవ్యచరితుఁ డాపస్తంబ సూత్రుఁడు
శ్రీవత్స గోత్రుండు శివపదాబ్జ
సంతత ధ్యాన సంసక్త చిత్తుఁడు సూర
నార్యునకును బోతమాంబికకును
నందనుండిల పాకనాటిలో నీలకం
ఠేశ్వర స్థానమై యెనక యొసఁగు
గుడ్లూరు నెలవుగ గుణగరిష్ఠత నొప్పు
ధన్యుండు ధర్మైక తత్పరాత్ముఁ

తే॥ గీ॥ డెఱ్ఱ నార్యుఁడు సకలలోకైక విదితుఁ
డయిన నన్నయభట్ట మహాకవీంద్రు
సరస సారస్వతాంశ ప్రశస్తిఁ దన్నుఁ
జెందుటయు సాధుజన హర్ష సిద్ధిఁ గోరి.

భా. అరణ్య 7-467

ధీర విచారుఁడు తత్కవి
తారీతియుఁ గొంతఁ దోఁప దద్రచనయకా
నారణ్యపర్వ శేషము
పూరించెఁ గవీంద్ర కర్ణపుట పేయముగాన్".

భా. అరణ్య 7-469

-అని నృసింహ పురాణమున చెప్పుకొనెను.

ఇట్లు "నన్నయ సరస సారస్వతాంశ ప్రశస్తి తన్నుఁజెందుటయును" - ఇది ఎట్లు చెందినది ? ఎప్పుడు చెందినది ? ప్రమాణరచన యేది ? చెందినదని పండితుల ముద్ర వలదా?

ఆ గ్రంథమేది?- అను ప్రశ్న లుదయించును. దీనికి సమాధానము హరివంశము; రామాయణము అలభ్యము కనుక.

ఆ హరివంశ రచనను గాంచి, పండితులు కవి తల్లజులు-"నీలో నన్నయశైలి గోచరించుచున్నది. నన్నయ సరసపారస్వతాంశ సిన్ను బొందినది. సరసమైన నన్నయయొక్క సారస్వత సంబంధమైన అంశ - దాని ప్రశస్తి నిన్ను పొందినది" అని పొగడియుందురు.

అపుడు కొంతధైర్యము గలిగి పూర్వకవులపైఁగల గౌరవముతో భారతము పూరించవలెనను కాంక్ష తీవ్రమై యుపక్రమించి యుండవచ్చును "తత్కవితా రీతియుఁ గొంతఁదోప" రచించినాఁడట! ఎంతో శ్రమపడి "తద్రచనయే" యని యాతని రచనగా భావించి, రచించి నప్పటికి, ఇతనిదొక విశిష్టశైలి, స్వంత భావన లున్నందున "కొంతమాత్రమే తత్కవితారీతి" ఇతనిరచనలో భాసించినదఁట !.

ఇంతటి పరిశ్రమకు ప్రప్రథమముగా నెవ్వఁడును శ్రమపడి యుండఁడు. "సకలలోకైక విదితుఁడు" "మహాకవీంద్రుఁడు" నయిన నన్నయభట్టును ఏ యనుభవములేక, ఏ యాత్మవిశ్వాసమును లేక అనుకరించి యుండఁడు.

కనుక హరివంశరచన తరువాతనే అరణ్యపర్వశేష రచన.

"ధీరవిచారుఁడు" ఎఱ్ఱయ - "ధీర" శబ్దమున కర్థము - "విద్వాంసుఁడు, స్వాతంత్ర్యభావములు కలవాఁడు, మనోవికారకారణము లుండియు మనోవికారమును పొందనివాఁడు" అని గలదు. ఎఱ్ఱయ 'ధీరవిచారుఁడే'. విద్వాంసుఁడును !. అంతకంటెను స్వతంత్రభావములు కలవాఁడు. అంతకంటెను, మనోవికారకారణములున్నను మనోవికారము చెందని వాఁడు.

అరణ్యపర్వరచన మాగిపోవుటకు, నన్నయకు మతి చలించెనని కొందఱును, మరణించెనని కొందఱును, పలురకముల వదంతులను, శకునములను వ్యాపింపఁజేసిన కాలమది. అట్టి వదంతులను, శకునములను విశ్వసించు కాలమది.

సోమయాజియై, శమదమాది గుణాన్వితుఁడయ్యు, తిక్కనవంటివాఁడే ఆరణ్య పర్వమును వదలి విరాటపర్వమును ప్రారంభించినాఁడు. పదునైదు పర్వముల ననర్గళముగా రచించియు, ఆరణ్యపర్వశేషముఁ గ్రహించలేదు.

అట్టి సంశయాస్పదమగు శేషమును పూరించుటకు నిజముగా "ధీరవిచారులే" సమర్థులు, మనోవికారకారణము లుండియు, పొందలేదు గనుక ధీరవిచారుఁడే ఎఱ్ఱయ.

కనుక హరివంశము తరువాతిది ఆరణ్యపర్వశేషరచన. ఈ భావమునకు Dr. యశోదారెడ్డిగారు, శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారి వాదనలు బలమొసంగు చున్నవి.

Dr. పి. యశోదారెడ్డిగారు -

ఇతఁడు నృసింహపురాణమున -

కం॥ గిరిశ పద భక్తి రస త
త్పర భావము కలిమి శంభు దాసుఁడనంగాఁ
బరఁగియు గోవిందగుణా
దర సంభృత సౌమనస్య ధన్యుఁడ నైదున్"

పీఠిక - 18

అని తాత తన్ను నుడివినట్లు తన్నుగురించి తెలిపినాఁడు.

గిరిశునిపై భక్తిరసము గలవాఁడు గనుక శంభుదాసుఁడనఁగా ప్రసిద్ధి వడసిన వాఁడు, అయినను గోవిందగుణాదర సంభృత సౌమనస్యధన్యుఁడు. ఈ "గోవింద గుణాదరసంభృత సౌమనస్యత" యెట్టిదో తెలియదు. కనుక హరివంశ రామాయ ణాది పురాణముల రచనమే యైయుండును. లేనిచో గోవిందగుణాదరమును చూపిన చిహ్నము లేవి ?

"కం॥ కావునఁ బ్రబంధ రచనా
ప్రావీణ్యము నీకు సహజ పరిణత సిద్ధం
బై వెలసిన యది యొక కృతిఁ
గావింప జగద్హితంబు గా నేబలుతున్"

నృ. పు. పీఠిక - 20

ప్రబంధరచనా ప్రావీణ్య మతనికి సహజ పరిణతసిద్ధమై వెలసినదఁట ! అట్టిచో నాతఁడు రచించిన ప్రబంధము లెయ్యవి ? కేవల మారణ్యపర్వ శేషమును పూరించి నంతమాత్రముననే ప్రబంధరచనా ప్రావీణ్యము సహజపరిణత సిద్ధమని చెప్పలేము. రెండు మూడుగ్రంథములైనను నతని కవిత్వ పరిణతికి నిదర్శకములై యుండవలెను. కనుక –

రామాయణ హరివంశము లాసమయమునకు రచించియే యుండును "ఎఱ్ఱన నృసింహపురాణ రచనా కాలమునాటికే ప్రబంధ పరమేశ్వరుడు. ఈ బిరుదు కేవల మారణ్యపర్వ శేషము రచించుటచే వచ్చినదికాదు. ఒకటి రెండు స్వతంత్ర గ్రంథములో, యుద్గ్రంథములో రచించుటచే లభించు వంతటి దీ బిరుదము. ఈ యుద్గ్రంథములే రామాయణ, హరివంశములు."

శ్రీ వీరేశలింగం పంతులుగారు- కవుల చరిత్ర :-

"ఈతని కాలము వఱకును నన్నయభట్టు విడిచిన యారణ్యపర్వ శేషము తెనిఁగింపఁబడక భారతము కొఱఁతవడి యుండుట చూచి యితఁడు తాను దానిని తెనిఁగింప నెంచియు తనపేరిట నాంధ్రీకరించినచో నన్నయ భట్టారకునికిఁబోలెఁ దనకు నేదో కీడు మూఁడునని భయపడి మిగిలిన భాగము రాజరాజ నరేంద్రున కంకితముగా నన్నయభట్టు పేరితోనే రచియించెను"

దీనిని చాగంటి శేషయ్యగారిట్లు సవరించిరి –

"అరణ్యపర్వ శేషమును ప్రథమమున రచించుట కాతనికి సంశయము కలుగక పోయి యుండవచ్చును. నన్నయ తిక్కనల భారత భాగమును కీర్తికాంక్షాపరుఁడై, భారత లోపమును పూరించుటకుత్సహించ వచ్చును"

శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు - ఆంధ్ర సాహిత్య చరిత్ర –

"నన్నయ ఆరణ్యపర్వ భాగమును వ్రాయుచు నడుమనే మృతి చెందెననెడి కవిలోక భయానకమైన వదంతి యానాఁడు కలదు. దానిని స్పృశించుట అశుభము అనెడి భీతి కలదన్న మాట !

తిక్కనగారు ఆ భాగమును ఏ ఉద్దేశముతో వదలి పెట్టినను -తన యుద్దేశము నాయన లోకులకుఁ జెప్పియుండఁడు. లోకము మాత్రము ఆ భాగమునకు గల అశుభత్వశంకనే ఆయన కాపాదించి యుండును. శకునములను, స్వప్నమునను దీవనలను, శాపములను శుభాశుభ సూచకములుఁగా యాకాలమున మంచికో చెడ్డకో

అట్టివిశ్వాసముఁగల యింట జనించిన యెఱ్ఱాప్రెగ్గడ కవిత్వము నేర్చితినిదా యని. చేసేతల యరణ్యపర్వభాగమును మొదటి రచనగా స్వీకరించెనని యనుకొనుట అవివేకము. మఱియు నొకవంక నన్నయ భారతము ఇంకొక వంక తిక్కన భారతము రసతరంగితములైన మహాసముద్రముల వలె నుద్ఘోషించు చుండఁగా నడుమనొక జలసంధిని త్రవ్వి రెండు సముద్రములను ఏకార్ణవముగా రూపొందించుటకు సిద్ధహస్తుఁడు కాకపూర్వము ఏ యువకుఁడు సాహసించును?".

ఇట్లీతని యభిప్రాయమున - రామాయణ హరివంశములు మొదటి జంట ఆరణ్యపర్వశేష నృసింహపురాణములు, తరువాతిది".

## ఆంధ్రమహాభారతోపన్యాసములు - వేదాలతిరువేంగళాచార్యులు:-

"మొదటి కావ్యము రామాయణము. తరువాత భారతారణ్యపర్వశేషోన్నయమును, పిమ్మట నృసింహపురాణమును, చివర హరివంశమును మనమహాకవి రచించిన క్రమము. చివరిదగు హరివంశమున - వెనుకటి గ్రంథములు ఆరణ్యపర్వశేషోన్నయ నృసింహపురాణమును నేల రచింపఁబడియు, స్మరింపఁబడలేదు? పోనీ, వెనుకటి గ్రంథములు స్మరింపఁబడనేలేదేమో యనుకొన్నచో, రామాయణమేల యిదివఱలో రచింపఁబడినదని అఁటఁ దెలుపఁబడెను?" అని యాశంక కలుగ వచ్చును.

కాని, యచట సందర్భమునుఁ బరిశీలించుదో, నీయా శంక తొలగును అగట ప్రోలయ వేమన మనకవినిఁ దనకు హరివంశమునుఁ గృతి యీయవలసినదని యడుగుట సందర్భము. అపుడు తనకునుఁ గవికినిఁ గల పూర్వ సంబంధమును ప్రకృత కార్యోపయుక్తముఁగాఁ జేర్కొనవలసి వచ్చెను. అదివఱలోఁ ధన తమ్ముఁ డీ మహాకవి యెఱ్ఱనను ధనధాన్యాదికమున సత్కరించి, తనయొద్దఁ గవిఁగా బరిచయ మొనరించుటయు, వతని వలన నపు డొక గ్రంథమును దాను రచింపఁజేసి, తాను కృతిఁ గైకొనుటయు, దాన దానియందలి సారస్య విశేషము వలనఁ దనకుఁదనివి తీరకపోవుటయు నదికారణముగాఁ ప్రకృత గ్రంథమును హరివంశమును రచింపఁజేయవలయు నను కోరిక యుదయించుటయు యుక్తతరమును, సాహసికమునుఁగూడ గదా!" అది కారణముగా నిటఁగృతి పతికినిఁ గృతికర్తకునుఁగల సంబంధము తమకు మాత్రము సంబంధించిన కృతుల వలనఁ దెలుప వలయుటయే ప్రసక్తముకాని యతనికి సంబంధములేని గ్రంథముల మూల

మునఁ గాదుగదా ! అట్లుభయయులకును సంబంధము గలవి రామాయణమును హరివంశ మును మాత్రమే !

కడమవి రెండును ప్రకృత కృతిభర్తయైన ప్రోలయ వేమునితో సంబంధము లేనివి గనుక వానినిఁ బేర్కొనక యుండుటయే యుక్తము. అదియే యిట నౌసర్పఁ బడినది. అవి యిదివఱలోనే రచింపఁబడియుండుట, నృసింహపురాణ పద్యము వలననే స్పష్టపడెను గదా ! ఈ నిరూపణమువలన నీ నిర్ణయము పర్యవసన్నమగుచున్నది.

వీరిమతము ననుసరించి, మొదట రామాయణము, అరణ్యపర్వశేషము తరు వాత నృసింహపురాణము, హరివంశములను రచించెనని తెలియుచున్నది. హరి వంశము చివరిరచనగా వీరి వాదము.

కాని యిది యంతవాదమునకు నిలుచునంతటి నిర్ణయముకాదు, శ్రీనాథకవి సార్వభౌముఁడు—

"చిన్నారి పొన్నారి చిఱుతకూకటి నాఁడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర"—

యని తన రచనలను వరుసఁగా తెలుపుకొనలేదా !

మఱియు – ఇతరనరుల కంకితముగా వ్రాసినరచన లైనచో మఱియొక రాజు నొద్ద వాక్రుచ్చుటకు సంకోచింప వలయును కాని దైవాంకిత విషయములో నీ సంకో చమున కర్థములేదు.

భర్తృత్వసంబంధము లేనంత మాత్రమున, కర్తృత్వసంబంధము గలదు కదా! తన గ్రంథములను తాను తెలుపుకొనుటలో సమయాసమయ నిరూపణ మెందులకు ? – కావున హరి వంశమున భర్తృత్వ సంబంధము లేదని – రామాయణమును మాత్రము తెలిపి వదలివేయు నంతటి అగత్యము లేదు.

మఱి – భారత ప్రసంగము చేయలేదుగదా ! యనిన అట్లు చేయకుండుట సమంజసమే ! అది 'తద్రచనయకా' నని నన్నయ రచనయని రచించెను గదా, కనుక నృసింహ పురాణమును తప్పక పేర్కొననే వలయును. కావున వీరి వాదము యుక్తిసహము కాదు.

అట్లయినచో నృసింహ పురాణము కడపటి రచన కదా! అందు ఆరణ్యపర్వ శేష రచన మాత్రమే తడవఁబడినదే! రామాయణ హరివంశముల నామమాత్రముగ నైన తడవలేదెందులకు? అనునది మరొక ప్రశ్న యుదయించును.

రామాయణ హరివంశములు నరాంకితములు. ఆరణ్యపర్వ శేషము నన్నయ పేరిటనే వెలయింపఁబడినది. నృసింహ పురాణము అహోబల నృసింహస్వామి కంకితము.

రామాయణ రచనకు ప్రోత్సాహకారి మల్లారెడ్డి. ఈతని ప్రాపువడసియే ఎఱ్ఱయ వేమారెడ్డిని చేరఁగలిగినాఁడు. రామాయణ హరివంశముల రచించి ఆతని కంకిత మొనర్పఁగలిగినాఁడు.

రామాయణ హరివంశములనాఁటికంతటి యాదరము చూపిన వేమారెడ్డి, నృసింహ పురాణమును రచింపుమని ప్రోత్సహించి యుండఁడా? ఏ కారణముచేత నైనను ప్రోత్సహించ లేదనుకొందము. ఈ నృసింహ పురాణమున నాతని పేరైనను తడవలేదే? అంతఁగా వీరి యనురాగబంధము సడలినదా? అని ప్రశ్నవచ్చును.

రామాయణ హరివంశముల రచనకు ప్రేరకుఁడు మల్లారెడ్డి. వేమారెడ్డి యనుఁగు సోదరుఁడు మల్లారెడ్డి. అతఁడు మోటుపల్లిఁ గొని సముద్రయానమును కైవసము గావించుకొనెను. సప్తద్వీప సద్వస్తు సందోహమును తెప్పించి, సోదరుని ననవరతము నర్చించెను. శత్రుసేనల పాఱద్రోలి, రాజ్యమున భీతావహ పరిస్థితిని దూరము గావించెను. రాజనీతి యందు, మంత్రాలోచనలందు వేమారెడ్డికి కుడి భుజమై వర్తించుచుండినాడు.

కం॥ "రామునకు లక్ష్మణుఁడు సు
మిత్రాసుతుఁడు ధర్మజునకుఁ దగ సౌభ్రాత్రం
బేమెయి నెఱపుదు రామెయి
వేమప్రభుఁ గొల్చె మల్లవిభుఁడును భక్తిన్"

హ. వ. I-1-29

రామునకు లక్ష్మణునివలె, ధర్మజున కర్జునునివలె సోదరభావము నెఱపుచు వేమప్రభువునీ మల్లారెడ్డి భక్తితోఁ గొలుచువాఁడు.

కం॥ "దైతేయారికి మాఱుట
చేతులక్రియ నొప్పి రెందుఁ జేదోఁడై వి
ఖ్యాతులు తమ్ములు వేమ
క్ష్మాతలపతి కన్నవిభుఁడు మల్లప్రభుఁడున్" I-1-24

శ్రీ మహా విష్ణువునకు విశిష్టమగు హస్తద్వయమువలె అన్నవిభుఁడు, మల్లప్రభుఁడు వేమారెడ్డికి సాయము గావించినారు.

అట్టి మల్లారెడ్డి - శత్రుజన భంజకుఁడు, మిత్రజనరంజకుఁడు, వేమారెడ్డి కనుంగుభ్రాత, ఎఱ్ఱయను ప్రీతితో సమర్పించి కావ్యప్రేరకుఁడైనవాఁడు - దివంగతుఁడైనాఁడు అకాలముననే మృత్యుముఖమునఁ బడినాఁడు.

వేమారెడ్డికి వైరాగ్యభావ మదయించి యుండును.

"నా తమ్ముండు ఘనుండు మల్లరథినీ నాథుండు నిన్నాతత
శ్రీతోడన్ సముపేతుఁ జేసి యెలమింజేపట్టి మాకిచ్చుటం..."

రామాయణ హరివంశముల కృతిప్రేరకుఁడ నయితి"నని చెప్పికొనినాఁడు. ఆ సోదరుఁడిక లేఁడు. ఆ యనురాగము లేదు. కనుక నతఁడు తన కిచ్చిన ఎఱ్ఱయను తిరిగి గ్రంథముల రచింపుమని ప్రేరేపింప మనసురాక విముఖుఁడై యుండవచ్చును. ఎఱ్ఱయకును నొక విధమగు నివృత్తి లక్షణము లాపాటి కలవడి యుండును. మల్లారెడ్డి ప్రాపువడసి. వేమారెడ్డిని చేరఁగలిగినాఁడు. వారి మన్నన అందుకొనినాఁడు. రామాయణ హరివంశముల వ్రాసి, "పరాశరాత్మజమునీంద్రుని వాఙ్మయ మాది దేవుఁడౌవెన్నుని వృత్తమికడు వేడుకతో విను నాయకుండ" వని యానందించినాఁడు. వారిచ్చిన యగ్రహారాదులను, ధనధాన్యములను, భోగభాగ్యములను అనుభవించి కవిగా యశస్సు నార్జింపఁగలిగినాఁడు, సంఘము నందు సాహితీప్రపంచమునందు

నొక విశిష్ట స్థానము నందుకొనఁ గలిగినాఁడు. ఇన్నిటికి మూలభూతుఁడగు మల్లారెడ్డి లేఁడు, వేమారెడ్డియు నిర్లిప్తభావమునందున్నాఁడు. రావలసి కీర్తిరానే వచ్చినది. అనుభవింపఁ గలిగిన భోగభాగ్యము లన్నియు ననుభవించినాఁడు. జీవిత సౌఖ్యములపై నిఁక వాంఛలేదు. ఆ భోగభాగ్యములు, ఆ యగ్రహారాది మన్ననలు, వైభవములు-క్షణికములు. వానిపై వాంఛలు చాలు. రాజులు-వారి మన్ననలు - వీనిపై ఆశ నశించినది. పూర్వస్మృతులు వలదు. ఆ స్మృతుల కాలంబనయగు మల్లారెడ్డి స్వర్గము నలంకరించినాఁడు. వ్రాసిన గ్రంథము లుండనే యున్నవి. నీలకంఠేశ్వరుని సాన్నిధ్యమే చాలు. అదియే ముక్తికి సోపానము. స్వాత్మోత్కర్షవలదు - అని నిర్ణయించుకొని యుండును. అద్దంకిని వదలి తన యారాధ్యదైవమగు నీలకంఠేశ్వరుని నెలవగు గుడ్లూరును ప్రవేశించినాఁడు. వైరాగ్యభావముతో జీవితము గడపుచుండి నాఁడు.

ఆనాఁటి కింకను భారతము పరిపూర్ణత నందుకొనలేదు. భారత పరాంశమగు హరివంశమును రచించినను, భారత గ్రంథమునకు పరిపూర్ణత సిద్ధించలేదు, అరణ్యపర్వ శేషమటులనే యున్నది. నన్నయ తిక్కనల యెడ నితనికపార గౌరవము. వారు రచించిన గ్రంథమునకు అపూర్ణత నాతఁడు సహింపలేఁడు. నిస్స్వార్థ భావముతో సాహిత్య సేవను గావింపఁబూనినాఁడు. అదియొక మహా కార్యము. "నన్నయ యసంపూర్ణముగ వదలిన భాగమును తిక్కన ఎందుకు చేపట్టలేదు ?" అను శంక లేదు. కుతర్కములకు తావులేదు. జీవితమొక క్షణ భంగురము. ఈ క్షణికమగు జీవన స్రవంతిలో నొక మహోత్కృష్ట కార్యమును గావించి తీరవలయును. భారతమునకు సంపూర్ణత చేకూర్చవలయును. అరణ్యపర్వ శేషమును పూరింపవలయును." తద్రచనయకా" నని నన్నయ వదలిన భాగమును నన్నయ పేరిటనే వెలయింపఁ బూనినాఁడు. బిరుదములు కృతి కర్తృత్వము తనకు వలదు. ఈ గ్రంథ శేషసమాప్తియే తనకొక బిరుదము. సాహితీ కర్తగా నన్నయ కైంకర్యమునకే అర్పించినాఁడు.

వయస్సు, జ్ఞానము, పరిసర ప్రభావము ఇతనిని మఱింత పరిణత మనస్కుని గావించినవి. ధ్యానధారణలు చక్కగా అలవడినవి. అట్లు ధ్యానమగ్నుఁడై యుండఁగనే ఒకనాఁడి ఇతనికి పాత స్వప్నావస్థయందు కనిపించి నృసింహ పురాణమును రచింపుమని ప్రేరేపించినాఁడు. ఆ పరిణత భావముతోనే నృసింహపురాణమును రచించి, భగవదర్పణము గావించినాఁడు. తన పూర్వగ్రంథములను, తన కవితా

చమత్కార గ్రంథముల పట్టికను తెలుపుకొను నంతటి లౌకిక స్పృహ, వాంఛలేదు కనుకనే నృసింహపురాణమున రామాయణ హరివంశములను స్మరింపలేదు. ఇట్లు నృసింహపురాణమును కేవలము "స్వాంతస్సుఖాయ" అన్నట్లు వ్రాసికొనెను. అన్య ప్రేరణచే వ్రాయలేదు. అట్టి కావ్యమున రాజ పరామర్శ ఉండనవసరము లేదు.

కనుక ఖండవల్లి లక్ష్మీరంజనం గారి క్రింది వాదనము మిక్కిలి సమంజసము గనే యున్నది.

"మొదటి రచనలు-యౌవనదశయందు. ఆ దశయందు పేరుప్రతిష్ఠలు తెచ్చుకొనవలయునని, అగ్రహారాది దానముల పరిగ్రహించి మన్నన లందుకొని జీవితమును సౌఖ్యప్రదమొనర్చు కొనవలయునని - తమ కవిత్వమును రాజుల కంకితమిత్తురు. రామాయణ హరివంశము లట్టి దశయందు రచించినవి; రాజగు ప్రోలారెడ్డి కంకిత మొసంగి మన్నన లందుకొనినవే! పిమ్మట వయసుమీఱిన కొలది భక్తి జ్ఞాన వైరాగ్యము లభివృద్ధిగాంచుటయు సహజము. జీవిత చరమదశయందు పరిపక్వత సిద్ధింప వైరాగ్యమలవడి భగవదంకిత మొనర్చుటయు సహజము. ఎఱ్ఱనయుట్లే గావించి రామాయణ హరివంశముల రాజుల కంకితము గావించినాఁడు. ఆరణ్యపర్వశేషమును నన్నయపేరటనే వెలయించినాఁడు. నృసింహపురాణమును దైవమున కంకితమొసఁగినాఁడు".

నృసింహ పురాణమున "రాయంచలు గూయఁ గ్రౌంచములు నావలఁగూయఁ గడంగు భంగి" ననుట - వినయమునకు చిహ్నము. "కతిపయాక్షర పరిగ్రహ జనితంబైన నైసర్గిక చాపలంబు కతంబున" అనుట జ్ఞానము పరిపక్వము నంది వినయము పరమావధి నందుకొనిన దశ. ఇట్టిది చరమదశయందే సాధ్యము. కనుక నృసింహపురాణము కడపటి రచన. రామాయణ హరివంశములు మొదటిజంట".

— ఈ అభిప్రాయ మెంతయు సమంజసముగ నున్నది.

### శ్రీ చాగంటి శేషయ్యగారు - కవితరంగిణి

"కీర్తి కాంక్షాపరుఁడైన యీ మహాకవి ఇతరులెవ్వరును నాకార్యమును జేపట్టక ముందు తానే యాపనిని నిర్వహించి, తెలుఁగువారికిఁ గలిగియున్న లోపమును బూర్తి చేయవలయు నన్న యాత్రము తోడను నత్యుత్సాహము తోడను మొట్టమొదట నా భాగమునే పూర్తిచేసి యుండవచ్చును. భారతమునందును, తత్కర్తల యందును గవికిఁగల గౌరవభావము క్రింది పద్యములో వ్యక్తీకరింపఁబడినవి.

"భాసుర భారతార్థముల భంగులు నిక్కమెఱుంగ నేరమిన్
గాసట బీసటే చదివి గాథలు త్రవ్వ తెనుంగు వారికిన్
వ్యాసముని ప్రణీత పరమార్థము తెల్లము చేసినట్టి య
శ్వాసన కల్పులం దలఁతు నాద్యుల నన్నయ తిక్కనార్యులన్"
నృ. పు. I. 9

భారతము నందిట్టి మహాభిప్రాయముఁగల కవి మొట్టమొదట నీ భాగమును బూరించె ననుటలో వింతలేదు. మహాభారతమునను గల కొఱఁతనుఁ బూర్తిచేసిన మహనీయుఁడగుటచే నతనిని విద్వజ్జనము ప్రబంధ పరమేశ్వరుఁడని పిలువఁజొచ్చిరని తలంపవచ్చును. లేదా కవి తానే ప్రబంధపరమేశ్వర బిరుదము వేసికొని యుండవచ్చును. కవి యారణ్యపర్వశేషమును, నృసింహపురాణమును ప్రబంధములుగా భావించి యుండెనేకాని, హరివంశమునుఁ బ్రబంధ మని యననే లేదు."

దీనికి Dr యశోదారెడ్డిగా రొసఁగిన ప్రత్యుత్తరమే సమంజసముగా నున్నది.

"కీర్తి కాంక్షాపరుఁడైన ఎవ్వఁడును నన్నయ తిక్కనల నంటి యుగకర్తలు పూరింపఁగా మిగిలిన భాగమును ఏయనుభవమును లేక పూరించుట కుత్సహింపఁడు. వారితోఁబాటు కీర్తిని కాంక్షించిన వాఁడు మొట్టమొదట స్వపరవివేకము నేర్పఱచుకొనవలయును. అందులకైనను తాను రచించిన కొంతభాగమును పరీక్షించు కొనవలయును. కనుక నేదేని మొట్టమొదట కొంతరచనయుండి తీరవలయును. అప్పను తన శక్తిని నిర్ణయించుకొనఁగలఁడు, అందుచే "కీర్తికాంక్షాపరుఁడైన వాఁడెవ్వఁడును ప్రప్రథమమున భారత లోపమును పూరింపఁజాలఁడు, పూరించి హాస్యాస్పద మగుట కవకాశమును కల్పించుకొనఁ జాలఁడు."

2. "భారతమునందలి మహాభిప్రాయముచే దానిని పూర్తిచేసి ప్రబంధ పరమేశ్వరుఁడనిపించుకొని యుండవచ్చును. లేదా కవి తానే ప్రబంధపరమేశ్వర బిరుదము వేసికొని యుండవచ్చును ?

దీనికి - Dr. యశోదారెడ్డిగారి ఖండన -

"భారతమునందు మహాభిప్రాయము గలవాఁడెవ్వడును, ప్రప్రథమున కవిత్వమునకే యనుభవములేక రచింపఁడు. అట్లు రచించినను వెంటనే ప్రబంధ పరమేశ్వరుఁడనిపించుకొని యుండఁడు, లేదా కవి తానే ప్రబంధ పరమేశ్వర బిరుదమును

వేసికొని యుండ వచ్చుననుట మఱింత హాస్యాస్పదము. అట్లు తానే ప్రబంధ పరమేశ్వర బిరుదము వేసికొని, యది నిలచి యుండినచో నిఁక కవులకు కవుల బిరు దములకు నీప్రపంచము నందలి కాగితములు చాలవు ప్రతి యువకవియు, ప్రతి శ్లోకకర్తయు, పద్య నిర్మాతయు నేదోయొక బిరుదమును తగిలించుకొని లబ్ధప్రతిష్ఠుఁ డగును. కనుక నెంతటి గొప్పకవియైనను, బిరుదములను తనంతతానే వేసికొనఁ జాలఁడు. వేసికొనినను నిలువవు".

— ఇది యెంతయు అంగీకరింపఁదగిన ఖండన.

"ఎఱ్ఱాప్రెగ్గడ విద్వత్కవి. ఉభయభాషాకోవిదుఁడు ఉన్నత సంస్కృతాది చతురోక్తి పదంబుల కావ్యకర్త. అట్టివాఁడు తన బిరుదమును తానేవేసికొను స్థితి యందుండఁడు. నిత్యసౌమ్యమతికి అంతటి బిరుదములపై వ్యామోహముండఁ జాలదు". ఈ వాదనయెంతయు సమంజసముగా తోచుచున్నది.

ఖండవల్లి లక్ష్మీరంజనముగారు – ఇదే భావమునే స్థిరపఱచుచున్నారు.

మొదటి జంట యనఁగా రామాయణ హరివంశములు ఈ రెండును నరాంకిత ములు. రెండవజంట భారత నృసింహపురాణములు. వానిలోమొదటిది స్వార్థనిరపేక్ష మైన నిష్కామ కర్మ.

రెండవది పారమార్థిక చింతఁతోఁ జేసిన ఈశ్వరార్పణము. అహోబల లక్ష్మీ నృసింహస్వామి కంకితము. మానవస్వభావమునుఁ బట్టి యాలోచించినచో రాజాశ్రయ మును, ధనార్జనమును ఆశించి రచించిన జంట మొదటిది. ఐహిక భోగచింతలేని పార మార్థిక దృష్టితో రచించినది రెండవజంట–యనియు విశదమగును. అట్లుగాక భారత నృసింహపురాణములో మొదటి జంటయైనచో గ్రంథకర్త ఆధ్యాత్మికసాధనచే నీశ్వర పద సన్నిధానమువఱకును ప్రాకిపోయి, యచట నుండి పతితుఁడై రాజపదవిధానమున పడిన భాగ్యహీనుఁ డనఁబడును. ఇట్టి యధమవర్తనము గలవారును ఉందురు. కాని, శంభుదాసుని వంటి యాత్మవిజ్ఞానధనులకు అట్టిపతనము సంభవింపదు".

ఇది ముమ్మాటికి సత్యము.

చదలువాడ మల్లయ తన విప్రనారాయణ చరిత్రయందు ఎఱ్ఱయను గురించి తెలిపిన పద్యమును గాంచిన కొందరు ఆరణ్యపర్వ శేషము, రామాయణము, నృసింహ పురాణము హరివంశము – ఇవె గ్రంథముల పూర్వాపరములని నిర్ణయించిరి. ఆ పద్యము —

సీ॥ "ప్రతిభతో నారణ్యపర్వశేషముఁ జెప్పెఁ
గవులకుఁ జెవుల పండువులుగాఁగ
వల్మీక భవువచో వైఖరి రామాయ
ణంబు నాంధ్ర ప్రబంధంబుఁ జేసె
నారసింహుని పురాణమొనర్చి హరిమెచ్చి
నన్నునెన్నఁడు చూచి నాఁడ వనఁగ
ప్రౌఢిమై హరివంశ భాగముల్ రెండును
రచియించె సభలందుఁ బ్రాజ్ఞులెన్న

ఆ॥ వె॥ దురితహరుఁ బ్రబంధ పరమేశ్వరునిఁ జెవ
ల్వాడ నిలయు నాదు వంశకర్త
ధన్యమూర్తి శంభుదాసు నెఱ్ఱాప్రెగ్గఁ
డను నుతింప బ్రహ్మకును వశంబె!"

——మల్లయ రచించిన ఈ పద్యము - అవతారికలు నిర్ణయించిన రెండు జంటలను తారుమారు చేసినది.

ఇందలి క్రమమునుఁబట్టి ఆరణ్యపర్వ శేష మీతని మొట్ట మొదటి రచనా రామాయణము అనంతర రచన. తదనంతరము నారసింహ పురాణము. కట్టకడకు హరివంశ భాగములు అని నిర్ధరించు చున్నారు.

కాని, నిశితముగ పరిశీలించినచో, నీ పద్యమున రచనా క్రమముకంటె కవితా శిల్పమున కెక్కువ ప్రాధాన్యమీయఁబడినదని తెలిసి కొనవచ్చును.

ఎఱ్ఱయ - "అరణ్యపర్వశేషమును కవులకు చెవుల పండువులుగా ప్రతిభతోఁ జెప్పినాడఁట!"

ఒక మహాకవి శైలిని "తద్రచనయకా"నని చేపట్టి నిర్వహించుట సామాన్య విషయము కాదు. తన శైలిని విడనాడి, బలవంతముగ నితరుల శైలి ననుకరించుట కెంతో ప్రతిభ అవసరము. అదియు కవులకు చెవుల పండువులుగా నుండునట్లు వినిపించినాఁడు. తెచ్చిపెట్టుకొన్న శైలి యని తేలికగా తేలిపోక ఆదినుండి అంతము

వఱకు దిగ్దంతివంటి నన్నయ శైలిని నిర్వహించి కృతార్థుఁడైనాఁడు. ఇందుల కెంతో ప్రతిభావంతుఁడైననే కాని అనుభవశూన్యున కంతటి నైపుణ్య మలవడి యుండదు. కనుక ఎఱ్ఱయ అరణ్యపర్వశేష రచన వలన నాతని ప్రతిభ ఎంతటి మహత్తరమైనదో గుర్తింప వచ్చును.

ఇఁక రామాయణమును మన మెఱుఁగము. అలభ్య గ్రంథమును గూర్చి చర్చించుట అలవికాని పని.

వాల్మీకి వచోవైఖరితో రామాయణమును రచించినాఁడని గ్రహింపవచ్చును.

— "నారసింహుని పురాణ మొనర్చి హరి మెచ్చి
నన్ను నెన్నఁడు చూచినాఁడవనఁగ"

అది జ్ఞానము పరిపక్వమైనదశలో ధ్యాన నిమగ్నుఁడైన ఎఱ్ఱయకు తాత కనిపించి "నారసింహుని పురాణమును రచింపు" మనినాఁడు.

భక్తి పరిపక్వతఁ బొంది తాదాత్మ్యస్థితిలోఁ గావించిన వర్ణన కనుక 'నారసింహుఁడు' మెచ్చి, "నన్నింత సొగసుగా నీవెప్పుడు గాంచితి'వని యడిగినాఁడఁట! ఈ భావముచేత ఎఱ్ఱయ భక్తిపారవశ్యము రచనలో తెలియుచున్నది.

"ప్రౌఢిమై హరివంశ భాగముల్ రెండును
రచియించె సభలందుఁ బ్రాజ్ఞులెన్న"

అని తెలుపుటచే - హరివంశ రచనను మిక్కిలి ప్రౌఢముగా సభలోని ప్రాజ్ఞులు మెచ్చుకొనునట్లుగా రచించినాఁడు.

ఈ పద్యము నందలి క్రమము కూడ ఎఱ్ఱయ మనోభావ పక్వతను తెలుపు చున్నది. అందుమూలమున నాతని గ్రంథముల రచనాక్రమమును గుర్తింపవచ్చును.

అరణ్యపర్వ రచనలో మిక్కిలి ప్రతిభను చూపి కవుల మన్ననలఁ బడసి నాఁడు. నృసింహ పురాణమును నారసింహుఁడు నన్నింత చక్కగా నెప్పుడు గాంచితి'వని యడుగునట్లుగా భక్తిభావ సంభరితుఁడై రచించినాఁడు. హరివంశమును సభలోని ప్రాజ్ఞులు మెచ్చుకొనునట్లుగ ప్రౌఢిమతో రచించినాఁడు.

ఇచట ప్రారంభమున రాజుల సభలో రచించునపుడు. సభ్యుల మెప్పు పొందుటకై ప్రయత్నించుట సహజము. ఇది హరివంశ రచనావిషయమున ప్రోలయ

వేమారెడ్డి సభలో జరిగినది. ఇది రామాయణ రచనానంతరము జరిగినది. అనంతరము ఆరణ్యపర్వశేషమును - ప్రతిభతో రచించి, నన్నయశైలిని వహించి, దిగ్దంతులవంటి నన్నయ తిక్కనల మధ్య తాను నాయకమణియై వెలుగొంది కవులమన్నన లందినాఁడు. అనంతరము వయసుపండి. జ్ఞానము పక్వమై, భక్తిపండిన కాలమున, చరమ దశయందు - నారసింహునిలో తాదాత్మ్య మొంది, నృసింహపురాణమును రచించినాఁడు. కనుక - ఈ క్రమముకూడ - ఎఱ్ఱయ మానసిక పరిణతిని తెలుపుచు, రామాయణ హరివంశములను పూర్వరచనలుగా ఆరణ్యపర్వశేష నృసింహపురాణములను తరువాతి రచనలుగా నిర్ణయింప నవకాశము కలిగించుచున్నది.

ప్రాజ్ఞులు సభలయందు తనను మెచ్చుకొనవలయు ననెడి యాకాంక్ష యౌవనావస్థయందే యుండుట సహజము - సభలందు ప్రాజ్ఞుల మన్ననలందుటకై రచించినది హరివంశము. కనుక నిదియే పూర్వగ్రంథము.

అతుకు తెలియని నన్నయశైలి ననుకరించుటకు ప్రతిభా ప్రదర్శన మవసరము. అది ఆరణ్యపర్వశేష రచనయందు చూపెను. వయసుపండి, భక్తిభావ పారవశ్యమున రచించినది నృసింహపురాణము. కనుక నిది కడపటిది.

కనుక నీ పద్యము ఎఱ్ఱయమానసిక పరిణతిని తెలుపుచు రచనాక్రమమును నిర్ణయించుచున్నది

నిడదవోలు వెంకట్రావుగారు మొదలగు కొందఱు విమర్శకుల యభిప్రాయము ననుసరించి.

"కవితా వైశిష్ట్యమును పరిశీలించినచో హరివంశము కంటె ఆరణ్యపర్వశేషము నృసింహపురాణముల రచనయే మిన్న యనియు, నృసింహపురాణ రచన ఎఱ్ఱన రచనలలో నద్వితీయ మనియు నిర్ణయము"- అపుడు నృసింహపురాణ రచనము తుదిరచన మగును- అని స్పష్టమగుచున్నది.

ఇట్లెన్ని విధముల పరిశీలించినను-

ఎఱ్ఱయ తొలి రచనల జంట -

"రామాయణ, హరివంశములు"-

తుది రచనల జంట -

"ఆరణ్యపర్వశేష, నృసింహ పురాణములు"

హరివంశము - క్రీ. శ 1330 - క్రీ. శ 1335 ల మధ్యకాలమున రచింపఁబడినది. అనంతరమే ఆరణ్యపర్వ శేషరచన అని చెప్పవచ్చును.

# 3. ఎఱ్ఱయ హరివంశము - పురాణ - కావ్యసమన్వయము

"నమోస్తుతే వ్యాసవిశాలబుద్ధే ఫుల్లారవిందాయత పత్రనేత్ర।
యేనత్వయా భారతతైలపూర్ణః ప్రజ్వాలితో జ్ఞానమయ ప్రదీపః॥"

భారతీయ వాఙ్మయమున వేదములకొక విశిష్ట స్థానము కలదు. ఆ వేదములే శ్రుతులు, శ్రుతుల తరువాత స్మృతులు, ఆ స్మృతుల తరువాత పురాణములు. కనుక-శ్రుతిస్మృతుల తరువాత పురాణములకే స్థానము.

"వేదాః ప్రతిష్ఠితాస్సర్వే పురాణేష్వేవ సర్వదా" అని నారదీయ పురాణము-వేదముల సారమే పురాణములందు ప్రతిష్ఠింపఁబడినదని తెలుపుచున్నది.

దేవీభాగవతము.

"శ్రుతి స్మృత్యుదితే నేత్రే, పురాణ హృదయం స్మృతమ్' అని యొక పురాణము తెలుపుచున్నది. శ్రుతులు, స్మృతులు నేత్రప్రాయములు అవి రెండును లేనిచో వివేక విహీనుఁడై, జ్ఞానజ్యోతి విహీనుఁడై మానవుఁ డంధుఁడై దారితెన్నులు తెలియక అజ్ఞానాంధకారమున కొట్టుమిట్టాడును.

పురాణము హృదయము వంటిది. నేత్రములులేని మానవుఁడైనను బ్రదుకఁ గలఁడు. కాని, హృదయము లేనిదే ఒక్కక్షణకాలమును బ్రదుకఁజాలఁడు. అంతటి మహత్త్వమును మానవజీవితరంగమున సంపాదించుకొనఁ గలిగినవి పురాణములు.

వేదములు - వేదతత్త్వములు - సామాన్యజనులకు దురవగాహములు. భగవంతుని నిశ్శ్వాస రూపములు వేదములు. అవి అపౌరుషేయములు. వేదము నందలి తత్త్వసాక్షాత్కారము సామాన్య మానవునకు అతి కఠినము, వర్ణాశ్రమ ధర్మరక్షణము వేదవిహితము. అనాదిగా వచ్చు భారతీయ సదాచారములను, సంస్కృతిని పరిరక్షించు భద్రపేటికలు వేదములు. ఇవి ప్రభుసమ్మితములై శాసించునవి. అట్టి వేదములు, వేదసారము దుర్లభములై మానవునకు అందుబాటులో లేకుండుటను గాంచిన వ్యాసుఁడు పురాణములను సృష్టించినాఁడు.

"విస్తారాయచ వేదానాం స్వయం నారాయణప్రభుః
వ్యాసరూపేణ కృతవాన్ పురాణాని మహీతలే"

—నారాయణ స్వరూపుఁడగు వ్యాసుడు వేదములను, వేదార్థములను విస్తరించుట కొఱకు పురాణములను గావించెను.

ప్రభు సమ్మితములగు వేద ధర్మములను మిత్ర సమ్మితముగా, సులభభాషలో బోధించునవి పురాణములు. భక్తశిరోమణుల కథలచే వేదార్థ సారమును బోధించునవి పురాణములు. ఈ పురాణము లుపాఖ్యాన ప్రధానములు ఉపాఖ్యానముల ముఖ్యోద్దేశ్యము భగవద్భక్త్యుత్పాదన. ఆధ్యాత్మిక జీవన సమున్నతి, మోక్షసాధన. పురాణములు వేదముల వలె విధి నిషేధాత్మకములు కావు. అర్థప్రధానమైనవి. పరిపూర్ణ పురాణానుశీలనముచే మానవత్వము జాగృతము కాగలదు. ఈ ఉపాఖ్యానములలో మానవులు- దేవతలేకాక రాక్షసులును పాత్రలుగా నుండురు. ఆ పాత్రలు భగవంతుని ఆగ్రహమునకో, అనుగ్రహమునకో పాత్రములై యుండును. భగవల్లీలా వర్ణనము జరుగుచుండును. ఆ కథలు – సృష్టి, స్థితి, లయములకు సంబంధించిన ధర్మతత్త్వములను నిరూపించును. యుగాంతరములకును వ్యాప్తములై యుండును. ఒక కాలమునకు ఒక లోకమునకు సంబంధించినవిగాక, త్రికాలములకును, త్రిలోకములకును సంబంధించినవై యుండును.

"పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణా స్మృతమ్
అనంతరంచ వక్త్రేభ్యో వేదాస్తస్య వినిర్గతాః"

(నారదీయ I - 60-61)

అని యొక పురాణము. పురాణములే వేదములకంటెను – ప్రథమమున బ్రహ్మచేత సృష్టింపఁ బడినవని పలుకు చున్నది.

పూర్వపరము లెట్లున్నను వేదముల సారమే పురాణములను మాట తథ్యము.

"యో విద్యాచ్చతురో వేదాన్ సాంగోపనిషదో ద్విజః
నచే త్పురాణం సంవిద్యాన్నైవ సస్యాద్విచక్షణః"

వాయు పు I-2-180

"చతుర్వేదముల నేర్చినవాఁడైనను, సాంగముగా ఉపనిషత్తులను తెలిసికొన్నను, పురాణములను చక్కగా చదువనిదే విచక్షణుఁడు కాఁజాలఁడు," అనివిష్ణుపురాణము ఘోషించుచున్నది.

"బహుశాస్త్రం సమభ్యస్య బహూన్వేదాన్ సవిస్తరమ్
పుంసో ఽ శ్రుత పురాణస్య నసమ్యాగ్యాతి దర్శనమ్।

అను నదియు పై భావమునే సూచించుచున్నది.

ఎన్ని శాస్త్రముల నభ్యసించినను, అన్ని వేదములను విస్తారముగా చదివినను,- పురాణజ్ఞానము లేనిదే చక్కనివర్ధనము - వివేకము అలవడదని యర్థము.

'ఇతిహాస పురాణాభ్యాం వేదంసముపబృంహయేత్'
మ. భా. I 1-204

పురాణేతిహాసముల విజ్ఞానము వలన వేదార్థము ప్రసన్న మగును

కనుక పురాణములు - ధార్మిక సందేహము నివారింపఁగలవు, ఆధ్యాత్మిక మార్గము, పరలోక ప్రవృత్తి కావలయు ననిన పురాణముల నమశీలింపవలసియున్నది.

సార్వదేశిక జ్ఞానమును ప్రబోధించుచు సార్వజనీన హితమును సూచించుచు ఆస్తికతా భావయనుద్బోధించునవి పురాణములు.

పురాణలక్షణములుగా అమరము

"సర్గశ్చ ప్రతి సర్గశ్చ వంశో మన్వంతరాణి చ
వంశాను చరితం చేతి పురాణం పంచలక్షణమ్"

అని పంచలక్షణములను తెలుపుచున్నది. అవశ్యము పురాణము లందీయైదను నుండవలయునని అమరసింహుఁడు చెప్పుచున్నాఁడు.

"దుహతాంచ పురాణానాం లక్షణం కథయామితే
సృష్టిశ్చాపి విసృష్టిశ్చ స్థితి స్తేషాంచ పాలనమ్"
బ్రహ్మ వైవర్త పురాణము-132.

కర్మాణాం వాసనా వార్తా మనూనాఞ్చ క్రమేణచ
వర్ణనం ప్రతియానాఞ్చ మోక్షస్య చ నిరూపణమ్
ఉత్కీర్తనం హరేరేవ దేవానాంచ పృథక్ పృథక్
దశాధికం లక్షణంచ మహతాం పరికీర్తితమ్

అని బ్రహ్మ వైవర్త పురాణము పురాణలక్షణముల దెలుపుచున్నది.

సృష్టి - విసృష్టి - స్థితి-పాలనాదులు దశాధికలక్షణములు మహాపురాణము లకు గలవు.

"పురా నవం భవతీతి పురాణం" "పురాఽపి నవం పురాణమ్" అని నిరుక్తి, కనుక పురాణము లందలి వస్తువిశేషములు పురాతనములు, అయ్యును - నవ్యములు గను, సత్యనూతనములుగను భాసించు చుండును. పురాణములు-మహాపురాణములు ఉపపురాణములు అని రెండు విధములు.

"సాత్త్వికేషు పురాణేషు మాహాత్మ్య మధికం హరేః
రాజసేషు చ మాహాత్మ్య మధికం బ్రహ్మణో విదుః
తద్వదగ్నేశ్చ మాహాత్మ్యం తామసేషు శివస్యచ
సంకీర్ణేషు సరస్వత్యాః పితౄణాంచ నిగద్యతే"

మత్స్యపురాణము - 53

అని తెలుపుచున్నది.

పురాణములు-సాత్త్వికములు, రాజసములు, తామసములు అని ముత్తెఱంగులు సాత్త్విక పురాణములందు విష్ణుమహిమ అభివర్ణితము. రాజసములందు బ్రహ్మ-అగ్ని మహిమలు, తామసపురాణము అందు శివుని మాహాత్మ్యము - సంకీర్ణములందు సరస్వతీబ్రహ్మల మహిమలు వర్ణితములు పురాణములును కావ్యములవలె కాంతా సమ్మితములు గావు. సాధారణముగా వస్త్వైక్య ముండదు. కథాకథనమే పురాణకవుల కాదరణీయము. సామాజిక, రాజకీయ, నైతిక, మతధార్మిక ఆచారవ్యవహారములను వర్ణించుచున్నవి. శుభకర్మప్రవృత్తి - అశుభకర్మనివృత్తి - పురాణముల వలననే; పురాణము లందలి వివిధాఖ్యానములు, భారతీయ సమాజమునకు ప్రతిబింబములే; ఋషిదేవ పితృగణముల వృత్తములు, స్వర్గనరకాద్యనుభవములు, వివిధ శాస్త్రార్థసార సంగ్రహములు - పురాణములందు వర్ణింపఁబడినవి.

పురాణ పంచలక్షణములలో నొకటైన, సర్గము -

ఆదిసృష్టి :- భగవంతుఁడగు నారాయణుఁడు సంకల్పించి, గావించిన బ్రహ్మసృష్టిని వివరించుచున్నది.

ప్రతిసృష్టి :- బ్రహ్మదు లొనరించు సృష్టి. స్థావర జంగమాత్మకమైన సృష్టివైవిధ్యము విపులముగా వర్ణిత మగును. కల్పాంతమున జరుపుసృష్టి. సృష్టింపఁబడిన జీవరాసులలో ఏర్పడిన క్రమబద్ధమై వికాస మిందభివర్ణితము.

వంశము :- దేవాసురాది విభేదోత్పత్తి. దేవతల, దేవర్షి బ్రహ్మర్షుల యొక్క గోత్రానుక్రమము ఇందు వర్ణితము.

మన్వంతరము :- ధర్మశాస్త్ర ప్రవర్తకులై భువిని శాసించినట్టి పదు నలుగురు మనువుల ఉత్పత్తి – వారి పరిపాలనా క్రమము నందలి విశేషములు వివరింపఁబడును.

వంశాను చరితము :- దైవమూలమైన సూర్యచంద్రాది వంశములందు జన్మించిన చక్రవర్తుల చరిత్రములు, ప్రపంచ భౌగోళిక స్థితిగతుల వర్ణనము లిందలివి.

ఇట్లు పంచలక్షణములతోఁ గూడిన పురాణములు సార్వజనీనమగు హితమును బోధించుచు, ఆర్యసాహిత్యమున కాధారస్తంభములై హిందూమత సర్వస్వము లనఁ దగి యున్నవి.

ఈ హరివంశమున గోచరించు పురాణ లక్షణములిట పరిశీలింపఁబడుచున్నవి పురాణ లక్షణములకు భంగము రాకుండ కావ్యత్వగౌరవ మాపాదించిన యెఱ్ఱయ విశిష్టత ననుశీలించుటలో ఇది సహకరించును.

ఎఱ్ఱయ హరివంశము – పంధొమ్మిదాశ్వాసముల కావ్యము. పూర్వోత్తర భాగములచే ద్విధా విభక్తమైనది. సంస్కృత హరివంశమున మూఁడు భాగములు – హరివంశపర్వము, విష్ణుపర్వము, భవిష్యపర్వము. తెలుగు హరివంశమున పూర్వోత్తర భాగములు రెండు, సంస్కృత హరివంశము భారతాంతర్గత భాగము, భారతము పురాణము, హరివంశము పురాణమే ! ఇందు సృష్టి, ప్రతిసృష్టి, వంశము, మన్వంతరము, వంశానుచరితములను పంచలక్షణములు గలవు. తెలుఁగు హరివంశము నందును– ఈ పంచలక్షణములు వెల్లివిరియుచున్నవి. కాని ఈ పంచలక్షణములు మాత్రమే ఉండునది కాదు. పూర్వభాగమున తొమ్మిదాశ్వాసములు గలవు. ఉత్తరభాగమున పది యాశ్వాసములు గలవు పూర్వభాగము నందలి మూఁడాశ్వాసములు పంచ లక్షణములతోఁ గూడియున్నవి

వైశంపాయనుఁడు జనమేజయునితో – వృష్ణి వంశవిధానమును అడుగుటతో కథాప్రారంభమగును.

హరివంశమున –

సృష్టి :- పరమాత్మ, ఆత్మయోగమున ఆత్మ - ప్రకృతియను తత్త్వషిధన మును నిర్మించెను. ప్రకృతి, మహత్తు, మహత్తునకు అహంకారము, అహంకారమునకు పంచభూతములు ప్రభవించినవి. ఇది సనాతన సృష్టి.

నారాయణుఁడఖిల జగత్సృష్టిని అపేక్షించినాఁడు, జలమును సృజించి నిజ వీర్యము నందిడెను. అది హేమాకారమగు మహాండమై యొప్పినది. తద్గర్భస్థుడగు అజుఁడు బహువత్సరముల కాలమయిన పిదప దాని నవియించుకొని జన్మించినాఁడు రెండుగా అవిసిన అండము క్రిందిభాగము భూమి, పైభాగము దివి అయినది.

ఈ నడుమ అంబరము, దిశలు, కాలము, మనస్సు, బుద్ధి వాక్కు, కామదోష రత్యాదులను ఒనరించెను. ఇదియే సృష్టి. ఇదే సర్గ మనఁబడు పురాణ పంచలక్షణము లలో నొకటి.

ప్రతి సర్గము : ఇది బ్రహ్మదు ఒనరించిన సృష్టి విధానము. ఇందు స్థావర జంగమాత్మక మైన సృష్టి వైవిధ్యము, విపులముగా వర్ణితమగుచు, సృష్టింపఁ బడిన జీవరాసులలో నేర్పడిన క్రమబద్ధమైన వికాస మిందభి వర్ణితము.

బ్రహ్మ, మరీచి, అత్రి, పులస్త్యుడు, పులహుడు, అంగిరసుఁడు, క్రతువు వసిష్ఠుఁడు - అను ఏడుగుర నుత్పాదించినాఁడు,

ఈ మహాత్ములు క్రియానిరతులును, ప్రజాపతులునై వెలసిరి. హిరణ్య గర్భుని దోషము వలన నంతకుఁడు జన్మించెను. సనత్కుమారుని యోగవిద్యాప్రభు నిఁగా సృజించెను. మేఘములు, విద్యుత్తు ఇంద్రధనుస్సు, అశని రోహిత నిర్ఘాతకేతు వులు, పర్జన్యము, - వీనిని పుట్టించెను.

ఋగ్యజుస్సామాథర్వణముల సంపాదించి, వానిని యజ్ఞసిద్ధికై ప్రతిష్ఠించి నాఁడు. సర్వగాత్రములనుండి అనేకభూతములను నిర్మించినాఁడు. ఇట్లు గావించిన తన సృష్టికి, అభ్యుదయమును గోరి తన శరీరమును రెండుభాగములుఁగాఁజేసి స్వాయంభువుఁడను మనువును, శతరూప యను పత్నినిఁ గావించెను.

వీరి వలన ప్రియవ్రతుఁడు, ఉత్తానపాదుఁడు, అను నిరువురు జన్మించిరి. ఉత్తాన పాదుని పత్ని ధర్ముని సుత - సూనృతాదేవి. వీరిరువురకు 'ధ్రువుఁడు, కీర్తిమంతుఁడు, ఆయుష్మంతుఁడు, మహాద్యుతి' - అను నలువురు పుత్రులు జన్మిం చినారు.

అందు ధ్రువుఁడు తపముఁగావించి సప్తర్షుల కంటెను నున్నత స్థానమును పొందఁగలిగినాఁడు ధ్రువుని భార్య శంభువు. వీరిపుత్రులు- శిష్టి,భవ్యుఁడు, శిష్టి భార్య-సుచ్ఛాయ. శిష్టిసుచ్ఛాయలకు – రిపు మొదలగు నైదుగురు పుత్రులు జన్మించిరి.

రిపు, బృహస్పతి .. వీరికి జన్మించినవాఁడే చాక్షుష మనువు. చాక్షుషమనువునకు భార్యపుష్కరిణి – వీరికి వీరణుఁడను పుత్రుఁడు జన్మించెను వీరణునిభార్య నడ్వల. వీరిరువురకు, ఊరుఁడు మొదలగు పదునొకండుగురు పుత్రులు జన్మించిరి.

ఊరునకు మహాప్రభయందు – అంగుఁడు. మొదలగు వారలు జన్మించిరి. అంగుఁడు మృత్యుపుత్రికయగు సునీథను పరిణయ మాడెను. వీరిరువురకును జన్మించినవాఁడు వేనుఁడు.

వేనుఁడు దక్షిణ హస్తమును మథింపఁగా అందుండి పృథుఁడు జన్మించెను ఈ పృథుఁడు వసుధను గోవుఁగాఁ జేసికొని పితికినాఁడు. పృథుని భార్య హవిర్ధాన వీరికి శిఖండి హవిర్ధానులు జన్మించిరి. శిఖండికి 'ధిషణ' యను భార్యయందు – ప్రాచీనబర్హి, శుక్లుఁడు, గయుఁడు, కృష్ణుఁడు, అధ్వరుఁడు, అజినుఁడు–అనువారలు జన్మించిరి.

ఆ ప్రాచీన బర్హికి – సముద్రుని పుత్రిక యగు, సువర్ణ భార్యయైనది. వీరికి పదుగురు ప్రచేతసులు జన్మించినారు. ఈ పదుగురును పదివేలవర్షములు ఘోరమగు తపముచేసి, సోముని కన్యయగు – 'మారిష'ను తమకు ధర్మపత్నిగా వరియించినారు. ఆ యింతి యందు దక్షుని పుత్రుఁగాఁ బడసినారు.

మొట్టమొదట – బ్రహ్మ – సృష్టిచేయ సంకల్పించినాఁడు. అతని తలంపునందు – మునులు, దేవతలు, దానవులు, మనుజులు మొదలగు భూతగణములు ఒక్కసారిగా జనియించినవి. ఆ భూత గణము లెన్ని జన్మించినవో, అన్నియే యుండి పోయినవి, వానికి అభివృద్ధిలేదు. ఈ విధానమునకు చింతించి, బ్రహ్మ – భూతగణముల అభివృద్ధికి కారణముగా మిథున ధర్మమును నిర్మించినాఁడు. సర్వకల్పము లందును పుట్టుకకు కారణములు వేఱు వానివయసులు వేఱు గురుత్వలఘుత్వములు కేవలము తపస్సుల తారతమ్యమును బట్టియే ! అట్టు జనికి సంకల్పము దర్శనము, స్పర్శనములు –తొల్లి హేతువులై యుండినవి.

ఆ దక్షప్రజాపతికి వీరణ పత్ని అసిక్నియందు సహస్ర పంచకము సంతానము కలిగినది వీరు తండ్రిపనుపున సృష్టిఁగావింపఁ బూనినారు. అప్పుడు నారదుఁడు వచ్చి, "మీరు బాలకులు, ఈ భూమిపై భాగమును క్రిందిభాగమును మూలలను, వాని కొలదులను తెలిసికొని రండు. అది తెలియకయే సృష్టిఁ గావింపఁదగునా ?" అని వారిని నలువంకలకు పంపినాఁడు పోయినవారు అంతుతెలియక తిరిగిరారైరి. దక్షుఁడు దుఃఖముతో తిరిగి సహస్ర పంచకమగు ఆత్మజుల సమువాయమును సృష్టించినాఁడు వారును పూర్వులవలె సృష్టిచేయ సంకల్పించి, తొల్లింటి వలె నారదుఁడు 'మీ సోదరుల జాడ తెలిసకొనిరం' డని పంపఁగా పోయి వెనుతిరిగి రాలేదు. దక్షుఁడు తనపత్నియం దరువదిమంది కరాతులను పొందెను. అందు-

ధర్మునకు - పదిమందిని, కశ్యపునకు - పదుమువ్వురను, చంద్రునకు-ఇరువదేడుగురను, అరిష్టనేమికి - నలుగురను, కృశాశ్వునకు బహుపుత్రునకు, అంగిరసునకు - ఇరువురు చొప్పునను - ఇచ్చెను.

వీరివలన వసు, రుద్ర, ఆదిత్య విశ్వసాధ్యాది దేవతలును, దైత్యదానవ యక్ష రాక్షస గంధర్వాప్సరో విహంగ భుజంగమ ప్రముఖులును, - ప్రభవించిరి. గోవులు. గణములు. అశ్వములు - ఖరములు, ఉష్ట్రములు, సింహ శార్దూలాది అఖిల క్షుద్ర జంతువులు ఉదయించినవి. వృక్షములు, తృణ లతాదులు ఉద్భవించినవి. అందు కశ్యపుని భార్యయగు దితిదేవి హిరణ్య కశిపు హిరణ్యాక్షులను ప్రసవించెను. వారి సంతానము అసంఖ్యాకమై అదితి సంతానముతో విగ్రహించినది. అట్టి సమయమున ఇంద్రుఁడు వజ్రాయుధముచే ఒకసారి అతను చూచి, దితి గర్భమును ఛేదించినాఁడు. అతఁడు 'మారుద' అని పలుకుచు ఆమె గర్భమును నలువది తొమ్మిది శకలములుగా చేసిన కారణమున మారుతులని పేరుగాంచిరి. వారింద్రునకు సహాయభూతులైనారు.

ఇదియే సకల భూతముల సృష్టి ప్రకారము.

ఈ విధముగా కలిగిన భూత విశేషములకు అజుఁడు ప్రత్యేకాధికారముల నిచ్చినాఁడు. ఇది హరివంశమునందలి ప్రతిసృష్టి.

వంశము :- ఈ వంశమున దేవతల చరిత్ర వర్ణింపబడును. అజుఁడు ఈ విధముగా సృష్టించిన భూత విశేషములకు ప్రత్యేకాధికారముల నిచ్చినాఁడు. ఆయా అధిపతులను గావించెను.

1 ప్రథుఁడు – రాజులకు అధిపతి

2. చంద్రుఁడు – పక్షులకు, తారకములకు, యజ్ఞములకు, ఉజ్జ్వల తపములకు ఓషధులకు అధిపతి యైనాఁడు.

3. వైశ్రవణుఁడు – అర్థసంపదలకు, అంబుధి వితతికిని, రాజన్యులకును అధిపతి

4. మహేశుఁడు – అనంత పిశాచ సంచయములకు అఖిలభూతములకు అధిపతి

5. విష్ణుఁడు – ఆదిత్యులకు, అగ్ని – వసువితతికి ; పాశపాణి జలములకు ; ఇంద్రుఁడు – వేల్పులకు, ప్రహ్లాదుఁడు – అమరకోటికి, అంతకుఁడు- పితృసమూహములకు; వాసుకి – నాగులకు, తక్షకుఁడు – తక్కిన సర్పములకు; నాగాంతకుఁడు – పక్షులకు; చిత్రరథుఁడు – గంధర్వులకు; ఉచ్చైశ్శ్రవము – హయులకు; ఐరావతము – కరులకు; నృపతి – నరులకు; హిమగిరి –గిరులకు, ఉదధి – ఏరులకు– ఇట్లధిపతులుగా నియమించినాఁడు.

బ్రహ్మ భూమండలమును నాలుఁగు వైపులుగా నేర్పఱచెను. పూర్వదిక్కునకు విరాట్పుత్రుండగు వైరాజును; దక్షిణదిక్కునకు కర్దమ పుత్రుఁడు శంఖపదుని, ఉత్తర దిక్కునకు – పర్జన్యపుత్రుఁడు హిరణ్యరోముని, పశ్చిమదిక్కునకు – రజః పుత్రుఁడు కేతుమంతుని, పరిరక్షకులనుగా ప్రతిష్ఠించెను. ఆ నలుగురు రాజులకు మధ్యమ లోకాధిపతి పృథుఁడు అనుశాసకుఁడు. ఈ పృథుఁడు గోరూపధారిణియగు భూదేవిని దోహనము గావించెను. అఖిలవస్తువులను దుగ్ధము లైనవి. భూమి పృథుని శాసనముచే పృథ్వియైనది. ఇతఁడు రాజులకు ఆద్యుఁడు భువనమునకు పూజ్యుఁడు. ఇది వంశము.

ఇఁక మన్వంతరములు :–

స్వాయంభువు :– బ్రహ్మశరీరసంభవుఁడు. ఆది మనవు. ఇతని కాలమున యమాభిధానులు పన్నెండుగురు దేవతలైరి. పరమేష్ఠి తేజమే వటాక రూపమును ధరించి, ఇంద్రత్వమునొందినది. మరీచి, అత్రి, అంగిరసుఁడు, పులస్త్యుఁడు పులహుఁడు, క్రతువు, వసిష్ఠుఁడు సప్తర్షుల పదవిని గైకొనిరి. ప్రియవ్రతుఁడు, ఉత్తానపాదుఁడు ఆ మనువునకు పుత్రులు. ధాత్రిని పాలింప నభిషిక్తులైనవారు.

ప్రియవ్రతునకు పదిమంది పుత్రులు జన్మించిరి. వారిలో అగ్నిబాహువు, మేధుఁడు, హవ్యుఁడు విరక్తులైపోయిరి. తక్కిన ఏడుగురు ఏడుదీవులకు ఏలికలైరి. పెక్కు తనయుల నుత్పాదించి వర్షాధిపతులను గావించిరి.

ద్వితీయమనువు - స్వారోచిషుఁడు :- ఇతని ఆధిపత్యకాలమున తారాజిక, దుషితులని క్రతుభుజులు రెండు గణములైరి. 'విపశ్చిత్' అను నతఁడు నూఱు యజ్ఞముల గావించి ఇంద్రుఁడైనాఁడు. ఊర్జుండు, ప్రాణుఁడు, దత్తుఁడు, అగ్ని, ఋషభుఁడు, చ్యవనుఁడు, బృహస్పతి - అనువారు సప్తర్షిత్వమును భజించిరి.

చైత్యుఁడు, కింపురుషుఁడు, మొదలగువారు రాజకులముల నంగీకరించిరి.

మూఁడవ మనువు - ఉత్తముడు :- ఇతని కాలమున సుధాముఁడు, సత్యుఁడు, శివుడు, ప్రతర్పణుఁడు, వశవర్తియను నైదుగురు అమరగణములు.

సుశాంతి అనువాఁడు ఇంద్రుడు. సుతేజుఁడు మొదలగు వసిష్ఠ పుత్రులేడ్వురును మునులైరి. మనుతనూభవులు పదిమంది భూమిని భరించిరి.

నాల్గవ మనువు - తామసుఁడు :-

ఈ మన్వంతరమున దేవతలు - హరుఁడు, సత్యుఁడు, సుధీ, సుధుఁడు మొదలగు వారలు నాలుగు గణములైరి.

శిబియను మహాభాగుఁడు వేల్పులను పాలించినాఁడు. కావ్యుఁడు, పృథుఁడు, అగ్ని, జహ్నుఁడు, ధాత, కపివంతుఁడు, పదనుండు - అనువారు సప్తర్షులు.

రాజులు పదుగురు -

పంచమ మనువు - రైవతకుఁడు :-

అమరులు - నాలుగుగణములు, సుమేధసులు, భూతనయులు, వైకుంఠులు. స్వామిభోగులు, విభుఁడు - ఇంద్రుఁడు.

ఋషులు : వేదబాహుఁడు, వినిద్రుఁడు, వేదశిరుఁడు, వేదరోముఁడు సత్యనేత్రుడు, పర్జన్యుఁడు, ఊర్ధ్వబాహుఁడు - అనువారు.

భూపతులు : ధృతిమంతుఁడు మొ॥గు పదుగురు.

చాక్షుషుఁడు :- ఆఱవ మనువు

ఆద్యులు, ప్రభూత ఋభువులు పృథగ్జులు, లేఖులు - ఈ ఐదుగణములు,
మనోజవుడు - ఇంద్రుఁడు

అంగిరసపుత్రుడు లేదుగరుడు పురుమైరి మనుసందనులు, ఊరుప్రభృతులు ఉర్విని పాలించిరి.

సప్తమ మన్వంతరము - ఎనిమిది గణములు.

వైవస్వతుఁడు మనువు, వసు, రుద్ర, ఆదిత్య మరుత్, విశ్వే- సాధ్య, అశ్వి నులు - గణములు.

దేవేంద్రుఁడు - ఊర్జస్వి.

సప్తర్షులు :- కశ్యపుడు, అత్రి, విశ్వామిత్రుఁడు, గౌతముఁడు, భరద్వాజుఁడు, జమదగ్ని, వసిష్ఠుఁడు - అనువారలు. ఇక్ష్వాకువు మొదలగువారు మను ప్రభవులు.

అమరులు, మనువులు, ఇంద్రుఁడు మునులు,- తమతమ కాలములు ముగిసి పోయిన అనంతరము తొలఁగి పోవుదురు వీరందరు తమతమ [illegible] నిర్వహించి, కడకు ఆత్మోత్తారకమగు జ్ఞానమును పొంది- అఖిలాత్ముని చేరుదురు. ఇది ప్రస్తుతము జరుగుచున్న మన్వంతరము.

అనాగత మన్వంతరము :- ఈ యుగమునకు సూర్యసుతుఁడు 'సావర్ణుఁడు' మనువు. సుతప, సునాథ, సుముఖ్య - అను మూఁడు గణములు. బలియను దైత్యుఁడు దివిజాధిపతి.

సప్తర్షులు :- పరశురాముఁడు. పారాశర్యుఁడు, ఋశ్యశృంగుఁడు కృపాచార్యుఁడు, అశ్వత్థామ, దీప్తిమంతుఁడు, గాలవుఁడు. మను తనయులు. పఙ్క్తి డెంద్ర గురు - మనుజవిభులు.

నాలుఁగు యుగములు ఏడుమార్లు ఆవృతములైన ఒక మన్వంతరము. మన్వంతరమున జలప్లావము సంభవించును. ఆ జలసంప్లవావసానమున సృష్టి ప్రారంభము. ఈ విధముగా యుగసహస్రము బ్రహ్మకు ఒక్క దివసావసానము. ఆ సమయమున, ఆదిత్యుని రశ్మి భరింపఁజాలక, సర్వభూతములు, అమరులు, అజుఁడాదిగా, మహావిష్ణువు నుదరమును ప్రవేశింతురు. ఇదియే అఖిల మన్వంతరము.

6. వంశానుచరితము : ఈ విశ్వమును సృష్టించిన స్రష్ట యేవంశమున జన్మించెనో, ఆ వంశచరిత్రము విస్తరింపఁబడినది

కశ్యపుని భార్య అదితి. ఈమె సహస్రదీధితిని గర్భమున ధరించినది. ఆ తేజమునకు కారణము తెలియక 'పిండము మృతిచెందుగాత' మని కశ్యపుఁడు శపించినాఁడు. అతఁడే మార్తాండుఁడు అతని భార్య త్వష్ట ప్రజాపతి కూతురు సంజ్ఞాదేవి. ఆమె భర్తవేడిమిని భరింపఁజాలక పోయినది. వైవస్వత మనువు యముఁడు, యమున -వీరు మువ్వురును వారి సంతానము. భర్తృతేజము నోర్వఁజాలక ఛాయను సృష్టించి, ఆమె వెడలిపోయినది. పితృగృహమును చేరినది. అచ్చట పితృపరిత్యక్తయై తపము గావించు కొనఁబోయినది.

ఛాయకు - సౌపర్ణుఁడు, శనైశ్చరుఁడు పుత్రులు. తపతి పుత్రిక. వైవస్వతుఁడు సప్తమమన్వంతరాధిపతియైనాఁడు. యముఁడు - ధర్మరాజను ఖ్యాతిఁబడసి మహత్త్వమును బొందినాఁడు, సౌపర్ణుఁడు అష్టమ మనువు కాఁబోవువాఁడు, శనైశ్చరుఁడు- గ్రహపదవి నధిష్ఠించినాఁడు. యమున మహానదియై లోక'పావని'యని ఖ్యాతిఁగాంచినది. తపతి సంవరణుఁడను రాజునకు పత్నియై, భారతవంశ ప్రదీపక మగు సంతానమును బడసినది.

వైవస్వత మనువునకు తొమ్మండ్రుగురు పుత్రులు. మొదటివాఁడు ఇక్ష్వాకుఁడు. ఇది సూర్యవంశ చరిత.

చంద్రవంశ చరిత్ర : వైవస్వతమనువునకు, ఇక్ష్వాకుడు మొదలగువారు జన్మింపక మునుపు పుత్రకామేష్టిఁగావించినాఁడు మిత్రావరుణులను దేవతలను - ఆహూతులను ప్రేల్చినాఁడు. అందుండి దివ్యాంబరాభరణ భూషిత యగు కన్య ఉదయించినది ఆమె ఇళ. ఆమెను సోమ నందనుఁడగు బుధుఁడు కామించినాఁడు; వీరిరువురకును జన్మించినవాఁడు పురూరవుఁడు. పురూరవునకు ఆయువు - ఆయువునకు నహుషుఁడు- నహుషునకు యయాతి - జన్మించిరి.

యయాతికి శుక్రపుత్రియైన దేవయాని యందు, యదుతుర్వసు లనువారు జన్మించిరి. శర్మిష్ఠయందు ద్రుహ్యువు, అనువు, పూరుఁడు - అనువార లుదయించిరి. ఇట్లు చంద్రుఁడు యదువంశమునకు మూలపురుషుఁడైనాఁడు. అంధక వంశక్రమమును ఇందు వర్ణింపఁబడినది.

వైవస్వత మనువు యజ్ఞము



ఇళ యను కన్యజన్మించినది.

సౌముఁడు ↓

బుధుఁడు + ఇళ



పురూరవుడు + ఊర్వశి

ఆయువు | సమాయువు | దృఢాయువు | వనాయువు | శతాయువు

ఆయువు →

నహుషుడు | వృద్ధశర్మఁడు | రంభుఁడు | రజి | రజిసేనుడు

నహుషుడు →

యయాతి | సంయాతి | ప్రయాతి

యయాతి + దేవయాని     యయాతి + శర్మిష్ఠ

యయాతి + దేవయాని → యదువు | తుర్వసుడు

యయాతి + శర్మిష్ఠ → ద్రుహ్యువు | అనువు | పూరుఁడు

ఇట్లు యదువంశమునకు చంద్రుఁడు మూల పురుషుఁడని వర్ణింపబడినది.

ఆ యదువంశమున జన్మించినవారు యాదవులు. ఆ యాదవ వంశ సంజాతుఁడు శ్రీ కృష్ణుఁడు.

ఇట్లు హరివంశపు మూఁడవ ఆశ్వాసము వఱకు సృష్టి, ప్రతిసృష్టి, వంశ, మన్వంతర, వంశాను చరితముల వర్ణన సాగినది. ఇంతవఱకును నీ హరివంశము పురాణ లక్షణములతోనే కూడియున్నది.

హరివంశమునందలి పురాణభాగము, నాయకుఁడగు శ్రీకృష్ణుని వంశ పూర్వ చరిత్రను తెలుపుట కుపయోగింపఁబడినది. ఈ మూఁడాశ్వాసముల గుఱించి చర్చనీయాంశములు కొన్ని గలవు. ఇచట వస్త్వైక్యము లేదు. పురాణములలోను వస్త్వైక్య ముండదు. ఇచ్చట - అనేకోపాఖ్యానములు గలవు. ఈ అంశమునందు వేద ధర్మమును లోకమున నాచరింపఁజేయుట కేర్పడిన విశిష్ట సంస్థలవంటి మహా వ్యక్తులను గూర్చిన కథలు కీర్తింపఁబడినవి. ఈ భాగమున ధార్మికతత్త్వము కథల రూపమున ఉపదేశింపఁబడినది.

ఇట్టి యుపాఖ్యానములలో మరుత్తుల జననకథ యొకటి. దేవతలు, దానవులు - వీరిరువురకు నన్యోన్య యుద్ధము జరుగుచుండును. ఆ యుద్ధమున పెక్కురు అసురులు సుర వర్గముచే మడిసిరి. అప్పుడు దైత్యుల మాత దితి శోకించి, మనోవల్లభుఁడగు కశ్యపుని, 'నాకేశుని చంపఁగల సుతు నొసంగు'మని వరమడిగినది. అమ్మహాత్ముఁడు "ఎప్పుడును, నేమఱక శుచిత నచలవృత్తిఁ దగిలి నూఱబ్దములు చూలుఁదాల్పనోపుదేని యట్టి పుత్రుఁడు జనించు"నని తెలిపినాఁడు.

అయ్యుగ్మలి యయ్యుగ్ర వ్రతము నడుప నొడంబడినది. కశ్యపముని గర్భప్రదాన మొనర్చి యేగినాఁడు. అమ్మగువ నిత్యంబును, త్రికాల స్నాన మాచరించి, వివిధోపవాస వ్రతములపూని శుచియై యుండ - తదంతరాయమును కల్పింపనెంచి, సహస్రాక్షుఁ డేతెంచి, యామెకు నమస్కరించి, వ్రతస్థిత యగుటచే నామెకు శుశ్రూష యొనర్పవచ్చితినని యర్థించినాఁడు సంతసించి, యామె యంగీకరించినది. ఇంద్రుడు మిక్కిలి జాగరూకుఁడై యదనువేచియుండెను, సంవత్సర శతం బతిక్రమించినది. ఒక్కనాఁ డమ్మదిత పాదశౌచముచేయ మఱచి నిద్రించినది. ఇదియ్యే రంధ్రమని గాంచి, తదీయోదరంబు సొచ్చి, జంభారి దంభోళింగొని

తద్గర్భంబేఁడు వ్రయ్యలు గావించెను. ఆయ్యర్భకుఁడు రోదనము గావించుచుండ, నప్పియఁ డొక్కొక్క శకలమును ఏడేడుగా రూపుఱ నడచినాఁడు.

అంతట లేచి, యసురజనని యార్తి నొందినది. "ఇట్లు చేయఁదగునా ?" అని యడిగినది. అందులకు వాసవుఁడు, "అడుగుల యందు శౌచనిధి నొనర్పఁ దలంపక నీవు కాళ్లడ తలయంపిగా నిదురఁబోవ నేనిది యంతరంబుగా మదంత హేతువైన గర్భమునొంచితిని. దీనిఁదప్పుగాఁ దడవక పైపవలయు" నని ప్రార్థించినాఁడు, దితిదేవి 'ఆశకలములన్నైన వధింపకు' మని ప్రార్థించినది. ఆ నలువది తొమ్మిది యును, దేవతలై 'మారుద' యనుట కారణముగా మారుతు లనంబరగిరి. ఇది మరుత్తుల జనన ప్రకారము.

ఇట్లు పాఖ్యానములతో నీతినిబోధించునవి పురాణములు. ఈ కథ నియమ నీష్ఠల గ్రహించి, యాచరించునపుడు ఏమఱుపాటు తగదని, శౌచవిధిని నియమము లకుఁదగిన విధ్యుక్తధర్మమును ఆచరింప వలయునని తెలుపుచున్నది. అపుడే కార్య సాఫల్యము సంభవింపఁ గలదని సూచించుచున్నది.

మఱొక ఉపాఖ్యానము - సంధ్యాదేవి కథ : కశ్యపుని కుమారుఁడాదిత్యుడు, అత్యుగ్రతేజుఁడయి జగత్త్రయంబునకు నత్యధిక సంతాపంబు గావించుచుండినాఁడు. అతనికి త్వష్టకూతురు సంజ్ఞాదేవి - దేవియైనది. ఆసాధారణ సౌకుమార్యము కలది కావున, ఎల్లప్రొద్దును కాలిపోవుచుండు భర్తవేడిమి సహింపలేక సమీపింపలేక, భీతితో నాతని కింపగు పరిచర్యలు, గావించుచునే యుండినది. వైవస్వత మనువు, యముఁడు, యమునలను పొందినది. ఇంక నవ్వరాంగి యాతని తాపము నోర్వలేక, తన ఛాయనుండి ఛాయయను దానిని పుట్టించి, తాను పతి వేడిమి తాళఁజాల కున్నందున "పుట్టినింటికేఁగి ఒక్కించుక యూరడిల్లి రాగలను. అంత వఱకు తనకు మాఱుగా విభునకు ప్రియము గావించు చుండవలసినదనియు, మఱచి యైన తన విషయమును చెప్పవలదనియు నొప్పించి తండ్రి పాలి కేగినది. తండ్రి యగు విశ్వకర్మ ఆమె వచ్చిన కారణము నెఱింగి, (సిగ్గున తలవంచియున్న) ఆమెను కోపించి, బుజ్జనంబుల, తర్జనంబుల నామెను దండించి, అశ్రుపూరితంబగు తదాన నాబ్జమును - ఆలోకించి-

కం॥ ఎంతయుఁ గ్రూరుండయినను
శాంతుండయినఁ బతియచువ్వె సతికారయ న
త్యంతపు బంధువు తదతి
క్రాంతిఁ దలఁచు కాంత యెందుఁ గనునే శుభముల్

హ. వ. I 1-117

—అని బోధించి, నీపతి పాలికి పొమ్మని, దుఃఖము వలదని కన్నీరు తుడిచి కూర్మిఁ గౌగలించి, వీడ్కొలిపినాఁడు.

ఇదొక మనోహర సన్నివేశము భర్తను కాదని, అతని కాఠిన్యమును భరింప లేక వచ్చిన తనయను, బుజ్జగించి, దండించి, నీతి నుపదేశించి, కన్నీరు తుడిచి, కౌగలించి, తిరిగి భర్తపాలికే కూతురునుపంపు సన్నివేశము. ఈగాథ తలిదండ్రులు కుమార్తెల నెట్లు పతివ్రతలు కావలయునని ఆశించెడివారో, ఎంతటి క్రూరుండయినను, శాంతుఁడయినను, పతియే సతికి ప్రాణమని తలంచెడివారో తెలుపుచున్నది.

ఇట్లు మొదటి మూఁడాశ్వాసములలో - వేనచక్రవర్తి కథ — సగర పుత్రులు కపిలునికోపాగ్నిచే భస్మీభూతులైన తీరు - పితృదేవతా ప్రభావము - పితృదేవతా సమారాధన యయాతి చరిత్ర కౌశిక పుత్రులు గురువరు వంచనంబున హీన జన్మలై పుట్టుట - ఇత్యాదులు, అనేకోపాఖ్యానములు భారతీయుల నీతిని, విశ్వాసమును, ఆచారమును తెలుపుచు సాగిపోయినవి.

ఇట్లు పాఠకులకు మనోరంజనతో పాటు - కథల రూపమున నీతి నుపదేశించు చున్నది హరివంశము. నైతిక, చారిత్రక శిక్షణ నొసంగి, పురాణములవలె ధర్మమును బోధించును. ఆస్తిక్యబుద్ధిని పెంపొందించును, అనాటి సామాజిక, రాజకీయ, నైతిక, ధార్మిక - ఆచారవ్యవహారములకీ హరివంశము దర్పణము. అంతమాత్రమున దీనిని కేవల పురాణమనఁజాలము. పురాణ లక్షణములతో పాటు సంపూర్ణ కావ్యలక్షణము లీ హరివంశమున వెల్లివిరియుచున్నవి. కనుక 'పురాణలక్షణములతోఁ గూడిన కావ్యము హరివంశము' అనుట - సమంజసము.

ఋషి, దేవ, పితృగణముల వృత్తములును ఇందుగలవు. పంచలక్షణములతో నొప్పారుచున్నది.

సృష్టి యందు నారాయణుఁడు అజాండమును సృష్టించిన తెఱఁగు వర్ణితమైనది. అనంతరము బ్రహ్మగావించిన సృష్టితీరు వర్ణింపఁబడినది. వంశమున - దేవతల చరిత్ర, మన్వంతరమున - పదునాలుఁగు మనువుల ప్రకాశక్రమమును, వంశానుచరితమున - సూర్య చంద్రాది వంశములందు జన్మించిన చక్రవర్తుల చరిత్రములు-ప్రపంచ భౌగోళిక స్థితిగతులు వర్ణితములు యదువంశ చరిత్ర విస్తృతముగ వర్ణింపఁబడినది. ఇట్లు దైవమూలమైన సూర్యచంద్ర వంశములందు జన్మించి. ధర్మవీరులయి, ప్రసిద్ధికెక్కిన మహారాజుల చరిత్రములు వివరింపఁబడినవి

హరివంశమున నాయకుఁడు శ్రీకృష్ణుడు. అతఁడు శ్రీమహావిష్ణువు నవతారము. ఆతని యవతార గాథల వర్ణించుటకు ముందు, ఆతని వంశ ప్రాముఖ్యమును, ఆ వంశ పూర్వస్థితిని, దానికి పూర్వహేతువగు ప్రతిసృష్టిని, ఆ ప్రతిసృష్టికి కారణమగు సృష్టిని, వర్ణించినాడు.

కనుక హరివంశ మహాకావ్య నాయకునకు మూలభూతమగు వంశ వర్ణనల నిమిత్తమై పురాణ లక్షణములు గ్రహింపఁ బడినవి.

మూడాశ్వాసములతోనే ముగిసిపోయిన యెడల హరివంశము - పురాణమే! కాని యంతటితో ఆగిపోలేదు. పందొమ్మిది ఆశ్వాసముల వఱకు సాగినది.

నాల్గవ ఆశ్వాసము : ఇందు విష్ణ్వవతార వర్ణనలు గలవు. అతఁడాయా యవతారములందుఁ గావించిన కార్యములు వర్ణింపఁబడినవి. ఈ మహిమాభి వర్ణనలు కావ్యనాయకుని అమానుష శక్తిత్వమును, దైవత్వమును ప్రకటించుటకయి యుపకరించును.

అతఁడు వరాహావతారమున పృథ్వి నుద్ధరించినాఁడు. నారసింహుఁడై హిరణ్యకశిపుని వధించినాఁడు.

పరశురామావతారము - తారకామయ యుద్ధము - కాలనేమి విష్ణుదేవునిపై యుద్ధసన్నద్ధుఁడై పోవుట - విష్ణుదేవుఁడు చక్రాయుధముచేత కాలనేమిని చంపుట - ఇట్లు విష్ణుమహిమ వర్ణింపబడినది. అనంతరము నారాయణుని యోగనిద్ర వర్ణింపఁబడినది.

అనంతరము - భూదేవి ప్రజాభార పీడితయై యోగ నిద్రాంతమున అచ్యుతుని కడకేఁగుట - భూభార నాశమునకై అవతరింప నిర్ణయించుట - అదియే కథా ప్రారంభము.

హరివంశమునందలి ప్రధాన ఘట్టములు :

నాయకుడగు శ్రీకృష్ణుని వంశపు పూర్వ చరిత్ర – నాయక జననము, బాల్య క్రీడలు, రాక్షస సంహారము, కంసవధ, జరాసంధ యుద్ధము, – రుక్మిణీ కళ్యాణము, నరకాసుర వధ, శ్రీకృష్ణుని కైలాస గమనము – ఘంటా కర్ణునకు పిశాచ జన్మదేహము మోచనమగుట, పౌండ్రక వాసుదేవ సంహారము, బాణాసుర వృత్తాంతము, ఉషానిరుద్ధుల ప్రణయము, బాణాసురునితో యుద్ధము, శ్రీ కృష్ణుని పరతత్త్వమహిమ – అభివర్ణితములు.

ఎఱ్ఱయ హరివంశమున, జనమేజయునితో వైశంపాయనుఁడు –

"వినుహరివంశనామమున విశ్రుతమైన పురాణ మగ్రిమం
బనుపమ వాగ్విశేషవిభవాఢ్యుఁడు సత్యవతీ సుతుండు సె
ప్పినయది యేనునీకు వినిపించెదఁ బూజ్యతమంబు, వంశ వ
ర్ధనము సమస్త పుణ్యఫలదంబిది శ్రోతకు వక్తకు న్నృపా!"

హ వ. **1-1-52**

'అది హరివంశ మను పేరఁ బరగునది. అట్టి పురాణమును వినిపించెద' నని ఆ పురాణమును కావ్యముఁగాఁ జేసి మలచి వినిపించినాఁడు. ప్రబంధలక్షణములలో నొప్పిన కావ్యమును వినిపించినాఁడు.

అందులకై–మూలము నందలి యనేకఘట్టములను వదలి, మార్చి, పెంచి, కుదించి, ప్రపంచించి, వినిపించినాఁడు. అష్టాదశ వర్ణనలతో నొప్పునట్లుఁగ వినిపించినాఁడు. కనుక ఎఱ్ఱయ హరివంశము పురాణ లక్షణముల పరిరక్షించుచు, కావ్య లక్షణములతో నడచిన ప్రబంధను. పురాణములలో వస్త్వైక్యము కొఱవదియుండును. ఎఱ్ఱయ హరివంశమున వస్త్వైక్యమునకు కొఱతలేదు. ఏకనాయకాశ్రయము, పురాణములు మిత్రునివలె నీతినుపదేశించిన, ఎఱ్ఱయ హరివంశము, కాంతవలె వ్యంగ్యార్థమును కలిగించుచు ధర్మ బోధ చేయుచున్నది.

పురాణములలో పాత్రల యింగితాకార చేష్టాదులను వ్యక్తము చేయుటలో తాటస్థ్యము గోచరించును.

ఎఱ్ఱన హరివంశమున పాత్రల స్వభావవ్యక్తి కరుణమున - మనః క్షోభను విశ్లేషించుట యందు అపూర్వమగు ప్రతిభ గోచరించుచున్నది. ఈ లక్షణములు మున్ముందు చూపఁబడును.

పౌరాణికులకు నీతి నుపదేశించుటయే ప్రధానధ్యేయము. ఇందులకై కథాగమనము కుంటువడినను లెక్కించరు. పాత్ర చిత్రణలో లోపములున్నను సరకు గొనరు. కాని ఎఱ్ఱయ హరివంశమున అట్లుకాదు.

పాత్రల మానసికస్థితి — నిశితముగ పరిశీలించి చిత్రింపఁబడినది. కావ్యమందంతటను ధర్మోపదేశము బీజమాత్రముగా పొదివింపఁ బడినది అందులకే ఎఱ్ఱయ హరివంశము కావ్యము.

పురాణ లక్షణముంతో నుపక్రమించి, కావ్యలక్షణములతో విస్తృతమై, భగవత్తత్త్వ నిరూపణముతో నుపసంహరింపఁ బడినది. సమయోచిత వర్ణనలిందు లెక్కకు మిక్కిలి నీరసములగు వర్ణనలిందు పరిహృతములు, పునరుక్తములిట తొలగింపఁ బడినవి. కనుకనే మూలము పురాణము-కాని అనువాదము కేవల పురాణము గాదు. పురాణ భాగముతోఁ గూడిన కావ్యము.

పురాణములలో చారిత్రక యథార్థ కథనమే ప్రాధాన్యము వహించును. అందు సౌందర్యమున కంటె సత్యమునకే సింహాసనము. పౌరాణికులు వర్ణనకంటె కథపై నెక్కువ శ్రద్ధచూపిరి.

కాని, ఎఱ్ఱయ- హరివంశమున ఆలంకారిక శైలిలో కథను నడపి, రసపుష్టికై విభావానుభావాదులను, చక్కగా పొందుపఱచినాఁడు. కనుక ఎఱ్ఱయ హరివంశము కావ్యమే :

"ఆదిరాజ యశోబింబ మాదర్శం ప్రాప్య వాఙ్మయం
తేషామసన్నిధానేఽపి నస్వయం పశ్య నశ్యతి"

(దండి కావ్యాదర్శ)

యను నాలంకారికుల మతము ననుసరించి, ఆదిరాజును ఆదర్శపురుషుని కావ్యనాయకుని గావించినాఁడు. "వృష్ణీనాం వాసుదేవోఽస్మి" అని భగవద్గీతలో చెప్పిన వాసుదేవుని జీవిత మహిమను, సాహసోపేత చర్యలను, శిక్షించిన దుష్టత్వమును రక్షించిన ధర్మతత్త్వమును కమనీయమైన కావ్యశైలిలో రచించినాడు.

ఎఱ్ఱయ హరివంశమున మూలమునలేని పల్లె వాయువులు స్వచ్ఛందముగా వీచుచున్నవి. మూలమునగాంచని గ్రామీణ జీవితసౌరభము, ఆలంకారిక శైలో పరిమళించుచున్నది. ప్రకృతి వర్ణనలు — కథాగమనమునకు తోడ్పడుచు, పాత్రలతో సాను

భూతిని పొందుచు, సాగిపోయినవి. మానసిక స్థితికి తగినట్లుగ మూలమునకును మెఱుగులు పెట్టుచు సాగిపోయినది.

శ్రీకృష్ణుని బాల్యక్రీడలలో - గ్రామీణబాలురక్రీడల ఛాయయున్నను, శ్రీకృష్ణుని దివ్యత్వ ప్రసక్తి అంతస్సూత్రముగా నుండుటవలన కావ్యమునకు దివ్యప్రకాశ మబ్బినది.

వస్తుచిత్రణ, వస్తుచిత్రణతోపాటు పాత్రచిత్రణ, పాత్రచిత్రణతోపాటు భావ వ్యక్తీకరణ, ఎఱ్ఱయకు అబ్బిన వరము. ఈ భావోద్రేకములు గలుగు పట్టుల సంయమ నము పాటించుట బంగారమునకు పరిమళము వంటిది అట్టి భావసంయమనము ఎఱ్ఱయ హరివంశమున కాననగును.

వ్యంగవైభవము - ఆలంకారికశైలి - కావ్యలక్షణములే. అవియును ఈ హరి వంశమున కబ్బినవి. కనుక ఎఱ్ఱయ హరివంశము కావ్యము.

"కవయతి - వర్ణయతీతి కవిః-తస్య కర్మ కావ్యం' అనియొక ఆలంకారికుఁడు. 'వర్ణనానిపుణః కవిః' అనియొక ఆలంకారికుఁడు. కవినిగూర్చి కవికర్మయగు కావ్య మును గూర్చి పలుకు చున్నారు కావ్యమున వర్ణన ప్రధానమైనదని తెలియుచున్నది. ఈ వర్ణనలు ప్రసంగోచితములై యుండవలయును. కథాగతికి భంగము కలిగింప రాదు. మానవమనోభావమునకు దర్పణ ప్రాయములై యుండవలయును. ఆ భావ ములు రమణీయముగ చమత్కారముతోఁ గూడి కావ్యారంభమున ఆశీర్వాదమో, నమస్కారమో, వస్తునిర్దేశమో జరుగవలసి యున్నది.

"నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్"

అని నారాయణునకు, నరునకు సరస్వతీదేవికి, వ్యాసునకు నమస్కరించుటతో జయా రంభము జరిగినది.

ఎఱ్ఱయ హరివంశము-

"శ్రీకిం బ్రేమ పదంబు భూమికి నతిస్నిగ్ధుండు దుగ్ధాబ్ధి శ
య్యాకేళీరతుఁ డాదివేధకు గృహం బైయొప్పు నాభిస్థ నా
ళీకంబుం గలవేల్పు లోకములఁ బాలింపం బ్రభుం డుత్తమ
శ్లోకుండన్నను వేమభూవిభునకిచ్చున్ సుస్థిరైశ్వర్యముల్"

హ. వ. I-1-1.

అని హరివంశరచనా ప్రేరకుఁడగు వేమభూపతికి, "లోకములం బాలింపఁ బ్రభుం డుత్తమ శ్లోకుండు – సుస్థిరైశ్వర్యముల నిచ్చుఁగాత' మని యాశంసించినాఁడు. అట్టి ఉత్తమశ్లోకుఁడైన ప్రభువునకు భగవంతుఁడనుగ్రహించి ఇచ్చు సుస్థిరైశ్వర్యములు చక్కని ప్రజాహితమునకు హేతువులగునని ఎఱ్ఱయ సంభావన.

ఆనాఁడు – ప్రభువులు తురుష్కుల దండయాత్రలో నలిగి రాజ్యమున సుస్థిరతను గోల్పోయి యుండిరి. వారికి సుస్థిరమగు రాజ్యము కావలసి యుండినది. కనుక రాజును అస్థిర ప్రభుత్వమునుండి కాపాడి, సుస్థిరైశ్వర్యమును శ్రీమహావిష్ణవొసంగుగాత మని శ్రీమహావిష్ణువును ప్రార్థించుటతో కథా ప్రారంభము.

సృష్టికర్త బ్రహ్మ. ఆసృష్టిని సుస్థిరముగా రక్షించువాఁడు విష్ణువు. లయ కారకుఁడు శివుఁడు. సృష్టి, స్థితి, లయములకు బ్రహ్మవిష్ణుమహేశులు అధిష్ఠానదేవతలు ఇచ్చట సంరక్షకుఁడు విష్ణువు, అతని అవతారమునకు సంబంధించిన చరిత్ర యిది కనుక శ్రీహరియే వేమభూపాలుని రాజ్యసంపదలను సుస్థిరపఱచుగాత మని ప్రార్థన.

ఆ విష్ణువు 'శ్రీకిం బ్రేమపదంబు' - 'భూమికి నతిస్నిగ్ధుండు' – 'దుగ్ధాబ్ధి శయ్యాకేళీరతుఁడు' – 'ఆది వేధకుగృహమై యొప్పు నాభికమలము గలవాఁడు. లోకములను పాలింపఁ గల ప్రభుఁడు. ఇవియాతని విశేషణములు

శ్రీ కి ప్రేమ పాత్రుఁడు గనుక సంపద లొసంగ గలఁడని రాజ్యసంపదల సుస్థిర పఱపఁగలఁడని ధ్వని.

దుగ్ధాబ్ధి శయ్యాకేళీరతుఁడు. పాలకడలియందు శయనించువాఁడు. అతఁడే ఆదిశేషునిపై యోగనిద్ర యందుండినవాఁడు. యోగనిద్రానంతరము - పృథ్వీప్రార్థన నాలించి, యవతరించి, భూభారము నుత్తరించుట – గ్రంథమునందలి విషయము. భూమికి నతి స్నిగ్ధుఁడు గనుక – పృథ్వీ ప్రార్థన నాలించి భూభార హరణమునకై యవతరించుట – ఇందు సూచితమైనది.

ఆది వేధకు గృహమై యొప్పు నాభిస్థనాళీకము గల వేల్పు – అనుటచే ఆది సృష్టిని, బ్రహ్మసృష్టిని. సూచించుచున్నది "లోకములఁ బాలింపం బ్రభుఁడనుట దుష్టశిక్షణ శిష్టరక్షణ – సూచించుచున్నది. కంసాది రాక్షస నాశము సూచితము. కనుక కావ్యారంభమున కావ్యార్థ సూచన జరిగినది.

రెండవ పద్యము -

శా॥ శర్వాణీ స్తనచక్రవాకములు వక్షస్స్ఫారకాసారమున్
గర్వంబింపెస లారగాఁదఁకిసి వేడ్కల్సల్ప రోమాంచమున్
సర్వాంగీణముఁగా ధరించికొని యిచ్చంజేర్చు శంభుండు స
ర్వోర్వీ రక్షణదక్షు వేమనృపు నత్యూర్జస్వలుం జేయుతన్"

(I – 1–2)

పార్వతి గాఢాలింగనమునందుండు శివుఁడు సర్వోర్వీ రక్షణ దక్షుఁడు - వేమ నరపాలు నూర్జస్వలుని చేయుగాతమని కోరిక. మూడవ పద్యమున బ్రహ్మను స్తుతించినాఁడు.

ఉ॥ తమ్మికిఁ జూలి లోకముల తాత తపస్వుల యొజ్జ యోగివ
ర్గమ్ముల కాద్యుఁడాగమ పర పరకుంభ్ర భవంబు ధర్మభా
గమ్ముల కర్త భారతికిఁ గాదిలి ముప్వుర తొల్తపేరు ని
త్యమ్ముఁగ నాయువీవుత గుణాఢ్యుఁడు ప్రోలయ వేమశౌరికిన్"

(I – 1–3)

"ముప్వుర తొల్తపేరు" - బ్రహ్మ, బ్రహ్మ. విష్ణు మహేశ్వరులు. ఈ ఈ ముప్వురిలో తొలుత పేరు గలవాడు బ్రహ్మ. అతడు మూడవ స్థానములో నుతింపఁబడినాఁడు. సృష్టి - స్థితి - లయములు - వీనికి బ్రహ్మ విష్ణు మహేశ్వరులు. ఇది దేవతా క్రమము. క్రమములో ఎఱ్ఱయ ప్రార్థింపలేదు.

ఎఱ్ఱయ - శివధ్యానైకనిత్యుఁడు 'గిరిశపద భక్తిధ్యానైక తత్పరుఁడు'. 'శంభు దాసుఁడు'. కనుక శంభుని మొదట నుతింపవలసి యున్నది. గురువుగా మొదటి ప్రార్థన కర్హుఁడు శివుఁడు. ఆ క్రమమునుగూడ తప్పించినాఁడు. మొదట విష్ణువును ప్రార్థించినాఁడు. అనంతరము ఆరాధ్యదైవమగు శివుని, తదనంతరము బ్రహ్మను నుతించినాఁడు.

ప్రార్థనా క్రమము ననుసరించిన - 'ఆయురారోగ్యైశ్వర్యముల' నిచ్చుగాత మని ప్రార్థించుట సహజము. ఇచ్చట ఆ క్రమము లేదు. తప్పినది. సుస్థిరైశ్వర్యము విష్ణు విచ్చుగాతమని శివుఁడాతని నూర్జస్వలు చేయుగాతమని, బ్రహ్మ వేమ భూపాలునకు నాయువు నీవుతమని క్రమమును తప్పించి, ప్రార్థించినాఁడు.

ప్రప్రథమున కోరవలసినది అస్థిరైశ్వర్యమునకు సుస్థిరత. అనంతరము ఊర్జస్విత. ఊర్జస్విత లేనిదే రాజు రాణింపలేఁడు. ఉత్సాహము – ఊర్జస్విత. ఉత్సాహమున్న చేయరాని దేదియు నుండదు. కనుక రాజున కుత్సాహమును ప్రసాదించుగాతమని ప్రార్థన. అనంతర మాయువును కాంక్షించుట జరిగినది.

అలనాఁడు రాజులకు అస్థిరైశ్వర్యము -తురుష్క ల దండయాత్రలచే రాజులు రాజసంపదలు – నిత్యము ఆపదలో నుండినవి. కనుక ప్రప్రథమమున కావలసినది సుస్థిరైశ్వర్యము. రాజునకు తన కర్తవ్యమును నిర్వహించి ప్రజలను రక్షించుట – వర్ణాశ్రమ ధర్మసంరక్షణ – గోబ్రాహ్మణ స్త్రీ రక్షణ – రాజ్యాభివృద్ధి కార్యక్రమములు. వీనికై ఊర్జస్విత – యనఁగా ఉత్సాహము అత్యవసరము. దాని నొసంగవలెనని ప్రార్థన.

ఆయువు లేనిదే ఇవేవియును సాధ్యముకాదు, కనుక ఆయుపు నొసంగుమని సృష్టికర్తను ప్రార్థించినాడు.

కనుక నీ కావ్యమున శ్రీహరిని ప్రథమమున సుస్థిరైశ్వర్యమును కాంక్షించుట – హరివంశరచనా ప్రాధాన్యమును తెలుపుచున్నది. అనంతరము శంభుదాసుఁడు తన ఆరాధ్య దైవము నందలి భక్తిని ప్రకటించుకొనినాఁడు. అనంతరము బ్రహ్మను నుతించినాఁడు.

ఇట్లు కావ్యార్థసూచనతో కావ్యమారంభమైనది. కావ్యము –

"ఇతి హాసకథో ద్భూత మితరద్వాసదాశ్రయమ్
చతుర్వర్గ ఫలోపేతం చతురోదాత్తనాయకమ్"

అయి యుండవలయును. ఈ హరివంశ చరిత్ర శ్రీకృష్ణ చరిత్ర. ఈ చరిత్రలో పురాతన భారతేతి హాసాంర్గతమైన హరివంశము, సదాశ్రయము, దుష్టశిక్షణ – శిష్ట రక్షణగావించు భగవ దవతారగాథ.

చతుర్వర్గ ఫలోపేతము – చతురోదాత్తనాయకము.

నాయకుఁడు – చతురుఁడు. ఉదాత్తుఁడు. ఉదాత్తనాయకుని లక్షణము –

"మహాసత్త్వోఽతిగంభీరః క్షమావా నవికత్థనః
స్థిరో నిగూఢా హంకారో ధీరోదాత్తో దృఢవ్రతః"

ప్ర. రు నాయక. 28

ఇట్టి యుదాత్తుఁడగు నాయకుఁడు శ్రీకృష్ణుఁడు.

'నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనైః' అనువర్ణనలలో నగరము ప్రథమమైనది.

నగరవర్ణన : నగర వర్ణనకు ద్వారకా నగరమును గ్రహింపవచ్చును. ద్వారకా నగరమును విశ్వకర్మ సృష్టించి యిచ్చినాఁడు.

సీ॥ కనకపు పెనుఁగోట వినువీధి గడవంగ
మణిగోపురములు సమగ్రములుగ
బంధుర ప్రాసాద పఙ్క్తులు నుత్తుంగ
హర్మ్య రేఖలు మనోహరత నలర
రాజమార్గం బభి రామంబుగాఁ బణ్య
పథములుజ్జ్వల శిల్పభంగి నమర
నమరసద్మములుఁ జైత్యంబులు సభలునుఁ
బ్రపలు నపూర్వంపు రచన మెఱయ.

తే॥ గీ॥ దోరణాట్టాలకంబులు తోరములుగఁ
గూప దీర్ఘికా సరసులు కొమరు మిగులఁ
గృతక పర్వతోద్యానంబు లతుల ములుగఁ
బరగు పురము నిర్మించె నచ్చెరువు గాగ "
(హ. వ. II - 2-166)

ఇది విశ్వకర్మచే మానసముగ సృజింపఁబడి, నారాయణునిచేత నాకారితమైన రమ్యాకారమగు మహాపురము.

ఈ నగర నిర్మాణ రచన అతిశయోక్తితోఁ గూడినది. కోటలు స్వర్ణమయములై వినువీధిని దాటిపోవుచున్నవి. సమగ్రములైన మణి గోపురములు, బంధురమగు ప్రాసాదపఙ్క్తులు, ఉన్నతములగు హర్మ్యరేఖలు, రాజమార్గ మభిరామముగా నొప్పుచుండినవి. పణ్యమార్గము లుజ్జ్వల శిల్పమయములు. దేవాలయములు, చైతన్యములు, సభలు, ప్రపలు అపూర్వమగు రచనతో ప్రకాశించుచున్నవి.

తోరణములు, అట్టాలికలు విశాలములు. కూపములు, దీర్ఘికలు, సరస్సులు అందమైనవి. ఉద్యాన వనములు – కృతక క్రీడా పర్వతములు లెక్కకు మిక్కిలి.

ఇది అతిశయోక్తులతో నొప్పు నగర నిర్మాణము.

ఈ అతిశయోక్తులను తీసివేసి గమనించినచో– కోటలు, గోపురములు, ప్రాసాదములు, హర్మ్యములు, రాజమార్గములు పణ్యవీధులు, దేవాలయములు, యజ్ఞశాలలు, సభాభవనములు, చలిపందిళ్ళు, తోరణములు, మేడలు, కూపములు, దీర్ఘికలు, సరస్సులు, క్రీడా పర్వతములు, – పురములందొప్పుచుండినవని తెలియవచ్చుచున్నది. ఇది యానాటి పుర వర్ణన.

మూలమున —

"భవిష్యతి పురీరమ్యా సుద్వారా ప్రాగ్ర్యతోరణా
చయాట్టాలక కేయూరా పృథివ్యాం కకుదోపమా
... ... ... ... ... ...
... ... ... ... ... ...
విశ్వకర్మాచ తాం కృత్వా పురీం శక్ర పురీ మివ
జగామ త్రిదివం దేవో గోవిందే నాభి పూజితః"

(హ. విష్ణు 58 – 42)

ఈ పురద్వారములు రమ్యమైనవి. అంతటను, అగ్రతోరణములు, అట్టాలికలు' చయలు. – ఈ పురికి కేయూరములై యొప్పుచున్నవి భూమండలపు కకుదమువలె నిది యొప్పారుచున్నది. శ్రీకృష్ణుని – యంతఃపురము విశాలమైనది. ఈ దేవ పూజిత ప్రదేశమున పరిచర్యార్థము వేలు వేలు గృహములు నిర్మితములు, ద్వారములు శిల్పశాస్త్రవిధానము ననుసరించి నిర్మింపఁబడినవి. ప్రాకారముతో శోభితమైనది. కందకములతో రక్షితమైనది. అట్టాలికలు, ప్రాకారములు, తోరణములు, యథాస్థానమున శోభితములు. సుందర నరనారీగణ మిచ్చట నున్నది. వణిజుల వ్యాపారముచే శోభిత నగరమది. నానా పణ్యగణములచే నాకీర్ణమై – ఆకసమున సంచరించు పట్టణము భూమిపై నవతరించినదో యను నట్లున్నది. వాపీ కూపములు స్వచ్ఛజలపూరితములు. ఉద్యానవనములతో శోభిల్లుచు, నంతట సంవృతాంగియగు వనితవలె నగుపించుచున్నది.

సమృద్ధమగు చత్వరములు గలవు. ఉన్నత సౌధములు మేఘావృతములై యున్నవి. కోటి సహస్ర సంఖ్యలలో వీధు లొప్పుచున్నవి. రాజమార్గ ముజ్జ్వలమై యున్నది. ఇంద్రపురి స్వర్గమునువలె ఈ నగరము సముద్రశోభను మఱింత శోభాయమాన మొనర్చుచున్నది. ఎందుకన - భూతలమున సంపూర్ణ రత్నసంచయముతో సుశోభితమగు ఏకైక నగరమిది. సుధలకు సుక్షేత్రము. సామంతులకు క్షోభదము. ఉన్నత ప్రాసాదములతో ఆకసమును మఱుగు పఱచుచున్నది.

బహురాష్ట్రములతోఁ గూడిన భూమండలమున నిర్మితయగు ద్వారక జనుల కోలాహలముతో ప్రతిధ్వనించుచున్నది అచ్చట సముద్ర ప్రవాహము నందలి యుత్తాల తరంగములతోఁ గూడిన వాయువు సదాశీతలమై యుండును.

తీరమున కళకళలాడుచుండు ఉపవనములతో నీ నగరకాంతి ద్విగుణీకృతమై తారకలతోఁ గూడిన ఆకసమువలె మానవుల మనస్సు నాకర్షించును.

సూర్యకాంతితో సమానమగు స్వర్ణమయ ప్రాకారముతో, గంభీర ఘోషగల సువర్ణ నిర్మిత భవనములతో శ్వేత మేఘములతో వలె సుజ్జ్వల ద్వారములతో, నట్టాలికలతో సుశోభితమైనది.

ఉన్నత సౌధముల ఛాయతో విశాల మార్గము లాచ్ఛాదితములు. అట్టి ద్వారకా నగరమున శ్రీకృష్ణుఁడు, సమస్త యాదవ గణము నివసింపఁ బొడంగిరిఁ ఆకసమును చంద్రుఁడు వలె ఆ పట్టణ శోభను శ్రీకృష్ణుఁడినుమడింపఁ జేసినాఁడు.

విశ్వకర్మ అట్టి పట్టణమును ఇంద్రపురివలె నిర్మించి, గోవింద పూజితుఁడై స్వర్గమునకు వెళ్ళెను.

ఇది మూలమునందలి ద్వారక వర్ణన. మూలమున పదమూడు శ్లోకములలో వర్ణితము కాగా నొక్క సీసములో ఎఱ్ఱయ వర్ణించి ముగించినాఁడు. కాని మూలము నందలి వైభవమున కీ ఎఱ్ఱయ ద్వారకానగర శోభ ఏమాత్రము తీసిపోదు.

మూలమునందలి శ్రీకృష్ణుని అంతఃపుర మిచ్చటలేదు.

"కాంత్యా జన మనోహరా" అనుదాని కనువాదము లేదు.

"కాంత నారీనరగణా" అనునదియు లేదు.

"పణిగ్భిరుపసేవితా" అను దానికి తెనుగు సేత లేదు.

"సురాణామపి సుక్షేత్రా" అను శ్లోకము పూర్తిగా పరిహరింపఁబడినది. గృహములలో గంభీర నిస్వనములు లేవు. నగరమును నిర్మించి శ్రీకృష్ణున కప్ప గించు నపుడు, అతని రాకకు పూర్వమే నగరమున జనుల కోలాహలము నచ్చట కలుగఁజేయుట ఎఱ్ఱయకు రుచించి యుండదు.

ఎఱ్ఱయ హరివంశము సంక్షిప్తము. అయినను సుందరము.

అర్ణవ వర్ణన : ఎఱ్ఱయ హరివంశమున చంద్రోదయమున సముద్రము విజృంభించినది. ఆ వర్ణన –

సీ॥ ఉన్నంతఁ జంద్రోద యోద్దామ దర్పుఁడై
యాసరిద్విభుఁడు గంగా సమాగ
మంబునఁ బొంగారి యంబర చుంబి చం
చద్వీచి తతితోడ సరభసముఁగ
నేతెంచి మాయున్న యెడ నిండఁ దొట్టి యం
తటఁ బోక మమ్మును దడుపుటయును
నేను నవ్వుచుఁ దగునే యిట్లు శాంతుఁడ
నగుమని పలికిన నాక్షణంబ

తే॥ గీ॥ శాంతుఁడై తనుత్వము నొంది చారుఫేన
వస్త్రిడును నూత్నకంకణోజ్జ్వల తరంగ
భుజుఁడు ముక్తామణిస్తోమ భూషితుండు
నగుచు రాజన్యు వలెను సొంపార నిలచె

ఇది పద్మభవుఁడు సురావళితో సముద్ర విజృంభణమును చెప్పిన విధానము.

మూలము నందలి సముద్రవర్ణన –

"ఇతి వృత్తైశ్చబహుభిః పురాణ ప్రభవై ర్గణైః
కుర్వతస్తు కథాస్తాస్తాః సముద్ర స్సహగంగయా
... ... ... ... ... ... ...
ఉక్త స్సంరబ్ధయా వాచా శాంతోఽసీతి మయాతదా
శాంతోఽసీత్యుక్త మాత్రస్తు తనుత్వం సాగరోగతః"

ఎఱ్ఱయ సముద్రుఁడు 'అంబర చుంబి చంచద్వీచి తతితోడ విజృంభించెను.' సవీచి విషమాంకుర్వన్నతింవేగ తరంగిణీమ్' అను మూలము. ఎఱ్ఱయ సముద్రుఁడు చారుఫేన వస్త్రుఁడు, మూలమున జలజంతు యుక్తమగు జలమే వస్త్రము, నూత్న కంకణోజ్జ్వల తరంగ భుజుఁడు.

ఇట్లు మూలము నుండి కొన్ని మార్పులున్నను ఎఱ్ఱయ సముద్రుఁడును రాజ వేషధారియే; మూలము నందలి సముద్రుఁడును రాజవేష ధారియే;

ఇట్లు కొన్ని వర్ణనలను మూలము ననుసరించినను, మఱికొన్ని మార్పులను కల్పించుచు కావ్యశైలికి హానికలుగక పోషించినాఁడు. 'యుక్తశ్చంద్రమసాపూర్ణః' అనుదానికి 'చంద్రోదయోద్దామ దర్పుఁడు' అను అనువాదమున దర్పము కనిపించు చున్నది. దర్పము కలిగినందులకే వేల నతిక్రమించుట జరిగినది.

అనంతరము —

**ఆర్యాస్తుతి :-** సుమారు యిప్పది యేడు శ్లోకములలో ఆర్యాదేవిని స్తుతించిన విధానమును వైశంపాయనుఁడు జనమేజయునితో చెప్పుట కలదు ఆ పొగడను స్తోత్రములను సంక్షేపించి, ఒక చిన్న వచనములో నిక్షేపించినాఁడు ఎఱ్ఱయ. ఇట సందర్భము :- మహామాయ నందగోపునింట జన్మింపఁ బోవుటను వర్ణించుట. అంత సుదీర్ఘమగు స్తోత్ర మాసందర్భమున అనవసరము. అది కథా గతికి భంగము కలిగించునది. కథకుగాని నాయకుని జననమునకు గాని - ఎట్లును ఉపకరింపదు. కనుక ఎఱ్ఱయ ఆ స్తోత్రమును తొలగించినాఁడు. ఇట్లు ఎఱ్ఱయ తన హరివంశమునకు కావ్యలక్షణమును కాపాడుకొనుచు వస్త్వైక్యమునకు కథాగతికి భంగ మును కలిగించు వర్ణనలను తొలగించుకొనుచు వర్ణించినాఁడు. అనుసరించినాడు.

మల్లోకములకును అధీశ్వరియయిన ఆర్యాదేవి స్తుతి ఇది. ఆమె రూపములను నామములను, వాసస్థానములను, స్వరూపమును, పరిచయలను, మహత్త్వమును మున్నదియేడు శ్లోకములలో పొడిగించినాఁడు. మూలము పురాణము. పురాణముల లక్ష్యము — ఆస్తిక్య బుద్ధిని పెంపొందించుట, సమయ సందర్భములను కల్పించు కొన్ని భగవద్భక్తి నుత్పాదించుట - కాని ఎఱ్ఱయ తన హరివంశమును కావ్య రూప మున మలచినాఁడు. కావున ఈ సుదీర్ఘ స్తోత్రము కథాగతికి భంగము కలిగింప వచ్చునని తొలఁగించి, ఒక్క చిన్న వచనములో వర్ణించినాఁడు.

శైలవర్ణన : ఎడతెగక వర్షములు కురిసి, గోవులు, గోపాలురు అనేక బాధలకు గుఱియైరి. శ్రీకృష్ణుఁ డప్పుడు గోవర్ధన పర్వతమును అగ్రహస్తమున నెత్తి వారిని ఆ పర్వతపు క్రిందిభాగమున చేర్చెను.

ఆ పర్వతము నెత్తిన సందర్భమున వర్ణన –

సీ॥ కదలి దొర్లెడు మహా గండశైలములతో
నిల మ్రాకులును బెల్లగిలి పడంగ
వడిఁదూలి చెదరెడు వారివాహములతో
ఘనమృగ వ్రజములు గలఁగి పాఱ
నుదరి కేళ్ళుఱికెడు మృగకేసరులతో
బిలగతాహులుఁ గింక వెలికి నెగయ
వెసఁబాసి పోయెడు విద్యాధరుల తోడ
నియమస్థ మునిజనాళియుఁ దొలంగ

తే॥ గీ॥ నొత్తువడి కాంచనాది ధాతూచ్చయములు
రసము జొబ్బిలఁగా రత్నరాసు లొలుక
నడరి సానుసంధులు వ్రయ్య నమ్మహాద్రిఁ
గలయ నాభీల మయ్యెఁ దచ్చలన వేళ

హ. వ I-5-39

పర్వతముపై మహాగండశిల లున్నవి. గొప్ప గొప్ప వృక్షములు క్రిక్కిఱిసి యున్నవి, ఒక్కసారిగా పర్వతమును కదిపి పెల్లగించి, పైకెత్తినపుడు, మహాశిలలు దొర్లిపోవుచున్నవి. వృక్షములు పెటపెటమని పెల్లగిల్లి భూమిపైఁ బడిపోవుచున్నవి. ఆ పర్వతము నందు సెలయేళ్ళు – జలధారలు – అచ్చటచ్చట నుండినవి. కుదించినట్లు కాఁగా ప్రవాహము కదలికచే తుళ్ళి చెల్లాచెదరగుచున్నది. ఆ పర్వత గుహలందు వృక్షసమూదాయములమధ్య మృగములు సంచరించుచుండును. అవి – ఈ మహాశిలల మ్రోతలు· వృక్షముల పెటపెటలు నిర్ఝరముల తుళ్ళింతలుఁ గాంచి, దిక్కుతెలియక· ఆ పరిస్థితికి కారణము తెలియక పరుగు లిడుచున్నవి. భయంకరములగు సింహములు, అదరిపడి దిగ్గని భీతిల్లి ఎగిరి పడుచున్నవి.

కినుకతో బిలమునందలి సర్పములు పై కెగఁబ్రాకు చున్నవి. విద్యాధరులు శీఘ్రముగా పర్వతముల వదలి పోవుచున్నారు. నియమస్థులగు మునీశ్వరులును ఈహడావిడికి - నియమము వీడి వెడలిపోవుచున్నారు. కాంచనాది ధాతుసముదాయము, పర్వతము నందుండినది - పిండినట్లయి రసము చిప్పిలు చున్నది. రత్నరాశు లొలికి పోవు చున్నవి. సాను సంధులు చీలిపోవుచున్నవి. ఇట్లు మహాద్రి కలఁతవడి భయంకర ముగా నుండినది.

ఇది పర్వతము కదలు నప్పటి సంరంభము. మూలమున శ్రీకృష్ణుఁడు పర్వ తము నెత్తుచున్నాఁడు.

"స ధృత స్సంగతో మేఘైః గిరి స్సవ్యేన పాణినా
గృహాభావం గత స్తత్ర గృహాకారేణ వర్చసా
... ... ... ... ...

(హ. విష్ణు. 18-3)

నిర్ఝరాంగ రుతై ర్వృక్షై ర్నిర్మయూర రుతైర్వనైః
నిరాలంబ ఇవాభాతి గిరిస్స్వ శిఖరై ర్వృతః"

(18 - 48)

సెల యేరులతోఁ గూడిన పర్వతాకారములగు మేఘములతోఁగూడిన పర్వ తములు మూలమున పురివిప్పినాట్యమాడు నెమళ్ళవలె భాసించినవి. ఇచ్చట సెలయే రులు మేఘములతో నావరింపఁబడుట పర్వతమును నెమలిఁగా చేసినది. ఎఱ్ఱయ హరి వంశమున నీ యూహ తొలఁగింపఁ బడినది. సాదృశ్యము సమంజసముగా కనిపింప లేదేమో ! కనుక తొలఁగించినాఁడు.

ఆ పర్వతము విదురింపవలయునని శ్రీకృష్ణుని బాహువును తలగడగా గావించు కొన్నట ఎఱ్ఱయ్య హరివంశమున లేదు.

కృష్ణుని బాహుదండముతో మేఘావరణముతో నా పర్వతము ఛత్రముగా ప్రకాశించుటయు ఎఱ్ఱయ హరివంశమున లేదు. అతివృష్టిచే ఆ పర్వతము రుద్రునిచే స్తంభితుఁడగు త్రిపురాసురుని పోలియుండుట - ఎఱ్ఱయ హరివంశమున లేదు. సుదీర్ఘ శ్లోకముల సముదాయము. ఆలంకారికముగ స్వభావోక్తితో రమ్యముగ నొక్క సీసముతో తెనిఁగించి, ఆపర్వతచలనమున కెంతో రామణీయకమును చేకూర్చినాఁడు, ఎఱ్ఱయ్య.

మూలమున నొకటి రెండు శ్లోకములు తప్ప తక్కినశ్లోకముల భావము లన్నియు సమానముగనే యున్నవి. కాని, మూలమునందలి సుమారు ఇరువది శ్లోకముల భావము ఒక్కసీసములో రమణీయముగా ఎఱ్ఱయ కుదించినాఁడు. శైలిలో రామణీయకత, సంక్షిప్తత చేకూర్చి, - కావ్యత్వమునకు న్యాయము కలిగించినాఁడు. కనుక ఎఱ్ఱయ హరివంశము కావ్యమే.

శిలలు, పాదపములు, మూలము నందును దొర్లినవి. పడిపోయినవి. ప్రస్రవణముల, చలనములు సమానములే: మూలము నందలి - గంధర్వులు, విద్యాధరులు, నాగులు 'ఆప్లుతో౽యం గిరిః పక్షైః' అని పర్వత మెగిరి పోవుచున్న దేమో యని సంభాషించుకొనిరి. ఎఱ్ఱయ హరివంశమున - సిద్ధులు ఆ స్థలమును వీడి మౌనముగ వెడలిపోయిరి. "పర్వతములు కంపించినంతనే అందలి వృక్షములును కంపించి - పుష్పములు జలజలరాలినవి." ఇది మూలము నందలివర్ణన. ఎఱ్ఱయ హరివంశమున లేదు.

"ఆర్తింజగ్ముః ఖగగణాః వర్షేణ చభయేన చ" -

పక్షి సముదాయము, వర్షముతో భయముతో ఆర్తిచెంది అవాఙ్ముఖములై పడిపోవుట మూలమున లేదు. ఆ పర్వతమునందలి వృక్షములపై విహంగమములు, విహంగ మరుతములు లేవు. ఆ పర్వతారణ్యమున మయూరకేకారవములు లేవు. "ఆపర్వతము నిరాలంబముగా కనిపించు చున్నది." అనుట ఎఱ్ఱయ అనువాదమున లేదు.

18-51

"సలంబమానః కృష్ణస్య భుజాగ్రే స ఘనోగిరిః
చక్రారూఢ ఇవాభాతి దేశోన్నృపతి పీడితః"

శ్రీకృష్ణుని భుజాగ్రమున వ్రేలాడుచున్న ఆ పర్వతము మేఘ సహితమై శత్రురాజ పీడితమైన దేశము చక్రారూఢమైనట్లుగా కనిపించుచున్నది. ఇదియు ఎఱ్ఱయ అనువాదమున కానము. ఎఱ్ఱయ హరివంశమున- కదలి డొల్లెడు మహాగండ శైలములతో ప్రాకులును పడిపోయినవి. వడి తూలిపోవు ప్రవాహములతో పాటు మృగ సముదాయము కలఁగి పాఱినది గర్జించుచు నుఱికెడు మృగకేసరులతో బిల గతాహులు కినుకతో వెలికుఱికినవి. విద్యాధరులు, నియమస్థ మునులు తొలఁగి పోవుచున్నారు. రత్నరాసు లొలుకుట, ధాతుచ్ఛయముల రసము జొబ్బిలుట, సానుసంధులువ్రయ్యుట ఇది ఎఱ్ఱయ పర్వత సంచలన వేళలోని సంరంభము. ఇది మూలముకంటె సంక్షిప్త

మైనన్ను, సుందరము. మనోహరము, చిత్రీకరణ సమర్థము, కనుక ఎఱ్ఱయ పురాణ శైలిని వదలి కావ్యశైలి నెట్లు గ్రహించెనో గుర్తింపనగును.

### ఎఱ్ఱయ - ఋతువర్ణనలు

ఎఱ్ఱయ ఋతువుల నన్నింటిని కాదనక వర్ణించి తన పురాణమునకు కావ్యత్వము నాపాదించినాఁడు.

గ్రీష్మర్తు వర్ణనలో నొక యుదాహరణ :-

గ్రీష్మర్తువేతెంచినది. మడువులయందు నీరింకిపోవుచున్నది. ఎంతటి ప్రవాహము నైనను ఎడపెడ చేయుచున్నాఁడు సూర్యుఁడు. వేడిమి అధికమగుచున్నది. నిదాఘ బలము తగ్గిపోయినది.

"హరి యంభోనిధిసొచ్చె శంభుఁడు తుషారాద్రీంద్రముం బ్రాకె వా
గ్వరుఁడుద్యన్మకరంద దుర్దిన సమగ్రంబైన యుత్ఫుల్ల పం
కరుహంబు న్భజియించె దీని మునుగల్గంగాంచియే కాకయె
వ్వరి నింకేల సహించు గ్రీష్మమనఁగా వర్తిల్లెఁ దాపోద్ధతుల్"
(హ. వ. I-6-34)

ఇది హేతూత్ప్రేక్షతోఁ గూడిన గ్రీష్మర్తు వర్ణన.

గ్రీష్మర్తువు నందు, తాప మత్యంత తీక్ష్ణముగా నుండుననియు, సూర్యుని వేడిమి భరింపఁజాలక - శ్రీమహావిష్ణువు క్షీరసాగరమును ప్రవేశించెననియు వర్ణించెను. శంభుఁడు హిమగిరి శిఖరముపై కెఁగఁబ్రాకెను. ఎగఁబ్రాకుట-యను క్రియాపదము -గ్రీష్మతాపమును తాళఁజాలక మంచుకొండను చేరి - ఆ మంచు సూర్యాతపమున కరగిపోవుచుండ - మెల్లగా జాగ్రత్తగా పడిపోక పైకి ఎగబ్రాకుచున్నాఁడని ధ్వనింపఁ జేయుచున్నది.

వాగీశుఁడు - ఉద్యన్మకరంద దుర్దిన సమగ్రంబైన యుత్ఫుల్ల పంకేరుహమును చేరుకొన్నాఁడు.

కేవలము పంకజమును కాదు.

'ఉద్యన్మకరందదుర్దిన సమగ్రం బైన' పంకజమును. ఇచట కేవలము పంకజ మనుటకంటెను – 'ఉద్యన్మకరంద దుర్దినసమగ్రంబైన పంకజము' – అనుట – మకరందముతో నిండిన పంకజమనుట – హాయిని గూర్చి, తాపము నివారింపఁ

గలవని ధ్వనింపజేయుటకే ! కనుక నిట విశేషణమును సాభిప్రాయముగా ప్రయోగించినాఁడు. ఇట్టి యతిశయోక్తులతో గ్రీష్మర్తు తాపమును త్రిమూర్తులకు కూడ కలిగించి, వారివాసస్థానములకు సార్థకత చేకూర్చినాఁడు - ఎఱ్ఱయ. శ్రీమహావిష్ణువు పాలకడలియే శయన స్థానముగా గలవాఁడు. మహేశుఁడు కైలాసవాసి. సృష్టికర్త - పంకజగర్భుఁడు, ఈ వస్తువుల నాధారముగా చేసికొని, సాలంకారముగా ప్రయోగించుటలో చమత్కారము గోచరించుచున్నది. అందులకే యితఁడు సూక్తివైచిత్రి కాద్యుఁడు.

ఇది మూలమునలేని ఎఱ్ఱయ చతురోక్తి. కావ్యమున శైలీ రమణీయత ముఖ్యము. అట్టి యాలంకారికశైలిలో నడచిన దీ పద్యము.

సలిలక్రీడ : గోపబాలకులు యమునను జేరినారు.

వ॥ ఇట్లు సొచ్చి యమ్మహావాహినియందు –

సీ॥ ఒండొండ యిద్దరి నుండి యద్దరిదాక
నేపారు పురుడున నీది యీది,
మునిఁగి లోలోనన చని దవ్వు దవ్వుల
ననువున నెగసి పెల్లార్చియార్చి,
కడఁగాన రాని పెన్మడువులఁ బఱతెంచి
యుఱికి వేకడఁ దేలి మెఱసి మెఱసి,
యొండొరుఁ జేర్కొని యోల యోలని రేఁచి
యుదటునఁ జల్లు పోరాడి యాడి,

ఆ॥ వె॥ వాద్యభంగి జలము వాయించి వాయించి,
పాడి పాడి కెరలి యాడి యాడి,
తనిసి మూఁడుజాల తఱి ప్రొద్దొకించుక
చల్లవడిన నల్లనల్ల వెడలి."

(హ. వ. I- 6.101)

— ఇది గోపాలురు నదియం దీదిన విధానము.

ఈ దరినుండి యద్దరి దాక నీదుట, మునిఁగి, లోలోననే యాదుచు దూరము వఱకు పోయిపోయి తేలుట, మిక్కిలి కేకలిడుట, పెద్దమడువులందు పఱతెంచి వచ్చి

యుత్తికి తేలుట, యొండొరులను పేరుపేరున పిలుచుచు, ఓలయోలని విజృంభించి, జల్లులాడుట, వాద్యమువలె జలమును వాయించుట, పాడుట, కేళి యాడుట - ఈతలో చేయు బహు చేష్టలు, ఇవి అత్యంత సహజమైన జలక్రీడ.

మూలమునలేని ఎఱ్ఱయ వర్ణన.

రతోత్సవము : రుక్మిణీ కృష్ణుల వివాహమైనది. సురలిచ్చు దీవనలు, భూసురులిచ్చు దీవనలు పొందిరి. సూతమాగధ గాయక నర్తక వంది వైతాళికాదుల కపరిమిత ధనమొసంగిరి. అభీష్టాన్నంబుల తృప్తులఁ జేసిరి. తక్కిన జనంబులను సముచిత సత్కారంబులఁ గావించిరి. చారువిహార సౌధముల, సాగరతీర వనాంతరంబు లందును - భూధర కందరంబులందును ముకుందుఁడా మృగాక్షితో కేళీరతుఁడైనాఁడు.

సీ॥ రాగ పల్లవముల రమ్యలై యితరేత
రాలోక లతలు పై నలమి కొనఁగ
నిష్టార్థ రచనల యిక్కలై యన్యోన్య
సల్లాపములు సుధాస్యందములుఁగ
రోమాంచ లీలల ప్రోవులై యొండొరు
వుల మూర్తు లాశ్లేష కలన సొగియఁ
గామ్యపూరమ్ముల కళికలై సరిఁ బర
స్పర చేష్ట లానంద పదవిఁ గొనఁగ

తే॥ గీ॥ ప్రమదపరిపాక భరమునఁ గలసి మెలసి
మనసులొండొంటి మమతల మఱఁగి కరఁగ
సతియుఁబతియును బొలిపోని సౌఖ్యలహరిఁ
జిక్కి రనుభావ నూత్న విచిత్ర రతుల

హ. వ. II-3-175

ఇంతులకు మూలము -

" తతస్సహ తయా రేమే ప్రియయా ప్రీయమాణయా
సీత యేవ పురా రామః పౌలోమ్యేవ పురందరః "

మూలము నందలి శృంగార వర్ణన మింత వఱకే సాగినది. రాముఁడు సీతతోవలె, పురందరుఁడు పౌలోమి తోడనువలె, శ్రీకృష్ణుఁడు 'ప్రియయా ప్రీయమాణయా' – రుక్మిణితో భోగించెను. దానికి ఎఱ్ఱయ కల్పన –

రాగపల్లవముల రమ్యలై యితరేతరాలోకము లనెడి లతలుపై నలమికొనుట, ఇష్టార్థరచనలకు నిలయములగు సల్లాపముల సుధా స్యందనములు, రోమాంచ లీలల ప్రోవులై యొండొరువుల ఆశ్లేషములు – కామ్యపూరమ్మల కళికలు – పరస్పర చేష్టలు

ఇట్లు క్రమపరిపాకమున మనసులు మమతలచే మరగి కరఁగినవి. నూతన విచిత్రానుభావరతుల చిక్కిరి. ఇది ఎఱ్ఱయ కల్పించిన రతోత్సవము, మూలముకంటె సుందరము, రసానంద జనకము.

విప్రలంభ శృంగారము : వివాహమునకు పూర్వము, రుక్మిణి శ్రీకృష్ణని వినుకలిచే ప్రేమించినది.

సీ॥ పలుక నెంతయుఁ బ్రియ్యు బాఱిన సుమఁజెక్కు
లందందఁ దడిపెడు నశ్రువారి,
యింకిన చనుదోయి యేకావళీ సూత్ర
భూషితంబైనది పొలుపు దక్క
పాటన యొడలుటఁ బాపట రూపేది
కిడుమాసినది నీలకచ భరంబు
వేడి యూర్పులతోన వెడలునో యుసులును
ననఁగఁ దూఁగాడెడు నంగవల్లి

గీ॥ తలిరు సెజ్జలు జందన సలిల వృష్టిత్రా
యబ్జదళ కృత వీజనం బాదిఁగాఁగ
సఖులు గావించు శిశిరోపచార విధులఁ
గొనక నిగుడెడి తాపంబె వనజ ముఖికి"

(హ. వ. II – ౩-4౩)

వినుకలిచే శ్రీకృష్ణుని ప్రేమకు చిక్కువడిన రుక్మిణి వియోగ తాపమిది. ఇది పూర్వ రాగము. అలంకార శాస్త్రము ననుసరించి, మన్మథావస్థలు పది.

"దృఙ్మనస్సంగ సంకల్పోజాగరః కృశతారతిః" ఇత్యాది దశావస్థలలో, అరతి కృశత - జాగరము - మొదలగు మన్మథావస్థల రుక్మిణికి కల్పించి, ఎఱ్ఱయ ప్రబంధ మును తీర్చిదిద్దినాఁడు. ప్రబంధ లక్షణములకు తగిన కావ్యనాయిక వియోగావస్థఇది. ఇది మూలమున లేదు.

ఈ విధముగా పాత్రల బహిరాకార చేష్టలతోపాటు తదీయ హృదయగతాభి ప్రాయములను గూడ వ్యక్తము చేయుచు, పురాణమగు హరివంశమును కావ్యముగా రూపొందించినాఁడు.

కావ్యలక్షణములను తప్పక తన హరివంశమునఁ జొప్పించుచు, ఎఱ్ఱయ హరి వంశ పురాణమును కావ్యముగా మలచినాఁడు.

ఎఱ్ఱయ కావ్యలక్షణముల సమగ్రముగా ననుసరించుచు, రుక్మిణీ కృష్ణుల వివాహమును ప్రబంధ ధోరణిలో వర్ణించినాఁడు. వినుకలిచే వీరియువురకు ప్రేమను కల్పించెను. రుక్మిణిని లీలావనములో విరహవ్యథ చెందుచుండినట్లుగ చిత్రించెను. పూర్వరాగము మన్మథావస్థలు కల్పించెను. సఖులతో శిశిరోపచార విధుల చేయించెను. ఆ రాజసుత చూపులు శ్రీకృష్ణునే కనుఁగొనఁ గోరునఁట! తక్కిన భంగు లేమియు నెఱుఁగదఁట!

స్తంభము, ప్రళయము, గాద్గద్యము, అశ్రువులు - ఇత్యాది - అనుభావ ములతో పుష్టి చెందిన వియోగ విప్రలంభ శృంగారమున కనిపించు అవస్థలతో రుక్మిణి బాధపడుచుండినది.

ఈ విధముగా "న వినా విప్రలంభేన శృంగారం పుష్టి మశ్నుతే" యను నాలంకారిక లక్షణముల ననుసరించి శృంగారమును పుష్టిమంత మొనర్చుటకై ఎఱ్ఱయ రుక్మిణీదేవికి విప్రలంభ వ్యథను కల్పించినాఁడు.

అద్దానిని నారదుఁడు చూచి వచ్చినట్లుగ శ్రీకృష్ణునకు తెల్పినట్లుగను చిత్రించి నాఁడు. ఆ బాలిక తనులత వియోగ తాపముచే కందుచుండినది. వేఁడి యూర్పు లతో పాటు ప్రాణముకూడ వెడలిపోవునేమో యనునట్లుగా తూగాడుచున్నదఁట! సఖులు పూలపాన్పు సమర్చినారు. చందన సలిల సేచనము గావించుచున్నారు. పద్మపత్రముచే వింజామరలు వీచుచున్నారు సఖుల శిశిరోపచార విధులింకను తాపము నినుమడింపఁ జేయుచున్నవే కాని, తరుగుట లేదు.

ఇది మూలమున లేదు.

వివాహము : అది దంపతులగు రుక్మిణీ కృష్ణుల వివాహమైనది.

సీ॥ సౌకుమార్యమునకు సౌకుమార్యస్ఫూర్తి
గలిగించు నవయవ కల్పనంబు
సౌందర్యమునకును సౌందర్య సంపద
యొదవించు లావణ్యయోగ రుచియు
సౌభాగ్యమునకును సౌభాగ్య విభవంబుఁ
గావించు సరసరేఖా క్రమంబు
సౌశీల్యమునకును సౌశీల్య కలనంబు
నందించు నాభిజాత్య స్థితియును
తే॥ గీ॥ దనకు నైజంబులుగ నొప్పు ధన్య జన్య
రుక్మిణీదేవి నానంద రుచిరమూర్తిఁ
బాణి పంకజ గ్రహణ కల్యాణలీలఁ
బ్రీతిగడ లొత్తుచుండఁ బరిగ్రహించె."

(హ. వ. II - 8 - 164)

మూలమున — వివాహము —

"ద్వారకాంచాపి సంప్రాప్తే రామే వృష్ణి బలాన్వితే
రుక్మిణ్యాః కేశవః పాణిం జగ్రాహ విధివత్ప్రభుః"

(హ. విష్ణు 61 - 34)

ఇది మూలము నందలి వివాహము. వృష్ణివంశీయుల సేనతోపాటు బలరాముఁడు ద్వారకకు చేరినంతనే - అప్పుడు - భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు విధి పూర్వకముగ రుక్మిణీదేవి పాణి గ్రహణమొనర్చెను. ఇదియే మూలమున నందలి వివాహవర్ణన. దీనికి అలంకారశైలి నొదవించి, ఎఱ్ఱయ హరివంశమున - సౌకుమార్యమునకు సౌకుమార్యస్ఫూర్తి కలిగించు నవయవములు, సౌందర్యమునకు సౌందర్య మొదవించు లావణ్యమును, సౌభాగ్యమునకు సౌభాగ్యమొదవించు సౌభాగ్యరేఖా క్రమము, సౌశీల్యమునకు సౌశీల్యమొదవించు నాభిజాత్యమును కల్పించినాఁడు. 'ప్రీతి కడలొత్తుచుండ పాణిని గ్రహించె' - ఈ ఎఱ్ఱయ సౌందర్యవర్ణన, శైలీరమ్యత మూలమున కానము. మూలమునందు కేవలము చారిత్రకాంశములను తెలియఁజేసె నట్లుగ పరిణయము గావించినాఁడు - వ్యాసుఁడు. దానికి సౌందర్యము దిద్దినాఁడు ఎఱ్ఱయ.

యుద్ధము : ఎఱ్ఱన హరివంశమున యుద్ధఘట్టములు పెక్కులు గలవు. శ్రీకృష్ణుఁడు జరాసంధునితో, శిశుపాలాదులతో, పౌండ్రకవాసుదేవునితో, బాణాసురునితో నరకాసురునితో - యుద్ధముచేయు సందర్భములు గలవు. అందు - శ్రీకృష్ణుఁడు జరాసంధునిపై విజృంభించిన ఘట్టమును స్వీకరించు చున్నాను.

వ॥ కృష్ణుండును క్రోధరభసోద్దాముండై కౌమోదకి యాయితంబుగాఁ బట్టి యిల చలింపఁ ద్రొక్కుచు నక్కజంబుగాఁ నడరి జరాసంధు సంధి బంధంబు బిట్టువ్రేసి, బెడిదంపుఁ బిడికిటం బొడిచి, యురక యఱచేతం జఱచిన మోకరిల్లఁబడి తూలుచు నతండు సేతిగద పిదిలి పడ, సశరంబగు శరాసనంబును, సపరికరంబగు నరదంబును దిగవిడచి. యపసరణంబ శరణంబుగా సందడి నడంగి పోయినంగలంగిఁ రాజన్యులందఱు సమ్మెటలు వెట్టి గుఱ్ఱంబులం దోలియు, నంకుశంబు లూని యేనుగులం దఱిమియుఁ, జేరుకోలల నడచి రథ్యంబులం బఱపియు, నత్యంత భయార్తులై నలుదెసలం జనిరి. సర్వసైన్యంబులుం జెల్లచెదరై కన్నవి కన్నదెసలం బాఱె నట్ల నరేంద్ర సహస్ర సంత్యక్తంబై విగత సంగీతంబగు రంగస్థలంబును గ్రేణిసేయు సంగర ప్రదేశంబు గైకొని"

— ఇది యుద్ధ వర్ణన.— కౌమోదకిని గ్రహించి కృష్ణుఁడు 'యిల చలించునట్లుగ' త్రొక్కినాఁడు. ఇల చలించునట్లు త్రొక్కుట క్రోధావేశమునకు సూచన. జరాసంధుని సంధి బంధమును బిట్టుగా వేయుట - ఇది యుద్ధకౌశలము.

జరాసంధుఁడు రెండుభాగములు సంధింపఁబడిన వ్యక్తి. అతుకులుగల చోట కొట్టిన వస్తువు త్వరగాఁ జీలిపోవును. ఆ పనినే శ్రీకృష్ణుఁడు గావించినాఁడు.

గుఱ్ఱములను - సమ్మెటలు వెట్టి తోలిరి.

ఏనుగులను - అంకుశములతో తరిమిరి.

రథ్యంబులను - చేరుకోలల వడచి పఱపిరి.

సర్వసైన్యంబులును చెల్లచెదరై' కన్నవి కన్నదెసలంబాఱినవి. —ఇది యుద్ధ రంగస్థితి. శ్రీ కృష్ణుఁడు ప్రదర్శించిన వీరమునకు ఫలము.

ఇచ్చట - నాయకులు వీరులు. ఈ ఆలంబనముతో పుష్టి నందిన వీరరసము పాఠకుని యందు చక్కగా పోషింపఁబడినది. ఇట్టి యుద్ధ ఘట్టము లెన్నింటినో హరివంశమునఁ గాంచఁగలము.

మూలమున—

"తద్యుద్ధమభవ త్తత్ర తయో స్తేషాంతు సంయుగే
సాయకోత్సర్గ బహుళం గదానిర్ఘాత దారుణమ్"
(హ. విష్ణు. 35 – 53)

అచ్చట వారికి భయంకరమగు యుద్ధము సంభవించినది. బాణ వర్షము కురియఁ దొడంగినది. గదాఘాతములు భయంకర యుద్ధమని తెలుపుచుండినవి.

'స చక్రే ణార్కతుల్యేన దీప్యమానేన తేజసా
చిచ్ఛేద సమరే వీరో సృగజాశ్వ మహారథాన్
గదా నిపాతవిహతా లాంగలేనచ కర్షితాః
న శేకు స్తే రణేస్థాతుం పార్థివా నష్టచేతసః
చక్రక్షుర నికృత్తాని విచ్ఛిత్తాణి మహీక్షితామ్
రథయూథాని భగ్నాని న శేకుశ్చలితుం రణే
ముసలాక్షేపభగ్నాశ్చ కుంజరాష్టషష్టిహాయనాః
ఘనా ఇవఘనాపాయే భగ్నదంతావిచక్రముశుః"

ఎఱ్ఱయ హరివంశము నందలి వాక్యవిన్యాసము ధారాప్రవాహముగా భాషావైభవమును తెలుపుచున్నది. 'అరదంబు దిగవిడిచి అవసానంబ శరణంబుగా సందడి నడంగి పోయిన'–"గుఱ్ఱంబులఁ దోలియు" "ఏనుఁగులఁ దఱిమియు" "రథ్యంబులఁ బఱపియు" – వంటి వాక్య విన్యాసము శబ్దాలంకారములతోఁగూడినది. రణభూమి యందలి సైనికులు కకావికలై పాఱిపోగా 'విగతసంగీతంబగు రంగస్థలంబును గేణి సేయు సంగర ప్రదేశంబు" – ఆ యుద్ధమంతకు పూర్వమెంత భయానకముగ జరిగినది తెలుపుచున్నది.

మూలము నందలి – 'హలాయుధముచే దంతము తెగిన అరువది సంవత్సరముల ఏనుఁగు శరదృతువునందు జలవిహీనమగు మేఘమువలె నగుపించినది' – ఈ శ్లోకమును ఎఱ్ఱయ అనువదింపలేదు. భయానకమగు రణభూమి యందలి యీవర్ణన రసమున కేమాత్రముపకరింపదని యేమో ?

ఇట్టి యుద్ధఘట్టముల నెన్నింటినో హరివంశమునఁ గాంచఁ గలము.

మూలమున ముర, హయగ్రీవ, నరకాసురాదు లొక్కొక్కరితో జరిగిన యుద్ధము సుదీర్ఘముగా వర్ణింపఁబడినది. ఆ సుదీర్ఘ యుద్ధమును సంక్షేపించి, యొక్క గద్యలో ముగించినాఁడు. ఆ గద్యయు మికిలి మనోహరములగు శబ్దాలంకారములతోఁ గూడి సాగినది.

"తూపుల నఱికి" - "చాపంబులఁ ద్రుంచి" - "తూణంబుల వ్రచ్చి" - "కృపాణంబుల నుఱుమాడి" - వంటివాక్యవిన్యాసము మనోహరమైనది. శైలి యందొక ప్రవాహము గోచరించుచున్నది. కావ్యశైలికి తగియున్నది.

ఇట్లు ఎఱ్ఱయ అష్టాదశవర్ణనలను మూలముతో పోల్చి చూచినపుడు, మూలము పురాణశైలియైన ఎఱ్ఱయది కావ్యశైలి యని చెప్పకయే చెప్పవచ్చును.

మూలమున కథాగతికి భంగమొనర్చు వర్ణనలను సంక్షేపించినాఁడు. సందర్భమునకు తగని ఘట్టములను తొలఁగించినాఁడు. వర్ణనాపట్టికలను త్యజించుటయో, ఆలంకారికశైలిలోనికి మార్చుటయో జరిగినది. కనుక ఎఱ్ఱయ హరివంశము కావ్యము, ఆనాడు కావ్యమునకు ప్రబంధమునకు భేదము లేదుగనుక - ప్రబంధము.

సూర్యోదయము : రుక్మి, రుక్మిణిని శిశుపాలున కిచ్చుటకు నిశ్చయించినాఁడు. ఎల్లి స్వయంవర దినము, శ్రీకృష్ణుఁ డిది నారదునిచే తెలిసి ఆహ్వానము లేకయే యచ్చటి కేతెంచెను. పలుతెఱంగుల సంభాషణలు ప్రజలలో బయలు దేరినవి.

శ్రీకృష్ణుఁడు రుక్మిణిని గొనిపోయి, వివాహము చేసికొన నిశ్చయించినాఁడు. అప్పుడు అరుణోదయమైనది.

ఉ॥ పాడె మధువ్రతావళులు పద్మవనీ విభవంబు శాపముల్
పీడె రథాంగకంబులకు వేడుకఁగూడి తరంగ డోలలం
దాడె మరాళ దంపతులు హాసవిలాసము దక్కఁగక్కనన్
వాడెఁ గుముద్వతీ ముఖము వావిరి నూడెఁ దమోనిబంధముల్
హ. వ. II-3-64

పద్మవైభవమును గుఱించి తుమ్మెదలు పాడినవి. ఉదయమైనది. పద్మములు వికసించినవి. ఆ వికసించిన పద్మముల చుట్టును తుమ్మెదలు తిరుగుచు ఝుంకారము చేయుచున్నవి. అవి పద్మముల వైభవమును గుఱించి పాడుచున్నట్లున్నవి. రథాంగకంబులకు శాపములు వీడినవి.

నిశాసమయమున చక్రవాకముల జంట పరస్పర వియోగమున శాపగ్రస్తము లగు ద్వంద్వముల వలె బాధ పడుచుండును. ఉదయమైనంతనే ఆ శాపము వీడెనో యను నట్లు అవి పరస్పర వియోగమును వీడి కలిసికొన్నవి.

మరాళ దంపతులు వేడుకతోఁగూడి తరంగ డోలికలందాడు చున్నవి. "కుము ద్వతీ ముఖము హాస విలాసమును దక్కి గ్రక్కునన్" వాడెను కుముదములు రాత్రులందు వికసించును. ఉదయమైనంతనే వాడిపోవును. కుముద్వతీ ముఖము హాసమును, విలాసమును దక్కి వాడి పోయినది.

"తమో నిబంధములు వావిరి నూడె"

అంధకారము నశించుట–ఇచ్చట ధ్వని–శిశుపాలాది రాక్షసుల గర్వభంగము నకు చిహ్నము. ఇచట వాచ్యార్థము గోచరించుచునే అంతకంటెను రమణీయముగా మఱొక అర్థము గోచరించుచున్నది గనుక వివక్షితాన్యపర వాచ్యములో సంలక్ష్య క్రమ వ్యంగ్యము ధ్వని.

మూలమున నీ పద్యమునకు శ్లోకములేదు. ఇది ఎఱ్ఱయ సృష్టి. రథాంగకంబు లకు శాపము వీడుట–ఆది దంపతుల అవతారమగు రుక్మిణీ కృష్ణులు వియోగము వీడి కలిసి కొందురు అనుట ధ్వనించుచున్నది. పద్మినీ విభవంబు మధువ్రతావళులు పాడుట – మధుకర వృత్తిని జీవించు సాధువులు – శ్రీకృష్ణ విజయ వైభవమును ఆలపింతురు–అనుట స్ఫురించుచున్నది. మరాళ దంపతులు వేడుకఁగూడి తరంగ డోలలందు ఆడుట–హంసలు–పరమహంసల వంటి రుక్మిణీ కృష్ణులు—వేడుకతోఁగూడి ఆనందింతురని సూచించును. కుముద్వతీ ముఖము హాసవిలాసము దక్కి వాడుట – శిశుపాలానుచరులు, అనుయాయులు నగు జరాసంధాదులు ఓడిపోయి అధోముఖు లగుదు రనుటకు సూచన.

ఇట్లీ సూర్యోదయ వర్ణన – జరుగఁబోవు రుక్మిణీ కల్యాణమును శిశుపాలాదుల గర్వభంగమును ధ్వనింపఁ జేయుచున్నది.

ఇంతటి ధ్వనిగర్భితములగు వర్ణనలుండుట చేతనే ఎఱ్ఱయ హరివంశ పురా ణము కావ్యమై వెలసినది. ఇది మూలమున లేనివర్ణన.

చంద్రోదయ వర్ణన : శ్రీకృష్ణుఁడు కేశియను రాక్షసుని చంపెను. ఆనాఁడు నిశాసమయమైనది. అంధకారమెల్లెడల వ్యాపించినది. క్రమముగా చంద్రుఁ డుదయించు చున్నాఁడు.

మ॥ ఇనుఁ డస్త్రాద్రికి నేగెనింతటన యింకే నాత్మతేజంబు, చ
య్యన నుద్దీప్తము సేయకున్న భువనం బత్యుద్ధత ధ్వాంత సం
జనితోగ్రాపదఁ బొందదే యనఁ గృపాసంయుక్తుఁడై వచ్చుచా
డ్పున నున్మీలిత రోచియయ్యె విధుఁ డాపూర్ణాకృతిం
బ్రాగ్దిశన్!
హ. వ. I-8-130

"సూర్యుఁడస్తగిరికేగినాఁడు. ఇఁక నేను నాతేజమును ప్రకాశింపఁజేయకున్న భువనం బంతయు కాఱుచీకట్లలో మునిఁగి, యాపద పొందును." అని కృపాసంయుతుఁడై వచ్చుచున్నాఁడోయను నట్లుగా చంద్రుఁడు తూర్పుదిక్కున సంపూర్ణాకృతితో నుద యించినాఁడు. అంతవఱకును ఒక తేజోరూపము తీక్ష్ణముగా వెలుగుచుండినది. ఆ తేజోమూర్తి యస్తంగతుఁడైనాఁడు. భువన మండలమంతయు నంధకారముచే నావృతమైనది. కనుక నుజొక తేజోమయ స్వరూపుఁడు దయతో ప్రజారక్షణకై ఉన్మీలితరోచియయ్యె. ఇది యానాటి చంద్రోదయవర్ణన.

ఇచ్చట - కేశియను రాక్షసుని అస్తమయము, శ్రీకృష్ణుని ప్రకాశము ధ్వనించు చున్నది.

కేశి - అంతవఱకును తీక్ష్ణముగా ప్రకాశించినాఁడు అస్తంగతుఁడైనాఁడు. అంతట చంద్రునివలె చల్లని వెలుఁగుతో శ్రీకృష్ణుఁడు ప్రజారక్షకుఁడుగా వెలుఁగఁ బోవు చున్నాఁడు. ఇది సూచన. మూలమున లేని ఎఱ్ఱయ సృష్టి, ఇందలి యాలంకారిక శైలి బూతు సూక్తివైచిత్రిని తెలియఁజేయుచున్నది పురాణమును కావ్యమని తలలూపఁ జేయుచున్నది. కనుక ఎఱ్ఱయ వర్ణనలు రమణీయార్థ ప్రతిపాదకములు.

**కుమారోదయము :** రుక్మిణీదేవి గర్భము ధరించినది.

మ॥ నడు మెుయ్యెయ్యన తోరమయ్యె దన రెన్నా భీతలం బంగముల్
జడనొందెం బలిసెంగు చద్వయము వెల్లంబాత్తమైఁదీఁగ యు
గ్గడువై కోర్కులు మూఁగె వస్తువులపైఁ గన్గోనలం దంద్రరో
క్కుడుదోచెం గమనీయ దౌహృద పరిక్షోభంబునం బొల్తికిన్

కం॥ తన పేర్మికి ననుగుణముగ
వనరుహ లోచనుఁడు పుంసవన సీమంతా
ద్యనుపమ కల్యాణంబులు
వానరిచి సమోమ్మద విభవపూర్ణత నొప్పెన్”
(హ. వ. II - 3-178)

తదనంతరము—

కం॥ మును పురహరు ఫాలానల
మునఁ జిక్కియనంగ భావమునుఁ బొందినయతఁ
మ్మున సిజు మాధవ వల్లభ
గనియెం బ్రద్యుమ్న నాముఁ గాదిలితనయున్”
(II - 3-181)

ఇచట - రుక్మిణి గర్భము ధరించినప్పుడామె యంగముల క్రమపరిణామము దౌహృద సీమంతాదులు గావించిన తీరు వర్ణింపఁబడినది. ఆమె ప్రద్యుమ్నుని ప్రసవించినది. ఇట్లు నాయికయగు రుక్మిణి గర్భము, కుమారోదయము వర్ణింపఁ బడినది.

మూలము - వైశంపాయనుఁడు చెప్పుచున్నాఁడు.

“రుక్మిణ్యాం వాసుదేవస్యలక్ష్మ్యాం కామోధృతవ్రతః
శంబరాంతకరోజజ్ఞే ప్రద్యుమ్నః కామదర్శనః
సనత్కుమార ఇతియః పురాణే పరిగీయతే”

మూలమున నింతమాత్రమున నున్నవర్ణనను, ఎఱ్ఱయ రుక్మిణి గర్భమును, ఆమె యందలి క్రమ పరిణామమును చూపించి, పిదప ప్రద్యుమ్న జన్మను వివరించినాఁడు. ఇదియు ప్రబంధ ధోరణిలో నడచిన పద్యమే.

మధుపానము :- బలరాముడు మదిరాపానము గావించిన విధానము.

ఉ॥ గోపికలందిరాఁ బసిడి కోరనుదార సుగంధి శీధువి
చ్ఛాపరి పూర్తిగాఁగొని వెసంగడు నుగ్గడుపై ముదంబు సం
వ్యాపక భంగిసంగము సమస్తము ఘూర్ణనమొందఁజేయ ను
ద్దీపితమైన మోహము మదింబర తంత్రత యావహింపఁగన్”
(II-2-85)

పసిడి కోరఁగల పాత్రతో ఇచ్ఛా పరిపూర్తిఁగాఁగొని మదమెక్కి అంగము ఘూర్ణన మొంద మదిరాపరతంత్రత నొందినాఁడు బలరాముఁడు.

పర్వాలసమున -

"గోపాలైర్దేశ కాలజ్ఞైరుపానీయత వారుణీ
సోఽపిబత్పాండురాభ్రాభం స్తత్కాలం జ్ఞాతిభిర్వృతః"

దేశకాలజ్ఞులగు గోపాలురు తెచ్చిన మదిరను పాండుర వర్ణముగల దానిని జ్ఞాతులతోఁ గూడి త్రాగెను.

"ఈ పసిఁడికోర" గల పాత్ర హరివంశము నందలిది. "సుగంధి శీధువు" ఎఱ్ఱయదే. అంగము సమస్తము ఘూర్ణన మొందునట్లుగ త్రాగినవాఁడు ఎఱ్ఱయ - బలరాముఁడే! పరతంత్రత యావహించుటయు ఎఱ్ఱయ బలరామునకే!

ఇట్లతి సహజముగా మదిరాపానమత్తుల మోహమును వర్ణించిన ఎఱ్ఱయ చిత్రణలో సహజత్వ ముట్టిపడుచున్నది.

మంత్రము : కంసుఁడు బలరామకృష్ణులను చంపను మల్లుర రావించి మంతన మాడుచున్నాఁడు. చాణూరముష్టికులు ప్రసిద్ధులగు మల్లురు. వారిని రావించి వారితో కంసుఁడు.

ఉ॥ మల్లుతనంబునన్ భువనమండలి వీరపతాక మీకయై
చెల్లుఁబ్రియంబు తోడ ననుఁ జేరినకోలెను నే నొనర్చు మే
లెల్లను మీ రెఱుంగుదుర యింతటఁ బ్రత్యుపకారకాంక్ష సం
ధిల్లెన యేని నాపలుకు దెల్లముగా వినుఁడేక చిత్తతన్"

హ. వ. I-9-55

మ॥ "బలుఁడుం గృష్ణుఁడు నాఁగఁజెప్పఁబడు గోపాలార్భకుల్గానన
స్థలిలోఁగా రెఱు కుందనంబునన యిందాఁకం బ్రవర్తిల్లి నా
రలఘుస్థైర్యము ధైర్యమున్మొదలుఁగా నర్హ్యోభ చౌచిత్యముల్
గలయండైన నెఱుంగ రెంతయునుమహాప్కార్యంబుశీలించుటన్"

I-9-56

శా॥ ఈ రంగంబున వారు మీకు నెదురై యేమేనిఁ జెద్దంబుమైఁ
జేరం జూతురు వారు గ్రక్కొనమితోఁ జేపట్టిపాలార్చుచున్
గారింపవలదొక్క పూఁవునన యాఘాతించి నాకున్మహో
దారంబైన శుభంబొనర్పుఁడు భవత్ప్రఖ్యాతి నిండారఁగాన్"

**I-9-57**

ప్రచండులగు మల్లుర రావించి, వారి ప్రావీణ్యమును పొగడి 'మల్లుతనంబు నన్ భువనమండలి వీరపతాక మీకె చెల్లు' నని పైకెత్తి బలరామకృష్ణుల 'ఒక్క పూవు' నన యాఘాతించి నాకు నమహోదారంబైన శుభంబొనర్పుఁ'డని - వారితో మంతనము లాడినాఁడు.

ఈ విధముగా ప్రవీణులైన వారలను శత్రువులపై ప్రయోగించి, మారణ సాధనములుగా నుపయోగించుకొనుట గమనింపఁదగినది. ఇవి ఆ రాజులకుండెడి కార్యసాధనలలో నొకతీరు.

మూలము—

'తౌ సమీపగతౌ దృష్ట్వా మల్లౌ జగతి విశ్రుతౌ
ఉవాచ కంసో నృపతి స్సోపన్యాస మిదం వచః

... ... ... ... ...

తాభ్యాం యుధి నిరస్తాభ్యాం గోపాభ్యాం రంగ సన్నిధౌ
ఆయత్యాంచ తదాత్వేచ శ్రేయోమమ భవిష్యతి'

(హ. విష్ణు. 28-19 నుండి 28-25)

"మల్లుతనంబున వీరపతాక భువన మండలమున మీకే చెల్లును" అని యోధులను ఉబ్బించుట భవిష్యత్కార్యమునకు నాంది. "ప్రియంబు తోడ నను జేరిన కోలెను సేనొనర్చు మేలెల్లను మీ రెఱుంగుదుర" యని తాను గావించిన సత్కారములను, తా నొసంగిన బహుమానములను స్మరింపఁజేయుట వారిని నిర్బంధమున నుంచుట.

"తన్మత్తో యది సత్కారః స్మర్యతే సుకృతానిచ" అనుదానికి "నే నొనర్చు మేలెల్లను మీరెఱుంగుదుర" అని నిశ్చయార్థకముగ తెలిపినాఁడు ఎఱ్ఱయ. మూలమున సందేహమును ఎఱ్ఱయ నిశ్చయముగ మార్చినాఁడు.

"ఒక్కపూఁపునన యాఘాతించి నాకున్ మహోదారంబైన శుభం బొనర్పుఁడు —అనుట ఎఱ్ఱయ కంసుని యాదేశము.

"నిపాతానంతరం శీఘ్రం హంతవ్యో నాత్రసంశయః" —ఇది మూలము.

మూలము ఎఱ్ఱయ అనువాదము సమానమే! ఇట్లు రాజులు ప్రవీణులను, ఆయా యుద్ధసాధనములలో సిద్ధహస్తులను పిలిపించి, స్తుతించి, తమ కానుకలను స్మరింపఁజేసి, తమ శత్రువులపై ప్రయోగించుట - జరుగుచుండెడిదే!

దౌత్యము :- పౌండ్రుఁడు శ్రీకృష్ణుని ద్వేషించువాఁడు. ఆతనితో యుద్ధ మొనర్చుటకు, చంపుటకును అదను వేచియుండువాఁడు. ఒక దూతను దైత్య దమను పాలికి పంపినాఁడు.

కం॥ పేరోలగమున వాఁడును
నారాయణుఁ గాంచి పౌండ్ర నరపతి నన్నుం
గోరి భవదంతికమునకు
దారత బుత్తెంచె వినుము తద్వచనంబుల్
(హ. వ. II - 6-206)

సీ॥ పుట్టిన గోలను బోఁడిమి సెడి గొల్ల
మందలోఁ బెరిగి ధర్మం బెఱుఁగక
వనితా వధంబు గోవధమును బాంధవ
వధముఁ గావించి దుర్వర్తనమునఁ
దిరిగి తంతటఁ బోక తేఁకువ మాలి నా
పేరుఁ జిహ్నములుఁ గల్పించుకొంటి
వాసుదేవుండన వసుధలోఁ గారణ
జన్మంబు నొందిన సత్యఘనుఁడఁ
(II - 6-207)

తే॥ గీ॥ గడఁగి నేనకా నీకు నెక్కడి తెఱంగు
బ్రదుకు వలతేని వినుము నా పనువు సేసి
చక్రమాదిగ విడిచి మత్సంజ్ఞ యుడిఁగి
నడికి చనుదెమ్ము నా శరణమ్ము సొరఁగ"

పౌండ్రకుని యొద్దనుండి దూతవచ్చి - శ్రీకృష్ణుని, "గొల్లమందలో పెరిగినవాఁడవు. ధర్మంబెఱుఁగని వాఁడవు. వనితావధ (పూతన), గోవధ (వృషభాసురుఁడు) బాంధవ వధము (కంసుఁడు) గావించిన దుష్టుఁడవు. నేనే వాసుదేవుడను. బ్రతుక దలంచి నచో చక్రాదులతో నీ వాసుదేవ నామమును త్యజించి, నా శరణమును పొందుము" అని పౌండ్రకుని మాటగా పలికెను.

వ॥ అని యిట్లు దూతముఖంబున వెడలిన విమత వాక్యంబాకర్ణించి, యాకర్ణ వికాసహాస మధుర లోచనుండగుచుఁ గమల లోచనుండు వానిం గనుంగొని-

కం॥ మీ యేలిక మాటలు, దూ
తా యెంతయు మంచి వేసుదప్పక యాతం
డే యనువునఁ బలికెడుఁ ద
న్నాయర్థమ చేయువాఁడ నట్టువిను తెలియన్

(II - 6-208)

సీ॥ నను నఁట కరుగుదెమ్మనియెఁ గావున నెల్ల
యడి యాలములతోన యరుగుదెంతు
వినుతచిహ్నంబులు విడువుమన్నాఁడు గా
వునఁ జక్రపూర్వతఁ దనరు వానిఁ
దన మీఁద విడిచెదఁ దనశరణము సొచ్చి
మనుమంటఁ గాదు గావునఁ గడంగి
తన శరణంబె పెంపొనరంగఁ జొచ్చి ని
ర్భయుఁడనై భూరి సంపద హరింతు

(II - 6 - 209)

తే॥ గీ॥ ధరణి నెందుఁ బేర్కొలవాఁడు దాను నాకు
దాఁట వచ్చునె తన యాజ్ఞ దడయకింత
వట్టు నేడు నెల్లిటిలోన నిట్టలముగఁ
జేయఁగలవాఁడ నింతయుఁ జెప్పు మీవు.

హ. వ. II-6-210

కం॥ అని కట్టనిచ్చి వీడ్కొలి

పిన - ,, - ఇది పౌండ్రక వాసుదేవుఁడు శ్రీకృష్ణుని కడకు పంపిన దౌత్యము.

ఇది మూలమునలేని ఎఱ్ఱయ వర్ణన.

ఆ నాఁటి రాజాస్థానము అందు మెలఁగినవాఁడు గావున ఎఱ్ఱయ పౌండ్రిక వాసుదేవుని చేత దూతనుపంపి శ్రీకృష్ణునికడ నాతని నిందించిన వాక్యములను చెప్పించి, రాజకీయ మర్యాదను కాపాడినాఁడు. యుద్ధములకు పోవుటకు ముందు రాజులు దూతలను పంపి, వారు యుద్ధమునకు వచ్చు కారణములను, సంధి నియమములను జెప్పుట పరిపాటి.

ఆ దౌత్యము విఫలమైనపుడే యుద్ధమును గావింతురు.

దూత ఎంతటి నిందావాక్యములు పలికినఁ, నాతని నిందించుట - వధించుట తగనిపని - యుద్ధశాస్త్రమునకు విరుద్ధము. దూతలు తమరాజులు చెప్పిపంపిన పలుకులు వారి మాటలుగా తెలుపుదురు. కావున నెంత కఠినముగా పలికినను వారిని చంపరు. చంపఁదగదు. కనుకనే శ్రీకృష్ణుఁడు పౌండ్రక వాసుదేవుఁడు పంపిన దూతకు -

"కట్టనిచ్చి వీడ్కొలిపినాఁడు," - నిందింపక, నిష్ఠురము లాడక కుడువను, కట్టను - ఒసంగి సగౌరవముగా పౌండ్రుని కడకు పంపినాఁడు. ఇది రాజకీయ చతురత. యుద్ధనీతి

ప్రయాణము :

కం॥ గరుడ స్కంధారోహణ
దురతిక్రమ గమన లీలతో నరిగె వెసం
బరిపంథి మీఁద భూతో
త్కర మఖిలముఁ దనకు శుభము కాంక్షింపంగన్.

హ. వ II-6-214

పౌండ్రునిపై - యుద్ధమునకు శ్రీకృష్ణుఁడు పయనమైనాఁడు గరుడుని స్కంధారోహణ మొనర్చి యరిగినాఁడు.

మూలమున – గరుడుని విసర్జించి, నారమునకుఁబంపి, రథారూఢుఁడై యుద్ధమున కేగినాఁడు.

"గతేఽథ గరుడే విష్ణూ రథ మారుహ్య సత్వరమ్
య్యత్రయుద్ధం సముభవ త్తత్రయాతిస్మ కేశవః"

గరుడుఁడు వెడలిపోయిన తరువాత విష్ణువు (శ్రీకృష్ణుఁడు) రథము నధిరోహించి సత్వరముగా యుద్ధభూమి కేగెను.

ఎఱ్ఱయ హరివంశమున గరుడుని స్కంధము నధిరోహించియే యుద్ధమున కరిగినాఁడు, "భూతోత్కర మఖిలముఁ దనకు శుభము కాంక్షింపంగన్" అని భూతములు శుభములను కాంక్షించుట – ఎఱ్ఱయ భావములు. ఇది రాఁబోవు శ్రీకృష్ణ విజయమును సూచించుచున్నది. ప్రయాణము నందే శుభసూచన కలిగినది.

ఈ విధముగా మూలమున లేని వస్తుచిత్రణ ఎఱ్ఱయ కావ్యధోరణిని సూచించు చున్నది. ప్రకృతి కథాగతికి తోడ్పడినది. ఇచ్చట పాత్రలు సజీవములు, ప్రాసంగికేతి వృత్తము ప్రధానేతివృత్తమునకు పోషకమైనది బ్రాహ్మణ మృతపుత్రుని శ్రీకృష్ణుఁడు బ్రతికించుట వంటి ప్రాసంగికములు. ఇది నాయకోత్కర్షకు పనికి వచ్చును సంఘజీవిత సర్వస్వమునకిది ప్రతికృతి. కనకనే ఉత్తమ కావ్యము ఎఱ్ఱయ నాటి సంఘజీవనము నిచ్చట చక్కగా చూడ వచ్చును.

ఈ హరివంశము భారత భాగము, భారతానుబంధము, భారతము పురాణము గనుక హరివంశము పురాణమే ! కాని కేవలము పురాణము కాదు పురాణలక్షణము లను గూడ తనలో పొందించుకొనిన కావ్యము ఆనాఁడు కావ్యము, ప్రబంధము సామాన్యవాచకములు గనుక ప్రబంధమే !

ఎఱ్ఱయ హరివంశము కావ్యమే అనుటకు మూల హరివంశము నందలి యొక ఘట్టముతో పోల్చిచూచిన తెలియఁగలదు.

మూలమున పారిజాతవృక్షమును శ్రీకృష్ణుడు భూలోకమునకు తెచ్చెను. ఆ వృక్షమును గాంచుటకై పలువు రేతెంచిరి.

ఆ వృక్షరాజమును గాంచిన వృద్ధులకు వృద్ధాప్యము దూరమైనది. అద్భుతము, అచింత్యము, మదకేళి కలకలముతోఁ గూడిన పక్షులతో వ్యాప్తము. అయిన వృక్ష రాజమును గాంచిన అంధులు దివ్యచక్షువులైరి. ఆ వృక్షగంధము నాఘ్రాణించిన రోగులు విరోగులైరి.

ఆ వృక్ష సమీపమునకు వచ్చిన మనుజులు నానావిధములగు మధురగీతముల వినుచుండువారు

"యోఽయం సంకల్పయామాసగంధంహృద్యం సరస్తథా
సతథైవ తమాజఘ్రే పారిజాత సముద్భవమ్."

హ. విష్ణు 75-59

ఎవ్వఁడే పరిమళమును సంకల్పించిన పారిజాత సముద్భవమైన ఆ పరిమళమునే ఆఘ్రాణించినాఁడు.

సత్యభామ ఆ వృక్షమును గాంచి, ఆనందించి, పుణ్యక వ్రతమును చేయ సంకల్పించినది. శ్రీకృష్ణుఁడు జంబూద్వీపమున లభించు సమస్త శ్రేష్ఠ వస్తుసముదాయమును తెప్పించెను. వ్రత పరిగ్రహణమునకై నారదుని స్మరించెను. ధ్యాతమాతుఁడై నారదుఁ డేతెంచెను అర్ఘ్య పూజాదు లొనరించిన స్వీకరించెను.
సత్యభామ –

అద్భిర్ప్రదా నారదాయ తతోఽను జ్ఞాప్య కేశవమ్
దేవీ ధేను సహస్రంచ కాంచనస్యచ పర్వతమ్

సత్యభామ హిరణ్యరూప్యములు, మణిరత్నములు, తిలలు, ధాన్యములు – వీనితోపాటు జలములోఁగూడ కేశవుని నారదునకు దాన మొనర్చినది.

ఆ దానమును పరిగ్రహించి నారదుడు హృష్టుఁడైనాడు.

"భోః కేశవ ! మదీయస్త్వ మద్భిర్దత్తోఽసి సత్యయా
సత్వం మామనుగచ్ఛస్వ కురుయదభ్యర్థ్యపీమ్యహమ్"

హ. విష్ణు. 76-9

అని నారదుఁడు పరిహాసవాక్యములు పలుకఁగా సంతుష్టుఁడై శ్రీకృష్ణుఁడు వరము కోరుమనెను. నారదుఁడు సాలోక్యము నర్థించినాఁడు.

"అయోనిజో భవేయంతే నారాయణ సతాంగతే
భవేయం బ్రాహ్మణశ్చైవ పునర్జాత్యంతరేష్వపి" 76-17

అని వరమును అర్థించెను. అయోనిజుఁడుగా, జన్మాంతరము నందును బ్రాహ్మణుఁడుగా జన్మింతునని యడిగినాఁడు.

"ఏవమస్తు" -అని శ్రీకృష్ణుఁడు వరమొసంగెను. ఈ వ్రతమును ద్రౌపదీ సహితులై పాండవాదులు, భీష్మక శిశుపాలాదులు అందఱును వీక్షించి యానందించిరి. ఇంతటితో ఆ పుణ్యకవ్రతము ముగిసియుండిన నది నాయకోత్కర్షకు, నాయక మహిమాభి వర్ణనకు, కావ్యగతికి ఉపకరించి యుండెడిది. ఈ పుణ్యక వ్రతమును కథనాయకుని సర్వోత్కృష్టునిగా తెలియఁజేసెడిది.

ఇంతటితో నాగక మూలమున - నాయక గుణమునకు ప్రాధాన్యమియ్యక పుణ్యకవ్రతకథావర్ణనను, ప్రారంభించినాఁడు - వైశంపాయనుఁడు.

సత్యభామాది సర్వులు, శ్రీకృష్ణుఁడు కులశీలగుణోపేతలగు పతివ్రతలు పరివేష్టించి యుండఁగా రుక్మిణీదేవి వ్రత విధానమును, వ్రతఫలమును నారదు నడిగెను.

"ఉమాదేవి ఆ వ్రతమును గావించినతీరు - ఆ ఉమాదేవికి మహేశుఁడు బోధించుట - ఆమె అరుంధత్యాది పతివ్రతల కావ్రత విధానమును వర్ణించిన తీరును వివరించినాఁడు.

78.4

"సతీత్వం ధర్మచరణంయస్యాః నిత్యమఖండితమ్
పుణ్యకానాంవిధి స్తస్యాః పురాణైః పరికీర్తితః"

అని అసతులీవ్రతమును గావించినను ఫలితముండదని తెలిపెను. ఆదిత్యాదులు, లోకవిఖ్యాతపతివ్రతలగు పౌలోమీత్యాదులు అందఱు ఉమాదేవిచే నెఱింగి, యీ వ్రతమును గావించిన వారే!

"భర్తను శీలములేక వంచించుస్త్రీ పుణ్యఫలమును పొందజాలదు."

78-3

"వ్యాధితః పతితో వాఽపి . దీనో వాపి కథంచన
నత్యక్తవ్యః స్త్రియాభర్తా ధర్మఏషసనాతనః"

అని భర్త రోగియైనను, పతితుఁడైనను అతనిని పరిత్యజించుట తగదు, ఇదిసనాతన ధర్మము, అని పాత్రలముఖమున ధర్మముపదేశించినాఁడు.

ఈ రీతిఁగా భారతనారికి పతిభక్తిని. పతివ్రతాధర్మమును బోధించు సుదీర్ఘోపన్యాసముతో, నూటముప్పదియైదు శ్లోకముల వఱకు పుణ్యకవ్రతవిధానము సాగినది.

మూలహరివంశ పురాణమున; ఆ వ్రత విధానమున ననుష్ఠింపఁదగిన ఉపవాసాదులు, ధరింప వలసిన వస్త్రాదులు, వివరింపఁ బడినవి. వ్రతానంతరము చేయవలసిన దానములు వర్ణింపఁబడినవి. వర్జనీయములు విశదీకరింపఁబడినవి. ఇఁక ఆ వ్రత విధానముతో పాటుఇదే అదనని, నానా ప్రకారములగు వ్రతములు వర్ణనలతో, స్త్రీలకు దానధర్మ విధులు, నియమనిష్ఠలు, బోధింపఁబడినవి.

'సుకేశిని' యగుటకు స్త్రీ చేయవలసిన వ్రతము దర్శనీయమగు లలాటమును పొందుటకై చేయవలసిన క్రమము, సుభ్రువగుట కాచరింపవలసిన వ్రతము, చారు దంతములను, ఉన్నత స్తనములను, శాతోదరమును, విశాల శ్రోణులను, మధుర వాక్కును పొందఁగోరిన స్త్రీ చేయవలసిన వలసిన విభిన్న వ్రత విధానములు-విధవ యగు స్త్రీ ఆచరింపవలసిన వ్రతమును, — వరుసగా ఏబదిరెండు శ్లోకములలో వ్రతముల పట్టిక వర్ణితమైనది.

అదితి వ్రతకము సావిత్రీ వ్రతము, ఇంద్రాణీ వ్రతము, గంగా వ్రతము, యమారధ వ్రతము, - వీని వివరములు కావలసిన వారికి హరివంశ ముపకరించును. అంతటితో ముగిసిపోలేదు. " సర్వకామ ప్రదమగు మఱొక వ్రతమును విశదీకరించెను. ఉమాదేవిద్వారా ఆ వ్రతముల ఉపసంహారమొక నలువది నాలుగు శ్లోకములతో సాగినది.

ఇట్లు వ్రతములను, వ్రత విధానమును నిష్ఠలను దానములను, వరుసఁగా రెండువందల ముప్పది శ్లోకములలో వర్ణించి, వ్యాసుడానాఁటి నారీమణులకీ హరివంశ పురాణమును నానా వ్రత విధానముగా అందించి, వ్రతాసక్తలనుగాఁ జేయ సంకల్పించె .

కాని, ఆ హరివంశము పురాణము, ధర్మబోధ, నీత్యుక్త జీవన విధానము - ఆనాఁటి హరివంశ పాఠకులకు అవసరమై యుండినది.

ఎఱ్ఱయ హరివంశము కావ్యము.

ఎఱ్ఱయ హరివంశమున – శ్రీకృష్ణుఁడు స్వర్గమునుండి పారిజాతమును తెచ్చెను "తత్సన్నిధానంబున సకల కుకురాంధక వరులుఁ గుమారులును దివ్యంబులగు తమ పూర్వ జన్మంబులు సంస్మరించి, యది తదీయ ప్రభావంబుఁగా నెఱింగి యద్భుతంబు నొందిరి."

శ్రీకృష్ణుఁడందఱిని వేర్వేఱ సన్మానించినాఁడు. "నిజ భుజ విజిత ధనంబులు వేర్వేఱ యాలోకించి

కం॥ కమనీయములును, బహుమూ
ల్యములు ననర్ఘ్యములునైన యవి గురులకుఁ జా
ట్టములకుఁ జెలులకు నుచిత
క్రమ మొప్పఁగ నిచ్చెఁ బ్రియము గడలుకొనంగన్.
(హ. వ II-4-238)

ఇట్లనేక దానములు గావించెను. సాందీపుని అధికార్చనంబులం దనిపెను. ఉగ్రసేనుని కళత్రంబున క్రగిమంబగు భూషాంబరాదులిచ్చి పుత్తెంచెను. శేషించిన యర్థంబును భాండాగారమునం దుంచినాఁడు. రథ గజ తురగాదులను నధికారుల నియోగించెను. అనేక యదువీర పరికీర్ణయగు సభయం దాసీనుఁడై - అందఱం గలయం గనుంగొని—

చ॥ "అనుపమ పుణ్యకీర్తులగు నట్టి మహాత్ములు మీరలిందఱున్
గొనకొని నిర్వహించునవి కుంఠిత దానదయాది సాధు వ
ర్తనముల లావు గాదె సురదైత్యులకైన నవధ్యుఁడైన శ
త్రుని నడగించె నాదయిన దోర్బల మెట్టిది యిట్టి సేతకున్.
(II-4-240)

అనుపమ పుణ్యకీర్తులు, అవికుంఠిత దానదయాపరులు, సాధువర్తనులునగు మీరందరు మహాత్ములరు. మీరు నిర్వహించు దానదయాది సాధువర్తన బలమే నా యీ సుర దైత్యులకైన నవధ్యుండగు శత్రువు నరకాసురుని - చంపఁగలిగిన దోర్బలము - మీ శక్తియే!" అని పొగడి తన శౌర్యమును వారు నిర్వహించిన దానదయాది పుణ్య కార్యముల శక్తియే యని నుతించి, తన నిరహంకారతను, నిర్మమకారమును ప్రదర్శించినాఁడు. ఇంకను - ఆగక

"పెద్దకాలము చేపడిన కన్నియలు ముక్తలైరి. రత్న శిఖరమైన పారిజాతము అబ్బినది.

కం॥ సౌమ్యున కొడయలు మీరా
జ్యమ్మునకుం గర్తలీర యంచిత కల్యా
ణమ్ములకుఁ బ్రవర్తకులరు
మిమ్మలరించుటయె యెల్ల మేలును నాకున్"—

(II-4 - 242)

అని వారి యానందమే తన యానందముగా తెలిపెను

ఇది మూలమున లేని అవికత్థన ప్రదర్శన. నాయకుని నిరాడంబర స్వభావమును ప్రదర్శించునది మూలము పురాణము గనుక పాత్రల స్వభావమునకు, ఉత్కర్షకు ప్రాధాన్య మొసఁగక పుణ్యక వ్రత విధానము ప్రారంభమైనది. ఎఱ్ఱయ హరివంశమున పుణ్యక వ్రతము లేదు. వ్రత విధానము, నిష్ఠ దానములు ఏమియును లేవు. కాని పాత్ర చిత్రణమునకు ప్రాముఖ్య మొసఁగఁబడినది.

అప్పుడు వారందరు మహిమను పొగడుచుండ, నారదుఁ డచ్చటి కేతెంచి, యాదవులకు శ్రీ కృష్ణ మహిమ నెఱింగించెను. వరుసగా అతఁడు గావించిన దుష్ట నాశమును స్తుతించెను.

"కవే రల్పాపి వాగ్వృత్తి ర్విద్వత్కర్ణావతంసతి
నాయకో యది వర్ణ్యేత లోకోత్తర గుణోత్తరః"

అను నాలంకారికుల లక్షణము ననుసరించి, యుత్కృష్ట గుణోపేతునిఁగా నాయకుని తీర్చిదిద్దినాఁడు ఎఱ్ఱయ.

సమయము, సందర్భము కల్పించి, వ్రతముల నుపదేశించుట - ధర్మోపదేశము గావించుట పురాణ లక్షణము. ఎఱ్ఱయ హరివంశము కావ్యము. కథాగమనమునకు భంగము కలిగించు నీరస వర్ణనలను తొలగించుటయే ఎఱ్ఱయ పని.

ఈ పుణ్యక వ్రతము, నానావ్రతముల విధానము, ఆచరణ ఫలము - వ్రతము నందుత్సాహముగల నారీమణులకు పనికివచ్చునే కాని, కథా వస్తువునకు కాని, రస పోషణకు గాని ఉపకరింపవు. వస్త్వైక్యమునకు భంజకములైనట్టివి. కనుక వీనిని పూర్తిగా తొలగించినాఁడు ఎఱ్ఱయ. ఈ ధర్మబోధన తొలగించి కావ్యత్వమును పరిరక్షించినాఁడు. ఎఱ్ఱయ గావింపఁ దలచిన ధర్మబోధ వ్యంగ్య ప్రధానమైనది. రసాన్వితమైనది.

14)

స్త్రీ తన శరీర సౌందర్యముతో, ఆచరణ శుద్ధితో పురుషుని సర్వవిధముల నానందింపఁజేయవలె ననుట – వ్యాసుని హరివంశబోధ – పురాణముల లక్ష్యమును అదియే.

అట్టి వ్రతముల నిమిత్తమున నైనను – దానధర్మాదు లొనర్పఁగలరని, శమ దమాదులను అలవరచుకొనఁగలరని, తద్ద్వారా జీవితమును నిర్మలముగా శాంతముగా పరోపకార పరదాన పరాయణముగా, గడుపఁగలరని యాకాంక్ష. పురాణమైన హరి వంశ మా ధ్యేయమునకు పాటుపడినది.

ఇట్లు కొన్ని ఘట్టములను నిశితముగ పరిశీలించిన, ఎఱ్ఱయ హరివంశము కావ్యమని చెప్పక చెప్పవచ్చును.

ప్రధానేతివృత్తమున కుపస్కారకములైన ప్రాసంగికేతి వృత్తము లన్నియు తమ తమ భిన్న ప్రయోజనములను సాధించు కొనుచునే ఏకముఖముగ ప్రవర్తించుచు వస్త్వైక్యమును చేకూర్చినవి. కనుకనే కావ్యము అందుల కుదాహరణము.

## బ్రాహ్మణ మృత పుత్రుని బ్రతికించు సందర్భము.

కథా సంగ్రహము :– అర్జునుఁడొకసారి ధర్మరాజునకు శ్రీకృష్ణుని ప్రభావమును చెప్పుచున్నాఁడు.

ఒకసారి అచ్యుతుఁడు ద్వారకాపురియందు యజ్ఞ దీక్షితుడై యుండెను. యజ్ఞము, యజ్ఞకర్త, యజ్ఞఫల ప్రదుఁడును, యజ్ఞదీక్షితుఁడై యుండెను. అమ్మహా యజన సమయంబున జానపదుఁడగు భూసురుఁ డొక్కరుఁ డరుదెంచి తన పుత్రులను ప్రసవక్షణమునందే యెవ్వఁడో కొనిపోవుచున్నాఁడనియు, ముమ్మార నీవిధముగా కోల్పోయె ననియు, చతుర్థ గర్భము ప్రసవ సమయము కాన, "సకల జగద్రక్షా విధి కధికారివి. గర్భస్థార్భకుని రక్షింపు" మని యాచించినాఁడు. యజ్ఞదీక్షా విధియం దుంటినని శ్రీ కృష్ణుఁడు యోచించు చుండెను. అప్పుడర్జునుఁడు, 'భూసురేంద్రుని యాపద పోగొట్టెద. నన్నుఁ బంపు" మని వెడలినాడు. తదీయ గ్రామము చేరెను. ఊరి చుట్టును సైన్యమును విడిపించెను. రామ ప్రద్యుమ్నుల వెంటఁగొని చనినాఁడు. అనేకములగు దుర్నిమిత్తములు సంభవించినవి బ్రాహ్మణి కడుపు లోపలనుండి వెలువడినప్పుడ బాలకుని ఏడ్పును, 'అదె పోయె, పోయె' నను అంగనాజనముల యాక్రందనమును, ఒక్కసారిగా బయలు వెడలినవి. అర్జునుఁడు వ్యర్థప్రయత్నుఁ డయినాఁడు. ముదుసళ్ళు, ముత్తవ్వలు మర్మ భేదకములగు మాటలతో నర్జునుని యస

మర్థతను పొడిచిరి. "భువనైక ధురీణుఁడు దానవాంతకుఁడు ఎక్కటి చేయు సేత నీకగునా ?" యనువారు, 'నీకున్ హరికి వినుహస్తి మశకాంతర' మనువారునైరి.

అమ్మహీదేవుఁడు క్రమ్మఱ కృష్ణుని పాలికిరిగె. నారాయణుండు తేలాయితము గావించుకొని, యర్జునుని సారథి గావించుకొని, కుబేరుని దిక్కున కేగెను. మహా శైలములు, నదులు కడచి చనినాఁడు. విపులార్ణవమును దాటినాఁడు. సముద్రుడు భీతిల్లి మార్గము నొసంగెను. పర్వతముల నతిక్రమించెను. అంధకార పటల మగుపించినది. దానిని ఛేదించుకొని పోయినాఁడు. అద్భుతంబగు తేజంబు గాంచి నాఁడు. ఆ వెలుగులోనికి సొచ్చి బ్రాహ్మణుని మృత పుత్రులను తెచ్చి యొసంగి నాఁడు. ఇది యర్జునుని పరాభవమును దెలుపు ప్రాసంగి కేతివృత్తమైనను, శ్రీకృష్ణుని 'విశ్వ చరాచరములకు నావిర్భావ దుర్భావముల నొనరింప సమర్థు' డనియు, మృత పుత్రులను సైతము తేఁగలవాఁడనియు, నభోమండలమును, తదనంతరమగు నంధ కారమును, తదతీతమగు తేజోమండలమును ప్రవేశింప సమర్థుఁడనియు తెలియఁజేయు చున్నది. ఈ విధముగా నీ ప్రాసంగికేతి వృత్తము— నాయకుని యుత్కర్షకు పనికి వచ్చుచున్నది.

అలంకారిక శైలిలో నుండునది కావ్యము.

శ్రీకృష్ణుఁడు నరకాసురునితో యుద్ధముచేయుచు అలసి పోయినాఁడు. సత్య భామతో, 'ఏనుపరి పీడితుఁడనై డస్సితి నొక్కింత నీవు కయ్యంపు మోపుమోయు' మని తన శార్ఙ్గము నామె చేతి కిచ్చినాఁడు.

ఆ క్షణమున సత్యభామ –

శా॥ వీరంబాడుదనంబునొందెననఁగా విక్రాంతిసౌందర్య ల
క్ష్మీరేఖం బచరించెనాగధృతి యక్షీణాకృతిం జెందెనా
ధీరోదాత్త పతిప్రియాచరణ భక్తిప్రౌఢ యాలన్విదాఁ
బ్రారంభించె మహారణక్రియకు నాప్రత్యర్థితోనుక్కునన్"

హ. వ. II-4-162

ఇవి యామె యుద్ధమొనర్పు సందర్భము నందలి రూపురేఖలు.

వీరరసమే స్త్రీరూపమెత్తి నదేమో యనునట్లున్నదఁట : పరాక్రమము-సౌందర్య లక్ష్మీ రేఖలను ప్రసరించుచున్నట్లున్నదఁట : ధృతి-ధైర్యము క్షీణముకాని ఆకృతిని

పొందెనోయనునట్లున్నదఁట ! ఆ తన్వి -ధీరోదాత్తుఁడగు పతికి ప్రియము నాచరించు భక్తితో నుండు ప్రౌఢురాలు ఆమె ప్రత్యర్థితో మహారణమున కుద్యమించినది.

ఇచ్చట – ఆమె ఆకారము – వీరత్వమే యాడుతనమును పొందినట్లుగ, పరాక్రమము సౌందర్యమును ప్రసరించుచున్నట్లుగ, ధైర్యము అక్షీణాకృతి నొందినట్లుగ నుత్ప్రేక్షింపఁబడినది. వీరత్వము స్త్రీలకు విరుద్ధము కనుక ఈ సందర్భమునే వీరత్వము ఆడుతనమెత్తినట్లున్నదని పేర్కొనుట ! పరాక్రమమునకు సౌందర్యమబ్బినట్లున్నదఁట ! ఇట్లు మూలమునలేని సత్యభామ యుద్ధప్రయత్నమాలంకారికమై యున్నది.

ఎఱ్ఱయ హరివంశమున పాత్రలు సజీవములు.

శ్రీకృష్ణుఁడీ కథానాయకుఁడు. పరతత్త్వాంశము. భూభారహరణార్థము భువి కవతరించినవాఁడు. ఆతని ప్రవర్తన సర్వులు అనుసరింపవలసినది. ఆ శ్రీకృష్ణుఁ డొకసారి యాదవులతోఁగూడి జలవిహారముఁగావింప నేఁగినాఁడు.

మూలము – ద్వారకలో నివసించునపుడు శ్రీకృష్ణుఁడు పిండారక తీర్థమున సముద్రయాత్ర గావించెను.

ఉగ్రసేన, వసుదేవులను పురరక్షకులుగా నుంచి యందఱును బయలుదేరిరి. యదువీరకుమారులు గణికాగణముతో నలంకృతులై వెడలిరి. ఆవేశ్యలందరు యదుకుమారులకు ఇచ్ఛాభోగ్యలు, క్రీడానారులు. దైత్యుని పురమును జయించినపుడు, తేఁబడినవారు అందరును క్రీడార్థమై బయలు వెడలిరి. రేవతితోపాటు బలరాముఁడును కాదంబరీపాన మత్తుఁడై వెడలెను.

"షోడశ స్త్రీ సహస్రాణి జలే జలజలోచనః
రమయామాస గోవిందో విశ్వరూపేణ సర్వదృక్"

(హ: విష్ణు. 88–13)

షోడశస్త్రీ సహస్రమును శ్రీకృష్ణుఁడు విశ్వరూపముతో రమింపఁజేసెను. అందఱును గోవింద సంగమున తృప్తినొందినవారే ; శ్రీ కృష్ణునకు "అహమిష్టాహమిష్టేతి" ఆనందించెడివారే !

ఈ విధముగా నందరును సముద్ర జలమున మకరాకృతిలో, మీనాకృతిలో ప్లవనము గావించినారు. స్తనకుంభములను నౌకలు గావించుకొని తరించిరి. శ్రీకృష్ణుఁడు రుక్మిణితో నానందముగా రమించుచుండెను.

"యస్యాయస్యాస్తు యో భావ స్తాంస్తాం స్తేనైవ కేశవః
అనుప్రవిశ్య భావజ్ఞో వినాయాత్మవశం వశీ ॥
(88 - 32)

ఎవరెవరికి ఏయే భావము లుండినవో ఆయా స్త్రీల నాయా భావములతోడనే వశము గావించుకొనినాఁడు.

స్త్రీ గణముతో యదుకుమారు లానందించుచుండిరి. శ్రీకృష్ణుఁడు కుబేర భవనమునుండి "పంచచూడ" యను పేరుగల అప్సరసలను పిలిపించి యదు కుమారులతో రమింపుఁడని యాదేశించినాఁడు.

ఈ విధముగా యదుకుమారు లప్సరసలతో, శ్రీకృష్ణుఁడు షోడశస్త్రీ సహస్ర ముతో, బహుభంగుల విహరించిరి. నౌకా విహారములు సల్పిరి. ఆ నౌకలయందు వివిధములగు హర్మ్యములు, పక్షుల సంకులములు, మణిమయములగు శయ్యలు, నందనవనాకృతులు, ఉద్యానవనములు, దీర్ఘికలు, సభ -సమస్తము అమర్పబడియుండి నవి. శ్వేతకోకిలల కూజితము లొకవైపు, చంద్రకిరణసదృశములగు హర్మ్యములందు, మయూరముల నాట్యములొకవైపు. వీనులకు కనులకు విందొనర్చు చుండినవి. నారా యణుని యాజ్ఞచే అనేకఋతువుల పుష్పము లొక్కసారిగా పుష్పించినవి. పుష్ప సౌరభము చందనశైత్యమును గ్రహించి వీచుచుండినది. అక్కడివారిని చక్రపాణి యనుగ్రహముచే ఆకలి దప్పులు పీడింపలేదు.

ఎనుబదియొక్క శ్లోకము లీ తీరున నడచినవి.

బలరాముఁడు మధుపానమత్తుఁడై రేవతితో నృత్యము గావింపఁదొడఁగెను. ఆ అప్సరసలు శ్రీకృష్ణమహిమను, యమళార్జున భంగమును కాళియ మర్దనాదులను కీర్తించుచుండిరి. అర్జునుఁడు సుభద్రతో అచ్చటి క్రీడోత్సవమున పాల్గొనెను.

ఆ రాస నృత్యమునకు నారదుఁడేతెంచినాఁడు. అతఁడే రాసక్రీడను నిర్వ హించినాఁడు.

"స సత్యభామా మథ కేశవంచ
పార్థం సుభద్రాంచ బలంచ దేవమ్
దేవీం తథా రేవత రాజ పుత్రీం
సంద్భశ్య సంద్భశ్య జహాస ధీమాన్"
89-25

సత్యభామాదులను చూచి చూచి నవ్వుచుండెను, - నారదుఁడు - అంతటి యోగి, ఒకరిచేష్టను - ఒకరి నవ్వును - ఒకరిలీలను అనుకరించు చుండెను.

వారిననేక విధముల నవ్వించుచుండెను. అచ్చటి యువతు లాముని కిష్టము లగు నుపాయనముల నొసఁగిరి.

బలరాముఁడు రేవతీ సహితుఁడై గానమొనర్చెను. సత్యాసహితుఁడై శ్రీకృష్ణుఁడు గానము చేయఁదొడంగెను. అర్జునుడు సుభద్రతోఁగూడి గానమొనర్చెను. గదసాత్యక్యాదులు, అక్రూరాదులు వీని కలిసికొనిరి. అందఱును సముద్రమున దుముకుట - శ్రీకృష్ణబలరాములు, భార్యలు ఒకరిపై నొకరు జలము చల్లుకొనుట, నారదుఁడును అందు పాల్గొనుట జరిగినవి.

ఈ విధముగా నారదుఁడు, బ్రహ్మమానస పుత్రుఁడు, సంయమీంద్రుఁడు, రాసక్రీడలో పాల్గొనుట, జలములు చల్లుకొనుట, హల్లీసక నృత్యమును నిర్వహించుట, శ్రీకృష్ణుని భార్యల చేష్టలను ఆటలను అనుకరించుట, అతని పాత్రకు సరియైనదికాదు. అతడలౌకిక భావములు గలవాఁడై యొకవేళ స్త్రీ పురుష భేదము లేక యట్లు గావించి యుండవచ్చును. అయినను, పాఠకులు లౌకికులు గనుక, నారదుఁడు వారి దృష్టిలో తక్కువకాకూడదని ఎఱ్ఱయ భావించి యుండవచ్చును. పాత్రల చేష్టాదులు వారి మానసిక వికాసమునకు తగినట్లుగా నుండవలయును. కనుక ఎఱ్ఱయ ఈ ఘట్టమునే తొలఁగించి పాత్రల మానసిక వికాసమును కించపఱుపక పోషించినాఁడు.

వేశ్యాగణము, క్రొత్తరకపు వేశ్యల ఆగనుసము క్రీడలు - ఎఱ్ఱన లక్ష్యమునకు తగదని భావించెనేమో! శ్రీకృష్ణుని పరతత్త్వము కించపఱచునట్టి క్రీడాకలాప మిది యని తలంచెనేమో ? నారదుని వంటి బ్రహ్మజ్ఞాని పాత్రచిత్రణ ఇట్లుగావింపఁదగదని యెంచెనేమో ? ఆ ఘట్టమును పూర్తిగా తొలగించి, కావ్యమునకు ఔచితిని చేకూర్చి నాఁడు. ఆ జలక్రీడ ముగిసినది. అందరును పైకి వచ్చిరి. చందనము పూసికొనిరి. నారదునకు చందనము నిచ్చిరి. భోజనపానాదులు గావించిరి. అనంతరమొక దీర్ఘమగు భక్ష్య భోజ్యముల పట్టిక వివరింపఁబడినది. ఈ వర్ణనలు - ఆనాటి పలు విధ భోజన సామగ్రిని తెలియఁజేయు చున్నవి. కాని కావ్యశిల్పమున కేవిధముగ నుపకరింపవు.

భోజనానంతరము తిరిగి గీతాగానములు మొదలైనవి. నారదుఁడు వీణ వాయించెను. శ్రీకృష్ణుఁడు వంశ వాద్యమును చేపట్టెను. అర్జునుఁడు మృదంగమును

ప్రయోగించెను. ఈ విధముగా కొంతకాలము 'హాటకచేరీ' జరిగినది. అప్సరస లితర వాద్యములు వాయించిరి. రంభ నాట్యమాడినది. తక్కిన అప్సరసలును ఇందు పాల్గొనిరి. ఈ 'ఛాలిక్య గాంధర్వము' భూతలమున వ్యాప్తి చెందినది.

అనంతరము 'ఛాలిక్య గాంధర్వము' యొక్క ఫలము వివరింపఁబడినది. ఆ విద్యనుండియే నేటి గాంధర్వము జనించినదట! శ్రీకృష్ణుఁడు యాదవులకు గాంధర్వమును బోధించెను. యాదవుల ద్వారా గాంధర్వము భూలోకమున కేతెంచినది.

ఈ విధముగా గాంధర్వవిద్య పుట్టు పూర్వోత్తరములు వివరింపఁబడినవి. ఇది కథకుఁగాని, రసపుష్టికి గాని, పాత్రపోషణకుఁగాని, ఏవిధముగను ఉపకరించుట లేదు గనుక ఎఱ్ఱయ ఈ శ్లోకములను పూర్తిగా తొలఁగించినాడు.

ఈ విధముగా ఉత్సవము ముగిసినది. శ్రీకృష్ణుఁ డందరిని వీడ్కొలిపెను. గాంధర్వ విద్య పుట్టు పూర్వోత్తరముల తెలిసికొనఁగోరువారికీ విషయము పనికి వచ్చునే కాని, కావ్యమున కుపకరింపదు. కావున ఎఱ్ఱయ ఈ ఘట్టమును పూర్తిగా తొలఁగించి, పురాణమునకు కావ్యత్వ సౌందర్యమును పొందించినాఁడు.

ఇట్లెన్ని భంగుల చూచినను - ఎఱ్ఱయ హరివంశము కావ్యమే!

కావ్యము - ప్రబంధము - సామాన్యవాచకములు. కనుక ఎఱ్ఱయ కావ్యము ప్రబంధము. ఆ ప్రబంధ రచనలో ఎఱ్ఱయ పరమేశ్వరత్వమును పొందినాఁడు. కనుక ఎఱ్ఱయ ప్రబంధ పరమేశ్వరుఁడు ఈశ్వరత్వమన ప్రభుత్వము. ప్రబంధ నిర్మాణములో ప్రభువు గనుక ఎఱ్ఱయ ప్రబంధపరమేశ్వరుఁడు.

---

## 4. ఎఱ్ఱయ - ప్రబంధ పరమేశ్వరుఁడు

ఎఱ్ఱన ప్రబంధపరమేశ్వరుఁడు. ఎఱ్ఱయకుఁ ప్రబంధపరమేశ్వరుఁడను పేరు వచ్చుటకుఁగల కారణమును పలువురు పలురకముల నూహించినారు. అందు ముఖ్యులగువారి యభిప్రాయముల నిట వివరించి, యొక నిర్ణయము నంగీకరించెదము గాక :

### 1. చాగంటి శేషయ్యగారు - కవితరంగిణి

"మహాభారతమునకుఁగల కొఱతనుఁ బూర్తిఁజేసిన మహనీయుఁడగుటచే నతనిని విద్వజ్జనము ప్రబంధపరమేశ్వరుఁడని పిలువఁజొచ్చిరని తలంపవచ్చును. లేదా కవి తానే ప్రబంధపరమేశ్వర బిరుదమును వేసికొనియుండవచ్చును. కవి యారణ్యపర్వ శేషమును నృసింహపురాణమునుఁ ప్రబంధములుగా భావించి యుండెనే కాని, హరివంశమునుఁ 'ప్రబంధ'మని యననే లేదు".

### 2. Dr. యశోదారెడ్డి - తెనుఁగులో హరివంశములు

"ఎఱ్ఱన నృసింహపురాణ రచనా కాలము నాటికే ప్రబంధపరమేశ్వరుఁడు. ఈ బిరుదము కేవల మారణ్యపర్వశేషము రచించుటచే వచ్చినదికాదు. ఒకటిరెండు స్వతంత్ర గ్రంథములో, యుద్గ్రంథములో రచించుటచే లభించు నంతటిదీ బిరుదము. ఆయుద్గ్రంధములే రామాయణ హరివంశములు"

### 3. పాటిబండ మాధవశర్మగారు - [అరణ్యపర్వ పీఠిక]

"ఎఱ్ఱనకు శంభుదాసుఁడను బిరుదము కలదు. కాని ప్రబంధపరమేశ్వరుఁడు అను బిరుదములేదు. ప్రబంధరచనా ప్రావీణ్యమునుఁ బట్టి యానాఁటివారు ఆయనను ప్రబంధపరమేశ్వరునిగా నుతించిరి. అది బిరుదమే యయినచో ఆయన గద్యములోఁ గాని, యితరగ్రంథములలోఁగాని దాని ప్రసక్తి యుండవలయునుగదా ! అది బిరుదము కాకపోవుట యట్లుండ, అది అరణ్యపర్వశేషరచన వలన లభించిన దనుటయు సరికాదు. ఆయన కాలమునకు సన్నిహితోత్తర కాలముననందే యుండిన "జక్కన" - "ఈ త్రయఁదా ప్రబంధ పరమేశ్వరుఁడై విరచించె శబ్దవైచిత్రి నరణ్య పర్వశేషము రచించెనని స్పష్టముగా చెప్పియున్నాఁడు.

వేమారెడ్డి, "సకల భాషా కవిత్వవిశారదుఁడు" అన్నాడు. ఉన్నత సంస్కృతాది చతురోక్తి పదంబుల కావ్యకర్తవు అని తాత ప్రశంసించినాఁడు. నాటి రసజ్ఞులాయనను 'ఎన్నికయై ప్రబంధ పరమేశ్వరు' డన్నారు.

ఈ విధముగా ప్రతిష్ట నార్జించిన పిమ్మటనే ఆయన అరణ్యపర్వ శేషోన్నయమాంధ్రభాష నిర్వహించినాఁడు.

**Dr.** రఘునాథశర్మగారు (భారతధ్వని దర్శనము)

"కవిత్రయములో మూడవవాఁడును, కావ్యభాగమును బట్టి రెండవ వాఁడును అగు ఎఱ్ఱాప్రెగ్గడకుఁ బ్రబంధ పరమేశ్వరుఁడను బిరుదము గలదు. అరణ్యపర్వశేషరచనమునుబట్టి యాతనికా బిరుదము వచ్చినట్లే క్రింది నృసింహ పురాణ పద్యమును బట్టి తెలియు చున్నది "

"ఉన్నత సంస్కృతాది చతురోక్తి పదంబులఁ గావ్యకర్తవై
యెన్నికమైఁ బ్రబంధపరమేశుఁడనంగ నరణ్యపర్వశే
షోన్నయ మాంధ్రభాష సుజనోత్సవ మొప్పగ నిర్వహించితే
నన్నయభట్ట తిక్కకవి నాథుల కెక్కిన భక్తి పెంపునన్".

(నృ. పురాణము 17)

అరణ్యపర్వ శేషమునుఁ బ్రత్యేకముగా నొక ప్రబంధమని చెప్పఁజాలము. అట్టి యెడఁ దత్కర్తృత్వముచే నీతనిఁ బ్రబంధపరమేశ్వరుఁడనుట ఎట్లు పొసంగును? ప్రబంధమనగానేమి ? ఒకజాతి కావ్యపరముగా నీశబ్ద మిటీవలి కాలమున వాడుకలోనికి వచ్చెనుగాని యెఱ్ఱయ కాలమునలేదు కావున నీ బిరుదమున కొకవిశేషమైన అర్థము చెప్పుకొనవలయును. ప్రబంధమనఁగాఁ జక్కని కూర్పు = సంధానము. ఎఱ్ఱయ నన్నయ తిక్కనలు వ్రాసిన భారత భాగమునకుఁ జక్కని సంధానము గావించెను భారత రచనకు 'ఇతిశ్రీ' కారము పెట్టుట చేతను, నన్నయతిక్కనకు విష్ణు పరమేష్ఠి సాదృశ్యము లుండుట చేతను నీతఁడు ప్రబంధపరమేశుఁడను టెంతయు నొప్పును".

ఎఱ్ఱయ నాఁడు ప్రబంధము కావ్యసామాన్య వాచి, కావ్యములు వ్యంగ్యముగా బోధించునవి. రచనా చమత్కృతి గలవి. రామణీయకత కావ్యమునకు ముఖ్యాంగము. కావ్యమునందలి ప్రత్యవయవమునకు, వస్తువునకు బంధముండును. కనుకనే ఆశిల్ప

మునకు ప్రబంధమను పేరు "ప్రకృష్టం బంధం యస్యతత్" అని ప్రబంధ నిర్వచనము.

"సర్గబంధం మహాకావ్యమ్" – అని దండి వచనము.

కావున ప్రబంధము కావ్యసామాన్యవాచి. "ప్రబంధః కల్పనా కథా" యని మఱొక నిర్వచనము. వస్తువర్ణనలో, రసవర్ణనలో బంధము పటిష్ఠమై యుండవలెను.

సంస్కృతమున నలంకారాది సమస్తగ్రంథములకు ప్రబంధశబ్దము వాడు చుండెడివారు.

కాళిదాసు తనపూర్వుల నాటకములను ప్రబంధములని చెప్పెను. "ప్రథిత యశసాం భాససౌమిల్లక కవిపుత్రాదీనాం ప్రబంధా నతిక్రమ్య వర్తమాన కవేః కాళిదాసస్య క్రియాయాం కథం పరిషదో బహుమానః" అని పూర్వకవుల నాటకములను ప్రబంధములని చెప్పెను.

విద్యానాథుడు –

"ప్రతాపరుద్ర దేవస్య గుణానాశ్రిత్య నిర్మితః
అలంకార ప్రబంధోఽయం సంతఃకర్ణోత్సవోఽస్తువః" I-9

అని అలంకార గ్రంథమును కూడ ప్రబంధమనియే పేర్కొనెను.

ఈ విధముగా, కావ్యములు, శాస్త్రములు, నాటకములు – సర్వగ్రంథములు ప్రబంధముల పేరిటనే వెలయుచుండినవి.

వ్యాసభగవానుడును హరివంశరచనా సంధర్భమున –

"అసత్ప్రబంధ కాంతార పరివర్తన పాంసులాం
వాచం శౌరి కథాలాప గంగయైవ పునీమహే"

అని తన పూర్వరచిత పురాణములను అసత్ప్రబంధములుగా భావించినాడు. కనుక సమస్త గ్రంథముల సామాన్యవాచిగా సంస్కృతమున ప్రబంధ శబ్దము ప్రయోగింపబడు చుండినది.

తెనుగున కావ్యమును, ప్రబంధమును పర్యాయపదములుగా వాడుచుండినారు.

నన్నయ భారతము ప్రబంధమే. తిక్కన తన భారతమును 'ప్రబంధ మండలి' యని చెప్పుకొనలేదా ? మఱి వీరికిలేని 'ప్రబంధ పరమేశ్వర' కీర్తి ఎఱ్ఱయకే వచ్చుటకు కారణమేమి ?' యను సందేహము పొడమును.

చదలువాడ మల్లయ ఎఱ్ఱయ రామాయణమును, 'ప్రబంధ' మనియే పేర్కొని నాఁడు. ఎఱ్ఱయ తన నృసింహ పురాణమును 'ప్రబంధ' మని యొకచోట పేర్కొన్నాఁడు. కనుక ప్రబంధము కావ్యము పర్యాయ పదములు.

నన్నయ 'కథాకథన' శైలిలో భారతమును నడిపినాఁడు. తిక్కన 'నాటకీయ శైలి'లో భారత రచన గావించినాఁడు. ఎఱ్ఱయది "వర్ణనాత్మక శైలి" "వర్ణనాత్మకత" ప్రబంధమునకు ప్రాణము వంటిది.

కథతోఁబాటు వివిధ సన్నివేశములలోని సౌందర్య స్ఫోరకత్వము ద్యోతక మగునట్లు వ్రాయుట వర్ణనాత్మక శైలి. ఇట్టి శయ్యకు మూలపురుషుడు ఎఱ్ఱయ. కనుకనే అతఁడు ప్రబంధ పరమేశ్వరుఁడు.

కాని, ఎఱ్ఱయకీ ప్రతిష్ట ఎప్పుడు వచ్చినది ? అనునదే ప్రశ్న. ఎఱ్ఱయది మొదటి రచన రామాయణము. అది కనిపించుట లేదు. కనుక కనిపించు గ్రంథము లలో మొదటిదగు హరివంశము నించుక పరిశీలించవలసి యున్నది. ఇందు మూల మున లేని వర్ణనలను, మూలమునకు వన్నెపెట్టు వర్ణనలను గావించినాఁడు. కథాను గుణముగ ప్రకృతిని వర్ణించుటలో ఎఱ్ఱయ దిట్ట - అందెవేసిన చేయి యనిపించు కొనినాఁడు మానవ మనోభావములకు ప్రకృతిని దర్పణప్రాయము గావించినాఁడు ప్రసంగోచితములగు వర్ణనలఁ జొప్పించినాఁడు. మూర్తిఁ గనులఁగట్టించు గుణా లంకార పాక విశిష్టమైన శబ్దార్థ సంయోజనమునుఁ గావించినాఁడు. కనుక భావము పుష్టి నందించి రస సిద్ధిని పొందించి, తన రచనచే 'ప్రబంధపరమేశ్వరుఁడని' వాసికెక్కినాడు.

ప్రబంధ రచనా ప్రావీణ్యమునుఁ బట్టి యానాఁటివారు ఆయనను ప్రబంధ పరమేశ్వరునిఁగా నుతించినారు.

రామాయణము లభ్యముకాదు. అరణ్యపర్వశేషరచన చేతనే ఆ నుతి యాత నికి లభించె ననుటయు సరికాదు. అరణ్యపర్వశేష మొక ప్రత్యేక రచనకాదు. కృతిభర్తయు ప్రత్యేకవ్యక్తి కాఁడు. రచనయు 'తద్రచనయకా' నని నన్నయపేరిటనే రచించినాఁడు. లభించిన గ్రంథములలో హరివంశమే మొదటిదిగా కానవచ్చు చున్నది. అందలి వర్ణనలు - మూలమునకంటె కొన్నియెడల భిన్నములు, కొన్ని యెడల విస్తృతములు, మఱి కొన్ని యెడల మార్పుచెందినవి. మూలమున నీరసము లును వస్త్వైక్యమునకు భంగకారకములు నగు ఘట్టముల తొలఁగించినాఁడు. రస

పుష్టి – వస్తుపాత్రరసబంధము సమకూర్చినాఁడు. హరివంశరచన చేతనే ఇతనికి కీర్తి వచ్చియున్నదని చెప్పవచ్చును. హరివంశరచనాకాలము నాఁటికాతఁడు ప్రబంధ పరమేశుఁడుకాఁడు. కనుకనే హరివంశమున 'ప్రబంధపరమేశుఁడని చెప్పుకొనలేదు.

హరివంశరచనా నంతరము అందలి ప్రబంధధోరణిని, వర్ణనా వైచిత్రినిఁ గాంచి పండితు లితనిని 'ప్రబంధపరమేశుఁ'డని పిలిచియుండవచ్చును. అనంతర రచన – అరణ్యపర్వశేషము. అరణ్యపర్వశేషకర్తృత్వమునే మఱుగుపఱచినాఁడు. సంజ్ఞతోఁబాటు బిరుదమునకు ప్రసక్తిలేకపోయినది. ఆయన కాలమునకు సన్నిహితో త్తరకాలము నందే యుండిన జక్కన – "ఈ త్రయిఁ దాప్రబంధపరమేశ్వరుఁడై విరచించె శబ్దవైచిత్రి సరణ్యపర్వశేషము" – అని ప్రబంధపరమేశ్వరుఁడై యారణ్య పర్వశేషమును రచించినట్లు తెలిపినాఁడు. 'అయి' అనునది భూతకాలికమైన అస మాపక క్రియ – క్త్వార్థకము. ఒకక్రియజరిగిన తరువాత – అను నర్థమును దెలు పును. కనుక ప్రబంధపరమేశ్వరుఁ డయిన తర్వాత నారణ్యపర్వశేషమును రచించె ననుట స్పష్టము.

హరివంశ రచనా విధానమునుఁ గాంచి, పండితులాతనిని ప్రబంధ పరమేశ్వ రుఁడని యుందురు. అట్టి – స్తుతిఁగన్న ఎఱ్ఱయకు తన కవిత్వముపై విశ్వాసమేర్పడి యుండును. "నన్నయ భట్ట తిక్కకవినాథుల" యందలి భక్తి పెంపున నారణ్యపర్వ శేషరచన చేసియుండును. అందును 'తద్రచనయకా' నని నన్నయ పేరిటనే, నన్నయ శైలిలోనే రచించునంతటి ధైర్యము కలుగవలయు ననిన ఏదోయొక శక్తి యతనిని ప్రేరేపింపవలయును. పండితు లితని హరివంశమును పఠించి "నీవు సామాన్యుఁడవుకావు. నీ కవిత యం దసాధారణ ప్రతిభ గోచరించుచున్నది. నీవు ప్రబంధ పరమేశ్వరుఁడవు. వస్తువును కూర్చుటలోను, ఔచితిని నిర్వహించుటలోను, పాత్రలను పోషించుటలోను, హరివంశమున నద్వితీయముగ నైపుణ్యము చూపితివి. నిజముగ నీవు ప్రబంధముల రచించుటలో పరమేశ్వరుడవే" యని ప్రోత్సహించి యుందురు. ఈ ప్రోత్సాహముచే ప్రేరకశక్తి లభించి, యాతడరణ్యపర్వ రచనకు పూనుకొని యుండును. కనుక మొట్టమొదటిసారిగా నీ – "ప్రబంధ పరమేశ్వర" పదమును నృసింహ పురాణములోనే తనకు తానుగా చెప్పుకొనె . కనుక –శ్రీపాటి బండ మాధవశర్మగారు చెప్పినటుల –

"అది అరణ్యపర్వ రచన వలన లభించె ననుటయు సరికాదు. ఆయన కాలమునకు సన్నిహితోత్తర కాలమునందే యుండిన జక్కన "ఈత్రయిఁదా ప్రబంధ

పరమేశ్వరుఁడై విరచించె శబ్దవైచిత్రి నరణ్యపర్వ శేషము" అని ప్రబంధ పరమేశ్వరుఁడైన యనంతరమే అరణ్యపర్వ శేషము రచించెనని స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు."

కావున హరివంశ రచనచేతనే ప్రబంధపరమేశ్వరుఁడాయెనని 'రామాయణము' లభింపనంతవఱకు నిశ్చయముగ చెప్పకొన వచ్చును.

అయినచో నృసింహ పురాణమున -

"ఉన్నత సంస్కృతాది చతురోక్తి పదంబులఁ గావ్యకర్తవై
యెన్నికమైఁ బ్రబంధ పరమేశుఁడనంగ నరణ్యపర్వ శే
షోన్నయ మంధ్రభాష సుజనోత్సవ మొప్పగఁ నిర్వహించితే
నన్నయభట్ట తిక్కకవినాథుల కెక్కిన భక్తి పెంపునన్"-

-అని తాత కలలోచెప్పిన పలుకులకు వివరణ యెట్లు ? అని యడుగవచ్చును.

ఇది ఎఱ్ఱయ స్వయముగా తన నృసింహ పురాణమున తన తాత పలికినట్లుగా చెప్పికొనినది

ఈ పద్యమున ఎఱ్ఱన పూర్వరచనల క్రమము ఛాయా మాత్రముగ ధ్వనించుచున్నది. కాని ప్రబంధ పరమేశ్వరత్వమునకు అరణ్యపర్వమే కారణమని విశదమగుటలేదు.

"ఉన్నత సంస్కృతాది చతురోక్తి పదంబులఁ గావ్యకర్తవై"-

-ఉన్నతమగు సంస్కృతము నందలి ఆదిది యగు చతురోక్తి పదంబులతోఁ గూడిన కావ్యమునకు కర్త - అనఁగా ఆదికావ్యమగు రామాయణమును రచించినవాఁడు. ఆ ఆదికావ్యము సంస్కృత భాషలో, చతురోక్తి పదములతోఁగూడి గొప్పదై వెలయుచుండినది. ఆయాది కావ్యమును రచించి కావ్యకర్తయైనాఁడు. అనంతరము "ఎన్నికమై ప్రబంధ పరమేశుఁడనంగన్" - 'ప్రబంధ పరమేశ్వరుఁడవు నీవు' అనునట్లుగ కావ్యకర్తయైనాఁడు. ఈ కావ్యము హరివంశము. మూడవది అరణ్యపర్వ శేషము. దీనిని నన్నయ తిక్కనల యందలి భక్తి పెంపున సుజనుల కుత్సవమగునట్లుగ ఆంధ్ర భాషయందు నిర్వహించినాఁడు.

మొదటి రచనచేత – కావ్యకర్త యనిపించుకొనినాఁడు.

రెండవ రచనచేత – ప్రబంధ పరమేశ్వరుఁడయినాఁడు.

మూడవ రచనచేత – సుజనుల కుత్సవము నాపాదించినాఁడు.

ఇట్లీ పద్యమున తన పూర్వ రచనల నన్నింటిని తాత ముఖమున ధ్వనింపఁ జేసినాఁడు. అంతియే.

ఇచ్చట – మూఁడవ రచనయగు ఆరణ్యపర్వమును సుజనోత్సవ మగునట్లుగ నిర్వహించినాఁడఁట ! రచింపలేదు. ఆంధ్రీకరింపలేదు నిర్వహించినాఁడఁట ! ఈ 'నిర్వహించితి' వనుటలో నెంతటి గురుతర కార్యము చేపట్టెనో విదితమగును. ఈ నిర్వహణకు పూర్వము తగినంత ఆత్మవిశ్వాసము కావలయును. అట్టి యాత్మ విశ్వాసమునుఁ జేకూర్చినదే యాతని ప్రబంధ పరమేశ్వరత్వము. "ప్రబంధపరమేశ్వర" బిరుదమాతనికి హరివంశరచన చేతనే లభించినది.

అదియునుఁగాక – ఎఱ్ఱయ భారతారణ్యపర్వశేషమును 'తద్రచనయకా' నని– నన్నయ రచనే యని యాతని పేరనే రచించినాఁడు. తన అస్తిత్వమునే వదలు కొనినాడు. కనుక సాధ్యమైనంతవఱకు నన్నయశైలినే యనుకరించి యుండును. నన్నయ భావములనుఁ గూడ 'అతుకు తేలియకుండ పూరించుటకై, గ్రహించి యుండును. కనుక నన్నయ ననుకరించిన దెంతవఱకో, ఎఱ్ఱన భావము నెంతవఱకో, ఆరణ్యపర్వశేషమున నిర్ణయింపఁజాలము, ఇట్లు అస్తిత్వమునే 'ఇదమిత్థ' మని నిరూపింపలేని యారణ్యపర్వశేషరచనచేత నాతనికిఁ ప్రబంధపరమేశ్వర బిరుదము లభించిన దనుట విశ్వసింపఁ జాలని వాదము. కనుక, హరివంశరచన చేతనే ఎఱ్ఱయ ప్రబంధపరమేశ్వరుఁడైనాఁడు.

హరివంశ మొక శేషపూరణము కాదు. శిథిల పూరణము కాదు, సంపూర్ణ గ్రంథము ఎఱ్ఱయ తనపేరిటనే వెలయించిన గ్రంథము, స్వేచ్ఛానువాదము. మూల మును యథేచ్ఛగా మార్చిన గ్రంథము. మూలమున లేని వర్ణనలను కూర్చిన గ్రంథము. ఇందు ఎఱ్ఱయ యథేచ్ఛగా ఔచిత్యమును గుర్తించుచు వివరించినాఁడు – సంక్షేపించి నాఁడు. అన్నియు ఔచితీ నిర్వహణకై ఎఱ్ఱయ పేరిటనే జరిగినవి, కనుక ఇందా తని ప్రబంధ పరమేశ్వరత్వమును పొందితీ మందితులు, కవితల్లజులు పరిశీలించి యుండవచ్చును. ఆతని వర్ణనా పైదగ్ధి కలరి "ప్రబంధపరమేశ్వరా" యని శ్లాఘించి యుండవచ్చును. కనుక హరివంశరచనయే ఎఱ్ఱయను ప్రబంధపరమేశ్వరునిఁ గావించినది.

ఈ హరివంశమున ఇతివృత్తమును వర్ణనలతో అలరించినాఁడు. పాత్రల స్వరూపములను వర్ణనలతో నలంకరించినాఁడు. పాత్రల మానసిక క్షోభను వర్ణనా పరంపరలతో మూలమును కాదని ముంచివైచెను కనుకనే ఎఱ్ఱయ ప్రబంధరచనకు పరమేశ్వరునివంటి వాఁడైనాఁడు ఈ సమస్త విషయములు ముందు ముందు వర్ణింపఁబడును. కనుక ఎన్ని విధముల గమనించినను ఎఱ్ఱయకు హరివంశ రచన చేతనే ప్రబంధ పరమేశ్వరత్వము లభించినదని తెల్లమగును.

ప్రబంధములు వర్ణనా వైచిత్రిని చూపుటయే ప్రధాన లక్ష్యముగాఁగలవి.

నిడదవోలు వేంకటరావుగారి నన్నెచోడుని కుమార సంభవ పీఠికను పరిశీలించినచో - ప్రబంధమనఁగా

"పురాణముల నుండి ఇతివృత్తములను గ్రహించి నవరసములతోడను అష్టాదశ వర్ణనలతోడను నలంకార బంధురమగు నుత్తమ కావ్యమును రచించుట, కృతిని కాంతాసమ్మితముగా నొనరించుట" యని నిర్వచింపఁబడినది.

శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారి కవుల చరిత్రము [భాగము - I - పీఠిక పుట xii - భాగము - 2 పీఠిక పుటలు 33, 34.]

ప్రబంధమును - "పురాణముల నుండి కథను గైకొని స్వకపోల కల్పనలను విశేషముగాఁ జేర్చి పెంచి చెప్పిన కేవలాంధ్రీకరణలు కాని రచనలు ప్రబంధము"లని నిర్వచించినాఁడు.

కనుక - అట్లు చూచినపుడును -

ఎఱ్ఱయ హరివంశము ప్రబంధమే!

ఇందలి ఇతివృత్తమును పురాణము నందలిదే! నవరసములు కాకపోయినను, శృంగార వీరాది రసము సందర్భానుసారముగ పోషింపబడినవి. అష్టాదశ వర్ణనలతో నొప్పు గ్రంథరాజమిది. ఇందు ఎఱ్ఱయ స్వకపోల కల్పనలను విశేషముగాఁ జేర్చి పెంచి చెప్పినాఁడు. వీనిని ముమ్ముందు వివరింతును.

కనుక ఎఱ్ఱయ హరివంశము నీ నిర్వచనములతో పరీక్షించినను ప్రబంధముగనే స్పష్టమగుచున్నది. ఇది కేవలాంధ్రీకరణమగు పురాణము కాదు. ఇదిగాక, ఆనాఁడు ప్రబంధకావ్య సామాన్యవాచి. హరివంశము కావ్యలక్షణములు కలిగి యున్నది.

పదునాఱవ శతాబ్దమునందలి ప్రబంధములకుఁ గల ప్రత్యేకార్థము - ఎఱ్ఱయ నాఁటికి లేదు - కావ్యములు ప్రబంధములే! ప్రబంధమునకు జీవప్రాయములగు వర్ణనలే హరివంశము ప్రబంధ మగుటకు ప్రాణములు. ఆ వర్ణనాత్మకతకు మార్గదర్శి ఎఱ్ఱయ. కనుక ఇతఁడు ప్రబంధ పరమేశ్వరుఁడు.

---

# 5. ఎఱ్ఱన - వర్ణనాత్మకత

ప్రకృతి చిత్రణ :- ఆంధ్రవాఙ్మయమున విభిన్నకవితారీతులలో తమ ప్రతిభను వెలయించిన త్రిమూర్తులు - నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రెగ్గడలు.

నన్నయ :- ఇతఁడు ప్రసన్నకథా కలితార్థయుక్తికిఁ బెట్టినది పేరు.

తిక్కన:- పాత్ర చిత్తవృత్తుల వర్ణనతోఁ గూడిన నాటకీయ శిల్పమునకు మూలపురుషుఁడు.

ఎఱ్ఱయ :- వర్ణనాత్మక శైలికి ఆద్యబ్రహ్మ.

కథతోపాటు వివిధ సన్నివేశములలోని సౌందర్యము ద్యోతక మగునట్లు వ్రాయుట వర్ణనాత్మకత.

కవి ప్రతిభకు ఆలవాలమైన కల్పితాంశములు గాని, వర్ణనాంశములుగాని, విస్తారముగా నుండవలయును. దానిని చెప్పుటలో కవి తనదైన శైలిని స్థాపించు కొనవలయును. ఇట్టి శైలిలో నొక ప్రత్యేకస్థానము నాక్రమించినవాఁడు ఎఱ్ఱయ.

ఇతివృత్తమును వర్ణనలచే సలంకరించుట అను నూత్నపద్ధతిని ప్రవేశపెట్టిన వాఁడు ఎఱ్ఱయ.

"లోకోత్తర వర్ణనా నిపుణమగు కవి కర్మ కావ్యము"

"నహి కవేరితి వృత్తమాత్ర నిర్వహేన ఆత్మపదలాభః, ఇతి హాసాదేవత తత్సిద్ధేః" అని ధ్వన్యాలోక కర్తయొక్క వాక్యము.

కేవలము ఇతివృత్తమును నిర్వహించుట కవి కర్మకాఁజాలదు. ఈ ఇతి వృత్తమును మాత్రము వర్ణించుట - ఇతిహాసమే చేయుచున్నది. కాని వర్ణన లోకోత్తరమై యుండవలయును. కావున వర్ణనలు లోకోత్తరములైనవుడే అది కావ్య మనుట స్పష్టము.

ఈ వర్ణనలు – వస్తువర్ణన మని, రూపచిత్రణమని భావచిత్రణమని మూఁడు విధములు.

రమణీయములైన సూర్యచంద్రాది ప్రకృతిలోని గ్రహములు, పర్వత నదీనద నిర్ఝరముల దృశ్యములు, పాత్రలు వర్తింపు రంగస్థలాది సన్నివేశములు – వస్తువర్ణన అగును.

మఱి - ఆ రంగమున ప్రవేశించు పాత్రల రూపురేఖలను, మనోభావముల ననుసరించిన చలద్వర్ణనలను చిత్రించుట - రూపవర్ణన యగును.

అలంకార శాస్త్రమున - మొదటిదానిని ఉద్దీపన విభావమని, రెండవదానిని ఆలంబనవిభావమని నిర్ణయించిరి.

విభిన్న స్థితులందు - పాత్రల మనోభావములను చిత్రించుట - భావచిత్రణ మగును.

ఇందులో మూఁడవది కవియొక్క ఆంతరంగిక జగద్దర్శనా నిపుణతకు పరీక్షా స్థానము.

ఆయా సన్నివేశము లందు - ప్రకృతిని పాత్రల మనోభావములకు దర్పణ ముగ చిత్రించుట ప్రకృతి చిత్రణము.

మూర్తి వర్ణనలు, భావవర్ణనలు - పరస్పరపోషకములై యున్నచో రసోదయము నకు పోషకములగును.

ఇట్లు ప్రకృతి వర్ణన, మూర్తి వర్ణన, భావవర్ణనకు పోషకములై రసోదయమున కుపస్కారక మైనవుడే, ఆ రసము సన్నివేశానుగుణముగ పుష్టిచెందినపుడే ఆ కావ్యము ఉత్తమకావ్య మనఁబడును.

వర్ణనాత్మకమైన రచనలో - చిన్నకథాంశమైనను, పాత్రల వివిధభావచాలన వ్యక్తీకరణము వలన విపుల మగును.

పాత్రచిత్రణమునకు, రసపోషణమునకు వర్ణనయే హేతు వగుచున్నది. బాహ్యేంద్రియములకు గోచరించునది మాయాచ్ఛన్నప్రకృతి, ఆ ప్రకృతి యందలి సత్యస్వరూపమును ప్రత్యక్షీకరింపఁజేయు భావములు ఉదాత్తములు.

స్థూల, సూక్ష్మ విభాగముచే ప్రకృతి ద్వివిధము. బాహ్యప్రకృతి - అంతర ప్రకృతి - ఈ బాహ్యాంతర ప్రకృతుల కైక్యము సిద్ధింపఁజేసినవాఁడే మహాకవి. దృశ్యమానమగు జడప్రకృతికి, తదంతరితుఁడగు పరమాత్మకును అభేదమును సాధింపఁగలవాఁడే ఋషితుల్యుఁడగు కవి. వేదాంతికి జ్ఞానమయమైన బ్రహ్మము కవికి రసమయము. రసమయముఁగా ధ్యానించి, తాను రససిద్ధుఁడై కవి పరబ్రహ్మ సాక్షాత్కారమును పొందును. అట్టి కవి దృష్టిలో చేతనా చేతన భేదమునకు తావు

లేదు. బ్రహ్మ పదార్థమునుండి ప్రభవించినది ఈ చరాచర సృష్టి. ఈ సృష్టికి ప్రతి సృష్టి గావించిన కవి కర్మయే కావ్యము. ప్రకృతి పరమార్థమునకు దర్పణమగు ప్రతి సృష్టి కావ్యము. ప్రకృతి దర్శనములో అనుభూతి స్పందనయే కవిత్వము

కావ్యమునకు వస్తువునందిచునది ప్రకృతి. కావ్య రసపోషణమున కుద్దీపనము కలిగించునది ప్రకృతి. ప్రకృతియే కావ్యసుందరికి, వస్తు పాత్రరసపోషకమై జీవాధారమై యొప్పారినది. ఈ ప్రకృతికి భాష్యప్రణేత కవి. చెట్లు, చేమలు, కొండలు గుట్టలు, వంకలు వాగులు, సూర్యుడు చంద్రుడు, అగ్ని వాయువులు, -ఇది యది యననేల ? - ఈ దృశ్యమానమగు జగత్తంతయు ప్రకృతి స్వరూపమే.

ఆకసమున మేఘ గర్జనమును విని పురివిప్పి నాట్యమాడు నెమలిని గాంచినపుడు, కవి హృదయమున భావనా తరంగములు నాట్యమాడును. మావి చిగుళ్ళను తిని మత్తెక్కి 'కుహూ' రావముఁ గావించు కోయిల గానమును విన్నప్పుడు కవి హృదయము నాదబ్రహ్మమున పరవశించును. సస్యశ్యామలములగు తృణ వితానముల గాంచినపుడు కవి శరీరము పులకించును.

భావమును స్పందింపఁజేయునది ప్రకృతి. ఈ సమస్త సృష్టియును భావనా వ్యాపారమునకు విషయమైనదే ! ఇట్లు కవికిఁ కలిగిన అనుభూతి స్పందనమే కవితా రూపమున జాలువాఱు చున్నది ఈ కావ్యసృష్టికి మూలాధారమే ప్రకృతి.

అలనాఁడు ప్రకృతియందలి చైతన్యతత్త్వమగు క్రౌంచమిథునమునందలి మగ పక్షిని బోయచంపఁగా కరుణా కూజితమైనట్టి స్త్రీపక్షి ఆక్రందనమునకు హృదయము ద్రవించి, శోకము స్రవించి. ఆదికవి నోటనుండి శ్లోకమై జాలువాఱినది.

అదే ఆదికావ్యమునకు నాంది.

"మానిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీస్సమాః
యత్క్రౌంచ మిథునాదేక మవధీః కామమోహితమ్"

అని య్యాక్రోశించినాఁడు వాల్మీకి.

ఈ కరుణరస పూరిత భావప్రవాహమే ఆదికవి రామాయణ మహాకావ్యమునకు నాందియై వెలసినది.

కవి యొకప్పుడు ప్రకృతితో పాత్రల తాదాత్మ్యము నొందించును. మఱొకప్పుడు పాత్రలయెడ ప్రకృతికి సానుభూతిని కలిగించును. ఇంకొకయెడ - పాత్రల

ధైర్యోత్సాహములకు ప్రకృతిని దోహదకారిగా చిత్రించును. మఱొక్కతటి ప్రకృతితో భావికథా సూచన చేయించును. కథాగమనమునకు సహాయకారిగా చిత్రించును ఇట్లు ప్రకృతిని కథానాయకుని చుట్టును త్రిప్పి కథ సుస్మిలితము గావించుచు రస పోషణకై పాటుపడును.

ఎఱ్ఱయ హరివంశమున ప్రకృతి ఈ పైచెప్పిన అన్నిరీతులలోను కావ్యశిల్ప మునకు పుష్టినందించినది. అందులకే ఎఱ్ఱన 'వర్ణనా వైచిత్రి' కాద్యుఁడై వెలసి నాఁడు తనదైన ఒక విశిష్టశైలిని స్థాపించుకొన్నాఁడు.

ప్రకృతి వర్ణనలో ఋతువర్ణనయు నంతర్భాగమే. ఏయే ఋతువుల నే రీతిఁగా ఎఱ్ఱయ వర్ణించెనో అదియును పరిశీలింప వలయును. మూలములోని వర్ణనకును ఈ వర్ణనకును గల భేదసాదృశ్యముల నరయవలయును. అందులకై ఆ ప్రకృతి ఇతని కావ్యమున ఏయే రీతుల నర్తించినదో యిందు పరిశీలింతును.

మూలముతో పోల్చిచూచినపుడే ఎఱ్ఱయ ప్రత్యేకతను గుర్తింప వీలగును. లేనిచో ఇందాపాదించిన విశిష్టత యంతయు మూలకారునిదే యను భావము కలుగును

ఎఱ్ఱయ జడప్రకృతిని చైతన్య తత్త్వమునకు ఉద్దీప్తి హేతువుగా నుపయో గించు కొనినాఁడు.

వస్తువర్ణన :- యోగ నిద్రానంతరను ఆదిపురుషుఁడు పృథ్వీప్రార్థన నాలించి భూభారమును తగ్గించుటకై దేవకీ గర్భమున జనింప నిశ్చయించినాఁడు దేవకీ వసుదేవులు కంసునిచే బంధితులై కారాగారమున వసించుచున్నారు. ఆ సమయమున యోగీశ్వరేశ్వరుఁడు దుష్ట శిక్షణకై భువిపై అవతరించినాఁడు.

ఆ సుసమ రుము నందు - (హ. వ. I - 5-117)

"ఆ దేవు దివ్యావతారంబున సకల చరాచరంబులుం బ్రమోద భరంబునొందె మందసమీరుండు సమీరిత సౌరభ సుఖస్పర్శుండై చరించెఁ దానసాగ్నిహోత్రంబులు ప్రదక్షిణ జ్వాలాజాలంబులై వర్తిల్లె. సాగరంబులు సమ్మద సంభ్రమంబులంబొదలె. దిశలు ప్రకాశంబు లయ్యెనంబర చరంబులగు తేజంబులు తేజోతిశయంబున మెఱసె నంతర్థాన గతులై యాదిత్యులు మోదంబునఁ గుసుమ వర్షంబులు గురియించుచు ననేక వాక్యంబుల నమ్మహా ప్రభావుం బ్రస్తుతించిరి. దివ్యంబులగు వాదిత్రంబులు ప్రదీప్త ధ్వనులం జెలంగె. గంధర్వ గానంబులు నప్సరో నర్తనంబులుం బ్రవర్తిల్లెఁ బాతాళ వాసులగు వాసుకి ప్రముఖు లుల్లాస భాసితులైరి.

ఇట్లు ఎఱ్ఱయ హరివంశమున సకలచరాచరలజులు అవతారపురుషుని అవతరణ సమయమున పరిపరివిధముల తమతమ హర్షములను ప్రకటించుచు ఆనందముచే చిందులు త్రొక్కినాట్యమొనర్చుచున్నవి.

మూలమున కృష్ణజనన సందర్భము నందలి వర్ణన :-

"సాగరాః సమకంపంత చేలుశ్చ ధరణీ ధరాః
జజ్వలుశ్చాగ్నయ శ్శాంతా జాయమానే జనార్దనే
శివాశ్చ ప్రవవుర్వాతా ప్రశాంత మభవద్రజః
జ్యోతీంష్యతి వ్యకాశంత జాయమానే జనార్దనే
అభిజిన్నామ నక్షత్రం జయంతీ నామ శర్వరీ
ముహూర్తో విజయోనామ యత్రజాతో జనార్దనః
అవ్యక్తశ్శాశ్వత స్సూక్ష్మో హరిర్నారాయణః ప్రభుః
జాయమానోహి భగవాన్నయనై ర్మోహయత్ప్రభుః
అనాహతా దుందుభయో దేవానాం ప్రణదన్దివి
ఆకాశాత్ పుష్పవృష్టించ వవర్ష త్రిదశేశ్వరః
గీర్భిర్మంగళ యుక్తాభిః స్తువంతో మధుసూదనమ్
మహర్షయ స్సగంధర్వా ఉపతస్థు స్సహాస్సరాః
జాయమానే హృషీకేశే ప్రహృష్ట మభవజ్జగత్
ఇంద్రశ్చత్రిదశై స్సార్ధం తుష్టావ మధుసూదనమ్"

హ. విష్ణు. 4-15 నుండి 4-21

'సాగరాః సమకంపత' - అను దానికి "సాగరంబులు సమ్మద సంభ్రమంబులం బొదలే" - అని నవరించినాఁడెఱ్ఱయ. "చేలుశ్చ ధరణీధరాః" అను దానికి అనువాదమేలేదు. "అభిజిన్నామ" - "అవ్యక్త శ్శాశ్వతః" అను శ్లోకములను పూర్తిగా వదలివేసినాఁడు. ఇది ఆనందసమయము. ధరణీధరములు కంపించుట సాగరములు చలించుట వంటివి భయోత్పాతములు కలిగించు నట్టివిగా రూఢికెక్కినవి. పాఠకులు కిట్టి ద్వంద్వభావము — ఆనందమా లేక భయమా ? అను నట్టి భావము రాకుండుటకై ఎఱ్ఱయ వాని ననువదించలేదు ఇట్టి ప్రకృతి వర్ణన సందర్భమున ఎఱ్ఱయ తీసికొనిన జాగ్రత్తను గమనింపవచ్చును.

క్రమముగా నందునింట బాలగోపాలుఁడు పెరుగుచున్నాఁడు. స్తన్యమొసంగిన పూతన చనుబాలతో పాటు ప్రాణములను చూఱగొనినాఁడు. శకటాసురుని ఖండించెను. గోపబాలురతో, గోపికలతో నాడుచు పాడుచు, దుండగంబులఁ గావించుచు పెరుగుచున్నాఁడు. కాళియ మర్దనము గావించినాడు.

గ్రీష్మర్తు వర్ణనము :-

శా॥ వాసంతీ కుసుమావతంసకము లుద్భాసించి గోపాంగనల్
శ్రీ సంపన్నములైన పాటలములన్నీమస్త సీమన్నలిం
కైసేయందగి ఫుల్లమల్లికలికా గర్వాంధమై పర్వె స
ర్వాసహోద్ధతి యయ్యె ఘర్మసమయంబారంభ సంసేవ్యమై
(హ. వ. I - 6-32)

కం॥ మడుపుల నీరింకించుచు
నడపడఁజేయుచుఁ బ్రవాహమెట్టిదియైనన్
వడయెయ్యనఁ జేర్చుచును
గ్గడు వర్యె నిదాఘు బలము క్రమయోగమునన్
(I - 6-33)

మ॥ హరియంభోనిధి సొచ్చె శంభుఁడు తుషారాద్రీంద్రముం బ్రాకె వా
గ్వరుఁడుద్యన్మకరంద దుర్దిన సమగ్రంబైన యుత్ఫుల్ల పం
కరుహంబున్ భజియించె దీనిమును గల్గంగాంచియే కాక యె
వ్వరి నిండ్రేల సహించు గ్రీష్మమనఁగా వర్షిల్లె తాపోద్ధతుల్"
(I - 6-34)

ఆరంభమునందు గ్రీష్మమున సంసేవ్యమానమై యొప్పారినది. గ్రీష్మర్తు ప్రారంభమున - వాసంతీ కుసుమములు విరళముగా వికసించును. పాటల పుష్పములు విరివిగా పూయును. మల్లికలును పూయఁ బొడంగును

పాటల పుష్పములు గ్రీష్మమున పుష్పించును. మల్లికలు సగర్వముగా వికసించును. గోపస్త్రీలు వాసంతీ కుసుమముల నుద్భాసించి, పాటల పుష్పములతో సీమస్తముల కైసేసి కొనిరి. ఇట్లు ఆరంభమున సహ్యలకును సంసేవ్యమై క్రమక్రమముగా ఔద్ధత్యముచే అసహ్యమైనది గ్రీష్మము. ఎఱ్ఱయ నిదాఘసమయ సహజములగు మల్లికాది పుష్పవికాసమును వర్ణించినాఁడు.

గ్రీష్మకాలమున - మడువులలో నీరింకుట, ఎట్టి ప్రవాహమైనను ఎడపడ నీరు కన్పించుట, వడ అధికమగుట - అత్యంత సహజము. ఇట్లు గ్రీష్మఋతువు నతి సహజముగా వర్ణించుచు, బ్రహ్మ విష్ణుమహేశులను సైతమీ గ్రీష్మతాపమునకు పలాయితులఁ జేసినాఁడు ఎఱ్ఱయ.

హరి సాక్షాద్విష్ణువు - తాపత్రయమును హరింపఁ జేయువాఁడు. అతఁడు సైతమీ గ్రీష్మతాపమును తాళఁజాలక అంభోనిధినిఁ జొచ్చినాఁడఁట! శంకరుఁడు సర్వులకు మంగళమును, సౌఖ్యమును కలుగఁజేయువాఁడు. ఇతఁడు సైతము గ్రీష్మమున సౌఖ్యమును పొందలేక తుషారాద్రిపై కెగఁబ్రాకినాఁడట! వాగీశుఁడు మకరంద భూయిష్ఠమగు పంకేరుహముపై చేరినాఁడు. త్రిమూర్తులే తాపమునకు తాళఁజాలక చెదరిపోయిరనిన నింక సామాన్యులకు సాధ్యమా?

ఇచట - సముద్రము నందలి ఆదిశేషునిపై శయనించుట, తుషారాద్రీంద్రమున నివసించుట, పంకేరుహముపై నుండుట - ఇది త్రిమూర్తుల సహజావాసము. దీనిని గ్రహించి గ్రీష్మతాపమును తాళఁజాలకయే యని హేతువు కాని దానిని హేతువుగా కల్పించి, యుత్ప్రేక్షించి, గ్రీష్మమును వర్ణించి, అంతటివారే తాళలేరనిన సామాన్యులకు సాధ్యమా యని కావ్యారాపత్తిలోనికి మార్చి, తన ఆలంకారికశైలిని ప్రదర్శించినాఁడు ఎఱ్ఱయ. అంతటితో ఆగిపోలేదు.

సీ॥ వనధు లెల్లనుఁ గ్రోలి తనియక పెనుపొంది
బడబాగ్ని యంతటఁ బ్రబ్బెనొక్కొ
యాగంగఁ గోలఁదిఁగా కథవుండు గ్రక్కునఁ
గ్రమ్మఱ గరళాగ్ని కడఁగె నొక్కొ
నీరజాసను నోరు నిండక మున్న క
ల్పాంతాగ్ని దమకించి యడరె నొక్కొ
సకల తత్త్వంబుల సమయించి ఘోరాగ్ని
తత్త్వ మొక్కటియకాఁ దలఁచె నొక్కొ
(హ. వం. I - 6-35)

తే॥ గీ॥ యగ్నియును మారుతంబు ననాదియైన
మైత్రి నేఁడకాఁ జూపంగ మసఁగె నొక్కొ
కాక యిట్టి వేసవి యెండుఁ గలదె యనుచు
జనులు బెగడొంద గాడ్పుతోఁ జఱచె నెండ

మ॥ తమలో రాయిడి గొన్న యున్నతుల సద్వంశంబులున్ రూపఱున్
సమయించుం దవమ యాశ్రితావళిని నెన్నంగా నిజంబిట్టి భా
వము సూడుండనునట్లు వేసవి మహావంశాటవుల్ రాసి ద
గ్ధము లయ్యెన్నికట ద్రుమావళులతోఁ గ్రందంగ దావాగ్నులన్
(I-6-36)

క॥ తరులెల్లఁ గ్రల్లవడఁగా
విరళములై పీధులున్న విధమొప్పెనహా
స్ఫార రుచులతోడఁ దలపడి
యడుమఁగఁ పోరాడి తుమురులై పడిక్రియన్" (I-6-37)

బడబాగ్ని సమస్తసముద్రమును క్రోలినది. అయినను తృప్తికాలేదు. ఇంకను వ్యాపించుచున్నదేమో యనునట్లే గ్రీష్మతాపము వ్యాపింపఁజొచ్చినది. అలనాఁడు క్షీరసాగరమథన సమయమునందు అభవుఁడు గరళమును మ్రింగెను. అద్దానిని సహింప శక్యముగాక వెలికిఁ గక్కఁగా, ఆగరళాగ్నియే తిరిగి వ్యాపించినేమో యనునట్లున్నది.

పంచ భూతములలో - అగ్నితత్త్వమొక్కటి. ఆ తత్త్వముల నన్నిఁటిని, పృథివ్యప్ వాయ్వాకాశ తత్త్వముల నణచి కేవల మగ్నితత్త్వమొక్కటే వ్యాపింపఁ దలచెనేమో ! అనునట్లు తేజస్తత్త్వము మిక్కిలి తీవ్రముఁగా వ్యాపింపఁగడంగినది. లేక - అగ్నియు, మారుతము అనాదియగు తమమైత్రిని ప్రదర్శింపఁదలఁచినవో యనునట్లు వేడిగాడ్పులతో వేసవి వ్యాపింపఁజొచ్చినది. ఇట్లు ఎఱ్ఱయ గ్రీష్మతాపమును బడబాగ్ని జ్వాలలుఁగా శంభుని గరళాగ్నిఁగా, నీరజాసను నోరునిండక మునుపే వ్యాపించిన కల్పాంతాగ్నిగా సకలతత్త్వంబుల నణచి విజృంభించిన ఘోరాగ్నితత్త్వ వ్యాప్తిఁగా నుత్ప్రేక్షించి, తన భావనావైశద్యమును విస్తరించినాఁడు.

వేసవికాలమున దవాగ్ని ఇట్లు ఘోషించుచున్నదఁట ! తమతో సంఘర్షణ పొందినవారెంతటి యున్నత వంశము వారైనను వారిట్లే నశింతురు, అనునట్లు ఆ దావాగ్నియందు పరస్పరము ఘర్షణపడి వంశములు వెదుళ్ళు దగ్ధములైపోయినవి. వానినాశ్రయించి సమీపమునందున్న వృక్షములు గూడ ఆదావాగ్నుల బాఁబడి వెదుళ్ళ ఘర్షణలో దగ్ధములైనవి. ఇచ్చట ఉన్నతవంశము, అనఁగా ఎత్తైన వెదురు

చెట్లు, గొప్పవంశస్థులు అని రెండర్థములు ఇచ్చట దావాగ్నియందు ఘర్షణనొంది నశించిన వంశవృక్షముల చూపుచు – ఎఱ్ఱయ యొక ప్రకృతి సత్యము న తెలియఁ జేయుచున్నాఁడు.

రెండు బలమైన పక్షములు ఘర్షణ పొందినపుడు – బలిష్ఠులగు నాయకులతో పాటు వారి నాశ్రయించుకొనిన నిర్బలమగు వారి దళము గూడ నాశము నొందును గదా ! ఆ సత్యమునే ఈ వంశవృక్షములు ప్రకటించుచున్నవఁట।

వేసవికాలమందు ఎత్తుగా పెరిగిపోయిన వెదురు చెట్లు పరస్పరము రాయిడి పొందఁగా దవాగ్నులు పుట్టుచున్నవి. ఆ యగ్నిలో వెదురుచెట్లు కాలిబూడిద యగును. వానితోపాటు, వాని సమీపము నందలి వృక్షములు గూడ నశించుపోవును. ఇది సహజము. ఈ సహజకార్యముచే – ఎఱ్ఱయ ఒక సత్యము చెప్పించినాఁడు.

వేసవి అత్యధికముఁగా నున్నపుడు వృక్షములన్నియును ఎండి, ఆకులు ఎండి, మోడులై పీధులన్నియును వెలవెల బోవుచుండును. అవి ఎట్లున్నదన – సూర్య రశ్ములతోఁబోరాడి తుమురులై పడిపోయినవోయను నట్లున్నవఁట।

ఇది ఎఱ్ఱయ ఊహ. అట్లే గ్రీష్మమునందు –

మ॥ జ్వలితారణ్యక ధూమముల్ శిఖిశిఖాసక్తిం దటిల్లీలతో
గలయ గ్రమ్మ ఘనాళిభంగి నెసగంగా నెండమావుల్ దిశా
వలయాపూర జలంబులం దొరయఁగా వర్షాగమస్ఫూర్తియై
వెలసెన్ గ్రీష్మము తీవ్రతాపము కడున్ భిన్న ప్రకారంబుఁగాన్
(హ. వం. I – 6–88)

ఒక ఋతువును విరుద్ధ స్వభావముగల మఱియొక ఋతువుతో పోల్చివర్ణించుట భావుకతయొక్క పరమావధి.

తే॥ గీ పక్వఫలముల ఁ గ్రాలు కింపాకలతల
బెరసి వేసవి చేవది తరువులెల్ల
దావదహన సంయుక్తికి ఁ దప్పె నవియు
నలఁగి దావాగ్ని నొదవిన యట్లనుండె.

శా॥ గోపూర్ణస్తనదుగ్ధపాన విధులున్ గోవర్ధనాంతర్ఝరీ
వ్యాపారంబులు గోపతిప్రియసుతావాః కేళిలీలాస్ఫుర
ద్గోపీ ముగ్ధకుచోపగూహనములు న్గోవిందసాంగత్యముల్
గోపశ్రేణికిఁ బాపెఁ దాపభయము న్ఘోరంపుఘర్మంబునన్.
హ. వం. I - 6-40

అరణ్యధూమముతో జ్వలితాగ్ని జ్వాలలు కలిసి మెఱపుతీగెలతో కలసిన మేఘసముదాయమువలె నొప్పినవి. ఎండమావులు దిశావలయము నందలి ప్రవాహ జలముతో సమానముగ కనిపించినవి.

శిఖి శిఖలు మెఱపు తీగలవలెను, జ్వలితారణ్యక ధూమము మేఘము వలెను, ఎండమావులు ప్రవాహమువలెను కనిపించుట సహజమే. వీనినిట్లు పోల్చి ఎఱ్ఱన తన అలంకారిక శైలిని ప్రదర్శించినాఁడు.

పక్వఫలములతో నొప్పుచుండు కింపాకలతలతో కలసి, వేసవికాలమునకు వశమై, తరువులన్నియును దవాగ్నిలోపడి భస్మమైనవి. కనుక ఆ లతలును దుఃఖముతో దవాగ్నిచే వ్యాపించి నట్లుండినవి. పక్వఫలములతోఁ గూడిన కింపాక లతలు దవాగ్నితోఁ గూడినట్లుగా నుండినవఁట !

ఇంతటి భయానకమగు గ్రీష్మకాలమున గోప సముదాయమునకు తాప భయము బాసినది ఎట్లని ఆశ్చర్యము కలుగవచ్చును.

గోపూర్ణస్తన పాన ధులు, గోవర్ధనపర్వతాం తర్ఝరీ స్నానములు, గోపతి ప్రియసుతుఁడగు శ్రీకృష్ణునితో గూడిన జలకేళులు, గోపీముగ్ధకు చోపగూహనములు- గోవిందసాంగత్యము - ఇవన్నియు గోపశ్రేణికి తాపభయమును బాపినవి. గోవుల- దుగ్ధపానవిధులు - అనినందున అనేక రూపములలో నుండు దుగ్ధమును సేవించుట చేత తాపభరమును పోఁద్రోలుదురు. గోవర్ధన పర్వతఝరులయందు యథేచ్ఛగా తానమాడుదురు. నందగోపసుతునితో జలకేళిసలుపుదురు-గోపికల ఉపగూహనములు, గోవిందసాంగత్యము మానసిక తాపమును మాన్పునవి. జలకేళులు, దుగ్ధపానవిధులు శారీరకమైన తాపమును మాన్పునవి. ఇట్లు శారీరక మానసిక తాపమును గ్రీష్మము నందు పోగొట్టుకొనుచుందురని భావము, రాబోవు సందర్భమున కిది నాంది. గోవింద సాంగత్యముతోతమబాధలను పోఁగొట్టుకొని, యాత్మశాంతిని పొందఁగలరని సూచన.

కవి గ్రీష్మవర్ణనమున - కవి సమయముల నెంతయు పాటించుచు, ప్రకృతి సత్యములను తెలుపుచు, సహజచిత్రణను గావించుచు - గోవిందుని సాంగత్యముతో గోపగోపికలు - ఆత్మసౌఖ్యము నొందఁగలరని ధ్వనింపఁజేసినాఁడు. గ్రీష్మకాలము నందు - దూరమునందుండు ఎండమావులు ప్రవాహమువలె కన్పించుట సహజము. అగ్నిజ్వాలలు దూరమునుండి మెఱుపువలె ప్రకాశించుటయు కలదు గ్రీష్మతాప మున గిరిఝరీ ప్రవాహములందు, స్నానమొనర్చుచు, చల్లని పానీయములను (మజ్జిగ మొ॥నవి) సేవించుచు, జలకేళి సలుపుచు ప్రజలు దినమును గడపుటయు సహజము· వెదుళ్ళు పరస్పరము మర్దన నొందఁగా దవాగ్ని పుట్టుట, అందు పరిసర వృక్షములు పెటపెట ధ్వనులతోపడి నశించుట జరుగుచుండును. ఇంతటి సహజ వర్ణనలతోపాటు కొన్ని అతిశయోక్తులతో, ఉత్ప్రేక్షలతో గ్రీష్మర్తువును వర్ణించి, ఎఱ్ఱయ తన వర్ణనా వైదగ్ధిని చాటుకొనినాఁడు.

ఈ గ్రీష్మవర్ణన మూలమున లేనిది. ఎఱ్ఱయ కల్పనాజనితమైనది.

శ్రీకృష్ణుఁడు కపిత్థవృక్షమును నిర్మూలింపఁబోవుచున్నాఁడు. ఈ కపిత్థ వృక్షవర్ణనము ఎఱ్ఱయ ఇట్లు గావించినాఁడు.

ఆవృక్షమొక రాక్షసుఁడు-విరోచన తనయుఁడు. అందలి ఫలముల నాస్వాదించు చున్నగోవులు మరణించుచున్నవి. ఆ విషవృక్షగంధము వ్యాపించుటచే గోపాలురు నానావిధరోగ బాధలందు చున్నారు. ఆ వృక్షమును నిర్మూలించుటకై శ్రీకృష్ణుఁడు గోపాలసహితుఁడై యేగుచున్నాఁడు. అప్పటి ఆవృక్షస్వరూపము -.

సీ॥ పాతాళమున నున్న ఫణిరాజు కోఱల
　　　పసయెల్ల రూపమై యొసఁగె ననఁగఁ
గాలకూటానల గర్వంబు సర్వంబు
　　　ప్రచ్ఛన్న తనులీలఁ బ్రబలె ననఁగ
నరకాగ్ని శతముల పరుస దనం బంత
　　　యును నొక్కచోఁ గూడి తనరె ననఁగ
నాభిచారిక విధి యాభిజాత్యము సక
　　　లముఁ మూర్తి మంతమై యమరె ననఁగ

తే॥ గీ॥ నధిక వికృతమై యౌన్నత్య మంబరంబుఁ
దాఁకి క్రమాకుల నంతటఁ దాన కాన
రాఁ బ్రభూత విస్తారమై క్రాలు కపట
కటుకపిత్థ భూజాతంబుఁ గాంచె నతఁడు”

హ. వ. I -6-79

పాతాళము నేలు సర్పరాజు వాసుకి. ఆతని కోఱలయందలి సారమంతయు రూపము ధరించి ఈ వృక్షమైనదో యనునట్లున్నది. లేదా - కాలకూట విషాగ్ని గర్వమంతయు - మాఱువేసము ధరించి ఈ రూపము నందున్నట్లున్నది. అభి చారకవిధి - ఆభిజాత్యము మూర్తి మంతమైనట్లుండినది. నరకమునందలి శత సంఖ్యాకములగు అగ్నుల కాఠిన్యమంతయు నొక్కచోఁ గూడి ఈ వేషమున నొప్పి నదో యను నట్లున్నది.

ఇట్టి వృక్షముయొక్క దుష్ప్రభావమును తెలియఁజేయుటకై, సర్పరాజు కోఱల సారము, కాలకూట విషాగ్ని, శతసంఖ్యాక నరకాగ్ని తీక్ష్ణత, ఆభిచారికవిధి (పర హింసాప్రయోగవిధి) - వీని నన్నింటిని రూపొందించి వృక్షముఁ గావించి విషతీక్ష్ణ తను వ్యంగ్యమున తెలియఁజేయుచున్నాఁడు.

ఈ కపిత్థవృక్ష వర్ణనము మూలమున లేదు. ఇది భయోత్పాతమును కలిగించు భావ తీవ్రత ఎఱ్ఱయ సృష్టి.

ఇఁక వర్షాసమయ మాసన్నమైనది అప్పటి ఎఱ్ఱయ వర్ణన -

“విషవృక్షంబు జయించి తాపభరముల్వోఁ బాపి వ్రేపల్లె క
ల్మషము ల్మాన్చిన కృష్ణుతో తనకు సామ్యంబాసపడ్డట్లు దు
ర్మిషహ గ్రీష్మమడంచి విశ్వము నిరుద్వేగంబు గావించుచున్
సుషమంబయ్యె నభస్యమాసము పరిస్ఫూర్జద్ఘన శ్యామమై”

(హ. వం. I - 6-105)

శ్రీ కృష్ణుఁడు విషవృక్షము నిర్మూలించి వ్రేపల్లె ప్రజల తాపమును మాన్పి నాఁడు. అట్టి నాయకునితో సామ్యమును బొందుటకై యాసపడినదో యనునట్లుఁగ వర్షాకాల మేతెంచి దుస్సహమగు గ్రీష్మము నడంచివేసినది. విశ్వమును ఉద్వేగము నుండి శాంత పఱచినది. ఘనశ్యామమై ఘనావృతమై బహు రమ్యమై యొప్పినది.

ఇచట కావ్యనాయకుఁడు ఘనశ్యాముడు. వర్షర్తువును ఘనశ్యామమే. అతఁడు వ్రేపల్లె వాసుల విషవృష్టధ నడంచినాఁడు. ఇది సర్వులకు గ్రీష్మతాపము నడంచినది. ఇట్లు వర్షర్తువు - అప్పటి ప్రకృతి కథానాయకునితో సమాన విధిని నిర్వర్తించి సామ్యమునందుట కువ్విళులూరెనది. ఇది మూలమునలేని ఎఱ్ఱయ వర్ణన. ప్రకృతిని కథానాయకుని సమానవిధి నిర్వాహకులుఁగా చిత్రించినాఁడు.

ఆ వర్షాకాలమున -

ఉ॥ చాతక వంది బృందములు
సంస్తుతి సేయ విశాల బర్హిబ
ర్హాతప వారణంబు లల
రారఁగఁ బర్వత భద్ర పీఠముల్
ప్రీతి నుపాశ్రయించి జల
భృద్ధరణీ విభులాక్రమించి రు
ద్ద్యోతి సురేంద్ర చాప నవ
తోరణ శోభిత భూమి భాగముల్

(హ. వం. I - 6-106)

కం॥ రాయంచల గుండె బెదరు
మాయామంత్రము వియుక్త మానచ్యుతి క
ర్త్యాయత మయూర కర్ణ ర
సాయన మనఁ బ్రథమ జలధరారవ మొనఁగెన్

హ. వం. I-6-107

కం॥ దినపతియు నిశావిభుఁడును
దన తన నామము నిరర్థతం బొందిన సి
గ్గునఁ బొడసూపరో యనఁగా
దిన నిశలొక్కటిగ మేఘతిమిరమ యయ్యెన్

I-6-108

ఇచ్చట వర్షాకాలమున వారిధరములను ప్రభువులఁగావించినాఁడు - ఎఱ్ఱయ. ఈ ప్రభువులు పర్వతములనెడి భద్రపీఠము లందాసీనులైనారు. ఆ ప్రభువులకు వంది

మాగధులు చాతక పక్షులు, వారు స్తుతి చేయుచున్నారు. మయూరముల విశాల పింఛములు వింజామరలు. ఆమయూరములు తమపింఛాతప పదారణములతో ప్రభువును సేవింపఁజొచ్చినవి. ప్రకాశించు నింద్రధనుస్సులు నవతోరణములుగా నలంకృతములైనవి. అట్టి భూభాగమును ప్రభువు లాక్రమించినారు.

ఇచ్చట రూపకాలంకారముతో మేఘమును వర్షాకాలమునకు ప్రభువుగా నధిష్ఠింపఁజేసి యాప్రభువునకు పర్వతాగ్రమును భద్రపీఠము గావించి, చాతక పక్షులను వందిమాగధులనుజేసి, ఇంద్రధనుస్సును తోరణముగా కట్టి మయూరపింఛముల నాతపవారణములఁ గావించిన ఎఱ్ఱాయ సూక్ష్మపరిశీలనాశక్తి శ్లాఘనీయము. వర్షాకాలమున మేఘములకాధిపత్యముండుట సత్యమే।

వర్షాకాలమునందు మేఘములు పర్వతసానువుల నాక్రమించుట, చాతకములు కూయుచుండుట, ఇంద్రధనుస్సులు ప్రకాశించుట, మయూరములు పురివిప్పినాట్యమాడుట సహజములు. ఈ సహజ కార్యములను తన అలంకారికశైలిలో త్రిప్పి ప్రభువునకు సేవాకార్యముగా ఎఱ్ఱాయ వర్ణించినాఁడు. స్వభావోక్తులతో నిండిన రూపకాలంకార మిది.

దీనికి మూలమున -

"తతః ప్రావృడను ప్రాప్తా మనసః కామదీపినీ
ప్రవవర్షు ర్మహామేఘాత్మక్ర చాపాంకి తోదరాః" అని యున్నది

(హ. విష్ణు. 10-౭)

ఇచ్చట మనస్సున కామము నుద్దీపింపఁజేయు వర్షాకాలము సంప్రాప్తమైనది. మహామేఘములు వర్షించినవి. ఇవి ఇంద్రచాపములతో గర్భితమైన ఆకారము కలవి. మూలమునందలి "మనసః కామదీపినీ" యను దానికి ఎఱ్ఱాయ అనువాదము లేదు. మూలమున ఎఱ్ఱాయ అలంకారిక శోభలేదు

ప్రథమ జలధర గర్జనలు ప్రారంభమైనవి. ఆ గర్జనలను వినినంతనే రాయంచల గుండెలు బెదరినవి. ఇది ఖార్యాపియుక్త నాశమునకు మాయామంత్రము. మయూరములకు కర్ణరసాయనము. వర్షాకాలమున రాయంచలు మానస సరోవరము నందలి తమ ప్రియురాండ్రను తలంచుకొని బెదరుచున్నవి. భార్యాపియుక్తులు వియోగ బాధతో నశించిపోవుటకు ఆ గర్జనలు మాయామంత్రము లగుచున్నవి.

వర్షాకాలమున వియోగులు బాధ తాళఁజాలరని కవి సమయము. మయూరములకు వర్షాగమము ఆనందప్రదము గనుక ఆ మేఘగర్జనలు కర్ణరసాయనములు. ' ఇది కవి సమయముతోఁగూడిన సహజ వర్ణన.

ఇది యుల్లేఖాలంకారముతోఁ గూడిన వర్ణన. దీనికి మూలము-

"నృత్య వ్యాపార కాలశ్చ మయూరాణాం కలాపినామ్
మదరక్తాః ప్రవృత్తాశ్చ కేకాః పటురవా స్తథా"

(హ. విష్ణు. 10-7)

విశాలములగు బర్హములు గల మయూరములకు నాట్యమొనర్చు కాల మాసన్నమైనది. మదమత్తములు, రక్తములునగు మయూరముల క్రేంకారవములు పటుతరములై యుండినవి.

ఎఱ్ఱయ మయూరముల క్రేంకారములనేగాక రాయంచల గుండెలకు బెదరుగ వియుక్తమానములైన, వానిచ్యుతికి మాయా మంత్రములగు గర్జనలను వర్ణించినాఁడు.

ఎఱ్ఱయ వర్షాగమమున -

దినమునకు అధిపతి సూర్యుఁడు. నిశాధిపతి చంద్రుఁడు. ఇపుడా యిరువురు వ్యర్థనామధేయులైనారు. దినమునందును రాత్రియందును మేఘములే ఆవరించి యుండినవి. వాని ఆధిపత్యమే వెలయుచుండినది. దినమున కధిపతి సూర్యుఁడు ప్రకాశమునిచ్చుట అను తనకార్యమును చేయుటలేదు కనుక దినాధిపతికాఁడు. నిశాధిపతియై నిశియందు కాంతి నిచ్చుచంద్రుఁ డిప్పుడు నిశాధిపతికాఁడు. ఇప్పుడాయిరువురును, వ్యర్థనామధేయులైనారు. తమతమ నామములు నిరర్థకములగుటచే సిగ్గుపడి మఱుగున పడిపోయిరో అనునట్లు దిననిశలొక్కటిగ మేఘావృతములై తిమిరములైనవి

మేఘము లావరించి యుండుటచే దినపతి కాంతిసేయఁజాలకుండెను. నిశాధిపతియు మేఘమునుండి మఱుఁగున పడెను. ఆ వర్ణననే ఎఱ్ఱయ ఇట్లు చమత్కరించినాఁడు.

మూలమున -

"బభూవాదర్శన స్సూర్యో భూమిశ్చాదర్శనా తృణైః 10-4
పతతా మేఘవాతేన నవతోయానుకర్షిణా
సమ్మార్జిత తలాభూమి ర్వ్యావనస్థేవ లక్ష్యతే" హ. విష్ణు 10-5

సూర్యుఁడు మేఘావృతుఁడై కనిపించలేదు. తృణావృతమైన భూమి అదర్శన యైనది. నూతన జలరాసుల నాకర్షించి మేఘమను వాయువు భూమిని పరిశుద్ధ మొనర్చుటచే, భూమి నూతన యౌవనమును పొందినట్లున్నది.

అని భూమిని, సూర్యుని మఱుఁగుపఱచి, భూమిని పరిశుద్ధమొనర్చి, యౌవనము నందుఁ గాంచినాఁడు వ్యాసుఁడు.

"నవవర్షావసిక్తాని శక్రగోపకులానిచ
నష్టదావాగ్నిధూమాని వనాని ప్రచకాశిరే" 10-8

ఇంద్రగోపములను కీటకములు నూతన వర్షాజలముచే తడిసిపోయినవి. అరణ్యమున దవాగ్నులు నశించిపోయినవి. ధూమములు నష్టములైనవి. కనుక అరణ్యములు వెలుగొందినవి.

ఇది ఎఱ్ఱయ అనువాదమున లేదు -

ఎఱ్ఱయ మూలమునందలి కేవల వర్షాకాల ప్రకృతి వికాసపట్టికను తొలగించి ప్రబంధశైలికి మెఱుఁగులు దిద్దినాఁడు.

ఎఱ్ఱయ హరివంశమున -

కం॥ లలిత గగన రంగంబున
నలయక క్రొమ్మెఱుఁగు గొండ్లియై యాడుచో
నలవడియె మొగులు దెరలును
బొలుపగు వడగండ్లగముల పుష్పాంజలులున్.

హ. వం. I- 6-109

కం॥ జలధారలు, మదధారలు
జలధరములు మొగవడములు చండానిలవి
హ్వాల గర్వార రవములు గ
ర్జలుఁగా గిరు లమరె సమద సామజ సమతన్. I- 6-110

తే॥ గీ॥ ఘనరసోపయోగంబునఁ గ్రమ్మఱంగఁ
బడసెఁ బ్రాయంబుఁ దగఁ దో యిబ్భంగి యనఁగ
హరిత తృణ లతారుణ కోమలాంగి యగుచుఁ
బృథ్వి యెంతయుఁ గ్రొత్తయొప్పిదము నొందె. I- 6-111

ఆది ఆకసము, అంకొక నృత్యశాల అన్నృత్యశాలలో స్త్రీలు మండలాకార నృత్యము నొనరించుచున్నారు. వారు క్రొమ్మెరుగులు, ఆ రంగస్థలమున తెరలుపడు చుండును. లేచుచుండును, పొరలు పొరలుగా ఆవరించి, తొలగిపోవుచుండు. మేఘములను తెరలుగా వర్ణించినాడు, గొంతిలోని పుష్పాంజలులుగా వడగండ్ల పర్షము నూహించినాడు. ఇటి ఎఱ్ఱయ రమ్యమైన యూహకు మూలములేదు.

మండలాకార నృత్యము సలుపుచు, పుష్పాంజలుల వెదజల్లుచు తళుక్కున మెఱసిపోవుచు తిరుగుచు నృత్యమొనర్చుట గలదు. ఆ నృత్యమును క్రొమ్మెఱు గులతో చేయించినాడు వడగండ్లను పుష్పములుగా జల్లించినాడు. అవి చెదురు ముదురుగా పడుచుండును. క్రొమ్మెఱుంగులు ఎడతెగక ప్రకాశించుట యనునది యుండదు. కనుకనే మేఘములను తెరలు తెరలుగా వేయించి మెఱపుల విరళతకు సార్థకతను చేకూర్చినాడు ఇట్టి యూహ అతి మనోహరము. మూలాతిరిక్తము. ప్రబంధ పరమేశ్వరునికి సార్థక నామమును చేకూర్చునట్టిది. మఱొక పద్యమున –

గిరులకు సమద సామజములకు సాదృశ్యమును చూపుచున్నాడు. గిరులకు జలధారలు కలవు. కరులకు మదధారలు కలవు గిరులకు జలధరములు గలవు. కరులకు మొగమదములు గలవు. భూధరములకు ప్రచండ మారుతముతో గూడిన అరణ్యరవములు, కరులకు ఘీంకారములు గలవు. కనుక గిరులు సామజములతో సమత్వము పొందినవి.

ఆ వర్షాగమమున పృథివికెంతయు నూతనమగు సొబగు సమకూరినది.

ఘనరసోపయోగంబున గ్రమ్మఱుగ బ్రాయము వడసినడి. ఇచ్చట ఘన రసమునగా – మేఘములందలి జలమని యొక అర్థము. దట్టమగు మూలికల రసమని మఱొక అర్థము. ఆ రసమును సేవించుటచే నూత్న యౌవనము సిద్ధించుటయుం గలదు. పోయిన యౌవన వైభవమును మూలికల రసమును సేవించుటచే – మఱల పొందినట్లు వర్షజలముచే పృథ్వి నూత్న శోభను పొందినది. హరిత తృణతారుణ కోమలాంగియై యొప్పినది.

ఇది 'యౌవనస్థేవ లక్ష్యతే' అను మూలమునకు వివరణ.

"మహీరుహైరుత్ప తితైః స్సలిలోత్పీడ సంకులా
అన్విష్య మార్గా వసుధా భాతి శాద్వల మాలినీ"

(హ. విమ. 10-18)

ప్రవాహ వేగమునకు వృక్షములతో శోభితములగు పర్వతాగ్రమ్ములు తెగి జారిపడుచుండినవి. వసుంధర తృణావృతయై మార్గము నన్వేషింప వలసినదిగా నుండినది.

ఎఱ్ఱయ వసుంధర హరిత తృణతారుణ కోమలాంగి. ఘనరసోపయోగమున నూత్న యౌవనము బొందినట్లుండినది. ఇది మూలమునకు భాష్యప్రాయమగు రచన.

ప్రజలు మూలికలను సేవించి కోల్పోయిన బలమును, ఉత్సాహమును స్ఫూర్తిని, ప్రాయమునుఁ బడయుచుండుట - ఎఱ్ఱయ కాలమున చక్కగా పరిశీలించి యుండును. ఆనాఁటికి ఆచరణలో నుండును. దానిని సందర్భానుగుణముగా పృథ్వీకాపాదించి ఎఱ్ఱయ ఆనందించి యుండును.

మూలమునందలి పెక్కువర్ణనలను ఎఱ్ఱయ పూర్తిగా పరిహరించినాఁడు, సుదీర్ఘవర్ణనలు, చమత్కార రహితములగు వర్ణనలు ప్రబంధశైలికి అడ్డు వచ్చునని ఎఱ్ఱయ భావించి యుండవచ్చును.

ఎఱ్ఱయ హరివంశమున -

శా॥ ధారాపూరకఠోరవృష్టిఁ గమలధ్వంసంబు పాటిల్లినం
జేరం జోటొకటిందుఁగానక భ్రమంజెయ్యేదు భృంగావళిన్
గారామారఁగ నుద్ధరించెఁ బొగడంగానొప్పదే నాఁగనొ
ప్పారెం బ్రస్ఫుట కందళీ కుటజ నీపామోదికాంతారముల్

హ. వం. I-3-112

కం॥ ధరణి రజమడఁచియు జల
ధరకాలము దెసలు గగన తలముఁ దలముగా
సరజంబులు గావించెను
బరిణతకేతకమనోజ్ఞపవనోద్ధతులన్. I-3-113

కం॥ రేయును బవలును మెఱయుచు
ఖద్యోతఘనావళులకలిమి ముద్దియలు దమం
బాయక యుండఁగఁ బరిరం
భాయత భోగరుచులమరె నాత్మేశులకున్. I-3-114

१०१ కుటజ కుసుమ వాసితలై
యటవులు నవమాలతీ లతాంత పరిమళో
త్కటలై నగరీ వనికలు
పటుతాప మొనర్చెఁ బాంథపంక్తులకెల్లన్
I - 6 - 115

కఠోరమగు వృష్టి ధారాపూరముగ కురిసినది. ఆ సంతత ధారలచే కమల ములకు ధ్వంసము సంభవించినది. ఆ కమలములందుండు భృంగములు - కమల ములు నశించి పోవటచే-చేరుకొనుటకు చోటెందును గానక తమ నిలయములను కోల్పోయి భ్రమతో చేష్ట లుడిగినవి. అట్లు చేష్టలుడిగిన భృంగావళిని, వికసించిన కొండమల్లెలు, నీపములు తమ పరిమళముకు వ్యాపింపఁజేయుచు, ఆకర్షించి, గారాబ ముతో నెలవొసంగి ఉద్ధరించినవి. వీనిని పొగడవలదా ? అనునట్లు వీని పరిమళము కాంతార మంతయును ప్రస్ఫుటించినది.

ఇది మూలమున లేని ఎఱ్ఱయ వర్ణన - ధారాపాతముగా వర్షము కురిసినపుడు కమలములు నశించిపోవుటయు, అపుడా కమలములందు వసించు భృంగములు నెలవు లేక చేష్టలుడిగి యుండుటయు కవిసమయ సహజము. అప్పుడడవులలో వికసించిన కొండమల్లెలు, నీపములు - వీనిని పరిమళముతో నరణ్యముల లోనికి ఆకట్టుకొను టయు గలదు. దీని నింత సహజముగా చిత్రించినాఁ డెఱ్ఱయ.

వర్షాకాలమున నిరంతరవర్షధారలచే ధూళియడఁగి పోయినది కాని పండఁబాఱిన కేతకీ పుష్పముల నుండి ధూళి బయలుదేరి గగనతలమంతయును వ్యాపించుటచే గగనతలమే భూమిగా మాఱినది. భూమిపై ధూళిలేదు. ఆకసమంతయు ధూళిచే (పుప్పొడి) వ్యాప్తమై భూమియైనది.

ఇట్లు భూమి నాకసముగను - ఆకసమును భూమిగను వర్ణించి ఎఱ్ఱయ తన నైపుణిని ప్రదర్శించినాఁడు. ఇది మూలమున లేదు.

రాత్రిం బవళ్ళు మేఘము లుఱుముచుండినవి, ఆ గర్జనలచే ముద్దియలు తమ్ముఁ బాసి విడనాడకుండుటచే ఆత్మేశులకు ఎడతెగని పరిరంభణ సుఖమమరినది.

ఇదియు మూలమున లేదు.

అరణ్యములు - అడవిమల్లెలచే పరిమళభరితములైనవి. నగరము నందలి యుద్యానవనములును నవమాలతీ కుసుమములచే పరిమళభరితములైనవి. ఈ పరిమ

శములు పాంథుల సముదాయమునకు మిక్కిలి తాపమును చేకూర్చినవి. పాంథులు వియోగము ననుభవించుచుండురు. వారికి నవపరిమళము మన్మథబాధ నధికము గావించినది ఇదియును మూలమునలేదు. ఎఱ్ఱయవర్ణన. ఈ వర్ణనలు ప్రబంధ వర్ణనలను పోలినవి.

ఇంక మూలము –

"తోయగంభీర లంభేషు ప్రవత్సుచ నదత్సుచ
ఉదరేషు నవాభ్రాణాం మజ్జతీవ దివాకరః హ. విష్ణు 10-17
మహీరుహైరుత్పతితై స్సలిలోత్పీడసంకులాః
అన్విష్యమాణా వసుధా భాతి శాద్వల మాలినీ
10-18
వజ్రేణేవా వరుగ్ణానాం నగానాం నాగశాలినాం
స్రోతోభిః పరిక్తృత్తాని పతంతి శిఖరాణ్యధః 10-19
పతతా మేఘవర్షేణ యథా నిమ్నానుసారిణః
పల్వలోత్కీర్ణ ముక్తేన పూర్వాంతే వనరాజయః 10-20
హాస్తోచ్ఛ్రిత ముఖాఃవన్యా మేఘనాదానుసారిణః
భ్రాంతాతి వృష్ట్యా మాతంగా గాంగతా ఇవతోయదాః"
10-21

ఎఱ్ఱయ హరివంశమున —

శా॥ చండాపాతములం దటద్రుమములుత్సారించి శుండాలికా
గండూషారవ రమ్యతోయలగుచుం గాండాంతరా వర్తముల్
డిండీరోత్కర వీచులం బెనుప నుద్రేకించెం గూలంకషల్
మందాకీ పరిగీయమాన విలసన్మాహాత్మ్యలై యొల్లెడన్.
హ. వం. I – 6-116

— అని వర్ణించినాడు.

ప్రచండ వర్షధారలచే నదులు గట్లను ఒరసికొని పోవుచు, కూలము లందలి ద్రుమముల నుత్సారించి పోవుచుండినవి. ఏనుగులు ప్రవాహములందలి జలమును గండూష మొనరించు చుండినవి. ప్రవాహము వేగమైన త్రెంతయు

ప్రవాహ అధికము కాఁజొచ్చినది. అట్టి నదుల మహిమను మండూకములు వర్ణించు చున్నవఁట !

వర్షాకాలమున – ఎల్లయెడల ప్రవాహము లుద్రేకించుట సహజము. చిన్న చిన్న వాగులు వంకలు సైతము విజృంభించి ప్రవహించుట కలదు. అందులకే నవి కూలంకషమైనను ఇంకను ఉద్రేకించినవని తెలిపినాఁడు. ప్రచండ ప్రవాహముల వేగమునకు కూలము లందలి వృక్షములు నిర్మూలములైనవి. శుండాలికలు గండూషము సేయుచుండుట సహజము – వర్షాసమయమున – ఏనుగులు – ఆడ ఏనుగులు నదీ తీరములకు వెళ్ళి బుడబుడ ధ్వనులతో జలపాన మొనర్చుట ఆ జలమును గండూషించుట మొనర్చుట–కాతి సహజముగా చేయుపనులే ! ప్రవాహమధిక మగునట్లెల్ల నురుగు అధిక మగుటయు సహజము. గాలి తీవ్రమై యా నురుగును గ్రహించికొని పోవుటయు గలదు. ఆ గాలి తీవ్రతకు, ప్రవాహ వేగమునకు సుడి గుండము లధిక మగుటయుఁ గలదు. అట్టి కూలంకషల మాహాత్మ్యమును మండూకములు వర్ణించుచున్నవట ! ఇచ్చట వర్షాధిక్యమున కప్పల బెకబెక లత్యధికముగా నుండును. అదియే మాహాత్మ్యమును వర్ణించు స్తుతి. కప్పలను స్తుతి పాఠకులుగా వర్ణించుట కవి చమత్కారము.

ఇట్లు ఎఱ్ఱయ అనువాదమును, మూలమును పరిశీలించినచో పెక్కు విశేషములు గోచరింపఁగలవు. మేఘములను ప్రభువులుగా వర్ణించి చాతక మయూరాదులను వారి సేవకులై నియమించుట ఎఱ్ఱన వర్ణనలలోని విశేషము. "మనసః కామదీపినీ" అనుదాని కనువాదములేదు. వర్షాగమ మందలి మనస్సులలోను కామమును ప్రేరేపక పోవచ్చును. వయస్సును ఆరోగ్యమును, పరిస్థితిని, పరిసరమును – అనుసరించి వియోగులకో, యువతులకో కామోద్రేకమును కలిగించఁగలదేమో సర్వులకు ఆ వర్షాగమము "మనసః కామదీపినీ" కాఁజాలదని ఎంచి ఎఱ్ఱయ ఆ భావమును తొలఁగించి యుండవచ్చును.

"విభూవాదర్శన స్సూర్యః" అనుశ్లోకము నందలి – సూర్యుఁడు కనిపించ లేదు" "భూమియు తృణావృతయై – కనిపించదాయెను" వంటి వాక్యములకు ఎఱ్ఱయ అనువాదము మెఱుఁగులు దిద్దినది.

"దినపతియు, నిశాపతియు –అదుర్దినములందు మేఘావృతులై – తమ తమ అధిక్యమును కోల్పోయి వ్యర్థనామధేయులై సిగ్గుచే మఱుగున పడిరో యను నట్లున్నది. అని మనోహరభావములను వెలువరించినాడు.

"లలితగగన రంగంబున" అను ఎఱ్ఱయ అద్భుతమగు వర్ణన ఆతని మేధావిత్వమునకు నికషోపలము. గగనస్థలము నొక రంగశాలగా నూహించి, ఆనృత్యశాలలో మేఘములను తెరలుగాచేసి, మెఱుపుతీఁగచే గొండ్లి చేయించి వడగండ్లను పుష్పములుగా వెదజల్లించుట - ఎఱ్ఱనకే చెల్లినది. ఈ పద్యమునకు మూలములేదు. ఇట్టివర్ణనలచేతనే ఎఱ్ఱయ వర్ణనా నిపుణుఁడనిపించుకొన్నాఁడు.

"హసితం కుటజైర్వృక్షైః" అను శ్లోకమున మూలమున కుటజవృక్షములు వికసించి నవ్వుచున్నట్లున్నది. కదంబములు పరిమళింపఁజేసినవి. జలధరములు తాపమునుఁ బాపినవి. వసుంధర జలముచే సంతోషించినది." ఇటువంటివాక్యముల పట్టికను తొలఁగించి చమత్కారమును జొప్పించి చిత్రించినాఁడు ఎఱ్ఱయ. ఇదిపురాణ శైలి కావ్యశైలిగా రూపొందిన ఎఱ్ఱయ వర్ణనా విశేషము.

"ధారాపూర" - అనుపద్యము -

ధారాపాతముచే కమలధ్వంసమగుట, సారంగములు నెలవుల కోల్పోయి చేష్టలుడిగి యుండుట, నీపములు, కొండమల్లెలు పరిమళించఁగా నచ్చటికి పరుగిడుట - వంటి సహజములగు చేష్టలను రమ్యముగా చిత్రించినాఁడు. ఇదియు మూలమున లేదు.

"నృత్తవ్యాపారకాలశ్చ... ప్లవరవాస్తథా"

అను శ్లోకభావమును ఉల్లేఖాలంకారముతో తీర్చిదిద్దినాఁడు.

"ప్రథమ జలధరముల గర్జనలు వినినంతనే రాయంచల గుండెలు చెదరినవి. వియోగులనాశమున కది మాయామంత్రమైనది. మయూరములకు కర్ణరసాయనమైనది." ఇట్లు పలువిధముల భావముల పలువురకు కలిగించి ఎఱ్ఱయ చమత్కారముగ వర్ణించినాఁడు.

మఱొక శ్లోకము -

"హస్త్యోచ్ఛ్రిత ముఖా వన్యా మేఘనాదానుసారిణః
భ్రాంతాతివృష్ట్యా మాతంగా గాంగతా ఇవ తోయదాః"

హ. విష్ణు 10-21

వన్యమాతంగములు తొండములను ముఖములను పైకెత్తినవి. మేఘనాదముల ననుసరించి ఘీంకరించు చుండినవి. అతివృష్టిచే ఆ మాతంగములు భూమి కవతరించిన మేఘములో యనునట్లుండినవి. ఇది మూలము.

ఎఱ్ఱన గిరులకు సమదసామజములకు సాదృశ్యముచూపి, గిరులకు జల ధారలు - కరులకు మదధారలు - గిరులకు జలధరములు - కరులకు మొగవడములు కలిపి సాదృశ్యమును చూపి పోల్చినాఁడు. మూలమును మార్చినాఁడు.

ఇట్లు మూలమునందలి కేవల వస్తుపట్టికను తొలగించినాఁడు. కేవలప్రకృతి సహజ వర్ణనకైన 'ఐంద్రేణసహసా' మొదలు "వనరాజయః" వఱకుఁగల అనువాద మును పూర్తిగా పరిహరించినాఁడు.

చంపాహతములం దట్రుమము" అను పద్యమున స్వభావోక్తిచే వర్షాపాత వర్ణన సలిపించినాఁడు.

ఇట్లు ఎఱ్ఱయ ఔచిత్యమును గమనించి, మూలము ను మార్చి, కూర్చి, తొల గించి వస్తువునకు రమ్యత నాపాదించినాఁడు.

ఆ వర్షాకాలమున - శ్రీ కృష్ణుఁడు కూడ మేఘమువలె నున్నాఁడఁట! ఇచట ఎఱ్ఱయ ప్రకృతితో నాయకునకు తాదాత్మ్యమును కలిగించినాఁడు.

ఉ॥ క్రాలెడు పచ్చఁబట్టునునుఁ గచ్చులు క్రొమ్మెఱుంగై చలింప ను
న్మీలిత బర్హదామము సమిద్ధ మహేంద్ర శరాసనంబుఁగా
మేలగు వేణువాద్యరవ మిశ్రిత గీతము గర్జచందమై
నేలకు డిగ్గె నొక్కొ దివి నీలఘనంబన నొప్పెఁ గానలన్.

హ. వం. 1-6-118

ఆ వర్షాకాలమున - మేఘమే దివినుండి భువికి దిగి వచ్చెనో యనునట్లున్నాఁ డఁట శ్రీకృష్ణుడు. మేఘము లావరించి యుండును. మయూరములు పింఛములు విప్పి నాట్యమాడుచుండును. ఇంద్రచాపము లాకసమున వెలయుచుండును. మేఘము ఉఱుమి యుండి గర్జించుచుండును. ఆ మేఘముతో శ్రీకృష్ణునికి తాదాత్మ్యమును కలిగించినాఁడెఱ్ఱయ.

శ్రీకృష్ణుని పట్టువస్త్రము నందలి నునుకాంతి క్రొమ్మెఱుంగులు - ఇతని మయూర పింఛము లాభరణములు మేఘమున కింద్ర చాపము లాభరణములు, మయూర బర్హమునందు పలువన్నె లుండును. ఇంద్రచాపమున పలువన్నె లుండును

ఇతఁడు మెల్లగ వేణువును మ్రోగించుచున్నాఁడు. మేఘమును గర్జించు చున్నది. ఇతఁడు నీలవర్ణుఁడు. మేఘమును నీలవర్ణమే. కనుక ఆకసమునుండి దిగి

వచ్చిన మేఘమో యనునట్లు శ్రీకృష్ణుఁ డా వర్షా సమయమున కానలందు సంచరించు చున్నాఁడఁట! ఎంత మనోజ్ఞములగు సుషమాసములతోఁ గూడిన వర్ణన ఇది!

మూలమున - బలరాముఁడు శ్రీకృష్ణునితో నిట్లు చెప్పుచున్నాఁడు.

"ప్రావట్ప్రవృత్తిం సందృశ్య దృష్ట్వాచాంబు ధరాన్ ఘనాన్ ।
రౌహిణేయో మిథః కాలే కృష్ణం వచన మ్రబవీత్"
పశ్య కృష్ణ! ఘనాన్ కృష్ణాన్ బలాకోజ్జ్వల భూషణాన్ ।
గగనే తవగాత్రస్య వర్ణచోరాన్ సముచ్ఛ్రితాన్"

హ. విష్ణు 10-22, 10-23

"తవ నిద్రాకరః కాలః తవ గాత్రోపమం నభః
త్వమివాజ్ఞాత వసతిం చంద్రోవసతి వార్షికమ్" 10-24

ఇది మూలము. ఇచ్చట బలరామునిచేత కృష్ణుని మహిమ వర్ణింపఁబడినది. శ్రీకృష్ణుఁడు విష్ణుస్వరూపుఁడని కనుకనే వర్షాకాల ప్రారంభమున, చాతుర్మాస్య ప్రారంభమున ఆ విష్ణువునకు నిద్రాసమయమని, విష్ణువు గోపవేషమున నజ్ఞాతముగా నున్నట్లు చంద్రుఁడును మేఘావృతుఁడై యజ్ఞాతముగా నున్నాఁడని తెలియఁ జేయుట-మూలమున నున్నది.

ఈ కృష్ణుని విష్ణుస్వరూపమును ఎఱ్ఱయ తడవలేదు.

భూలోకమున నవతరించిన తరువాత భూలోకవాసులుఁగనే ఉండవలయును గదా! అదియే ఉచితము. "నీవీపాటికి ఆదిశేషునిపై నిద్రించుచుంటివి. నిద్రింపు కాలమాసన్నమైనది. నీవలెనే చంద్రుఁడును అజ్ఞాతవాసము చేయుచున్నాఁడు." అని భూలోకమునందు గోపవేషమునందున్నప్పుడును స్మరింపఁజేయుచుండుట మానవోచితముగా నుండదని ఎఱ్ఱయ సంస్కర్త. ఆ విషయమునే తడవక భువికి దిగివచ్చిన మేఘమునుగా శ్రీకృష్ణుని వర్ణించి, అప్పటి ప్రకృతితో నతని సామ్యము చూపుట సమంజసముగా నున్నది. అట్లు మూలమునందు స్థానమునకు, సమయము నకు, అవతారమునకు, వేషమునకు తగని వానిని ఎఱ్ఱయ తొలఁగించినాఁడు.

భాండీర వటోపాంతమున శ్రీకృష్ణుఁడు వినోదించుచుండినాఁడు. క్రమముగా కళింద కన్యాతీరమును చేరెను. మేతకై యేఁగుచుండు కదుపుల వెంబడి నాఁడుచు పాడుచు గోపాలురు వెంటరాఁగా బలదేవునితోఁగూడి పోవుచున్నాడు.

అప్పుడీ యమునా నదిని ఎఱ్ఱయ వర్ణించినతీరు —

సీ॥ మునివర దత్తార్ఘ్యములఁ గుశాక్షతములఁ
దెట్టువగట్టిన తీరములును
గుండలి కన్యకా కుచకుంభ కుంకుమ
క్షాళనఁ గెంపారు సలిలములును
సిద్ధ సంయమి సమర్చితనైక తాలింగ
భూషితాగ్రములగు పులినములును
శబరకుటుంబినీ కబరికా వనమాల్య
వలితంబులైన శైవాలములును

తే॥ నచటనచట నొప్పారఁ బ్రౌఢాబ్జముఖియుఁ
గ్రమ మీనేక్షణయు రథాంగ స్తనియును
హంసరుచిరానులాపయు నగుచుఁ గాలు
యమునఁ జూచుచు దవ్వుఁగా నరిగి విభుఁడు"

హ వం 1-7-5

ఆయమునా నదీతీరమున మునివరులు అర్ఘ్యమునొసంగుదురు. ఆ అర్ఘ్యము లందలి కుశలు, అక్షతలచే తీరములు తెట్టువలు గట్టినవి. నాగకన్యకలు అచ్చటికి వచ్చి స్నానములుచేసి జలక్రీడలాడుదురు. వారికుచకుంభము లందలి కుంకుమలు క్షాళితములై సలిలములు కెంపారినవి. సిద్ధులు, సంయములు సైకతలింగములు, గావించుకొని పూజించినారు. ఆ సైకతలింగములచే పులినస్థలములు అలంకృతము లైనవి శబరస్త్రీలు తమధమ్మిల్లములను వనమాలికలచే నలంకరించుకొని యుందురు. ఆ వనమాలికలు శైవాలములను చుట్టియుండినవి.

ఆ యమున యం దచ్చటచ్చట వెలుఁగుచుండు ప్రౌఢములగు అబ్జములే ముఖములు. సుందరములగు మీనములే ఈక్షణములు. రథాంగములే స్తనములు. హంసల రుచిరానులాపములే సంభాషణలు — అయి యొప్పారినది.

ఎఱ్ఱయవర్ణన మూలమునకంటె చాల సంక్షిప్తమైనది. సంక్షిప్తమైనను సార వంతమైనది. ఒక్కసీసములో ముగించినను, సిద్ధులకు సాధ్యులకు, నాగులకు, నరుల కును సేవ్యమానము గావించినాఁడు ఆ యమునను.

మూలకర్త యమునా నదిని స్త్రీగా భావించి యందలి సమస్త వస్తుజాతమును స్త్రీ అంగములుగా, అంగ సౌభాగ్య పోషకములుగా వర్ణించినాఁడు. ఇది మిక్కిలి దీర్ఘమగు వర్ణన. ఆ యమునా నదికి స్రోతస్సులు, పులినములు, హ్రదములు, హంసలు, కారండములు, సారసములు - అన్నియు నవయవములై సొబగుఁగూర్చినవి. రక్తోత్పలములు ఓష్ఠములు, నిమ్నానుగాములగు స్రోతస్సులు నతభ్రువులు, చక్రవాకములు స్తనతటములు. ఇట్లు తీరపార్శ్వములు ముఖములుగా, దీర్ఘస్రోతస్సులు భుజములుఁగా, తటములపూర్ణత శ్రవణములుగా నా నది యొప్పారినది మూలమున, కారండవములు కుండలములై, నీలోత్పలములు లోచనములై, మీన పంక్తులు మేఖలలై సారస రవములు నూపుర శింజితములై సొబగున చేకూర్చినవి. ఈ సుదీర్ఘ వర్ణనలోనొక శ్లోకమునందు చమత్కారము గోచరించుచున్నది

'జలజము' అనుపదమునకుగల పెక్కర్థములను గ్రహించి, ఒకచోట కమలముగా, మఱొక్కచోట జలము నుండి జనించిన శీతలత్వాది గుణములుఁగా, ఇంకొక యెడ జలమునందు పుట్టిన శైవాలముగా పలువిధముల గ్రహించి చమత్కారము గావించినాఁడు. మఱెక్కడను నీ సుదీర్ఘ వర్ణనయందు చమత్కారమంతఁగా కనిపించదు. దీర్ఘములగు ఉపమానములతోఁగూడి రూపకాలంకారముల వర్ణనయే కనిపించుచున్నది. ఈ మూలమున యమునస్త్రీగా పదునొకండు శ్లోకములలో సౌందర్యము వర్ణన గావింపఁబడినది. ఆశ్లోకములన్నింటిని సంక్షేపించి, ఎఱ్ఱయ నాలుఁగు చరణములలో సౌందర్యమును గుప్పించినాఁడు. ఈ చరణములందు -

మునివరు లొసంగిన అర్ఘ్యములు, సైకతాలింగ సంసేవనములు, శబరకన్యల ధమ్మిల్ల వనమాలికలు, కుండలి కన్యకా కుచకుంభక్షాళితములచే కెంపారు సలిలములు కలవు. ఇవి మూలమున లేవు. మూలమునందలి కారండవములు, శ్వాపదములు, నరుల పయఃపానములు, సైకతశ్రోణులు, త్రివళులు, ఆవర్తనాభులు, ఎఱ్ఱయ వర్ణనలందు వదలి వేయఁబడినవి.

శ్రీకృష్ణుఁడు గోపాలురతోఁ గూడి కాంతారమున సంచరించు చున్నాఁడు. అచట నొక తాళవృక్షము దృష్టిగోచరమైనది. అది -

శా॥ కాలాహుల్ ఖుజుతావిచిత్రతమగు భోగశ్రేణి శోభిల్లఁ దా
తాళం బొక్కట నిర్గమించి విలసద్దర్వీవికాసంబుతోఁ

"కేళింగ్రోలెడినో యనంగఁ దనువుల్ గృష్ణంబులై యొప్పఁగా
శైలన్మూలములైన తాళతరువుల్ కృష్ణుండు వీక్షించుచున్"
హ. వం I-7-75

కృష్ణుఁడు తాళవృక్షములను గాంచినాఁడు. అవి యెట్లున్నవన - పాతాళము నుండి నల్లని పాములు - త్రాచులు చక్కని శ్రేణిలో నిర్గమించి పడగవిప్పి ప్రకాశించు చున్నవో యనునట్లున్నవి. తనువులు నల్లనై యొప్పుచుండినవి. మార్గము వెల్ల ఆడుచుండినవి. అట్టి తాళవృక్షములను శ్రీకృష్ణుఁడు గాంచెను.

మూలమునందలి తాళవృక్షములు -

"తాలైస్తైర్విపుల స్కంధై రుచ్ఛ్రితై శ్శ్యామ పర్వభిః
ఫలాగ్రశాఖిభిర్భాతి నాగహస్తై రివోచ్ఛ్రితైః"
హ. విష్ణు 13-6

తాళవృక్షముల స్కంధములు విశాలములు, ఉన్నతములు. వాని పర్వములు నల్లఁగా నున్నవి. వృక్షాగ్రశాఖలు ఫలములతో నిండియున్నవి. పైకెత్తఁబడిన ఏనుఁగుల తొండములో యను నట్లుండినవి.

ఇది మూల వర్ణన. మూలమున తాళవృక్షములు - పైకెత్తబడిన ఏనుఁగుల తొండములతో పోల్చఁబడినవి. ఏనుఁగు తొండములు మొదలు విశాలములై పోనుపోను సన్నములై యుండును. తాళవృక్షము లట్లుండవు. స్కంధమొకే విధముగా నుండి పైభాగమున మెదల్పఁగా ఫలశాఖాభరితములై యొప్పుచుండును. మూల వర్ణనకంటె ఎఱ్ఱయ వర్ణన మనోహరము. అతి సహజము. పైకెత్తఁబడిన యేనుఁగుల తొండములకంటెను - నల్లని నాగులు పాతాళము నుండి నిటారుగా పైవఱకు నిల్చి ఫణుల నాడించుచున్నవో యను నట్లుండుటయే అత్యంత సహజము. తాళవృక్షములకు క్రిందవఱకు ఆకులుండవు. శాఖలుండవు. పాము నిటారుఁగ నిలఁబడినట్లు గనే యుండును. అగ్రభాగమున మాత్రము పాము పడఁగ ఆకారమున శాఖలు అల్లలాడు చుండును.

ఇట్లు మూలమునందు కంటెను ఈ వర్ణనయే తాళవృక్షాకారమున కత్యంత సమీపమై యొప్పుచున్నది.

శరత్కాల మేతెంచినది. అప్పటి ఎఱ్ఱయ వర్ణన.

చ॥ వరుసనిదాఘకాలము ప్రవర్తితమై చనఁగాఁ బయోధర
స్ఫురిత విభూతి మాసయుగ శోభితమై భువన ప్రమోద ని
ర్భరత యొనర్పఁ బిమ్మట శరన్నవ సంపదయేఁగు దెంచె. ను
ర్వరకు సమగ్ర సస్యవిభవంబులఁ గూర్చుచు వర్ణనీయమై
హ వం I-7-110

మ॥ మును వర్షోదకధారల న్మదముతో మూర్ధాభిషేకంబు గై
కొని శుభ్రాభ్ర కిరీట శోభియయి సంక్షుభ్యన్మరాళావళుల్
ఘన వాలవ్యజనంబులై మెఱయఁగాఁగాంతేందుబింబాత ప
త్ర నిరూఢి స్మరదంబరం బమరె నుద్యద్రాజ చిహ్నంబులన్.
I-7-111

మ॥ తెలి నవ్వుల్ వెలిదమ్మి నెమ్మొగములం దీపార నేపారు చూ
పులు దారై మదలోల భృంగ రచన ల్పొల్పార వీచిభుజా
వళి యాలింగనకేళి కుత్తలపడన్ వార్ధిందగం గూడుచోఁ
గలకల్ దేరిదనర్చె నేఱులు శరత్కల్యాణ కల్యాకృతిన్
I-7-112

"నిదాఘ కాలము ప్రవర్తించి వెడలిపోయినది. వర్షాసమయము మాసద్వయము పయోధరములచే తన సంపదను తెలియఁజేయుచు భువన ప్రమోద మొనగూర్చినది. అనంతరము శరత్కాల నవసంపద యేగుదెంచినది. ఉర్వరకు సస్యవైభవమును చేకూర్చినది. "శరత్కాలీనమగు సంబరము ఉద్య దాజ చిహ్నములతో నొప్పారినది. ఈ రాజు అభివృద్ధి చెందువాఁడు. ఇతనికి వర్షోదక ధారలకే మూర్ధాభిషేకమైనది. ఈ రాజునకు శుభ్రమగు అభ్రము కిరీటము. సంక్షుభితంబులగు మరాళావళులే ఘనవాలవ్యజనములు మనోహరమగు చంద్రమండల మీ రాజున కాతపత్రము.

తెల్లని తమ్మిమొగనందు తెలినవ్వులు ప్రకాశించినవి. ఇచట ఏఱులు వార్ధినిఁ గూడుటకై కలకలుదేఱి పయనమైనవి. వీనికి తెల్లని తమ్ములే మొగమునందలి చిఱు నవ్వులు. మదలోల భృంగముల స్వరూపములే చంచల వీక్షణములు. వీచే భుజావళులతో తమ భర్తయగు వార్ధినిఁ గూడుటకై యుత్తల పడుచున్నవి. అట్టి నదులు కలకల బయలుదేరుచున్నవి.

ఇట్లు ఏఱులు - శరత్కాలము నందలి వికసించిన పద్మములనెడి చిరునవ్వుతోఁ గూడిన ముఖములతో, మదలోల భృంగరచనలనెడి చంచల వీక్షణములతో, కలకల ఐయలుదేరి వార్ధినిఁ గూడుటకై పోవుచున్నవి.

ఇట్లు శరత్కాలము నందలి ఏఱులను భార్యలు సముద్రుఁడను తమ భర్తను గూడుటకై చనుచున్నారు.

ఆ॥వె॥ పిదుకఁ గొలఁది గాక పెయ్యలు దనిసె క్రే
పల్లె పసులు సేఁపి పాలు గురియ
నదరి పాలవెల్లి యయ్యెనా నెందు వి
కాసకాశవన విలాస మెసఁగ I-7-113

కం॥ బంధూక తిలకములు సౌ
గంధిక కర్ణావతంస కంబులు నుద్య
ద్గంధి వనోత్పల కుచతట
బంధుర భూషలును గోపభామల కమరెన్. I-7-114

కం॥ తారకిత గగన చక్రము
తోరాసె ననంగరేలు తొగపువ్వుల నొ
ప్పారె విపుల నిర్మలకా
సారంబులు సారసప్రసర సేవ్యములై I-7-115

తే॥గీ॥ అలరు వావిలి పూఁదీఁగె లలము కొనిన
చలువ చోటులఁ గ్రుమ్మరు జడను గాద్పు
మొగులు విరియొందఁ దళుకొత్తు మొగము చెమట
లార్చి పొలము గొల్లలకు మెచ్చె తలిర్చె I-7-116

కం॥ వడాకు పొన్న కొమ్మలు
గోడాడెడు నడవి గారు కోడమలు మోద
క్రీడఁ దనరు చాద్పునఁ బై
నోడికలయి పువ్వుఁ దేనె లురులుఁగ నొప్పెన్. I-7-117

కం॥ అసనంబులు మదనుని యి
వ్వసనంబుల పోలె విరహులగు వారి కతి
వ్యసనం బొనర్చె వికస
త్ప్రసవ శిలీముఖ నితాంత పటుపాతములన్ I-7-118

రేపల్లె పసులు సమృద్ధిగా పాలు గురియుచున్నవి. గొల్లలకు పిదుకుటకు సాధ్యముకాక వదలివేసిరి. దూడలు త్రాగలేక తృప్తిపొందినవి. కనుక పాలధారలు ప్రవహించి పాలవెల్లి యయినదో యనునట్లుగా వికసించిన కాశకుసుమములు ప్రకాశించు చుండినవి.

గోపభామలు శరత్కాలమున తమ్ము తా మలంకరించుకొనిరి. బంధూక పుష్పములతో తిలకము దిద్దిరి. సౌగంధిక కుసుమములను కర్ణభూషణములుగావించుకొనిరి. పరిమళించు నవోత్పలములను కుచతట బంధుర భూషలుగ నమర్చుకొనిరి.

నీర్గుండి పూలతీగ లంతట అలముకొని చల్లగానుండు చోటుల నుండి గాలులు వీచి మొగులు విరిసిన యెండలో దళుకొత్తు మొగము చెమటలు పోగొట్టి పొలము గొల్లలకు ప్రీతి పాత్రమైనది.

ఏడాకుల పొన్నలు - అడవి యేనుగు కొదమలు - మోదక్రీడ యందొప్పుచున్నట్లుగా - ఆ పొన్నల శాఖలనుండి పూదేనియలు కారుచుండినవి. ఏడాకుల పొన్నల పూదేనియల ధారలు - ఏనుగుల మదజలము ఒక్కతీరుగనే యుండును. ఇది కవి సమయ సిద్ధము.

తారకిత-గగనచక్రము తారలతో ప్రకాశించు చున్నది. ఆ గగన చక్రముతో సామ్యము నొందు (రాయు) చున్నదో యను నట్లుగా విపుల నిర్మల కాసారములు సారసములతో సేవింపబడుచు, తొగపూవులతో నొప్పారినవి.

రాత్రులయందలి విశాల నిర్మల కాసారములు ఆకసముతో పోటీపడినవి. అచ్చట తారలు ప్రకాశించుచున్నవి. కాసారములందు సారసములు ప్రకాశించుచున్నవి. ఉత్ప్రేక్షతో నొప్పుచున్న దీ వర్ణన.

వేగిసపూలు వికసించినవి. అవి వికసించిన మన్మథుని పుష్పబాణముల వలె, తీక్షణములై విరహులగువారి కతివ్యసనము చేకూర్చినవి.

ఉ॥ శారద చంద్రికల్వితత చారు మహోత్సవ లయ్యె గోపక
న్యారమణీయ గీతుల నుదంచిత ధేను విదోహన ధ్వని
స్ఫారతల న్సదర్ప వృషభ వ్యతి గర్జిత లీలలన్మహో
దార రతీశ్వర ప్రియకథారుచుల వ్రజ భూమి యెల్లడన్
I -7-119

వ॥ ఇట్టి శరత్సమయంబునం బ్రమద తరంగితంబులగు నంగంబులు నంతరంగంబులుం గలిగి, గంగాతరంగంబుల తెఱంగున - హాసవికాసంబుల చాడ్పున, నమృత పయోనిధి ఫేనపటలంబుల పగిదిఁ గర్పూర క్షోద పుంజంబుల పోలుపునం జందన పంకకూటంబుల కైవడిఁ జంద్రప్రభా పూరంబుల పరుసునం, గుముదచ్ఛద విసరంబుల విధంబున, ముక్తామణి సముత్కరంబుల కరణి నతిధవళంబులై శైలంబులంబోలె నుచ్ఛ్రితశృంగంబులు, మహాతరువులుంబోలె బంధుర స్కంధంబులును, జంద్ర కిరణంబులంబోలె సర్వదిగ్వ్యాపకరంబులుం గృతయుగ ధర్మంబులుంబోలె నఖండిత సంచారంబులు, శంకర విహారంబులుంబోలె ననపేత వృషంబులు, శ్రుతి విభవంబులుంబోలె లోకోద్ధారకంబులు, విష్ణుకీర్తనంబులుంబోలె శ్రవణ మంగళంబులు, నధ్వరోత్సవంబులుంబోలె, దర్శన పావనంబులుఁ బుణ్య తీర్థంబులుంబోలె నిత్యనిర్మలంబులు, మంత్రంబులుంబోలె రమణీయంబులు, దైవంబులుంబోలె నర్చనార్హంబులు, గురువులుంబోలె నిరంతరానువర్తన పరితోష్యంబులు, శ్రీవిశేషంబులుంబోలె నఖిలలోకోప జీవ్యంబులు, భావంబులుంబోలె రసజనకంబులు, సమయంబులుంబోలె నక్షణ సంతానంబులు, నీతిపథంబులంబోలె నర్థావహంబులు, నిధులుంబోలె నదక్షిణ సంతానంబులునై యొప్పు గోగణంబు గనుంగొని"

చంద్రికా సమయము నందావ్రజవాసులు శారద రాత్రులు గడుపు తీరును ఎఱ్ఱయచక్కఁగా వర్ణించినాఁడు. గోపకన్యల రమణీయ గీతములొకచోట వినిపించు చుండును. ధేనువుల విదోహన ధ్వనులొకవైపు, దర్పించిన వృషభముల ఱంకెలు మఱొక్కచోట. మహోదార మన్మథ ప్రియకథా రుచులొకవైపు - ఇట్లెంతయో ఆనంద జనకముఁగ శరత్సమయము లందలి రాత్రులను గడుపుచుండువారు.

అనంతరము ఎఱ్ఱయ ఒకపెద్ద వచనమున గోవులను వర్ణించి, వాక్యరచనా విన్యాసమునందు తనకుఁగల అపూర్వ ప్రతిభను ప్రదర్శించినాఁడు.

ఆ గోవులు గంగాతరంగముల తెఱంగుననున్నవి. అనంగహాసవిలాసమువలె నున్నవి. అమృత సముద్రము నందలి ఫేనపటలమువలె నున్నవి. కర్పూరక్షోద పుంజమును, చందనపంక కూటమును, చంద్రప్రభా పూరమును, కుదముకుళకాంతిను, ముక్తాగుణములును, - ఆ గోవుల ధావళ్యమునకు బోల్పవలెనని గ్రహించినాఁడు. అవి శైలములవలె నున్నతములు, మహాతరువులవలె బంధురస్కంధంబులు, చంద్ర కిరణములవోలె నంతట వ్యాపించినవి. కృతయుగ ధర్మమువలె ఎడతెగని సంచారము గలవి. శంకరుని విహారము నందీశ్వరుఁడు లేనిదే ఎట్లుకాదో, అట్లే వృషభంబులతోఁగూడి సంచరించుచుండినవి. శ్రుతి వైభవము లోకముల నుద్ధరించు నట్లుగ నివియును లోకోద్ధారకములు. విష్ణుకీర్తనమువలె శ్రవణమంగళములు - అధ్వరోత్సవంబులవలె దర్శన పావనములు. పుణ్యతీర్థములవలె నీ గోవులు నిత్య నిర్మలములు. మంత్రలములవలె రమణీయములు. దైవములవలె అర్చన కర్హమైనవి. గురువులవలె నిరంతర మనుసరించు వారిని సంతోషింపఁజేయునవి. శ్రీఫిశేషములవలె అఖిల లోకముల కుపజీవ్యములు. భావములవలె రసజనకములు. భావములు పుష్టినంది రసస్వరూపమును బొందునట్లుగ నీ ధేనువులు రసమున - క్షీరఘృత తక్రాది రసముల పుట్టించునవి.

"సమయంబులుం బోలె నక్షణ సంతానంబులు, నీతిపథంబులుం బోలె నర్థావహంబులు, నిధులుం బోలె నదక్షిణ సంతానంబులునై యొప్పు గోగణములు"

ఈ వచనము శ్లేషతోఁ గూడిన, నానార్థపదజాలములతో నొప్పు వాక్య సముదాయము. ఇందు కొంతవఱకు బాణుని శైలి గోచరించుచున్నది.

"శైలంబులుంబోలె............నదక్షిణ సంతానంబులునై" వఱకు నీ వచన సముదాయమున బాణుని శైలినిఁ బోలిన వచనశైలి గోచరించుచున్నది.

ఇతని వర్ణనలు స్వభావోక్తి మధురములు, ఒక విషయమును వర్ణించునపుడు ఆ విషయమును తెలిపెడి అనేక పదజాలముల నుపయోగించుట - పాఠకులకు భాషా జ్ఞానమును కలుగఁజేయుటకై సమర్థమగును. అట్టి సమర్థమైనది, బాణుని శైలి వంటిది, ఎఱ్ఱయ వచన శైలి.

మూలమున శరదృతు వర్ణన :—

"తం శరత్కుసుమాపీడాః పరివార్య ప్రదక్షిణమ్
గావోగిరివరం సర్వాస్తతో యాంతు పునర్వ్రజమ్
హ. విష్ణు 16-13

ప్రాప్తా కిలేయంహి గవాం స్వాదుతోయతృణా గుణైః
శరత్ప్రముదితా రమ్యా గతమేఘ జలాశయా 16-14

ప్రియకైః పుష్పితైర్గౌరం శ్యామం బాణాసనైః క్వచిత్
కఠోరతృణ మాభాతి నిర్మయూరరుతం వనమ్ 16-15

విజలా విమలా వ్యోమ్ని విబలాకా వివిద్యుతః
వినర్ధంతే జలధరా విదంతా ఇవ కుంజరాః"— 16-16

ఈ విధములగు కేవల ప్రకృతి తత్త్వమును తెలుపు వాక్యముల పొందికతో సుదీర్ఘముగా వర్ణింపఁబడిన ముప్పది శ్లోకముల శరదృతు వర్ణన మూలమునందు గలదు. పాఠకులకు విసుగు జనింపవచ్చును ఎఱ్ఱయ హరివంశమున కేవలము తొమ్మిది పద్యములు నొక్క దీర్ఘవచనముతో ముగిసినది.

16-17 నుండి

"పటునా మేఘవాతేన నవతోయానుకారిణా
పర్ణోత్కరఘనా స్సర్వే ప్రసాదం యాంతి పాదపాః
సిత పర్ణాంబు దోష్ణీషం హంస చామర వీజితమ్
పూర్ణచంద్రామలచ్ఛత్రం సాభిషేక మివాంబరమ్
హంసైః ప్రహసితా నీవ సముత్కృష్టాని సారసైః
సర్వాణి తనుతాంయాంతి జలాని జలదక్షయే
చక్రవాక స్తనతటాః పులినశ్రోణి మండలాః
హంస లక్షణహాసిన్యః పతింయాంతి సముద్రగాః
కుముదోత్ఫుల్ల ముదకం తారాభిశ్చిత్రమంబరమ్
సమ మభ్యుత్స్మయంతీవ శర్వరీష్వితరేతరమ్
మత్త క్రౌంచావ ఘుష్టేషు కలమాపక్వ పాండుషు
నిర్విష్ట రమణీయేషు వనేషు రమతే మనః" 16-22

ఈ పైశ్లోకము లందు అలంకారశోభను, ఉక్తి వైచిత్రిని గలిగిన రెండు మూఁడు మాత్రము గ్రహించి ఎఱ్ఱయ తెనిఁగించినాఁడు. తక్కిన వానిని వదలి వైచినాఁడు.

"సితం వర్షాంబుదోష్ణీషః" అను శ్లోకమునకు ఎఱ్ఱయ అనువాదము -

"శరదంబరం బమరె మద్యద్రాజ చిహ్నంబులన్" - అని యారాజునకు - వర్షోదకధారలు అభిషేకముగా శుభ్రాభము కిరీటముగా, సంక్షుభ్యన్మరాళావళులు, ఘనవాలవ్యజనములుగా, కాంతేందు బింబము ఆతపత్రముగా" పట్టాభిషేకము గావించినాఁడు.

మూలమును యథాతథముగ ననువదించి శరదృతు శోభను తెలుఁగువారికి చూపించెను.

తక్కిన "హంసైః ప్రహసితా నీవ" మొదలు - "వనేషు రమతే మనః" వఱకుఁ గల శ్లోకముల సారమును గ్రహించి సంక్షేపించి, ఒక్కపద్యము నందిమిడ్చి, ఆలంకారికారిక శైలిలో రచించి తన ప్రబంధ పరమేశ్వరత్వమును నిరూపించుకొనినాఁ డెఱ్ఱయ.

"తెలినవ్వుల్ వెలిదమ్మి.........శరత్కల్యాణ కల్యాకృతిన్" అని తెల్లదామరలను తెలి నవ్వులుగా, మదలోల భృంగరచనలు చూపులుగా, వీచీ భుజావళి యాలింగనకేళి కుతలపడుచుండ వార్ధినిఁ గూడుటకై నేఱులు పరుగులిడినవి".

ఇచ్చట మూలమునందలి చక్రవాకస్తనతటములు, పులినశ్రోణి మండలములు, తొలఁగింపఁబడినవి. పండిన వరిధాన్యముల పరుసలులేవు. మదమత్త క్రౌంచపక్షుల నాదములు వినిపించవు.

ఇట్లు ఎఱ్ఱయ రమ్యమైన ఆలంకారిక శైలి ఉన్నంతవఱకును మూలమును యథాతథముగనే గ్రహించును. చతురోక్తులున్నంత వఱకు గ్రహించును సరసములగు వానిని యథాతథముగా తెనిఁగించును. 'చక్రవాక స్తనతటీ' త్యాదుల పునరుక్తమైన వానిని పరిహసించినాఁడు. ఇదే గ్రంథమున నివి రెండుమూఁడుచోట్ల తటస్థించుటచే తొలఁగించినాఁడు.

మూలము నందలి సుదీర్ఘమగు వర్ణన కథాగతి భంజకముగా నుండునని భావించి యుండవచ్చును.

మూలము నందలి శ్లోకములలో శరదృతువర్ణన ప్రకృతి యందు దాయా సందర్భములందు కలుగు విశేషములు దీర్ఘముగా వర్ణింపఁబడినవి.

మేఘము లుండవు గనుక చంద్రుఁడు మిక్కిలి ప్రకాశించును సూర్యుడుఁ మిక్కిలి ప్రకాశము నొసంగును. రాజు లీ శరదృతువు నందే జైత్రయాత్రకు వెడలు దురు. ఈ శరదృతువునందు జరుగు విభిన్న కార్యములను ఎఱ్ఱయ వర్ణించక వదలి వేసినాఁడు.

"గోవులు పాలను ద్విగుణముగా నొసంగినవి. వృషభములకు మదము ద్విగుణీకృతమైనది." వంటి శ్లోకములలోని భావమును మాత్రము గ్రహించి ఎఱ్ఱయ తన సహజ ధోరణిలో వర్ణించినాఁడు.

"పిదుఁక గొలఁదిగాక పెయ్యలు దనిసె. క్రేపల్లె పసుల పాలు సేఁపి గురియ, పాలవెల్లి యయ్యెనో యనునట్లుగ కాశపుష్పము లంతటను వికసించినవి :— కాశపుష్ప వికాసమును పాలవెల్లి గా చమత్కరించినాఁడు.

తక్కిన శ్లోకములను అనువదించలేదు. మూలమున వర్ణనమును చాలవఱకు సంక్షిప్తపఱచినాఁడు. "శరత్కాలము" రాజుమూర్ధాభి షిక్తుఁడైనట్లు" అనుశ్లోకమును తెనిఁగించినాఁడు. ఈ శ్లోకమును యథామాతృకముగా వర్ణించినాఁడు.

"తారకిత గగన చక్రము" అను పద్యము "కుముదోత్ఫుల్ల" అను శ్లోకమున కనువాదమే! "చక్రవాక స్తనతటీ" అను శ్లోకమున కనువాదములేదు.

మూలమున - శరత్కాలమున - బంధూక పుష్పములు తామ్ర కర్ణములతో ప్రకాశించుచున్నవి. వరుసగా అసన పుష్పములు, సప్తపర్ణములు, కోవిదారములు, బాణాసనములు, నికుంభములు - వరుసఁగా వికసించి వెలుగుచున్నవి. కాని ఎఱ్ఱయ హరివంశమున - గోపభామినులకు బంధూకములు తిలకములైనవి. సౌగంధిక పుష్పములు కర్ణావతంసములైనవి. అసన పుష్పములు మదనుని బాణములయి విరహులకు వ్యసనము చేకూర్చినవి.

ఎఱ్ఱయ శారద చంద్రికలు - గోపకన్యారమణీయగీతుల - చాల మహోత్సవమైనది. శారదరాత్రులు రతీశ్వరప్రియ కథలతో నొప్పినవి. అప్పుడు ఉదంచిత ధేను విదోహనధ్వనులు, సదర్ప వృషభ గర్జితములు విస్పించుచున్నవి. ఇది మూలమునలేని ఎఱ్ఱయ సృష్టి.

మూలమున లేని ఎఱ్ఱయ సృష్టి మఱొక్కటి - అది సుదీర్ఘ వచనము. గోవుల స్వరూప వర్ణన. శరత్సమయము నందు - అతి ధవళములగు గోవులొప్పుచున్నవి. వానిధావళ్యమును - గంగా తరంగములు, అనంగ దమన హాసవికాసములు, అమృత

పయోధి ఫేనపటలములు, కర్పూర పుంజము, కుముదములకాంతి, ముక్తామణి సముదాయము, - వీనితోపోల్చి ఆ శరత్కాలమున తన మనో నేత్రములతో వాని ధావళ్యమూహించి యానందించినాఁడు ఇది ఎఱ్ఱయ గోవులయందు రక్తిని ప్రకటించు వర్ణన. మూలమున లేదు. ఎఱ్ఱయకు గోవులపై ప్రీతిచే కలిగిన కల్పన. అంతటితో వదలలేదు.

వాని స్కంధములు మహా తరుస్కంధముల వలె ఉన్నతములైనవి. శైలముల వలె యెత్తైన శృంగములు గలవి. చంద్రకిరణములవలె నంతట వ్యాపించినవి. అంతటితో నాగలేదు ఎఱ్ఱయ వీనిని శ్లేషతో నలంకరించినాఁడు. కృతయుగ ధర్మమెట్ల ఖండిత సంచారము కల్గియుండునో అట్లే వీని సంచారమును అఖండితము. శంకరుఁడు నందీశ్వరుఁడు లేక సంచారము గావింపఁడు. ఇవియును వృషభములతోడనే సంచరించునవి. శ్రుతుల వైభవములు వేదములు లోకోద్ధారమే ప్రయోజనముగా గలవి. ఈ గోవులును లోకోద్ధారమే ప్రయోజనములుగా గలవి. విష్ణుకీర్తనము శ్రవణ మంగళము. ఈ గోవలు శ్రవణమంగళములే; అధ్వరములందుత్సవములు - దర్శన పావనంబులు. ఈ గోవులును దర్శనముచే పవిత్రమొనర్చునవి. పుణ్యతీర్థములు నిత్యనిర్మలములు ఇవియును నిత్యనిర్మలములే. మంత్రములు రమణీయములు. ఇవియును రమణీయములు. దైవములర్చనార్హములు. ఇవియును అర్చనార్హములు. గురువులు నిరంతరాను వర్తనముచే సంతోషింపఁజేయువారు. ఇవియు సంతోషింపఁ జేయునవి. సంపదలు సమస్త లోకములకు నాశ్రయింపఁదగినవి. గోవుల ఆశ్రయింపఁదగినవి. భావములు రసమును కలిగించునవి. గోవులును - గోరసమును కలిగించునవి. ఆచారములు సంతతి గలవి. ఇవియును సంతానము గలవియే; నీతిమార్గములు అర్థములను కలిగించునవి. ఈ గోవులను అర్థమును కలిగించునవి. సిధులు దక్షిణ లేకనే సంతానము కలవి. ఇవియు అదక్షిణ సంతానము గలవి".

ఇట్టి గోగణము లెఱ్ఱయవి - మూలమునలేనివి. ఎఱ్ఱయ హృదయజన్య భావవినిర్గతములైనవి. ఎఱ్ఱయకుఁగల గ్రామీణ జీవితమునందలి అనురక్తిని, గోవుల సాంగత్యము నందలి ఆసక్తిని, ఈ వచన రచనావైదగ్ధి యందు చూపించినవాఁడు. ఆ వాక్యములందలి విన్యాసవైఖరి - ఇతనికి వాక్యములను రచించుట యందుఁ గల నైపుణిని ప్రదర్శించును. ఈ భావములు చతురోక్తి భూషితములు,

బాణుని వాక్యరచనా స్వరూపమును తలపింపఁజేయుచున్నది. ఉన్నత గిరి శిఖర ఝరీ వేగముతో సాగిపోవునట్టిది. అలంకారములతో తొణికిసలాడుచున్నది. ఇతనికిఁగల శాస్త్రజ్ఞానమును వెల్లడించునది "భావంబులుంబోలె రసజనకంబులు, సమయంబులుం బోలె నక్షీణ సంతానంబులు, నీతిపథంబులుంబోలె నర్థావహంబులు, నిధులుంబోలె నదక్షిణ సంతానంబులు" - వంటి వాక్యములు - శ్లేష చమత్కారముతో నొప్పి, యాతనికిఁ గల పాండితీ వైభవమును ప్రదర్శించుచున్నవి.

రాబోవు వర్షమును సూచించు చిహ్నములు.

ప్రకృతి యంత అతివృష్టి సంభవింప నున్నది. అప్పుడు -

సీ॥ "శివుదిక్కునందు వేకువఁ గోల మెఱుఁగులు
మెఱసె నచ్చోన సమీరణుండు
పుట్టి తీవ్రత నేలఁ బెట్టుఁగా జఱచుచు
విసరి బీరెండతో నెసఁగె నుమ్మ
యూఁగ మిక్కుట మయ్యె నెఱనింగిఁ గడు మించె
నిడుదలై తిలకించె నీరుకాళ్ళుఁ
బడమట నిరుదెసఁ బ్రతిసూర్యములు దోఁచె
నంబరంబునఁబర్వెనా గడపలు

తే.గీ॥ పిన్న బిడ్డ లెయ్యెడలఁ బింపిళ్ళుగూసి
రంధ్రి తలములు సిమసిమ యనియె జనుల
శిఖిల తృణలతా తరు నిచయంబుఁ జీడ
వట్టె నిట్టలంబుఁగ జడిపట్టు బొందె    హ. వం. 1-7-160

కం॥ సురపతి దిక్కునమెఱుపు భూ
ధరముల పెలి మొగులు గప్పెఁ దప్పదు వర్షం
బరుదిది యకాలమున నని
దొరకొని చింతిలిరి గొల్ల దొరలెల్ల మదిన్"    I-7-161

ఇది ఎఱ్ఱయ - అతివృష్టికి పూర్వము వర్షమును సూచించుటకై చేసిన వర్ణన-

ఈశాన్యదిశలో కోలమెఱుగులు మెఱిసినవి. అచ్చటనుండియే గాలులు తీవ్రముగ వీచినవి. బీరెండలో నుమ్మ - ఈగలు - మిక్కుటములగుట - ఆకసమున మెఱపు లతిశయించుట ఆకసము ఎఱ్ఱబడుట - నీరుకాళ్ళు విడుదలై తిలకించుట ప్రతిసూర్యస్సులు అంబరమున నగుపించుట - దొంతులు దొంతులుగా మేఘములు వ్యాపించుట - పసిబాలురు పింపిళ్ళు కూయుట - అంఘ్రితలములు సిమసిమయనుట ఎల్లిప్రయ కాలమున రాబోవు వర్షమును తెలిసికొను చిహ్నములు. ఇది మూలమునలేని వర్ణన

ఎల్లిప్రయనాఁటి కిట్టి విశేషము లాకసమునందు, ప్రకృతి యందును గాంచి ప్రజలు వర్షాగమమును గుర్తించు చుండుట గలదు. ఈనాటికిని పల్లెలలో నిట్టివానిని చిహ్నలను గుర్తించి పల్లెప్రజలు వర్షము తప్పక కుఱియఁగలదని - దున్నుటకో విత్తులు నాటుటకో సంబరపడుచుందురు. ఇది ఎల్లిప్రయకాలమునాఁటి ఆంధ్రుల విశ్వాసము, ఎల్లిప్రయ విశ్వాసమును. ఇదియే ఎల్లిప్రయ తెలుఁగుదనము. తృణలతా తరునిచయములకు చీడపట్టుట - సురపతి దిక్కు (తూర్పు)న ఉఱుముట, పర్వతము లపై కప్పుట - వర్షము తప్పక వచ్చునని నిర్ణయించు సూచనలు, ఆనాటివి. గ్రామము లందీనాటివి కూడ. మూలమున లేని వర్ణనలు. ఇఁక అతివృష్టికి సంబంధించినది - అప్పటి ఎల్లిప్రయ వర్ణన -

సీ॥ దిక్కరిణీ బృంద మొక్కట యీనిన
  పిల్లలు దివిఁ బ్రబసరిల్లె ననఁగ
గోత్రా చలంబులు చిత్రవాతాహతి
  దెసఁ బెల్లగిలి మీఁద వెలసె ననఁగఁ
బాతాళమున నున్న బంధుర ధ్వాంతముల్
  వెడలి భానుని మ్రింగ నడరె ననఁగ
నిల నాల్గు చెఱఁగుల జలధులు నలిఁ రేగి
  కడళుల నభ మెక్కఁ గడఁగె ననఁగ

తే. గీ॥ నొప్పి యుద్ధర స్థూలపయోధరములు
దెసలు కడపటఁ బొడమి యాకసము మూసి
మెఱుగు జోతులు చూడ్కికి మిక్కుటముగ
నొదవెఁ బిడుగులు రాలును నుప్పతిల్లె. - 7-168

మ॥ వడినమ్మేఘచయంబుఁ దొరఁగు దుర్వారోద్యతాసారముల్
వడగండ్లుం బెరయంగఁ దీవ్రవిసరద్వాతూలముల్లూడి దం
వడిఁదోడ్తోడఁ బ్రవృద్ధినొంద ధ్వానాపృథివ్యంతరం
బెడ మొక్కింతయులేక యుండఁగగరంబేపారె నాపూర్ణతన్.
I-7-164

ఆ నల్లని మేఘములు పర్వతాకారములై భయంకరముగా గర్జించుచు ఆకాశమంతట వ్యాపించినవి అవి దిగ్గజముల బృంద మెక్కసారిగా ఈనిన పిల్లలు ఆకాశమంతట వ్యాపించి నట్లున్నది. గోత్రపర్వతములు చిత్రమెన వాతాహతిచే పెల్లగిలి మీద ప్రకాశించి నట్లుఁగ నుండినది. పాతాళమునందున్న భయంకరమగు నంధకారము బయలువేని సూర్యుని మ్రింగను వ్యాపించి నట్లున్నది

భూమి యందలి నలువైపులనుండి సముద్రములు విజృంభించి, ఆకాశమున కెక్కను పూనుకొని నట్లుండినది. కాఱుమబ్బులంతట వ్యాపించి ఆకాశమును మూపివేసి, మెఱపుకాంతులు మిక్కుటమై పిడుగులును రాలును నతిశయించినవి.

దీనికి మూలము -

"తతస్తే జలదాః ఘోరనాదా భయావహాః
... ... ... ... ... ... ... హ. విష్ణు 18-8

అబభౌ సర్వతస్తత్ర భూమిస్తోయమయీ యథా" - అని పదిశ్లోకములందు వర్ణింపబడినది. ఈ వర్ణన ఎఱ్ఱయ రెండు పద్యములలో ముగించినాఁడు.

"మేఘులు మేఘములతో నొరసి కొనుచున్న కొన్ని ఏనుగులవలె కొన్ని మకరములవలె నున్నవి" అను మూలమున భావము కంటె -

"దిక్కరిణీ బృందమీసి నట్లుఁగ — కులపర్వతములు గాలివిజృంభణకు పెల్లగిల్లి పైకిపోవుచున్నట్లున్నది" అనుట భయానక ప్రకృతిని తలపించు భావతీవ్రత.

"పర్వతాకారములగు మేఘములు గర్జించుచు వ్యాపించినవి" అనుటకంటె "గోత్రపర్వతములు చిత్రవాతాహతి వెసఁబెల్లగిలి మీఁదవెలసె" ననుట భయంకర స్థితిని తెలుపు భావము.

"అవి అన్యోన్యము కలసి యొకటి కొకటి సహస్రసంఖ్యలో, గజములవలె పోవుచున్న" వనుటకంటె – "దిక్కరిణీ బృందమొక్కట ఈనిన పిల్లలు దివిఁ బ్రస రిల్లె" ననుట ఆలంకారిక శైలిలో చిత్రిత మైనది. 18-13

"సముద్రం మేనిరే తంహిఖమారుఢం నృచక్షుషః' అను దానిని యథాతథ ముగ కొలఁదిమార్పుతో అనువదించినాఁడు.

"ఆకసము నధిరోహించిన సముద్రమని తలంచిరి" అనుటను "ఇల నాల్గు చెఱఁగుల జలధులు వలిరేఁగి

కడకుల నభమెక్కఁ గడఁగె ననఁగ" అని నలువైపుల నుండి సముద్రములు నలిరేగి నభమెక్కినట్లుగ కొంత పెంచినాఁడు. "ద్యాపాపృథివ్యంతరం బెడమొక్కింతయులేక యుండఁగఁ గరం బేపారెనా పూర్ణతన్" – అనుట ఎఱ్ఱయ వర్ణన. మూలమున – "శృహస్తములవోలె, నాగహస్తములభాంతి వేణువులవలె వర్షధారలు పడినవి" అని కలదు.

ఇట్లతి జాగ్రతతో మూలమును పరిశీలించుచు ఎఱ్ఱయ మూలమునకు మెఱుఁగులు దిద్దుచు వర్ణనలఁ గావించుటఁ జూడ-నందులకే అతఁడు ప్రబంధపరమేశ్వరుఁడయ్యెనని తెలియుచున్నది. "నైవాపతన్ ఖగమా" వంటి శ్లోకముల భావములను పెంచి ఇంకను వివరముగ ఎఱ్ఱయ వర్షానంతర స్థితిని వర్ణించు సందర్భమున రచించినాఁడు. అందులకే ఇట నాశ్లోకముల కనువాదము వదలివేసినాఁడు.

కంసుని పనుపున అక్రూరుఁ డేతెంచినాఁడు. అతఁడు మహాయోగి; పరతత్త్వ సాక్షాత్కారము పొందిన జ్ఞాని. శ్రీకృష్ణునే పరమాత్మఁగా దర్శించి కొలుచువాఁడు. అయినను కంసుని యాజ్ఞకు తలయొగ్గి కృష్ణునిఁగొంపోవవచ్చినాఁడు. వచ్చి కృష్ణునిఁ గాంచినాఁడు. కాంచి, బహువిధ భక్తిభావములతో పరవశించినాఁడు. వసుదేవుఁ డాతని తండ్రి అని తెలియఁ జేసినాడు. అసిశమును అతఁడు కంసుని వలని భయముతో కుందుచుండుటను వివరించినాఁడు. అనవరతము జనని యగు దేవకీదేవి పడుబాధల నుగ్గడించినాఁడు.

"అలనాఁడు విలయార్ణవమగ్నయగు భూదేవినే ఉద్ధరించితిపె? ఈనాఁడు విపజ్జలధిని మునిఁగిన జననిని తేర్చక ఉదాసీనుఁడ వయితివేల?" అని మేల్కొలిపినాఁడు.

"సమస్త జగములకు అభయమిచ్చి కావఁజాలినవాఁడ"వని ఆతని యవతార తత్త్వమును స్మరణకు తెచ్చినాఁడు. ఆ రాత్రి యంతయు శ్రీకృష్ణుఁ డీవిచారమునందే మేల్కొని గడపినాఁడు. సూర్యోదయ మగుచున్నది.

కం॥ రజని తనుఁబాసి పోఁ గను
ప్రజనిత భయ తాప భర విభావితమై వ
ర్ణ్యజితాత్ముఁడయ్యె నితఁడన
రజని కరుఁడు దొరఁగె రుచి పరంపర నెల్లన్.

హ. వం. I-8-162.

రజని తన్నుఁబాసి పోయినది. అందులకు చంద్రునకు భయతాపములు, జనించినవి. ఆ తాప భారము భయాధిక్యముచేత వివర్ణము నొందినట్లుగ రజనికరుఁడు తనకాంతులను దొరగెను.

ప్రకృతిలో - రజని తన్నుఁబాసిపోయినందులకు చంద్రునకు భయతాపములు. ఇంతవఱకు నాయకుఁడగు శ్రీకృష్ణుఁడు తానవతరించిన లక్ష్యమును విస్మరించినాఁడు 'కంసనాశము' అనుకర్తవ్యపథమున నంధకార మావృతమై యుండినది. ఆ అంధకారమిపుడు తొలఁగిపోయినది. కర్తవ్యమార్గము స్పష్టమైనది. "గురుతరకార్యభారము నింతవఱకు విస్మరించియుంటినే ?" అనెడి వ్యథ - దేవకీ వసుదేవుల దయనీయస్థితి - తన అవతార కార్యనిర్వహణ - వీనిపై అంధకారమను తెర - అదే రజని-వ్యాపించి యుండినది. అజ్ఞాన మావరించియుండినది. అంధకారమునకు అజ్ఞానమునకు సామ్యము. ఇది కవి సమయము. ఆ రజని ఇపుడు తొలఁగిపోయినది. కర్తవ్యవిస్మృతి కలిగియుండి నందులకు నాయకునకు వ్యథ - ఇచట కథాపాత్రయగు శ్రీకృష్ణునకు ప్రకృతియగు చంద్రునితో సామ్యము. ఇట్లు నాయకుని సుఖదుఃఖములు ప్రకృతిలో భాసించినవి.

కం॥ "కలయఁగడిపోయి యెందుం
జలితములై రాలె నాకసంబున్ర మానం
గల పూవులనఁగ దారక
ములుగానంగ రాక యడఁగిపోయెందోడ్తోన్". I 8-163

ఆకసమను మ్రాను ఆ మ్రాకు పండలి పూలు నక్షత్రములు. ఇచట శ్రీకృష్ణుని మానసాకాశమున నంతవఱకును వెలుగొందు చుండిన సుహృద్భావ స్మృతులు - అనురాగబంధములు- అనునక్షత్రములు జలజలరాలిపోయినవి అనఁగా సంబంధములు స్మృతిపథమును వీడిపోయినవి. అప్పటి వరకును అతఁడు గడపిన జీవిత నాటకమునందలి - నందగోపతనయ ప్రాతాళీవయము - అను అంకమునకు తెరపడిపోయినది.

ఆ బృందావనము, ఆ బాలగోపాలురు, ఆ గోపికల ముగ్ధభక్తి - ఆ గోగణముల మూగవోయిన అనురాగము - ఈ అనుభవముల అనురాగ బంధము - అను వెలుగు నక్షత్రములు జలజలరాలిపోయినవి. ఒక్కసారిగా స్మృతిపథమునందలి ఈ బంధమును ఛేదించుకొని కర్తవ్యపథమున పడినాఁడు శ్రీకృష్ణుఁడు దుష్టశిక్షణ - శిష్టరక్షణ ధర్మసంస్థాపనము - ఇతని అవతార ప్రయోజనము. అనురాగబంధములను త్రెంచుకొని వ్రేపల్లె నుండి బయలుదేరినాఁడు. అపుడు ఎఱ్ఱయ చిత్రించిన ప్రకృతి స్వయముగా నతనికి వీడ్కోలొసంగు చున్నది.

"వెరవుతోడ వేకువయను వెజ్జుతూర్పు
దిక్కు కెంపను మందునఁ దేర్చినొక్క
తిమిర కాలాహి విషమూర్ఛనముల ననఁగఁ
దెలిసె నెత్తమ్ము లొప్పులఁ దలకొనంగ" హ, వం. I-8-184

అంధకారమను కాలసర్పము కాటువేసినది. ప్రకృతి విషమూర్ఛనములందు మునిగినది. అపుడు వేకువయను వైద్యుఁడు ఉపాయముతో వచ్చినాఁడు. తూర్పు దిక్కున 'కెంపు' అనుమందుచే ప్రసన్నత నొందించినాఁడు. నెత్తమ్ములకు చైతన్యము కలిగినది. అనఁగా జ్ఞానబోధయయినది.

ఇంతవఱకును కాలమను సర్పము కాటువేయఁగా సహృదయ సరోజములు అజ్ఞానమున ముకుళితములైయుండినవి. అక్రూరుఁడను వైద్యుఁడేతెంచినాఁడు. ఆ ప్రదేశమును "కెంపు-రక్తిమ" అను మందున - వర్ణమున ముంచినాఁడు. అప్పటి వఱకు సత్పురుషహృదయ సరోజములు విషమూర్ఛితములై యుండినవి. ఆ బాల గోపాలుఁడే అవతారపురుషుఁడని దేవకీ దేవి అష్టమ గర్భమున జనించిన వాఁడని, కంసుని చంపఁబోవు అవతార పురుషుఁడని తెలియదు. ఇట్లు కాల మహి

మచే అజ్ఞాతముగా నుండిపోయిన సత్పురుష మానస సరోజములకు ప్రబోధము కాఁగలదు. జ్ఞానము ప్రకాశింపఁగలదు. అట్టి అజ్ఞానాంధకారమును పోగొట్టుటకై వచ్చిన ముఖ్యుడు - వైద్యుఁడు - అక్రూరుఁడు. ఇతఁడు తాను ప్రవేశించిన దిశను - ప్రదేశమను 'రక్తిమ' అను మందున ముంచినాఁడు ఈ రక్తిమ అనురాగమునకు పర్యాయపదము. క్రోధమునకు ప్రతీక. రజోగుణమునకు మఱొక రూపు.

ఇట్లు సాధు సత్పురుషులు అవతారపురుషుఁ డితఁడే యని తెలిసికొనఁగలరు. కంస విధ్వంసనకై జన్మించిన పరమాత్మతత్త్వమితఁడే యని యానందింపఁగలరు.

"తెలిసె నెత్తమ్ములొప్పులఁ దలకొనంగ-"

సాధువుల హృదయ సరోజములకు మనోహరముగా జ్ఞానోదయమైనది. సాధువులకు -సత్పురుషులకు ఇతనియెడ అనురాగముదయించఁ గలదు. ఈ దుష్టుల సంహరించు నిమిత్తము భగవానుఁడు సత్త్వగుణమును విడనాడి రజోగుణమును - ప్రదర్శింపఁబోవు చున్నాఁడు. ఇన్నింటికి కారణభూతుఁడు అక్రూరుఁడు. అవతార పురుషుని ప్రభావావిష్కరణముచే సజ్జన హృదయ సరోజములు మేల్కొననున్నవి. వికసింపనున్నవి.

ఇందులకు నాంది - అక్రూరుఁడను వైద్యునిరాక.

ఇట్లు భావిని సూచించు ఎఱ్ఱయ వర్ణన అపూర్వకల్పనము. మఱికొన్నింటిని ఎఱ్ఱయ ప్రకరణానుగుణముగ సూచించును.

కం॥ కాళింది సారసారవ
కోలాహల మద్రిధరునకును శుభయాత్రా
కాల మెఱిఁగించె సమ్మిళి
తాలోల రథాంగ మిధున హర్షధ్వనులన్"

హ. వం. I-8-169

బాల్యము నుండియు నాతఁడనుదినము సంచరించుచుండిన కాళిందీ నది. ఆ పరిసరములు. అచ్చటి సారసపక్షులు తమతమ కోలాహలములచే - రథాంగ మిధునములు తమ తమ హర్షనాదములచే గోవర్ధనోద్ధారికి శుభ యాత్రాకాలము నెఱిగించినవి. ఇచట ప్రకృతి శుభ శకునములను సూచించినది.

కం॥ గోవర్ధన నిర్ఝరముల
పై వేమఱు సుడిసి గోపబర్హామయ వతం
సావళి గదల్చుచును బృం
దావన పవనము మెలంగెఁ దద్ద్విజ మలరన్ I-8-165

అప్పటి బృందావనము నందలి పవనము, శైత్యమాంద్యములతో ఆ లీలా మానుష విగ్రహుని సేవించినది. గోవర్ధన పర్వతమునందలి నిర్ఝరములపై వీచి, అచ్చటి శీకరములను గ్రహించినది గోపుల బర్హమయా లంకరణములను కదల్చు చున్న దనఁగా మాంద్యమును తెలియఁజేయుచున్నది. ఇట్లు శైత్య మాంద్యములను కలిగిన మారుతము నాయకుని సేవించినది. అతఁడు ధర్మనిర్వహణకై పూనుకొనుట ప్రకృతి కెంతయు సంతసము. అందుకే సేవించుట.

అంతట -

కం॥ కంసారి సురవిరోధి
ధ్వంసమునకుఁబోవు కృష్ణు దర్శించుటకా
శంసఁ జనుదెంచె ననఁగా
హంసుఁడు ప్రాక్పర్వతంబు నందుదయించెన్ I-8-171

దుష్టరాక్షసుడు, దురంతముల కధినేత. లోకకంటకుఁడు అగు కంసుఁడు మొదలగు సురవిరోధుల ధ్వంసమునకై పోవుచున్నాఁడు-ఆ లీలామానుషవిగ్రహుఁడు అతఁడాచరింపఁ బోవుకార్యము దుష్టనాశము. దుర్మతి భంజనము. అది శిష్ట జనులకు శుభావహము. అందులకే సాక్షాత్కర్మ సాక్షియే తూర్పుదిక్కునందు నాయకుని సందర్శించుటకై చనుదెంచునో యను నట్లుదయించెను.

ఇఁక నీ సందర్భమునందు మూలము నించుక పరిశీలింతుముఁ

"తతః ప్రభాతే విమలే పక్షివ్యాహారసంకులే
నైశాకరే రశ్మిజాలే క్షణదాక్షయ సంహృతే
నభస్యరుణ సంస్తీర్ణే పర్యస్తే జ్యోతిషాం గణే
ప్రత్యూష పవనాసారైః క్లేదితేధరణీ తలే
క్షీణాకారాసు తారాసు సుప్త నివృత్తిభాసుచ
నైశమంతర్దధే రూపముద్గచ్ఛతి దివాకరే॥

నిర్మలమైన ప్రభాతము. పక్షుల కలకలనాదము. రాత్రి సమాప్తమైనది. చంద్రుఁడును తన కిరణజాలముల సంహరించుకొనినాఁడు, అరుణోదయకాంతులు ఆకసమున వ్యాపించినవి.. నక్షత్రసముదాయమస్తమించినది. ప్రాతఃకాలీన పవనము– హిమబిందువులతోపాటు పృథ్వినాక్రమించినది. నక్షత్రములు క్షీణించినవి. సూర్యోదయమై నంతనే నిశారూప మదృశ్యమైనది

ఎఱ్ఱన ప్రకృతి నాయకునితో సామ్యము నొందినది. ఇచ్చట ఆ సామ్యము లేదు. వర్ణన ధ్వనిపూరితము కాదు.

కేవలము ప్రభాతకాలమున పక్షుల కలకలములు, అరుణోదయకాంతి ప్రసారము, నక్షత్రముల అస్తమయము, ప్రాభాతిక పవనము –వంటి ప్రాతః కాలమున జరుగు ప్రకృతివికారము యథాతథ వర్ణన. ఎఱ్ఱయ ప్రకృతి నాయకునితో – ప్రబంధపాత్రతో సామ్యము నొందినది.

శ్రీకృష్ణుఁడు కపిత్థ వృక్షము నున్మూలించినాఁడు. అప్పుడు ఆ కృష్ణుని యమునానది గాంచినది. హర్షోత్ఫుల్ల యైనది.

"పౌరుషము మెచ్చిముదము నిండార నగుచుఁ
గౌగిలింపఁగ నేతెంచు కరణి నొప్పెఁ
బ్రకట ఫేనయై కడలచే బారసాఁచి
హరికి నభిముఖముగఁబొంగు తరణికన్య"

నాయకుఁడతి పౌరుషముతో విషవృక్షము నున్మూలించినాఁడు. విజయోత్సవము ననుభవించినాఁడు ఆతని పౌరుషమునకు యమునా నది మెచ్చినది. ముదము నిండార నగుచున్నది. ఆతని నానందముతో కౌగిలింప నేతెంచుచున్నదో యను నట్లుండినది. ఫేనములు ప్రకటములైనవి. అవి హాసన్ముఖ లక్షణములు. కడలు తరంగములు తరంగములను చేతులు చాపినది. హరి కభిముఖముగ పొంగిపోయినది.

ఇచట ప్రకృతి – కథాపాత్రయొక్క వీరత్వమునకు మెచ్చి, పొంగి మనసార నవ్వుచు, ఆలింగనము గావించుకొనుటకై వచ్చినట్లుఁగ నున్నదఁట. ప్రకృతి పరవశించి శౌర్యపరాక్రమముల నభినందించు చున్నది. ఈ పద్యమునకు మూలములేదు. ఇది ఎఱ్ఱయ వర్ణనా వైదగ్ధి మూలమున లేని వర్ణనలు.

"శీతాంశుశ్శాంతకిరణో నిష్ప్రభ స్సమపద్యత
ఏకో నాశయతే రూపమేకో వర్ధయతే వపుః

శీతాంశువు శాంతకిరణుఁడైనాఁడు. కాంతి విహీనుఁడైనాఁడు. ఒకఁడు తన రూపమును నాశము గావించుకొనుచున్నాఁడు. మఱొక్కఁడు తన శరీరము నభివృద్ధి పఱచుకొనుచున్నాఁడు. ఇది రాబోవు కంసనాశమునకు, కృష్ణుని యభివృద్ధికి సూచకములే! ఈ శ్లోకమున కంసవినాశము, కృష్ణుని అభివృద్ధి సూచితములైనవి. దీనిని ఎఱ్ఱయ అనువదించలేదు. పూర్తిగా తొలఁగించినాఁడు.

"ఏకో నాశయతే రూపమేకో వర్ధయతే వపుః"

- అను ఈ వాక్యమున "ఒకఁడు రూపమును నశింపఁజేసికొను చున్నాఁడు. మఱొకఁడు శరీరము నభివృద్ధి పఱచుకొనుచున్నాఁడు" అని వివరించుచు, సూర్యుఁడుదయించుచున్నట్లు, చంద్రుఁడు శాంతకిరణుఁడైనట్లు వర్ణించుట ఎఱ్ఱయ అనువాదమున లేదు. మూలమున నీశ్లోకము కంసుని చంద్రునిగను, శ్రీకృష్ణుని సూర్యునిఁగను సూచించుట తగదని ఎఱ్ఱయ భావించి యుండవచ్చును కంసుఁడు రాక్షసుఁడు; దుష్టుఁడు. శ్రీకృష్ణుఁడు దైవాంశ సంభూతుఁడు; దుష్ట శిక్షకుఁడు. రాక్షసుని గూడ శ్రీకృష్ణుని సాయిలో నుండునట్లు రెండు ప్రకాశమాన గ్రహములతో - దినకర నిశాకరులతో పోల్చుట వలదని ఆ శ్లోకమును అనువదించక పూర్తిగా తొలఁగించి యుండవచ్చును.

కాని మూలమునందలి యూహ బాగున్నది. చంద్రునికి గల నిశాచరత్వముచే రాక్షసత్వస్ఫూర్తిఁ గలుగుచున్నది.

అక్రూరుఁడు తోడితేర బలరామకృష్ణులు మధుర చేరినారు. అచట రామ కేశవుల నాశము గావించుటకై కంసుఁడు సర్వసన్నాహములు గావించి రాత్రి యగుటయు యథోచిత వర్తనంబున నుండే, ఉదయమకాసున్నది ఇఁక కంసనాశను జరుఁగబోవుచున్నది. శ్రీకృష్ణుఁడు కంసుని నాశము గావింపనున్నాఁడు.

అప్పటి ప్రకృతి :-

ఉ॥ కంసుని బాధలంబడు జగంబుల కింతట వేఁగుఁ గాక త
ద్ధ్వంశము వేగవేగుటయుఁ దానొడఁగూడఁ దెయన్నతిందమో
ధ్వంసమొనర్చి శౌరి కనుదమ్ముల తమ్ముల చాయనవ్వఁగా
హంసుఁడు ప్రాచ్య పర్వత శిఖాగ్రవతంసతనొందెనొప్పగాన్
హ, వం. I-9-87

ఇంతవఱకు దుష్టుఁడగు కంసుఁడు సత్పురుషుల పీడించు చుండినాఁడు. అతఁడు కలిగించిన బాధలకు జగమువేగిపోయినది ఇఁక ఆ జగములకు వేఁగగు గాక! అని ఒకవంశమున దుర్మార్గుఁడు జనించిన ముందావంశమును నాశమొనరించి పిమ్మట నాతనిని హత మార్చునట్లుగా – ఇచట సూర్యోదయము అంధకారనాశము – అనంతరము ఆ అంధకారమున చరించు నిశాచరుని వినాశము చేయఁదలచినట్లు భావించినాఁడు ఎఱ్ఱయ. అనంతరము తూర్పుగొండపై సూర్యుఁడు సిగమాసికమై వెలసినాఁడు, ఇచట శ్రీకృష్ణుఁడు రాక్షసరాజును చంపఁబోవుచున్నాఁడు. అచ్చట నతని వంశమగు నంధకారమును తాను ధ్వంసమొనర్చి, యానిశాచర నిర్మూలనకై రంగభూమిని సిద్ధము గావించినాఁడు. ఇచట నాయకునకు ప్రకృతి సాహాయ్య మొన రించినది.

కంసుని మరణానంతరము –

"అంతఁ గంస పతనావసానంబగు హరిపరాక్రమ కార్యప్రస్థానంబను సంధించి కృతకార్యుండ పోలె దివసకరుం డపరగిరి యవలి కఱిగె"

దివసకరుఁడు కంసుని పతనమునకు తానే కృతకృత్యుఁడైనట్లుగ భావించి నాఁడు. అపరగిరి యవ్వలి కరిగినాఁడు ఇచట ఎఱ్ఱయ ప్రకృతిని నాయకునితో తాదాత్మ్యము నొందించినాఁడు.

ఇందులకు మూలము –

"రజన్యాంతు నివృత్తాయాం తతస్సూర్యే విరాజితే
పశ్చిమం కంస సంస్కారం చక్రుస్తే యదుపుంగవాః"

హ. వం. 32–57

రాత్రి గడచిపోయినది. సూర్యుఁడు ప్రకాశించినాఁడు. ఆ యదుపుంగవులు కంసునకు సంస్కారముగావించిరి.

మూలమున ప్రకృతికి నాయకునితో తాదాత్మ్యం లేదు. కంసుని మరణా నంతరము శ్రీకృష్ణుఁడుగ్రసేనుని పట్టాభిషిక్తుసిఁ గావించినాఁడు బలరామ సహితుఁడై సాందీపని కడకేగి సకల విద్యల నభ్యసించినాఁడు. సర్వవిద్యాకుశలుఁడై వెనుతిరిగి వచ్చుచున్నాఁడు. ఆ సమయమున –

శా॥ ఉల్లంబుల్ వికసిల్ల మందపవనుండుద్గంధియై వీచె, వ
ర్తిల్లెన్భానుఁడు మేఘయుక్త విసరద్దీప్తి ప్రతాపంబుతో
ఉల్లాసంబు వహించె వహ్నులు విధూమోద్యచ్ఛిఖా శ్రేణి శో
భిల్లం బెల్లుగ వాసుదేవుని పురాభిప్రాప్తి వేళం దగన్

హ. వం I-9-216

వాసుదేవుడు పురమున ప్రవేశించును. అపుడు మందమారుతము వీచినది. "ఉల్లంబుల్ వికసిల" వీచినది పుష్పసుగంధమును వెదజల్లినది. భానుఁడు మేఘ నిర్ముక్త కాంతితో నుల్లాసమును వహించినాఁడు. వహ్నులు ధూమరహితములైన శిఖాశ్రేణులచే శోభిల్లినవి.

మూలమున -

"శివాశ్చ ప్రవవుర్వాతాః విరజస్కా దిశో దశ
దైవతానిచ హృష్టాని సర్వేష్వాయతనేషుచ"

హ. విష్ణు 34-37

ధూసర రహితములగు వాయువులు మంగళప్రదములై వీచినవి. సర్వమందిరములందు, గృహములందు దేవతలు హర్షించిరి.

ఇచ్చట మూలమును - ఎఱ్ఱయ వర్ణనయు నించు మించు సమానములై యున్నవి.

గాలులు మంగళప్రదములై వీచినవి. దశదిశల ధూసరములు లేనివై వీచినవి.

రుక్మిణీ వివాహఘట్టము :-

విదర్భ భూపాలుని తనయ రుక్మిణి. చేదిభూపతి తనయుఁడగు శిశుపాలునకు రుక్మిణి నొసంగ నిశ్చయమైనది. ఆమె వి కలిని కృష్ణునిపైన చంచలమగు వలపును నిలిపినది.

వివాహ సన్నాహములు జరిగిపోవుచున్నవి. వరుఁడై బంధుమిత్రులతో శిశుపాలుఁడు వివాహమున కేతెంచినాఁడు. ఆ సమయమున నారదునివలన రుక్మిణివలపు నెఱింగి శ్రీకృష్ణుఁ డచ్చటి కేతెంచినాఁడు. ఆ రాత్రి విడిదియందు పరిపరి విధముల తాను చేయవలసిన కార్యములను గుఱించి తలపోయుచు గడిపినాఁడు.

నిశాసమయము అంతమైనది, అప్పుడు

"పాడె మధువ్రతావళులు పద్మవనీ విభవంబు శాపముల్
వీడె రథాంగకంబులకు వేడుకఁగూడి తరంగడోలలం
దాడె మరాళదంపతులు హాసవిలాసముదక్కఁగ్రుక్కసన్
గుముద్వతీ ముఖము వాడిరినూడె తమో నిబంధముల్"

తుమ్మెదల సముదాయము పద్మినీ వైభవము గురించి పాడినది. మరాళ దంపతులు వేడుకఁ గూడి తరంగడోలల యందాడినవి. కుముద్వతీ ముఖము హాస విలాసము దక్కి వాడిపోయినది. తమో నిబంధకము వీడినది.

చక్రవాక మిథునములకు శాపము విడిపోయినది. చక్రవాక పక్షులు దాంపత్యమునకు ప్రతిబంధులు. ఆ చక్రవాకముల శాపము విడిపోయినట్లుగ లక్ష్మీనారాయణావతారులగు రుక్మిణీ వాసుదేవుల వియోగము విడిపోవును. మరాళదంపతులు వేడుకతోఁగూడి తరంగడోలల యందాడినట్లుగా, నీ యాది దంపతులు వేడుకతోగూడి శిష్ట రక్షణాది కార్యముల చేయ గలరు.

కుముద్వతీ ముఖము హాసవిలాసమును దక్కి, వాడినట్లుగా శత్రు సముదాయముల ముఖములు – అనఁగా శిశుపాలాదుల ముఖములు వాడిపోవనున్నవి. పద్మినులకు మనోవికాసము కలిగినట్లుఁగా సత్పురుష హృదయ సరోజములకు ఉల్లాసము కలుగనున్నది.

తమము నశించి జ్యోతి ప్రకాశింపఁగలదు. పాపములు, పాపులు నశించి సత్పురుషులు ప్రకాశింపఁగలరు.

"అరుణోదయా రాగంబునఁ
గరమలరెడు పూర్వదిఙ్ముఖంబున వెలసెన్
సరసిజ మిత్ర సమాగమ
పరమోత్సవ వార్త భువనపఙ్క్తుల కెల్లన్ హ. వం II-3-65

అరుణోదయ మగుచున్నది. అప్పటి రాగము – రక్తిమ. ఆ రక్తిమచే పూర్వ దిశా ముఖము వెలసినది సరసిజమిత్ర సమాగమ వార్త భువన పంక్తులకెల్ల తెలిసినది ఇది పరమోత్సవము – ఇందు అరుణోదయరాగము – రుక్మిణీకృష్ణుల అనురాగమును, సరసిజ మిత్రుల సమాగము – ప్రకృతి పురుషుల సమాగమమును తెలుపు చున్నది

ఈ సమాగమము - భువన మండలముల కెల్ల పరమోత్సవము. ఈ వర్ణనచే ఎఱ్ఱయ భావ్యర్థ సూచన గావించినాఁడు.

"తన తేజంబున నన్యతేజముల విధ్వంసంబు నొందించి యెం
దును సన్మార్గము సుప్రకాశ విగళద్దోషంబుఁగాఁజూపి య
త్యను రక్తోజ్జ్వల మండలుం డగుచుఁ బూర్వాద్రీంద్రభద్రాసనం
బున నొప్పెన్ గ్రహరాజు విశ్వము గరంబుం దన్నుఁ సేవింపఁగన్
హ. వం. 11-3-66

ఇదియు సూర్యోదయ వర్ణనయే!

గ్రహరాజు - గ్రహముల కధిపతి - సూర్యుఁడు. ఇతఁడు తన తేజమున నన్యతేజముల విధ్వంసంబు నొందించినాఁడు. దోషము (రాత్రి) జాఱిపోయినది. ఎందుకు సన్మార్గము (ఆకాశము) సుప్రకాశితమైనది. అనఁగా శిష్టరక్షణ, ధర్మస్థాపన జరుగుచున్నది. సూర్యమండల మత్యను రక్తిచే (ఎఱుపు) నుజ్జ్వలమైనది. అట్టి సూర్యభగవానుఁడు పూర్వాద్రీంద్రమున - భద్రాసనంబున నాసీనుఁ డైనాఁడు. ఇట్లు గ్రహరాజు విశ్వము తన్నుఁ సేవింపఁగా కరం బొప్పెను.

రుక్మిణీ పరిణయము - శిశుపాలాదుల పరాభవము, రుక్మిణీకృష్ణుల అనురాగ పూరిత దాంపత్యము, సత్పురుషుల మనోవికాసము - ఇవి యన్నియును నప్పటి ప్రకృతి వలనఁ దెలియుచున్నవి.

ఇచట సూర్యుఁడు తనతేజములో నన్యతేజముల విధ్వంసము నొందించినట్లుఁగా కావ్యనాయకుఁడగు శ్రీకృష్ణుఁడు శత్రువులగు శిశుపాలాదుల నాశము గావింప నున్నాఁడు. వాసుదేవుఁడును గ్రహరాజు సూర్యునివలె జగన్మిత్రుఁడు. కనుకనే విశ్వమాతని సేవించుచున్నది. అచ్చట దోషము (రాత్రి) పాపము, పాపులును జాఱిపో నున్నారు. ఇంతటి భావ్యర్థమును ధ్వనింపఁజేయుచున్న దిచ్చటి ప్రకృతి.

మూలమున నీ విషయ మేమియును లేదు. ఇది ఎఱ్ఱయ స్వేచ్ఛా కల్పన.

మహాలోక ఘట్టము :- ఒకసారి యజ్ఞ దీక్షితుఁడగు శ్రీకృష్ణుని కడకు బ్రాహ్మణుఁ డొకఁ డేతెంచెను. తన కుమారులు వరుసఁగా పుట్టిన వెంటనే ఏదో శక్తి చంపుచున్నదనియు, తన భార్య తిరిగి పూర్ణ గర్భవతి యనియు, ఈసారైనను

అట్టి శిశుహత్య జరగకుండ రక్షింపవలయు ననియు ప్రార్థించెను. కృష్ణు డా సమయమున యజ్ఞ దీక్షితుడు. అర్జునుఁడు తానే బ్రాహ్మణ కుమారుని రక్షించి వత్తునని కృష్ణుని అనుమతి పడసి బయలుదేరినాఁడు.

లీలామానుష విగ్రహుడు, జనన మరణ చక్ర సంధాతయు నగు శ్రీ కృష్ణునకు సాధ్యమగు కార్యమును అర్జునుఁడు చేయఁజాలునా ? సైన్య సమేతుఁడై యర్జునుఁడు బ్రాహ్మణుని గ్రామమును చేరినాఁడు. చుట్టును సైన్యమును విడియించి, అందరును విశ్రాంత వాహను లైనారు.

ఆ సమయమున —

చ॥ ఖరకరుఁడున్న దిక్కున శృగాల ఖగావళి రూక్షఘోర దు
స్తరముగఁ గూయఁ జొచ్చె ఘన సంధ్యయ కాలమునందలిర్చె సం
బరమున భానుఁ డెంతయుఁ బ్రభారహితత్వము నొందె నుల్క భీ
కరముగ మ్రోగుచుం బడియె గాఢ పరాభవసూచకంబుగా దెల్పుచున్.

హ. వం. II -5-68

ఇచట ప్రకృతి యర్జుననకుఁ గలుగు కార్యహాని, పరాభవములను సూచించుచున్నది. సూర్యుని దిక్కున నక్కలు — పక్షులు భయంకరముగఁ గూయఁ జొచ్చినవి. అకాలము నందే దట్టమగు సంధ్య వ్యాపించినది. ఆకసమున ప్రభాకరుఁడును ప్రభా విహీనుఁడైనాఁడు. భయంకరమగు శబ్దముతో నుల్క మ్రోయుచు పడినది- ఇది అర్జుననకు జరుగఁబోవు గాఢ పరాభవమును సూచించుచున్నది.

బ్రాహ్మణ పత్ని ప్రసవించి , తిరిగి శిశువును కోల్పోవుట, అర్జునుడు రక్షింపలేక పోవుట - వీనికి దుష్ట శకునములు సూచకములు, విజయుని పరాభవము - విజయుని మిత్రుఁడగు వాసుదేవున కే విధముఁగా నుపకరింపఁగల దనునది ప్రశ్న -

విజయుని పరాభవముచే - శ్రీకృష్ణుఁడు తిరిగి బ్రాహ్మణుని పుత్రులఁ దేర బయలుదేరెను. బ్రాహ్మణుని మృత పుత్రుల బ్రదికించి. కార్యసాఫల్యముతో వచ్చెను. మృత్యుహస్తముల నుండి బాలకులఁ దెచ్చి తన యమానుష శక్తిని తెలియ బఱచెను. ఈ ఘట్టముచే శ్రీకృష్ణుని అమానుషతత్త్వము నిరూపిత మగు చున్నది.

ఇది నాయకుని పరతత్త్వమును స్థాపించు నట్టి ఘట్టము. కనుక నా పాత్రను పోషించుటకై ప్రకృతి - దుశ్శకునములు - సూచించుచు తోడ్పడినది. ఇదియే అప్పటి ప్రకృతి వర్ణన చేసిన కార్యము.

దీనికి మూలము -

"తత శ్శకునయోదీప్తా మృగాశ్చ క్రూర భాషిణః
దీప్తాయాందిశి వాశంతో భయమావేదయంతిమే
సంధ్యారాగ జపావర్ణో భానుమాంశ్చైవ నిష్ప్రభః
పపాత మహతీ చోల్కా పృథివీ చాప్యకంపత
తాన్ సమీక్ష్య మహోత్పాతాన్ దారుణాన్లోమహర్షణాన్
యోగ మాజ్ఞాపయం స్తత్ర జనస్యోత్సుక చేతసః
యుయుధాన పురోగాశ్చ వృష్ణ్యంధక మహారథాః
సర్వేయుక్త రథాస్సజ్జాః స్వయంచాహం తథాఽభవమ్.

హ. విష్ణు 112-3 నుండి 112-6

ఇవి మూలమున నర్జునుఁడు పలికిన పల్కులు. శ్రీకృష్ణుని మాహాత్మ్యమును అర్జునుఁడు స్వయముగ ధర్మజునకుఁ దెలుపు సందర్భము.

"తతః శకునయోదీప్తా మృగాశ్చ క్రూరభాషిణః"

అను మూలమున - ఎఱ్ఱయ - 'శకునము లగుపించినవి, 'మృగములు క్రూరముఁగ భాషింపఁ జొచ్చినవి' - అనుటకు - 'శకునయో దీప్తా' అనుట తొలఁగించినాఁడు. ఇది వాచ్యముగ చెప్పుట - దీనిని తొలఁగించి శకున స్వరూపములను వ్యంగ్యముఁగఁ జూపించినాఁడు. "ఎఱ్ఱయ - శృగాల ఖగావళి రూక్షఘోర దుస్తరముగఁ గూయఁ జొచ్చె" ననునది "మృగాశ్చ క్రూర భాషిణః" అను దాని కనువాదము. మృగము లెన్నియో, యేవో మూలమునందు లేవు అదియునుగాక కొన్ని మృగములు అరచినచో శుభము. మఱికొన్ని మృగముల అరపులు అరిష్టదాయకములు. కనుక ఎఱ్ఱయ 'మృగములు' అని యనక 'శృగాల ఖగావళి' యని తెలిఁగించినాఁడు. సవరించినాఁడు. 'భయమావేదయంతిమే' అను దాని కనువాదము లేదు. ఆ భయ మూహించుకొన వలసినదే కాని చెప్పనవసరము లేదని ఎఱ్ఱయ భావించి యుండవచ్చును. ఇట్లెన్నో సూక్ష్మ విషయములనుఁ గూడ గమనించుచు ఎఱ్ఱయ అనువదించినాఁడు.

ఇది యాతని సూక్ష్మ పరిశీలనా శక్తికి నిదర్శనము.

శ్రీ కృష్ణుడు కైలాస పర్వతమున కేగనున్నాఁడు.

1) శివుని ధ్యానించి పుత్రత్వ సిద్ధి నొందుట.
2) బదరీ వనమున ననవరత తపో నియమ వ్రత సిద్ధులు, అఖిల సిద్ధాంత దర్శనులు, జీవన్ముక్తులు నగు మునీంద్రుల నభినందింపఁ గనుట.
3) పరమేశ్వరునకుఁ దనపైఁగల పక్షపాతమును నారదాది యోగివరులకుఁ దెలుపుట- ఇది యాతని కైలాస గమనమునకు ఫలముఁగా కాంక్షించినవి. ఇందులో పుత్ర ప్రాప్తి ప్రద్యుమ్న రూపమున సిద్ధించినది. తక్కిన కార్యములు సఫలములు కానున్నవి. అందులకే ఆనాటి ప్రకృతి ప్రభాతము ఎఱ్ఱయ హరివంశమునందు-

సీ॥ తన వినిర్మల బుద్ధిఁ దనరు నుద్యోగంబు
తోన ప్రాభాతిక ద్యుతులు వెలయఁ
దన యుత్సహించిన పనికి దవ్వగు విఘ్న
తమము తోడన తిమిరములు తొలఁగఁ
దన మనోరథములఁ దలఁకొను రాగ సం
తతి తోడఁ బూర్వ సంతతియు వెలయఁ
దన మనంబునఁ బేర్చు ఘన వికాసంబు తో
డన పంక జోల్లసమును దలిర్ప

తే॥ గీ॥ నప్పురు శర్వరి విరతి యం దచ్యుతుండు
తన యుదరోర్కోదయము చందనమున మెఱయ
నుజ్జ్వలార్కోదయంబున నుచిత నియమ
జాలమంతయుఁ బాటించి లీల నరిఁగి.

హ. వం. II - 5-121

శ్రీకృష్ణుఁడు తన వినిర్మల బుద్ధికిఁ దగిన ప్రయత్నమునే తలపెట్టినాఁడు. ఆ ప్రయత్నముతో పాటు ప్రాభాతిక కాంతులు వెలసినవి. తానుత్సహించిన పనికి విఘ్నసముదాయము లెట్లు దూరములో యట్లే తమము దూరమైనది.

తన మనోరథములం దుదయించిన రాగసంతతితోపాటు పూర్వదిశ యందును రాగోదయమైనది.

తన మనస్సున నతిశయించిన వికాసముతోపాటు పంకజముల కుల్లాసము కలిగినది.

ఇట్లు రాత్రి గడచిపోయి ప్రభాతము కలిగినది. ఇచ్చట ప్రకృతి - ప్రభాత వర్ణన. ఇది నాయకుని చర్యలకు తాను సహకరించినది. అతని మనస్సును కార్యముల ననుసరించి వర్ణించినది. ఇది ఎఱ్ఱయ వర్ణన. మూలమున లేనివర్ణన. మూలమున కేవలము "ప్రభాతా యాంతు శర్వర్యాం గంతు మైచ్ఛ జ్జనార్దనః" - అని మాత్రము కలదు "రాత్రి గడచి ప్రభాతమురాఁగా జనార్దనుఁడు పోవ నిశ్చయించినాఁడు" అని మాత్రమే గలదు ఆ పుణ్యకీర్తనుఁడు బదరీ వనమును ప్రవేశించినాఁడు.

సాయం సమయ మైనది. అప్పుడచ్చటి యాశ్రమమును ఎఱ్ఱయ వర్ణించిన తీరు-

సీ॥ తరువిట పాసక్త ధౌత వల్కల పంక్తి
కమనీయ తోరణ కల్పనముఁగ
హూయమానంబులై యొండొండ వెలిఁగెడు
త్రేతాగ్ను లభినవ దీపములుగ
దుగ్ధ పానంబులఁ ద్రుళ్ళు పెయ్యల నోరి
నురువులు సితపుష్ప విరచనలుఁగ
గోరినీడంబుల సేరెడి ఖగముల
వాసితంబులు జయ ధ్వానములుగఁ

తే॥ గీ॥ ఘన సమాగమోత్సవమునఁ దగిన శుభము
లప్రయత్న సిద్ధములుగ నతిశయిల్లు
ముని జనాశ్రమ రేఖ లవ్వనజ నాభుఁ
డర్థిఁ దఱిసి యుండొక రమ్యమైనచోట. II-5-152

సాయంకాల సమయమైనది. అచ్చటి - ఆశ్రమము నందలి మునివర్యులు స్నానాదు లొనర్చి ధౌత వల్కలముల తరువులకు, విటపములకును ఆరఁగట్టినారు. అవియే తోరణములై యొప్పారినవి. త్రేతాగ్ను లచట ప్రేల్వఁబడినవి. అవియే అభినవ దీపములు. పెయ్యలు దుగ్ధ పానము గావించు చుండినవి. నోట నురువులతో త్రుళ్ళుచుండినవి. ఆ నోటి నురువులే తెల్లని పూల రచన. పక్షులు కలకలారావములు చేయుచు గూళ్ళకుఁ జేరుకొను చుండినవి. ఆ కలకలారావములే జయజయ ధ్వానములై వెలసినవి. ఈ విధముగ ఆ లీలామానుష విగ్రహునకు సమాగమోత్సవము అప్రయత్నముగనే సిద్ధించినది

మూలము నందు ఈ సన్నివేశ వర్ణనము :

"అగ్నిహోత్రాకులే కాలే పక్షి వ్యాహార సంకులే
నీడస్థేషు విహంగేషు దుహ్యమానాసు గోషుచ

హ భవిష్య 76 18

ఋషిష్వప్యథ తిష్ఠత్సు మునివీరేషు సర్వతః
సమాధిస్థేషు సిద్ధేషు చింతయత్సు జనార్దనమ్

హ. భవిష్య 76-32

అధిశ్రితేషు హవిషు జ్వాల్యమానేషు చాగ్నిషు
హూయమానేషు తత్రైవ పావకేషు సమంతతః

హ. భవిష్య 76-33

అతిథౌ పూజ్యమానేచ సంధ్యావిష్టే జగన్మణౌ
సతస్యామథ వేలాయాం దేవైస్సహ జనార్దనః
వివేశ బదరీం విష్ణుర్ముని జుష్టాం తపోమయీమ్".

హ భవిష్య 76-34

అంతటను యజ్ఞాగ్ని వెలుఁగుచున్నది పక్షులు కలకలారావముతో తమ తమ గూండ్లను చేరుచున్నవి. గూండ్లలో పక్షులుండఁగా, గోవులు పితుకఁబడు చుండఁగా, మునీశ్వరు లంతట ధ్యాననిష్ఠులై సమాధి స్థితియందు కూర్చొని యుండఁగా సిద్ధులు జనార్దనుని చింతించు చుండఁగా విష్ణువు బదరికాశ్రమమును ప్రవేశించెను.

అగ్నులు జాజ్వల మానములై వెలుగుచున్నవి. అంతటను అగ్నిహోత్రము వేల్వఁబడుచున్నది. అతిథులకు సత్కారములు జరుగుచున్నవి. జగన్మణి యగు సూర్య భగవానుఁడు అస్తంగతుఁడగుచున్నాఁడు. ఆసమయమున జనార్దనుఁడు దేవత లతోఁ గూడి బదరీ వనమును ప్రవేశించెను.

ఇచ్చట కేవలము ఆశ్రమమునందలి ప్రకృతి మాత్రము వర్ణింపఁబడినది. కాని ఎఱ్ఱయ ఆశ్రమము తోరణములతో పుష్పవిరచనలతో, దీప సముదాయములతో, జయజయధ్వానములతో శ్రీకృష్ణుని ఆహ్వానించుచున్నట్లుండినది. ఇట్లు ఎఱ్ఱయ - కేవల ప్రకృతి స్థవర్ణనను గ్రహించి, సందర్భము ననుసరించి, - కథాగతిని సూచించుటకో, భావ్యర్థమును తెలియఁజేయుటకో నాయకపాత్ర పోషణమునకో పాత్రల

యుద్దీపనమునకో - ఆహ్వానమునకో, ఆనందమునకో రచించును. ఇదియే - ఎల్లయ లోని విశిష్టత -

ఆ యాశ్రమమున మునుల, సిద్ధుల ఆదర సత్కారములఁ బడసినాఁడు శ్రీకృష్ణుఁడు. బదరికాశ్రమము నందొక పర్వతము. ఆ పర్వతమునందొక రాక్షసుడు- అతని పేరు ఘంటాకర్ణుఁడు. రాక్షసుఁడయ్యు మూఢభక్తి గలవాఁడు. విష్ణుభక్తి పరాయణుఁడు. అతని మూఢభక్తికి ముగ్ధుఁడై శ్రీకృష్ణుఁడాతని పిశాచ భావమును తొలగించినాఁడు. సత్పదవి నొసంగినాఁడు. అప్పుడు శ్రీకృష్ణుఁడదే పర్వతము నందున్నాఁడు. అప్పుడు సూర్యోదయమగుచున్నది.

అప్పటి ఎల్లయ వర్ణన.

"తన పైశాచిక భావముఁ దొరఁగి సిద్ధత్వంబునం బేర్చి నె
ట్టన తేజోమయమూర్తియై చనిన ఘంటాకర్ణుతో మచ్చరిం
చెనొకో నానిబిడంబులై యొసఁగు పెంజీకట్లు వాయంగ నూ
తన సంధ్యామయ దీప్తి, దాల్చెను జగత్కల్యాణ కల్యాకృతిన్."

హ. వం. II-6-3

ఇచ్చట - ఘంటా కర్ణుఁడు తన పైశాచిక భావముం దొరఁగి పెంజీకటినిఁ బాసి తేజోమయ మూర్తి యైనాఁడు సిద్ధత్వము నొందెను. అతనితో మచ్చరించెనో యనునట్లుఁగ సూర్యుఁడును దట్టమగు పెంజీకటిని బాపెను. నూతన సంధ్యా కాంతులతో జగత్కల్యాణమునకై సుందర రూపమును దాల్చినాఁడు.

అచట కావ్యము నందలి యొక పిశాచ స్వరూపుఁడు పైశాచిక భావముఁ దొలఁగి తేజోమయ మూర్తి యైనాఁడు. రాక్షసుఁడు దుష్ట స్వభావుఁడు, జగముల హింసించువాఁడు. అతడా రాక్షసత్వమును తొలఁగి తేజోమయ మూర్తియై శిష్టుఁ డగుట జగత్కల్యాణము. అంతటి కల్యాణ రూప మాతని కబ్బి నందులకు ప్రకృతిలో నొక గ్రహమగు సూర్యునకు మాత్సర్యము.

ఇఁక మూలము నందా సన్నివేశము -

"అర్చితో మునిభి స్సర్వైః ప్రీతః ప్రీతిమతాం ప్రియః
తతః ప్రభాతే విమలే సూర్యే చాభ్యుదితే సతి
ఆరుహ్య గరుడం విష్ణు ర్యయౌ కైలాస ముత్తమమ్"

హ. భవిష్య. 84-3

సర్వులు మునీశ్వరులు అర్చించినారు ఇతడు ప్రీతి మంతులకు ప్రీతుఁడైనాడు. అనంతరము నిర్మల ప్రభాతమున సూర్యుఁడుదయించినాఁడు. అపుడు విష్ణువు గరుఁడు నారోహించి యుత్తమమగు కైలాసమున కేగినాఁడు.

ఎఱ్ఱయ గావించిన ప్రకృతి – పాత్రల సంబంధము మూలమున గాంచలేము అప్పు డెఱ్ఱయ హరివంశమున-

కం॥ వినతా తనయుఁడు మున్నుఁగ
వనుపమ తేజుఁడయితోఁచు హరిఁగన నినుఁడున్,
వినతా తనయుఁడు మున్నుఁగ
వనుపను తేజుఁడయితోఁచె హరి యుదయాద్రిన్.

హ. వం. II-6-4

వినతకు తనయు లిద్దఱు. ఒకఁ డరుణుఁడు మఱొకఁడు గరుత్మంతుఁడు. అరుణుఁడు సూర్యసారథి. గరుడుఁడు విష్ణువునకు వాహనము.

ఆ వినతా తనయునితో ననుపతేజుఁడయి యేతెంచు హరినిఁగాంచుటకు, యీ వినతాతనయునితో ననుపమ తేజుఁడయి యేతెంచు – నినుఁడు – ఉదయాద్రి పై కానిపించుచున్నాఁడు.

సూర్యుఁడు – వినతా తనయుని వాహనముగా వాఁడు. విష్ణుఁవు – వినతా తనయుని వాహనముగాఁ గలవాఁడు. ఈ హరిని గాంచుటకై ఆ హరి యేతెంచినాఁడు. హరి యనఁగా రెండర్థములు – సూర్యుడు – విష్ణువు. ఈ చమత్కారము మూలమున లేదు.

"ఆరుహ్య గరుడం విష్ణుర్యయౌ"
"ప్రభాతే విమలే సూర్యే చాభ్యుదితే సతి"యని

కేవలము సూర్యోదయమున గరుడుని అధిరోహించి. విష్ణువు వెళ్ళినట్లుఁగా గలదు. ఈ వాక్యమున నే చమత్కారమును లేదు. ఎఱ్ఱయ – 'హరి' 'వినతాతనయుఁడు' అను పదముల నానార్థములతో శబ్ద వైచిత్రిని చూపినాఁడు.

బాణాసురునితో యుద్ధము :

బాణాసురుడు శివభక్తుఁడు. తన బాహువుల తీట తీరునట్లుఁగ యుద్ధము సంభవింప వలయునని మహేశుని వలన వరమునుఁ బొందినాఁడు అందులకు మహేశుఁడం

గీకరించినాఁడు. 'నీ మయూర ధ్వజ మనిమిత్తంబుగా భగ్నమైనపుడు యుద్ధము సంభవింపఁ గలదని వరమొసంగి నాఁడు.

మయూరధ్వజ మనిమిత్తముఁగా ధాత్రిపై భగ్నమై త్రెళ్ళినది. అప్పటి వర్ణన-

"క్షోణి వడంకె దిగ్గహనఘోరముగా దివిధూమకేతువ
క్షీణతఁదోచె శర్కరలు సేడ్వడఁ జల్లుచుఁ దీవ్రుఁడై జగ
త్ప్రాణుఁడు వీచె శోణితపురంబురు శోణిత వృష్టిఁ దేలె ని
ర్వాణము లయ్యె దేవరిపువర్గము వేడుము లెల్ల నొక్కమై

హ. వం. II-7 44

మఱియు ననేక భంగుల నుత్పాతంబులు పుట్టెనఁట: భూమికంపించుట - ఆకసమున ధూమకేతువు స్పష్టముఁగా ప్రకాశించుట, శర్కరలు వడగండ్లు జల్లుచు వాయువు వీచుట, గొప్పశోణిత వర్షము కురియుట ఇట్టివి అరిష్టసూచకములు. అనాదిగా భారతీయులు శకునములపై నమ్మకము గలవారు.

ఇచ్చట - భూమికంపించుట - శోణితవర్షము కురియుట - ఇత్యాదులు మూలమునందును, హరివంశము నందును కలవు. ఎఱ్ఱయ ఈ అపశకునములను కేవల మొక్కపద్యములో సంక్షేపించెను. మూలమున సుదీర్ఘ వర్ణన గలదు.

తొమ్మిది శ్లోకములలోని వర్ణనను ఒక్క ఉత్పలమాలలో సంక్షిప్తముగా చిత్రించి భవిష్యద్బాణ పరాజయమును, సూచించినాఁడెఱ్ఱయ. ఈ అపశకున సూచనలు గ్రంథమున రెండు మూఁడు సందర్భములందు వచ్చినవి గనుక, ప్రతిచోటను సుదీర్ఘముగా నుంచుట తగదని యెంచి, ఎఱ్ఱయ ఒక్కపద్యములో సంక్షేపించి యుండవచ్చును.

ఇట్లు మూలమున కపకర్ష కలిగింపక, సుదీర్ఘములు, పునరుక్తములును నగు వర్ణనలను ఎఱ్ఱయ సంక్షేపించుట లేదా తొలఁగించుట గావించును. ఉచితము లని తలంచిన వానిని యథాతథముగ అనువదించును. స్వతంత్రాను సరణను గావింపఁ దలఁచిన ఘట్టములను స్వతంత్ర కల్పనలతో చిత్రించును. ఈ విధముగా ఎఱ్ఱయ హరివంశమును మూలముతో పోల్చి చూచినపుడు - ఎఱ్ఱయ ప్రకృతిని తన గ్రంథమున వస్తు, పాత్ర, రస, భావ, పోషణలకు చక్కఁగా వినియోగించుకొనినాఁడని

తెలియు చున్నది. భావి కథా సూచనకై ప్రకృతి నుపయోగించును. కథా గమ నము ప్రకృతి వర్ణనచే కలిగించును. చైతన్య తత్త్వమున కుద్దీప్తి హేతువును గావించును. కథా పాత్రలతో సానుభూతి చూపించును. ఒకపరి ఇతని ప్రకృతి కథానాయకుని యెడ సానుభూతి చూపును. మఱొక పరి సామ్యము కలిగించును. ఇంకొక యెడ పాత్రలతో తాదాత్మ్యమును పొందును. కావ్యపాత్రలతో మచ్చరించు నట్లుగ కనిపించును.

ఈ విధముగ ప్రకృతిని పాత్రల మనోభావనునకు దర్పణములుగ చిత్రించి, ఎఱ్ఱయ, వస్తు వర్ణనలను విచిత్రములగు భావనల నయ్యాటలకు రంగభూమిగా చేసి కొని రచించుట చూడ నితని 'వర్ణనా వైదగ్ధి' కి అచ్చెరువు పడక తప్పదు.



# 6. ఎఱ్ఱయ హరివంశము - రూప చిత్రణ

కం॥ "తనువగు శబ్దార్థంబులు
ధ్వనిజీవ మలంక్రియా వితానము సౌమ్ముల్
దనరు గుణంబులు గుణములు
ఘనవృత్తులు వృత్తులౌర కావ్యేందిరకున్."

కా. సం. 2-63

కావ్యలక్ష్మికి - "శబ్దార్థములు శరీరము, ధ్వనియే జీవము. అలంక్రియా వితానము సొమ్ములు. గుణములు గుణములు. వృత్తులు వృత్తులు" అని అలంకారికోక్తి.

కేవలము శబ్దముకాని, కేవలము అర్థముకాని కావ్యవ్యవహారమును ప్రవర్తింపఁ జేయఁ జాలవు. కాని విశిష్టమగు నర్థ మెచ్చట గోచరించునో అదియే కావ్యము. అదే ధ్వని కావ్యము.

కావ్యధ్వని - జీవనమును గుఱించి స్థూలముగా వివరించుచున్నాను. అభిదా వృత్తి, లక్షణావృత్తి, వ్యంజనావృత్తి - అని శబ్దమునకు వృత్తులు మూఁడు. ఈ వృత్తులనే శక్తులు అందురు.

సంకేత సహాయమున వాచ్యార్థమును బోధించు శక్తి "అభిదాశక్తి." ముఖ్యార్థ బోధ - నిమిత్తము, ప్రయోజనము, - ఈ మూడింటి సహాయము నపేక్షించి, యర్థమును ప్రతిభాసింపఁ జేయుశక్తి "లక్షణాశక్తి." పైశక్తులు కలిగించిన అర్థ జ్ఞానము మూలమున నేర్పడిన ప్రతిభచే వక్తృవివక్షను గ్రహించి ప్రతిపత్తృ ప్రతిభను తోడు చేసికొని, యర్థమును స్ఫురింపఁ జేయుశక్తి "వ్యంజనాశక్తి."

"కవయతే చాతుర్యేణేతి కవిః" చాతుర్యముతో వర్ణించువాఁడు కవి. వాచ్య వాచకముల రచించి నంత మాత్రమున - మహాకవి కాఁజాలఁడు. కాని వ్యంగ్య వ్యంజనమున కుపాయము వచ్యము. వర్ణ, పద, వాక్య, రచనాదుల వలన ఈ వ్యంగ్యార్థము స్ఫురించును. అదియే ధ్వని. అట్టి ధ్వని గల కావ్యమే ఉత్తమోత్తమమైనది.

"యత్రార్థ శ్శబ్దోవా తమర్థముపసర్జనీ కృతస్వార్థౌ
వ్యఙ్క్తః కావ్య విశేష స్సధ్వనిరితి సూరిభిః కథితః" ధ్వ. I-13

ఎచ్చట - శబ్దము తన్ను తన యర్థమును అప్రధాన మొనర్చి, పరమ రమణీయమగు నర్థవిశేషమును - వ్యంగ్య మొనర్చునో - అట్టి కావ్యవిశేషము ధ్వని యని - సూరులు వ్యవహరింతురు.

"వాక్యం రసాత్మకం కావ్యమ్" - అని విశ్వనాథుఁడు. రసాత్మకమైన వాక్యమే కావ్యమని పేర్కొనినాఁడు రసాత్మకత కావ్యలక్షణము. అదోషత, సగుణత, ఔచిత్య పూరకమగు అలంకారయోజన కలిగియుండట కావ్యలక్షణము. జగన్నాథ పండితుఁడు, "రమణీయార్థ ప్రతిపాదక శ్శబ్దః కావ్యమ్" అని నిర్వచించినాఁడు. రమణీయార్థ మనఁగా - వాచ్యార్థము కన్న సుందర మైనది. అదేధ్వని. అదే రసము అట్టి రమణీయార్థమును ప్రతిపాదింపఁగల శబ్దమే కావ్యము.

పదము - పదార్థము తెలిసిన వారందఱు వాచ్యార్థమును గ్రహింపఁగలరు. కాని వ్యంగార్థమును, కేవలము సహృదయులే తెలిసికొనఁ గలరు. వాచ్యార్థమున కాశ్రయము శబ్దమైన-వ్యంగ్యార్థమున కాశ్రయము-వర్ణ, అర్థ రచనాదులు. ఈధ్వని సహృదయ హృదయానందమును కలిగించును. ఈ ధ్వని స్వశబ్దవాచ్యము కారాదు. ఇది అలౌకికానందము నొందఁ గూర్చునది. లౌకిక వ్యవహారమునకు లోఁబడనిది.

విభావానుభావ వ్యభిచారీ (సంచారీ) భావ దర్శనము వలన సత్త్వగుణము వెల్లివిరియును. అచ్చట - రజస్తమో గుణముల స్పర్శ యుండదు. ఆ సత్త్వ గుణోద్రేకము వలన వాసి హృదయము నందు సంస్కార రూపమున నున్న రత్యాదు లుద్బుద్ధము లగును. విభావాదులు వాని నభివ్యక్తము లొనర్చును. పునరను సంధానముచే నా విభావాదులు సాధారణము లగును. అప్పుడు, పాఠకునకు పుస్తకము పఠించు చుంటినను జ్ఞానము నశించి, విషయము నందు లీనమగును. తన్ను తాను విస్మరించి యనిర్వచనీ యానందము నొందును.

"విభావే నానుభావేన వ్యక్త స్సంచారిణా తథా
రసతామేతి రత్యాదిః స్థాయీభావస్స చేతసామ్"
(సా. ద. తృ. I)

కనుక-విభావానుభావ సంచారీ భావములతో పుష్టమైన స్థాయీభావమే రసము. ఈ రసమే ధ్వని. 'రసవ్యంజన' యనఁగా ధ్వని. ఆ యాస్వాదన వ్యాపారమే వ్యంజ వ్యాపారము, ఇదొక అలౌకిక వ్యాపారము. విభావాదులు రసోత్పత్త్యనంతరము నష్ట మగుచున్నవి. భావుకత్వ వ్యాపారము స్వగత పరగత భావముల నశింపఁజేసి

విభావాదులను, సాధారణ మొనర్చు చున్నది. అనంతరము భోజకత్వ వ్యాపారము ఆవిర్భవించి, రసాస్వాదముయొక్క ఆనందమును కలిగించును.

"ప్రతీయమానం పునరన్యదేవ వస్త్వస్తి వాణీషు మహాకవీనామ్
తత్తత్ప్రసిద్ధావయవాతి రిక్తం విభాతి లావణ్యమివాంగనాసు"
ధ్వ-I-4

ప్రసిద్ధములగు-నవయవముల కతిరిక్తమై, యంగనల శరీరమున లావణ్యము ప్రకాశించునట్లు మహాకవుల వాక్కులలో వాచ్యార్థము కంటె వేఱైన అరమొకటి స్ఫురించు చుండును. ఈ విధముగా ప్రతీయ మానమగు ధ్వని రెండు విధములు.

అవి వక్షిత వాచ్యధ్వని - వివక్షితాన్యపర వాచ్యధ్వని - అనునవి. అవివక్షిత వాచ్యధ్వని లక్షణా మూలము. ఈ ధ్వని లక్షణావృత్తి మార్గమున నేర్పడుటచే దీనిని లక్షణామూలధ్వని యందురు

ఈ ధ్వని యందు - వాచ్యార్థము వివక్షితము కానిచో, - వివక్షితము మఱి యొకటి యేదియో యుండవలెను. అదియే వ్యంగ్యము, మొదట వాచ్యార్థమునకు క్షతి యేర్పడవలెను ముఖ్యార్థము భంగ మగుటచే మఱొక అర్థము కల్పించు కొన వలసి యుండును. ఈ కల్పనమున కొక ప్రయోజన ముండవలయును.

ఈ అవివక్షిత వాచ్యధ్వని-అత్యంత తిరస్కృతమని, అర్థాంతర సంక్రమిత మని రెండు విధములు.

2. అత్యంత తిరస్కృత వాచ్యధ్వని :-

ఇచట వాచ్యార్థము పూర్తిగా పొసఁగక మఱొక అర్థము స్ఫురించును.

ఉ. సువర్ణపుష్పాం పృథివీం చిన్వంతి పురుషాస్త్రయః
శూరశ్చ కృత విద్యశ్చ, యశ్చ జానాతి సేవితుమ్" ధ్వ-I

"శూరుఁడు, విద్యావంతుఁడు, సేవావిధానమున, నేర్పరి - ఈ మువ్వురును భూమిని బంగారమును పూయింతురు" అని యర్థము. ఇచ్చట బంగారు పూయుట పొసఁగదు. బంగారు పుష్పము లెచ్చటను పూయవు. కనుక నీ వాచ్యార్థము పూర్తిగా పొసఁగదు. లక్షణా శక్తి నాధారము గావించుకొని, యీవ్యంగ్యార్థము గోచరించు చున్నది. కనుక లక్షణా మూలక మగు నత్యంత తిరస్కృత వాచ్యధ్వని. ఇది మనోహరముగా నున్నది. భూమిని మిక్కిలి ధనవంత మొనర్తురని తాత్పర్యము.

2. అర్థాంతర సంక్రమిత వాచ్యము :-

ఇచట వాచ్యార్థము మఱొక అర్థములో పర్యవసించును. వాచ్యార్థమునకు బాధ కలుగక మఱొక అర్థములో పర్యవసించును

సీతా విరహమున శ్రీరాముఁడు - [ఉ. రా. చరిత్ర]

"స్నిగ్ధశ్యామలకాంతి లిప్త వియతో వేల్లద్బలాకా ఘనా
వాతాశ్శీకరిణః పయోద సుహృదా మానందకేకాః కలాః
కామం సంతు దృఢం కఠోరహృదయో రామోఽస్మి సర్వంసహే
వైదేహీతు కథం భవిష్యతి హాహా దేవి! ధీరాభవ" ధ్వ-II

ఇచ్చట 'రామోఽస్మి' అనుశబ్దము - "కఠిన హృదయుడను ఎన్నింటినైన సహింప సమర్థుఁడను" - అను నర్థముల స్ఫురింపఁ జేయుచున్నది. "దట్టమగు కారు మబ్బు లలము కొన్నవి. విలాసముతో కూడిన బలాకములు శీతల మారుతము, మేఘములకు సుహృదులగు మయూరముల కేకారవములు, - అన్నియు నున్మాద కరములుగా నున్నవి. ఏమైన నుండు గాక: - నేను రాముఁడను సర్వమును సహింపఁ గలను. కానిసీత ఎట్లుండఁ గలదు ? హా ! దేవి ! ధీరురాలవు కమ్ము" - ఇది అర్థము.

ఇచట - 'నేను రాముఁడను' - అను నది 'కఠిన హృదయుఁడ' నను అర్థాంతరమున సంక్రమితమైనది. వాచ్యార్థము - మరొక రమణీయార్థము చెప్పుటలో పర్యవసించినది.

వివక్షితాన్యపర వాచ్యధ్వని :-

ఇది అభిధా మూలము. అది అసంలక్ష్య క్రమ వ్యంగ్యము, సంలక్ష్యక్రమ వ్యంగ్యము అని రెండు విధములు.

అసంలక్ష్య క్రమ వ్యంగ్యము :- ఇందులో వాచ్యార్థ వ్యంగ్యార్థ స్ఫురణలో నొక క్రమము తోపదు ధ్వని యొక్క క్రమములో గ్రహింప వీలు పడదు. రసధ్వని, భావ ధ్వని, రసాభాసము, భావా భాసము, భావశాంతి, భావో దయము, భావసంధి, భావ శబలత, రసశాంతి మొదలగు విభాగములు కలవు.

సంలక్ష్యక్రమ వ్యంగ్యము :- ఇందు-వాచ్యార్థముతోపాటు వ్యంగ్యము గోచరించును. వాచ్య వ్యంగ్యార్థ స్ఫురణలలో ఒక క్రమము తోచును. కనుకనే సంలక్ష్య వ్యంగ్యధ్వనియైనది,

ఉదా ॥

'ఏవం వాదిని దేవర్షౌ పార్శ్వే పితు రధోముఖీ
లీలా కమల పత్రాణి గణయామాస పార్వతీ'

ధ్వ. II

మహేశుడే పార్వతిని వివాహమాడఁ గలఁడని నారదుఁడు హిమవంతునితో పలుకుచుండఁగా, - పార్వతి వినినది. అధోముఖియై లీలా కమలము నందలి పత్రములను గణించెను. అధోముఖియై పత్రములను లెక్కించుటచే - లజ్జా రూప వ్యభిచారి భావము గోచరించుచున్నది. కనుక సంలక్ష్య క్రమ వ్యంగ్యము.

వాచ్యార్థము భంగము కాకయే రమణీయార్థము గోచరించినది, లజ్జను మఱుగు పఱచుటకై లీలాకమలము నందలి పత్రములను గణించినది. ఇది యర్థశక్త్యుద్భవమగు ధ్వని. ఇచ్చట వాచ్యార్థము పొసఁగుచునే యొకక్రమమున వ్యంగ్యము గోచరించు చున్నది. కనుక సంలక్ష్యక్రమ వ్యంగ్యము. ఎచ్చట - వాచ్యార్థము గోచరమైనవెంటనే- విభావాది సామగ్రి వలన - రసాదులు ప్రతీతములగునో, అది అసంలక్ష్యక్రమ వ్యంగ్యము. కాని, యిచట - కమలపత్రములను గణించుట - ముఖము వాల్చుట వంటివి - ఆటపాటల యందును సంభవింప వచ్చును. కనుక వాచ్యార్థము గోచరించిన వెంటనే వ్యంగ్యము గోచరము కాదు. వివాహ వృత్తాంత ప్రకరణము తెలిసి నపుడే ఈ వ్యంగ్యము గోచరించును. అందుచే నిది సంలక్ష్యక్రమ వ్యంగ్యము. ఈ ధ్వని భేదములు వాక్యగతములని, పదగతములని తిరిగి రెండు భేదములచే నాలుఁగు.

ఈ విధమైన స్థూలధ్వని స్వరూపమును ఎఱ్ఱయ హరివంశమునందు సమన్వ యించి, తద్వారా, ఉత్తమ కావ్యత్వ ప్రతిపాదనము చేయుట ప్రస్తుత పరిశోధనలో ఒక భాగము.

పైని పేర్కొన్నధ్వని - ఎఱ్ఱయ హరివంశమున - రూపవర్ణన యందెంత వఱకు గోచరించుచున్నదో పరిశీలించుటయే యీ వ్యాస లక్ష్యము.

పాత్రల వివిధాకార వర్ణనయే రూపవర్ణన. ఒక వస్తువును గూర్చిన సూక్ష్మాతి సూక్ష్మములైన బహ్యాంశములు అవ్యవధానముగా పేర్కొనఁబడి ఆవస్తువున కుత్కర్షా పాదకములైనచో, నప్పుడది వర్ణింపబడినది యనవలయును. బాహ్యవర్ణన - సమస్త ప్రకృతికి సంబంధించినది. ఆంతరంగిక వర్ణన మానవ మనస్తత్త్వమునకు సంబం ధించినది.

బాహ్య వర్ణనలో – ప్రకృతి వర్ణన, రూపవర్ణన అని రెండు భాగములు. ప్రకృతి వర్ణనకు వలెనే, రూపవర్ణనలోను ఎఱ్ఱయ దొక విశిష్టత.

ఈ రూప వర్ణనలో స్థిర, చర వస్తు వర్ణనలలోను ఎఱ్ఱయ అందెవేసిన చేయి.

దుగ్ధ సాగరమున యోగనిద్రా పరవశుఁడైన నారాయణుఁడుండఁగా – కృత త్రేతాయుగములు గడిచిపోయినవి. తృతీయ యుగావసాన మది. పృథ్వి ప్రజాభార పీడితయై యాక్రోశించు చున్నది. బృందారకులు, శతానంద సహితులై యనుక్రోశ వశమున నాగశయనీయుని సమీపించిరి. మధుర వాక్యముల ప్రస్తుతించిరి.

అచ్యుతుఁడు మేల్కాని "తెల్లని తమ్మి రేకులకు దియ్యపు నెచ్చెలు లైన కన్నులం జల్లిన చూపు" చూచినాఁడు. "లోకము లెల్ల శుభ సమేతములా ?" యని ప్రశ్నించినాడు.

అప్పుడు కమల సంభవుఁడు విరచితాంజలియై –

"ధాత్రియందు రాజు లన్యోన్యవైరము దక్కినారు. ప్రజారక్షణ తత్పరులై భూదేవ, పితృప్రీతి గావించుచున్నారు ఎల్లరును ఆయువెక్కి తెవులు, చావు లేకున్నారు. దానంజేసి భూభార మధిక మైనది. భూమి అచలయయ్యును చలనంబు నొంది యార్త యైనది ఆమెను రక్షింప వలసిన"దని విన్నవించినాఁడు. ఈ అభ్యాసమని విజ్ఞాపనమును విని మహావిష్ణువు దివ్యశయనము నుండి యుత్థితుఁడై నాఁడు. అప్పటి ఎఱ్ఱయ వర్ణన.

సీ॥ ఇందిర తొడలపై నింపారఁ జాఁచిన
యడుగులు మణిపీఠి యం దమర్చి
యొక్కింత సడలిన యుత్తంస దామకం
బభినవంబుగ మౌళి నలవరించి
కౌస్తుభోజ్జ్వల పద కంబునఁ బెనఁగొన్న
చారుహారము నులి చక్కఁజేసి
కటి మీఁద జాఱిన కనక సూత్రంబుతోఁ
బీతాంబరము దిండు బిగియఁ దిగిచి

తే॥ గీ॥ శంఖ చక్రగదాభయ స్ఫార చిహ్న
ములు గ్రమంబున శ్రీహస్తముల వహించి,

యోగ నిద్రాంత లీల యిట్లొప్ప నిలిచె
దేవదేవుఁడు దివిజుల దృష్టి యలర"          హ. వం. I-5-9

నిలిచి, తత్త్వమయ సేవాను రూపంబుగాఁ బొడసూపినాఁడు.

ఇందిర తొడలపై 'నింపారఁజాచిన' యడుగులను తీసి మణి పీఠియం దమర్చి నాఁడు. నాగపర్యంక మెత్తుగా నున్నది. ఆ పర్యంకము నుండి లేచి, కూర్చొన వలయు ననిన - మొదట అడుగులను భద్రమైన ప్రదేశముపై నుంచి, యూనికతో లేవ వలయును. మణిపీఠ మతి కఠినమైనది భద్రమైనది. అందు పై అడుగును గట్టిగా నుంచిన లేచుట సంభవమగును. శయనించిన ఏవ్యక్తి యైనను లేచి కూర్చొను టకు చేయు మొదటి ప్రయత్నమిది. అనంతరము ఉత్తంసదామకము - తలపై నుండిన దండ - పరుండినపుడు జారిపోయి యుండును. దాని నభినవముగ నలంక రించు కొన్నాఁడు. కౌస్తుభోజ్జ్వల పదకము హారము నందు పెనవేసికొని యుండి నది. శయనించి నపుడు - హారము చిక్కువడుట అత్యంత సహజము దానిని చక్కఁజేసికొనెను. కటి నుండి కనక సూత్రము జాఱి యుండినది. ఆ సూత్రముతో పీతాంబరపు దిండును బిగువుగా గట్టినాఁడు. శంఖచక్రాది చిహ్నములను క్రమముగా శ్రీహస్తము లందు వహించెను. దివిజుల దృష్టి యలరు నట్లు నిలిచినాడు.

ఎఱ్ఱయ - శయనించిన వ్యక్తి లేచి కూర్చొను రూపము నింత సూక్ష్మముగా పరిశీలించి చిత్రించిన చేష్టావర్ణన.

మూలము నందు -

"స సంక్షిప్య జలం సర్వం తిమిరౌఘం విదారయన్
ఉదతిష్ఠ ద్ధృషీకేశశ్శ్రియా పరమయా జ్వలన్
హ. వ. 51-43

"తానువాచ హరిర్దేవో నిద్రా విశ్రాంత లోచనః
తత్వ దృష్టార్థయా వాచా ధర్మహేత్వర్థ యుక్తయా"
హ. వం 51-44

"హృషీకేశుఁడు జలము నంతయు సంక్షేపించి తిమిర సముదాయమును చీల్చుకొనుచు లేచినాఁడు. ఉత్కృష్ట శ్రీయుతుఁడు, నిద్రా విశ్రాంత లోచనుఁడనై

హరి దేవతలతో నిట్లనెను. ధర్మహేత్వర్థముతోఁ గూడిన తత్త్వదృష్టి గల వాక్కుచే నిట్లనెను". ఇది మూలము.

ఈ వర్ణనను ఎఱ్ఱయ ధ్వని ప్రధానముగా చిత్రించెను. మూలమున హృషీకేశుఁడు తిమిరసముదాయమును చీల్చుచు లేచెను. అంతియే.

"తెల్లని తమ్మిరేకులకుఁ దియ్యపునెచ్చెలు లైన కన్నులం జల్లని చూపు చూచి" ఇది ఎఱ్ఱయ వర్ణన. ఇందు తెల్లని కటాక్షవీక్షణంబులు, బృందారకులపై ననుగ్రహమును, వారి ప్రార్థన నెఱవేరఁ గల దనుటను – సూచించుచున్నది. మూలమున నిద్రావిశ్రాంత లోచనుఁడు మాత్రమే

ఇందిర తొడలపై నింపారఁజాపి యుంచిన అడుగులను మణి పీఠియం దమర్చుట – విలాసమును వీడి కర్తవ్యోన్ముఖుఁ డగుటను సూచించుచున్నది.

ఉత్తంస దామకంబును సవరించుకొనుట – కార్యారంభమున కుద్యుక్తుఁ డగుటను ;

కౌస్తుభోజ్జ్వల మణియందు పెనగొన్న హారమును చక్కఁజేసికొనుట – విలాసమును వీడినట్టి దయాప్రదర్శనను –;

పీతాంబరము బిగియఁదిగుచుట – కర్తవ్యదీక్ష కుపక్రమించుటను –

శంఖచక్రాది చిహ్నములను ధరించుట అభయ ముద్రను వ్యంజింపఁ జేయుచున్నవి.

ఈ పద్యమున వాచ్యార్థము పొసఁగు చున్నది. వాచ్యార్థము గోచరించుచునే వ్యంగార్థము మఱొకటి స్ఫురించుచున్నది. కనుక నిచ్చట వివక్షితాన్య పరవాచ్య ధ్వని లోని అసంలక్ష్యక్రమ వ్యంగ్యమున భావము ధ్వనించుచున్నది. స్థాయీ భావము ఉత్సాహము. ఇచ్చట బృందారకాదులు పృథ్వీబాధను తెలియఁబఱచుట ఉద్దీపనమై, శ్రీ మహావిష్ణు వాలంబనమై, తెల్లని తమ్మిరేకుల వంటి కటాక్షములు భూభారమును హరింపవలయు ననెడి ధృతియును వ్యభిచారియై చిత్తదీప్తిని తెలియఁజేయుచు, ఓజోగుణముతో నొప్పారుచున్నది. ఇచ్చట దయావీరము రసపుష్టిని పొందక, పాఠకుని యందుండు ఉత్సాహము భావధ్వనిఁగా ప్రతీయమాన మగుచున్నది. ఇది వాక్యగతమైన వ్యంగ్యము. ఈ పద్యము చదువుట తోడనే పాఠకుని యందొక విధమగు నుత్సాహము జనించును. కాని రసము పుష్టము కాలేదు. ఇది భావధ్వని.

కంసుఁడు, దేవకి యష్టమ గర్భమే తనకు మృత్యుకారక మని, ఆ శిశువును చంపుటకై ఎదురు చూచుచున్నాడు. దేవకికి పుట్టిన ఆరుగురు శిశువులు కంసునిచే నాశ మయిరి. అది అష్టమ గర్భము, చారులను కట్టడిచేసి. ఎప్పటి కప్పుడు వార్తలను సేకరించుచున్నాఁడు. అష్టమ గర్భస్థ శిశు జననమునకై, వేయి కనులతో నెదురు చూచుచున్నాఁడు కంసుఁడు.

చారుల వలన శిశు జననమైనదని తెలిసినది. పరుగు పరుగున కృష్ణజన్మ స్థానమున కేగుచున్నాఁడు. అప్పటి ఎఱ్ఱయ వర్ణన.

మ॥ "తలయుం జీరయుఁవీడ సంభ్రమముతో దైవోపఘాతంబునం
గలఁకం గ్రుళ్లుచుఁ జాఱుతెంచి వెసనా కంసుండు తత్సూతికా
నిలయ ద్వారమునందు నిల్చి శిశువుం దేతెమ్ము తెమ్మంచు నా
కులుఁడై పల్కఁగ కృష్ణమాతయును సంక్షోభార్తయై యత్తఱిన్"

హ. వం. I-5. 124

శీఘ్రముగా సూతికా గృహ ద్వారమునందు నిలిచినాఁడు. ఇది వ్యాకులుఁడై పరుగులిడిన కంసుని యాకార విశేషము.

మూలము నందు —

"తచ్ఛ్రుత్వా త్వరితః కంసో రక్షిభి స్సహ వేగిభిః
ఆజగామ గృహద్వారం వసుదేవస్య వీర్యవాన్

హ. విష్ణు 4-29

సతత్ర త్వరితం ద్వారి కింజాతమితి చాబ్రవీత్
దీయతాం శీఘ్రమిత్యేవం వాగ్భి స్సమభి తర్జయత్"

హ. విష్ణు 4-30

మూలమున "రక్షిభి స్సహ వేగిభిః" - చారులతో, రక్షకులతోగూడి తీరికగా పోయినట్లు కనిపించుచున్నది. ఎఱ్ఱయ కంసున కీ నిదానములేదు. శిశు జననమును వినిన వెంటనే ఒక్కటే పరుగున వచ్చుచున్నాఁడు. ఎవ్వరిని పిలువలేదు, కలిసి కొన లేదు అంతటి మహారాజున కప్పుడు "తలయుం జీరయుఁవీడ" వోయినవి తలవీడిపోవుట - అతి శీఘ్రగమనమును తెలియఁ జేయుచున్నది. 'చీర వీడిపోవుట' - "విడిపోవుచున్నను తెలిసికొనక పరుగులిడుచుండుట" - యుక్తాయుక్తముసుఁ గోల్పోయిన పారవశ్య స్థితిని గోచరింపఁ జేయుచున్నది.

కంసునకు - తన్ను చంపఁబోవు శిశువు జన్మించినాడు. పరుగునపోయి, ఆ బాలుఁడెట్లున్నవాఁడో చూడవలయును. చూచినంతనే చంపివేయ వలయునను ఆతురత ఆవేశము గోచరించుచున్నవి. మూలమున "ఆజగామ" యనుటను ఎఱ్ఱయ 'పాఱు తెంచి' యని మార్చినాఁడు ఎఱ్ఱయ కంసుఁడు పాఱుతెంచినాఁడు.

మూలమున కంసుఁడు "కింజాతమ్" అని యే శిశువు జన్మించిన దని యడి గిన, ఎఱ్ఱయ కంసుఁడు "శిశువుం దేతెమ్ము తెమ్ము" అని ద్విరుక్తిచే నాతురతను ప్రదర్శించుచు పలికినాడు. మూలము - అనుద్వేగకరమగు ప్రశ్నను తెలియఁజేసిన - ఎఱ్ఱయ కంసునిచే "తలయుం జీరయువిడి" పోవునట్లుగా పరుగులిడిన పరుగులకు తగినట్లుగా పలికించినాఁడు.

" దీయతాం శీఘ్రమిత్యేవం వాగ్భి స్సమభి తర్జయత్ " అని వాక్కులతో వాచ్యముగా వెవరించిన మూలమును మార్చి, వ్యంగ్య భరిత మొన రించినాఁడు ఎఱ్ఱయ. తలయుం జీరయు వీడుటలో - ఆవేగమును, వ్యభిచారి భావమును, "తే.తెమ్ము తె'మ్మనుటలో ఉగ్రతయును, 'క్రుళ్ళుచు' పాఱుతెంచటలో శ్రమయను వ్యభిచారియు గోచరించు చున్నవి. బాలుని చంపవలయునని పరుగులిడు కంసుఁ డాలంబనముగా పాతకుని లోని క్రోధమను స్థాయి పుష్టి కావలసి యున్నది. రౌద్ర రసము స్ఫురింపవలసి యుండినది. కాని శిశువు అవతార పురుష డగుటచే నా క్రోధము - శిశువునకై గావించు చేష్టలు రసాభాసములైనవి.

ఇచ్చట వాచ్యార్థము పొసఁగుచునే మఱొక అర్థము స్ఫురించుటచే నిది వివక్షితాన్య పరవాచ్య ధ్వనిలో అసంలక్ష్య క్రమ వ్యంగ్యము. ఇచ్చట రసా భాసము, కంసుని యాకులత్వ మను భావముగా ఆవేగోగ్రతా శ్రమాది వ్యభిచారీ భావములతోఁ గలిసి రసాభాస మైనది.

మఱొక ఉదాహరణ :- శ్రీకృష్ణుని శకటము క్రింద పరుండఁబెట్టి యశోద యేటి కేఁగినది· వచ్చునప్పటికి, కుమారుఁడు పరుండిన శకటము విపర్యస్త మైనది. అది విని నందుఁడు అరణ్య సంచారము నుండి వేగముగా నేతెంచినాఁడు. అప్పటి యాతని యాకారము -

సీ॥ పరిమిత పలితైక భాసురంబగు కేశ
సంచయం బారణ్య సంచరమునఁ
దరువుల రాలు కేసరముల నత్యంత

ధూసరంబై కడు మాసరముగ
గోఖురోద్ధత రేణు కుంఠితంబగు మోము
చెమట బొట్టుల చాల చెన్నుమిగులఁ
గట్టిన చెంగావి కాసె లేఁ జిగురుల
జిగి నూని తనువతి స్నిగ్ధకాంతి

తే॥ గీ॥ నలర కర్కశ గ్రంథిల యష్టి చేతఁ
బట్టి గోపాల పరివార బహు విధోక్తు
లెలసి చెలఁగఁగఁ గదుపుల వలన నుండి
వచ్చె నంద గోపుఁడు నిజావాసమునకు.

హ. వం. I-5-181

అంతవఱకును నరణ్యము నందు సంచరించి వచ్చినాఁడు. ఒక ప్రౌఢ వయస్కుఁడగు గ్రామాధికారి రూపమును - ఎఱ్ఱయ వర్ణించిన విధాన మిది.

మూలమున -

"ఏతస్మిన్నంతరే గోభి రాజగామ వనేచరః
కాషాయ వాససీ బిభ్ర న్నందగోపో వ్రజాన్తికమ్"

మూలమున కాషాయ వస్త్రములు ధరించుట - గోవులలో నుండి వచ్చుట మాత్ర మున్నది

ఎఱ్ఱయ హరివంశమున - కర్కశ గ్రంథిల యష్టి చేత ధరించి, చుట్టును గోపాలపరివారము ముచ్చటించు చుండ వచ్చుచున్నాఁడు నందుఁడు. గోఖురోద్ధత రేణుకుంఠిత మగు మోము - గోవుల మధ్యలో చిరకాలము గడిపిన విధానమును; చెమట బొట్టులు - ఎండనక, శ్రమయనక విశ్రాంతి లేక తిరిగిన విధానమును తెలుపు చున్నవి.

చెంగావి వస్త్రము కాసె వేసి కట్టుట - ఆనాఁటి వస్త్ర ధారణ విధానమును తెలుపుచున్నది

గ్రామాధికారులు, గ్రామీణులు - మంచి చెడ్డలనరయుచు, పరిసర ప్రాంతము లందు సంచరించు చుందురని, ఆపద్ధర్మముగా చేత రక్షణకై గ్రంథులు గల యష్టిని ధరించెడి వారని తెలియుచున్నది. అతని శిరముపై దట్టముగా వ్రాలిన పుప్పొడులు ఆతని, అత్యధిక సంచారమును తెల్పుచున్నవి.

ఇట్లు నందుని యాకారమున ఎఱ్ఱయ నాఁటి గ్రామాధికారి గాంభీర్యము, కార్య దీక్ష - గోచరించుచున్నవి.

ఇచ్చట వాచ్యార్థము గోచరించుచునే మఱొక రమణీయార్థము గోచరించు చున్నది - కనుక - వివక్షితాన్యపర వాచ్యధ్వనిలో - భావధ్వని గోచరించుచున్నది. ఇచ్చట ఎఱ్ఱయ నందుని యాకారము ఉత్సాహమను స్థాయిలోనే పర్యవసించినది.

కాళియుఁడు మహాహ్రదమున నివసించుచున్నాడు. మడుగు మహాభయంకర మైనది. ఇదె కదంబ విటపి యొక్కటి యుత్కటోరగ విషంబున విషాదంబు నొంది యియ్యుత్తమ తటినీ తటంబున నున్నయది ఇది మదీయ పదస్పర్శ పదవిఁగాంచి యఖిలలోక నమస్కార్య హరి మహిమను పొందుఁగాఁత. దీనినెక్కి యిన్నీట నుఱికెద నని తలంచినాఁడు కృష్ణుఁడు.

ఎవ్వరితోను చెప్పలేదు. ఒక్కింత మంతనమైనను ఆడఁడు. ఈ విపుల ప్రయత్న మొనర్చుటకు హేతువేమో యని బలదేవాదులు తలంచు చుండిరి. మోమున నల్లన చిఱునవ్వు వెలయుచుండినది. అప్పుడు-

సీ॥ ఒడి సిక్కఁగొనఁ బెక్కి మడిసంది నునిచిన
తలుగులు ద్రాళ్ళులు దోలఁగ వైచి,
డాకేలఁ బట్టిన ఢక్కయుఁ జంకఁ దా
ల్చిన వేణువును నన్యుచేతి కిచ్చి
పొలుచు పింఛపు దండ వుచ్చి వెండ్రుకలు నొ
ప్పెదు జడగా నల్లి ముడి యమర్చి
మొలఁ గచ్చకట్టుపై మలఁగిన పచ్చని
నునుఁగొంగు దిండుగా నునిచి చుట్టి

తే॥ గీ॥ చెప్పులూడ్చి కదంబక స్ఫీత తరువుఁ
బ్రాకి పెడ బొబ్బయిడి యార్చి యాఁక గొనక
మడువు లోనికి నుఱికె నున్మత్తలీల
నెగసి తత్తోయ కణములు నింగిఁబొదువ” హ. వం. I-7-18

- ఇది మడుగులోని కుఱుకు శ్రీకృష్ణుని వర్ణన.

చంక యందు చిక్కువడి పోయిన త్రాళ్ళను, తలుగులను, తొలఁగవైచినాఁడు. ఏ ప్రయత్నమున కైనను, పనికైనను చుట్టుచు చిక్కువడిన త్రాళ్ళు చంకయందుండిన మిక్కిలి యడ్డు కలిగించును. కావున వానిని తొలఁగించినాఁడు. ఎడమ చేతి యందలి ధక్కను, చంక యందుండు వేణువును తీసి, యొక గోపాలున కిచ్చినాఁడు. చక్కగా నలంకరించు కొని యుండిన పింఛమును, దండను - తొలఁగించి వేసెను. వెండ్రుకలు ముడిలేక చిందరవందరగా నున్న - ఈదునపుడు దేనికైన తగులుకొనవచ్చును. అందుకే ముడివైచినాడు. మొలయందు గోచిపై పచ్చని కొంగును దిండుగా చేసిచుట్టినాఁడు. చెట్టుపై నెక్కుటకు నీట దుమికి యీదుటకు చెప్పులు పనికిరావు. కనుకవానిని తొలఁగించెను. కదంబక స్పీత తరువుపై కెఁగఁ బ్రాకినాఁడు. పెడ బొబ్బ లిడుచు అర్చి, ఆగక నీటిలోనికి ఉఱికెను.

మూలమున - శ్రీకృష్ణుడు కాళియమడువున దూకునపుడు -

"ఏనం కదంబ మారుహ్య తదేవ శిశు లీలయా
హ. విష్ణు. 11-59

విని పత్య హ్రదే ఘోరే దమయిష్యామి కాళియమ్
ఏవం కృతే బాహు వీర్యం లోకే ఖ్యాతిం గమిష్యతి
హ. విష్ణు 12-1

సోపసృత్య నదీతీరం బద్ధ్వా పరికరం దృఢమ్
ఆరోహచ్చ పలః కృష్ణః కదంబ శిఖరం ముదా హ. విష్ణు 12-2

కృష్ణః కదంబ శిఖరాల్లంబమానో ఘనాకృతిః
హ్రద మధ్యేఽ కరోచ్ఛబ్దం నిపతన్నంబు జేక్షణః
హ. విష్ణు 12-3

కృష్ణేన తత్రపతతా క్షుభితో యమునా హ్రదః
సంప్రాసిచ్యత వేగేన భిద్యమాన ఇవాంబుదః"
హ. విష్ణు 12-4

'ఏవం కృతే బాహువీర్యం లోకే ఖ్యాతిం గమిష్యతి' - ఇట్లయిన లోకమున నా బాహు వీర్యము ప్రసిద్ధి పొందఁగలదని తన్ను తాను శ్లాఘించు కొనుట ఎఱ్ఱయ అనువాదమున లేదు. శ్రీకృష్ణుఁడు నదీ తీరమునకు వెళ్ళి, "బద్ధ్వా పరికరం దృఢం' అని మూలమున సంక్షిప్తమైన భావమునకు ఎఱ్ఱయవిస్తృత వ్యాఖ్యాన మొనర్చినాడు.

ఎఱ్ఱయ శ్రీకృష్ణుని మోమున చిఱునవ్వు వెలసినది కలుగులు త్రాళ్ళు తొలఁగవైచి ధక్కను వేణువును అన్న చేతికిచ్చి, చెప్పులు తొలఁగించి, వెండ్రుకలు జడగా నల్లి ముడివైచి, - అనంతరము మడుగు లోనికి దుమికినాఁడు. ఇతఁడు చేయఁబోవు కార్యము - దుష్టుడగు కాళీయుని దమనము. ఇచ్చట ధర్మ వీరము ధ్వనించు చున్నది "ఎవ్వరి తోడను చెప్పక, ఒక యింతయు మంతన మాడక" - దుముకుట గర్వమును వ్యభిచారి భావము; పెడబొబ్బ లిడుట - ఆర్చి యాగక సుఱుకుటలు, ధృతి యను వ్యభిచారీ భావమును, - చిరునవ్వు - హర్షమును వ్యభిచారీ భావమును; శ్రీకృష్ణుఁడాలంబనమగు నుత్సాహమను స్థాయిని పాఠకుని యందు పుష్టివంత మొనర్చు చున్నవి. ప్రజలను బాధించు కాళియుని, "ఇది మదీయ పదస్పర్శ పదవిఁ గాంచి, యఖిలలోక నమస్కార్యహారి మహిమను పొందుఁగాత" మని నిశ్చయించుట- ప్రజల భీతినిపోఁగొట్టుఁ దలంచుట - శ్రీకృష్ణుని యందలి యుత్సుకతను తెలియఁ జేయు చున్నవి.

ఇచ్చట వాచ్యార్థము పొసఁగుచున్నది. వాచ్యార్థముతోపాటు - శ్రీకృష్ణుఁడు గావించు నుద్యమ తీవ్రత చేసికొనిన కట్టుదిట్టములు, తీసికొనిన మెలుకువలు భద్ర తలు - గోచరించుచున్నవి. ఇందు అసంలక్ష్యక్రమ వ్యంగ్యమగు - రసధ్వని ప్రతీయమానమగుచున్నది. వివక్షితాన్యపర వాచ్యధ్వని. ఇచ్చట ధర్మవీరము రసము. శ్రీకృష్ణుఁడాలంబనము.

మఱొక వర్ణన :-

శ్రీకృష్ణుడు కాళియుని మడుగున దుమికినాఁడు ఆ పన్నగము లాతనిని బంధించి వేసినవి. కొంత తడవు - అవి కలిగించిన బాధలనుభవించిన వానివలె నటించినాఁడు. - అనంతరము -

ద్వైతభ్రాంతి నివృత్తిఁ బొందఁగ నభేద బ్రహ్మబోధంబు సం
భూతం బైన నశేష బంధనములం బోఁద్రోచు సిద్ధాత్ము న
ట్లా తం డమ్మెయి నాత్మతత్త్వ విదుఁడై యప్పాప చుట్ట లిన్వి
ర్ధూతిం బొందఁగ నీల్గి బిట్టు నెగసెందోయాఘు మధ్యంబునన్

హ. వం I-7-46

జీవుఁడు వేఱు; పరమాత్మవేఱు - అనుభావము ద్వైతము. అది భ్రాంతి మాత్రమే. అది అజ్ఞాన జనకము. ఆ యజ్ఞానమును పోఁద్రోల వలయును. అట్టి అజ్ఞాన నివృత్తి కలుగవలయు ననిన శ్రవణ మనన నిది ధ్యాసములను సాధనములు

సంపూర్ణముగా కొఱతలేక యుండ వలయును. అప్పు డజ్ఞానము తొలఁగి, ఆత్మ పరమాత్మలో నైక్యమై హృదయమునకు దైవాత్మైక్య సాక్షాత్కార బోధము కలుగును. అదే ద్వైతభ్రాంతి నివృత్తి. అప్పుడు "సోఽహం బ్రహ్మాస్మి" అను భావ ముదయించును. అదే సమాధ్యవస్థ.

"సోఽహం బ్రహ్మన సంసారీ నమత్తోఽన్యత్కదాచన
ఇతివిద్యాత్స్వమాత్మానం సాసమాధిః ప్రకీర్తితా"

అదియే ద్వైత భ్రాంతి నివృత్తి. ఆ నివృత్తిఁ బొందిన వెంటనే బ్రహ్మకు తనకు భేదములేదను జ్ఞానము సంభూతమగును. అప్పుడాతని యశేష కర్మ బంధనములు తొలఁగును. అనురాగము, మమత కామక్రోధాదులు, - ఈ యన్ని బంధనములను ఛేదించు కొనును. అతఁడే సిద్ధుఁడు. లోకాతీతుఁడు అట్టి సిద్ధునివలె శ్రీకృష్ణుఁడాత్మ తత్త్వవిదుఁడై-తన పరతత్త్వమును స్మరించినవాఁడై- అప్పాపచుట్టలు సర్పముల బంధనములు-ఎగిరిపోఁగా నీల్గి జలమధ్యమునుండి ఓట్టుగా నెగసెను. ఇదియొక సమాధిస్థుఁడగు జ్ఞాని చేష్టలు, జ్ఞాని సమాధిస్థుఁడై - సర్పాకారమగు కుండలినీ శక్తిని జాగృతమొనర్చుకొనును. ఆ శక్తి జాగృతమైనంతనే మూలాధార చక్రమునుండి సహస్రార చక్రము వరకు ఊర్ధ్వ ముఖముగా ఎగిరిపోవుటయు కలదు అప్పుడే అతఁడు జీవబ్రహ్మైక్య జ్ఞానమును పొందును. కర్మబంధము లాతని నంటక తెగిపోవును. ఈ సమగ్ర భావము శ్రీకృష్ణుఁడు సర్పబంధముల ఛేదించుకొని ఎగిరి నప్పటి స్వరూపముతో - చూచుచున్నాఁడు ఎఱ్ఱయ. జ్ఞాని యగు సిద్ధుఁ డుపసమానము. శ్రీకృష్ణుఁ డుపమేయము, సర్పబంధముల ఛేదించుకొని శ్రీకృష్ణుఁడెగురుట - సిద్ధుఁడు పద్మాసనస్థితుఁడై కుండలినీ శక్తిని లేపి యూర్ధ్వముగా సహస్రార చక్రమున బంధించి బ్రహ్మబోధమును పొందుటతో పోల్చినాఁడు. ఇచ్చట నుపమానోపమేయములతో సుందరమగు నలంకార రూపమున సిద్ధుని గతిని స్ఫురింపఁ జేసినాఁడు. వాచ్యార్థము స్ఫురించుచునే యలంకార రూపమున మఱొక సుందరమగు నర్థము గోచరించుచున్నది; కనుక అలంకారిక ధ్వనియిది.

శ్రీకృష్ణుఁడు కాళియ మడువున దుమికినాఁడు. సర్పము లాతని చుట్టుముట్టి బంధించి వేసినవి. ఆ బాలవృద్ధంబుగా వ్రేపల్లె యెల్లఁ గదలి వచ్చినది. కాళియుని చుట్టలు, చెలులు, కాంతలు, పుత్రులు, భయంకరముగ చుట్టుముట్టినవి. అప్పుడాతని రూపము-

చ॥ అసిత ఘనాకృతుండయిన యర్కుని మాడ్కి మహావిధుంతుదో
ల్లసన విషణ్ణుఁ డైన మృగలాంఛను పోల్కి నుదగ్రధూమ సం
ప్రసర తిరోహితుండయిన పావకు భంగి భుజంగ బంధన
వ్యసనము నొందియున్న కమలాక్షునిఁ గాంచి విషణ్ణ చిత్తలై
I - 7-30

ఇది శ్రీకృష్ణుఁడు కాళియ నాగము చేత తక్కిన సర్పముల చేత చుట్టఁబడి విషదూషితుఁడై మూర్ఛపోయిన విధానము. శ్రీకృష్ణుఁడు చైతన్యమునుఁ గోలు పోయినాఁడు. కాలమేఘము చేత నావృతుండయి తాపము కోల్పోయిన అర్కుని వలె శ్రీకృష్ణుడు తేజో విహీనుఁ డయినాఁడు.

రాహుగ్రస్తుఁడగు చంద్రునితో, అత్యధిక ధూమావృతుఁడగు నగ్నితో, భుజంగ బంధనముచే వ్యసనము నొందిన కృష్ణుఁడు పోల్పఁబడినాఁడు. ఇచ్చట నాతని తేజోవిహీనత, కాంతి విహీనత తాత్కాలికమేనని ధ్వనించు చున్నది. మేఘావృతుడై సూర్యుఁడు తాపమును కోల్పోవుట క్షణికము. రాహుగ్రస్తుఁడై చంద్రుఁడు కళావిహీనుఁడగుటయు తాత్కాలికమే ; ఉదగ్ర ధూమసంప్ర సారముచే నగ్ని తన తాపమును కోల్పోవుటయు కొంతకాలము. మేఘనిర్ముక్తుఁడగు సూర్యుని ప్రతాపము తీవ్రతరమగును. రాహుపరిత్యక్తుఁడగు చంద్రుని కాంతియు నినుమడించును. ఉదగ్ర ధూమ వ్యాప్తిచే ప్రకాశ హీనుఁడైన అగ్నియు, ద్విగుణీకృత జ్వాలలతో భగ్గున మండును. కనుక శ్రీకృష్ణుఁడు తాత్కాలికముగా తేజోవిహీనుఁడైనను ద్విగుణీకృత ప్రతాపుఁడై కాళియుని గర్వమును భంగమొనరింపఁ గలఁడని ధ్వనించుచున్నది.

ఇచ్చట వాచ్యార్థము పొసఁగుచున్నను అలంకారముల బలమున మఱొక రమణీయార్థము గోచరించుచున్నది. కనుక — ఇది సంలక్ష్యక్రమ వ్యంగ్యము అలంకారధ్వని. వాక్యగతాలంకార సామర్థ్యముచే - శ్రీకృష్ణుఁడు శీఘ్రముగనే కాళియుని పీచమడపఁగలఁడని ప్రతీయాన మగుచున్నది.

ఒకనాడు బాలురగు రామదామోదరులు గహన కాంతారమున ప్రవేశించిరి. ఏ దెసఁ గాంచినను తృణ సముదాయము మనమున కాహ్లాదమును గొలుపు చుండినది. గోపాలు రందఱును నానందోత్సాహములతో విహరించు చున్నారు. అప్పుడు శ్రీకృష్ణుఁడు రోహిణీ నందనునితో నిట్లను చున్నాఁడు.

చూచితివా ? ఈ తాళవృక్షము నందలి ఫలములను ? తాళఫలములు క్రమముగా పక్వమైనవి. కనుకనే కెంపుతోఁగూడిన నలుపు. మిక్కుటమగు గంధమును దిక్కుల పరిమళింపఁ జేయుచున్నవి. రసమం తర్భాగమున నున్నను, వెలికి కార్చు చున్నట్లున్నవి."

ఇది తాళఫల వర్ణన -

మ॥ క్రమపాకంబుఁ గెంపుతోడి నలుపెక్కన్మిక్కుటంబైన గం
ధము దిక్కుల్సురభీ కరింప రసమంతర్గామియయ్యున్వెలిం
గమియం గాఱుచునున్న చాడ్పున విలోకప్రీతిఁ గావింప హృ
ద్యములై యున్నవి చూచితే ఫలములీ తాళద్రుమశ్రేణులన్ I-7-77

తాళవృక్షము, తాళపత్ర గ్రంథమగు హరివంశమునకు సూచకము. ఈ తాళపత్రము లందలి ఫలము - క్రమముగా పక్వమైనది. కెంపుతోఁ గూడిన నలుపు - రజోగుణముతోఁ గూడిన విషాదమును సూచించుచున్నది. క్షీరాబ్ధిశయనుఁడు - దుష్టుల శిక్షించుటకై క్రమముగా రజోగుణమును పొంది. భువి యం దవతరించుట - దుష్ట శిక్షణకై క్రోధము దాల్చుట - రాక్షస సంహారము - వీనిని సూచించుచున్నవి. "నలుపు" - అక్షరాబ్ధిశయనుని విశృంఖల విహారమగు దుష్ట వినాశమును, తరువాత రాక్షసులకగు విషాదమును సూచించుచున్నవి రాక్షస వినాశము, దుష్ట విషాదముతోఁ గూడిన యీ గ్రంథ పరిమళము దిక్కుల సురభీకరించు చున్నది.

మూలమునందు -

"తత్ర దామోదరో వాచ ముహాచ వదతాం వరః
అహో తాళఫలైః పక్వైర్వాసి తేయం వనస్థలీ
హ. విష్ణు. 13-7

స్వాదూన్యార్య సుగంధీని శ్యామాని రసవంతి చ
పక్వతాళాని సహితౌ పాతయావే లఘుక్రమా
హ. విష్ణు 13-8

యద్యేషా మీదృశో గంధో మాధుర్య ఘ్రాణ తర్పణః
రసేనామృత కల్పేన భవితవ్యంచ మే యతిః" హ. విష్ణు 13-9

ఇట్లు మూలము నందలి 'సుగంధీని' అనుదానికి 'దిక్కుల్ సురభీ కరింప' నని యనువాదము. 'స్వాదూని' యను దానికి 'హృద్యములై' యని – 'శ్యామాని' అను దానికి "క్రమపాకంబున కెంపుతోడి సలుపెక్కన్" అనునవి యనువాదము లైనవి. 'రసేనామృత కల్పేన భవితవ్యంచ మేమతిః' అను దానికి 'రసమంతర్గామి యయ్యు న్వెలింగమియం గారుచునున్న చాడ్పున' అనునది – హృద్యములై యున్నవి. సహృదయులకు తప్పక హృదయాహ్లాదముఁ గొలుపఁ గలదను నమ్మకముతో సిశ్చితాభిప్రాయమును తెలియఁజేయుచున్నాఁడు.

పండితులు, కవులు, రసజ్ఞులు – అంతర్గతమగు రసము నాస్వాదింపఁ గలరు. సామాన్యులు 'వెలింగమియం గారుచు నున్న చాడ్పున' నున్న కావ్యామృతమునే చవి చూడఁగలరు. ఈ తాళద్రుమశ్రేణు లనుటచే – శ్రేణులుగా నమర్పఁబడిన తాళపత్ర గ్రంథము ప్రతీయమాన మగుచున్నది. విలోక ప్రీతిఁ గావించుట – విశేషముగా పరిశీలించిన వారికి తప్పక రసానందమును సమకూర్పఁ గలదని ధ్వనింప జేయుచున్నది. 'విలోకప్రీతి' యనఁగా పక్షిలోకమునకు ప్రీతిఁగల్గించునదని వ్యష పరమైన అర్థము. దిక్కులు సురభీకరించుట – గ్రంథ ప్రాశస్త్యమును నలువైపుల వ్యాపింపఁ జేయఁగల దనుటను సూచించు చున్నది. రసమును వెలికి గమియం గారు నట్లుండుటచే – పైపై పఠించువారికిని, అంతర్గామి యగుటచే – విశేషముగా పరిశీలించు వారికిని హృద్యములై, సహృదయ హృదయానందమును చేకూర్పఁ గల దను విశ్వాసము ధ్వనించుచున్నది.

ఇట్టి పద్యము తాళఫల పక్వతను తెలియఁ జేయుచునే – హరివంశగ్రంథ తాళపత్రముల ప్రాశస్త్యమును ధ్వనింపఁ జేయుచున్నది. కనుక బాహ్యార్థము పొసఁగు చునే మఱొక రమణీయార్థమును స్ఫురింపఁ జేయుచున్నది కనుక – వివక్షితాన్య పరవాచ్యమగు ధ్వని కలదని, యుత్తమ పద్యమని తెలియుచున్నది. ముఖ్యార్థ బాధ కలుగక, అన్యార్థమును చెప్పుటలో పర్యవసించుటచే నిది సంలక్ష్యక్రమ వ్యంగ్యము.

కంసుఁడు దితిసుతాంతకుని చేఁజిక్కి విగత ప్రాణుఁడైనాఁడు. దిక్కులేని పీనుఁగై రంగవాటంబున పెద్ద బయలం బడిన యక్కంసుని కడకు తద్భార్య లందఱును వచ్చుచున్నారు. అంతఃపురమును వీడి యత్యంత శీఘ్రముగా నేతెంచు చున్నారు. అప్పటి వారి రూప వర్ణనము – ఎఱ్ఱయ గావించినది.

సీ॥ కరతాడనములఁ జన్గవలపై లత్తుక
చట్టలు చఱచిన చాడ్పు దోఁపఁ
దెగి రాలు హారమౌక్తికములు నశ్రు బిం
దువు లేర్పఱుపరాక దొంతడింప
నెండెండు వాతెఱ నెసఁగు తాంబూల ర
క్తిమ శోకవహ్ని గ్రక్కెడు తెఱఁగుగఁ
దూలెడు పయ్యెద దుఃఖాంబు నిధి లోని
కడల చందంబునఁ గడలు కొనఁగ

తే॥ గీ॥ వీడి వెన్నుల వ్రేలెడి వేణు లోలి
వెలసి కాలాహి నిభములై సొలఁపుఁ జూపఁ
బొదువు మూర్ఛలు డెందంబు బదిల కొలుప
నలఁత కొలఁదికి మిగిలె నయ్యంగనలకు"

హ. వం I-9-183

వీరాధి వీరుఁడై జగము నంతయు గడగడ లాడించిన ఆభర్త వారి కిఁక లేఁడు. భార్య లందఱును మూర్తీభవించిన శోక స్వరూపిణులైనారు. "అలఁత కొలఁది మిగిలె నయ్యంగనలకు" - బాధ శక్తికి మించి పోయినది

మాటికి చేతులతో నావేశమున గుండెలు బాదుకొను చున్నారు. చేతులు లత్తుకచే నలంకృతములై యున్నందున - లత్తుక యందు ముంచి చట్టలు చఱచిన ట్లున్నది. చేతులతో బలముగా కొట్టుకొనుటచే ముత్తెముల హారములు తెగుచు, జాఱిపోవు చున్నవి. కనులనుండి ఎడతెగక అశ్రుకణములు రాలుచున్నవి. హార మౌక్తికము లేవో, అశ్రు బిందువులేవో, యేర్పఱుప రాక యుండినది. అఱచి యఱచి నోరెండి పోవుచుండినది. ఆ నోటి తాంబూల రక్తిమ - వారు శోక వహ్నినిఁ గ్రక్కుచుండిరో యను నట్లుండినది. పయ్యెదలు తూలిపోవు చున్నవి. వీపున విడిపోయి కేశపాశ ములు వ్రేలాడు చున్నవి. మూర్ఛలు పొదివికొని వచ్చుచుండినవి. ఇట్టి స్త్రీలు మూర్తీభవించిన కరుణ రస స్వరూపలై వచ్చు చుండిరి.

"ఇష్ట జనస్య వినాశా చ్చాపాత్క్లేశా చ్చ బంధనాత్
ఏతై రర్థ విశేషైః కరుణాఖ్య రస స్సముద్భవతి"

భర్త లోకాంతర గతుఁడైనాఁడు. అశ్రుకణములు తొఁగుట - పయ్యెదలు తూలిపోవుట - అశ్రుపాతము, స్తంభము అను సాత్త్విక భావములు, కురులు చెదరిపోవుట - దైన్యమును, అశ్రువులు - ఆర్తి యను వ్యభిచారీ భావమును, వాతెఱ లెండిపోవుట - శ్రమను, పొదివికొని వచ్చు మూర్ఛ - త్రాసమను వ్యభిచారీ భావమును తెలియఁజేయుచున్నవి.

ఇట్టి సందర్భమున పాఠకుని యందలి శోక మను స్థాయి, కంసుని భార్యలాలంబనముగా తొలఁగిన పయ్యెదలు, చట్టచఱచుట ఆవేగముతోఁ గూడిన అనుభావములును, వీడిన కురులు, అశ్రువులు స్తంభాది సాత్త్విక భావములతో - త్రాస, దైన్య, శ్రమ, ఆర్తి మొదలగు వ్యభిచారీ భావములతో పుష్టములై కరుణ రసమును ధ్వనింపఁ జేయుచున్నవి.

ఈ సీస పద్య పాదము లందలి ఉత్ప్రేక్ష - మీలనాద్యలంకారయులు, ఆయా అవయవయల తాత్కాలిక స్థితిని, చక్కగా రూపొందించుచు రసము నలంకరించుచున్నవి. ఇది యలంకార సంకీర్ణమగు వాక్యగత - అసంలక్ష్య క్రమ వ్యంగ్యమున రసధ్వని (రసాభాసము).

అలతి యలతి పదములు, సమాసరాహిత్యము - మాధుర్య ప్రసాద గుణములను తెలియఁజేయుచున్నవి.

ఇచ్చట కంసుని భార్యల విలాపము నందు కరుణరసము వ్యంజితమైనది గనుకనే నాయికలకు, కవికి, పాఠకునికి నొకే విధమగు అనుభవము కలుగుచున్నది.

వివాహ మంగళమునకై వెడలు రుక్మిణీదేవిని
చెలులు కైసేసిన విధము.

సీ॥ వాలిత పర్జన్య లక్ష్మి విభూషించు
 పర్యాప్త నవ మేఘ పంక్తు లనఁగ
రమణీయ శారదరాత్రిఁ బ్రకాశించు
 రాకా సుధాకర ప్రభ లనఁగఁ
బ్రకటిత ప్రాభాత పద్మినిఁ బాటించు
 బాలారుణోదయ లీల లనఁగ
నుల్లసితాశోక వల్లరి నలరించు
 నుదిత వసంత సంపద లనఁగ

తే॥ గీ॥ వితత మోహన మంత్ర దేవతఁ బ్రసన్నఁ
జేయు సాధక సాధన శ్రీ లనంగ
రుక్మిణీ దేవి నభిరూప రుక్మ కాంతి
కలిత తనుయష్టిఁ గైసేసి రెలమిఁ జెలులు.

హ. వం II-3-68

ఇది వివాహ సందర్భమున రుక్మిణీదేవిని సఖు లలంకరించిన విధానము ఇచ్చట ఉపమేయములను మఱుఁగు పఱచి, యుపమానములను మాత్రమే తెలియఁ బఱచినాఁడు ఎఱ్ఱయ ఇది మూలమున లేని వర్ణన.

సఖులు మొదట రుక్మిణి కురుల నలంకరించిరి. అవి 'లాలిత పర్జన్య లక్ష్మి విభూషించు నూతన మేఘ పంక్తుల' వలె నున్న వఁట! మేఘముల వరుసలు తెరలు తెరలుగా నుండును. ఈమె కురులును పొరలు పొరలుగా - అరాళములై యున్న వని ధ్వని. నూతన మేఘ పంక్తు లనుటచే - కురులు దట్టముగా నల్లఁగా నున్నవని ప్రతీయమానమగు చున్నది. ఇవి వాచ్యముగా చెప్పఁబడలేదు.

ఇట్లు కురుల నలంకరించిన తరువాత ముఖమును కై సేసిరి. ఆమె ముఖ కాంతి "రాకా సుధాకర ప్రభల" వలె నున్నదఁట! శారద రాత్రులే రమణీయములు. అందును రాకా సుధాకరుని ప్రభలతోఁగూడిన శారద రాత్రుల శోభ అది. మఱింత రమణీయము. అందులోను రమణీయ శారద రాకా సుధాకర బింబ శోభ అంతటి రామణీయకత గలది రుక్మిణి ముఖ బింబ కాంతి యని ధ్వనించు చున్నది. ఇచ్చట చంద్రున కనేక పర్యాయ పదములున్నను, 'సుధాకర' పదమునే ప్రయోగించి ఎఱ్ఱయ ఆమె ముఖ మమృత కళలను వెదజల్లు చంద్రుని వలె నయనామృతమై లావణ్యము నీను చున్నదని ధ్వనింపఁ జేసినాఁడు.

వసంతర్తువు నందు - పాదపములు - చిగురించును ఆ చిగుళ్ళ కాంతి వలె నీమె పాదాగ్రములు కాంతి గలిగి ఎఱ్ఱటి పుష్పములతో గూడిన అశోకవల్లరినే యలంకరించు నంతటి ఎఱుపును గలిగియున్నదని ధ్వనించు చున్నది. ఇట్లు సహజారుణిమ గల పాదములను లాక్షారాగముతో మఱింత ఎఱ్ఱగా నలంకరించి హస్తాగ్రములను బాలారుణ శోభ నొసంగు లత్తుకతో కై సేసిరని తెలియుచున్నది.

కట్టకడకు - నేత్రముల నలంకరించిరి. అవి నేత్రములు కావు. విశాలములై మోహనమంత్ర దేవతను ప్రసన్న మొనర్చు కొను సాధకులకు సాధనశ్రీలు- ఈమె వీక్షణములు - సమ్మోహితులను గావించి, పారవశ్యము నొడగూర్చు చుండినవని భావము. ఇట్లు రుక్మిణీదేవి - నవీన స్వర్ణకాంతితోఁ గూడిన తను యష్టిని గై సేసిరి. 'తను' అను పదము సుకుమార భావమును - 'యష్టి' యను పదము సన్నగా నుండిన దని తెలియఁ జేయు చున్నవి.

ఇచ్చట తను యష్టి యందలి, కురులు ముఖము, హస్తములు, పాదములు - అని వాచ్యముగా చెప్పక పోయినను, ఆయా యుపమానముల బలము వలన ఉపమేయములు ప్రతీయ మానము లగు చున్నవి. కనుక నుత్తమోత్తమ రూపమును ధ్వనింపఁజేయు అవివక్షిత వాచ్యధ్వని యందు - అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వనియై రుక్మిణి శృంగార రస దేవతగా రూపొందింపఁ బడినది. ఈమె యలంకరణము శృంగార రసమున కుద్దీపన విభావమై - రుక్మిణి యాలంబనమై 'రతి' యను స్థాయీ భావము గోచరించు చున్నది.

సమ్మోహన మంత్ర దేవతను ప్రసన్న మొనర్చు కటాక్షము లుద్దీపనములు, రాకాసుధాకర కాంతిగల మోము - ఆలంబనమై పాఠకునిలో 'రతి' యను స్థాయి యుదయించినది. కాని రసపుష్టి వఱకు పోషింపఁబడలేదు . కనుక నిది భావము. ఆ ఉపమేయములగు ఆమె యంగము లూహింప వలసినదే. అవియు నుపమాన బలముచే ప్రతీయ మానము లగుచున్నవి. కనుక అవివక్షిత వాచ్యధ్వని.

గౌర్యాలయమునకు బయలుదేరి తిరిగి వచ్చుచున్న రుక్మిణిని కృష్ణుఁడు గాంచినాఁడు. చూపులు చూపులఁ గలిసినవి. రుక్మిణి తాను మును విన్న రూపమును కనులారఁ గాంచినది. శ్రీకృష్ణుఁడు గ్రక్కున నామెను పరిగ్రహించు నిమిత్తము ముందునకు వచ్చి నిలిచినాఁడు రుక్మిణికి - విస్మయము, కంపము, హర్షము నొండొకంటితో పెనఁగొన శీతబాష్పువులు ముఖారవించమునఁ దోచినవి ఇంత వఱకును అనుభవించిన తీవ్రమైన వియోగవ్యథ పొంగి అశ్రు రూపమున బయటికి వచ్చినది. అఖిల సౌందర్య నిధియైన ఆది పురుషుఁడు - పిలువకయే తన్నుద్ధరింప నేతెంచినాఁడు అతని చెందు చూడ్కి మదిలోన చిక్కినది. చెలులు వెఱగుపడి చూచుచుండఁగనే రుక్మిణి తన్ను మఱచినది.

మ॥ పతిచూపు న్సతిచూడ్కియు న్సమగతిం బ్రస్ఫీతరాగంబులై
ధృతి వాయంబుయిలోట యొల్లగిల నుద్వేగం బఱం బ్రహీ బరి
చ్యుతి వాటిల్లఁ బరస్పరాంగములపై నొండొండ బ్రాకంగఁద
చ్చతురావస్థఁ గృతార్థ దంపతుల యోజంబొల్చె నిర్వ్యాజతన్
II-3-80

ఇది రుక్మిణీ శ్రీకృష్ణులు - పరస్పరావలోకనముచే పొందిన సమాధ్యవస్థ. సభోంగ శృంగారమును సూచించుచున్నది.

"దర్శన స్పర్శనాదీని నిషేవేతే విలాసినౌ
యత్రాను రక్తావన్యోన్యం సంభోగోఽయ ముదాహృతః"
(సా. ద. తృ. 210.)

అనురక్తులగు వీరిరువురి పరస్పరాలోకనము-ఆలంబనమై - పాఠకుని యందలి రతి-ధృతి వాయుట - హ్రీ పరిచ్యుతి వాటిల్లుట - ఆవేగము అను వ్యభిచారీ భావముగా 'ఉద్వేగం బఱన్' అను స్తంభమను సాత్త్విక భావముతో-వీరి సమాధ్యవస్థ ప్రళయ మను సాత్త్విక భావముగా శృంగార రసముగా పుష్టినందినది.

అలతి యలతి సమాసములు,వైదర్భీ రీతి ప్రసాద గుణము శృంగార రసపుష్టికి తోడ్పడుచున్నవి.

'ఉద్వేగం బఱన్' అనుట మోహమును తెలియఁజేయుచున్నది. పరస్పరాంగ ములపై దృష్టి వ్యాపించుట అను భావము.

ఇందు వివక్షితాన్య ధ్వనిలో - అసంలక్ష్య క్రమ వ్యంగ్య ధ్వని - రసధ్వని స్ఫురించుచున్నది.

నరకాసురుని బంధువర్గమంతయును మరణించినది. కోపించిన నరకుఁడు యుద్ధమున కుఱుకు చున్నాఁడు. బలాధిపునితో పాటు అతని బలమంతయు వికల మైనది. అప్పటి యాతని రూపు-

మ॥ భ్రుకుటీ బంధురోగ్ర వదనంబున్ దష్టదంష్ట్రాధర
ప్రకటాహంకరణోచ్చ హుంకృతియుఁ బ్రస్పందాతి వృత్తాంసలో
త్సుక బాహాయుగళంబునైన సుమతీసూనుండనూనైక సా
ధక సన్నాహముతోడ నెల్వడియె నుత్సాహాన సోహాకృతిన్.
హ. వం.II-4-147

వీరాధి వీరుఁడగు నరకుని వీరత్వ ప్రదర్శనతోఁ గూడిన రూపమిది. ఇతఁడు శ్రీకృష్ణునిపై నుఱుకునప్పటి రూపమిది.

భ్రుకుటీ బంధనము, దంష్ట్రాధర దశనము - అనుభావములై - బాహుకంపనము సాత్త్విక భావముగా, హుంకారము, అమర్షమను వ్యభిచారీ భావమై, పాతకుని లోని యుత్సాహము వీరముగా పుష్టి నొందుచున్నది. ఇచ్చట 'ఉత్సాహానవోహా కృతిన్' అని ఉత్సాహము వాచ్యముగా చెప్పఁబడు చున్నను, - ఈ పదము చేతనే మన కిచట వీరరసము ధ్వనించుట లేదు కనుక భావము వాచ్యము కాలేదు భ్రుకుటీ బంధన, ఉగ్రవదన, దంష్ట్రాధర దశనములు, బాహుస్పందము, హుంకారము - రస పుష్టి కుపయుక్తము లగుచున్నవి.

ఇచ్చట - నరకుని యుద్ధ సన్నాహము వాచ్యముగా గోచరించు చున్నను - మఱొక రమణీయార్థము గోచరించు చున్నది - కనుక - వివక్షితాన్యపరవాచ ధ్వనిలో - అసం లక్ష్య క్రమ వ్యంగ్యము ఈ వీరము - నరకుఁ డాలంబన మగుటచే - అప్రధాన వ్యక్తి యాలంబనముగా రసాభాస మగుచున్నది.

హుంకారమున - అమర్ష మను వ్యభిచారీ భావము గోచరించును. నరకుని లోని యీ రస మనుచితము అముఖ్యము, - కనుక నిది రసాభాసము. ఆ భాస మనఁగా అముఖ్యత. వీరత్వ ప్రదర్శన అముఖ్యుఁడగు ప్రతినాయక నిష్ఠముకనుక రసాభాసము.

నరకునిచే పరిపీడితులగు మునీశ్వరులు - వసుదేవ సూనుని సమీపించెద మని ద్వారక చేరిరి. ఆతని కడ మొఱ లిడుటకై యాతనినిఁ గాంచిరి. యదుపతి దుఃఖించు మునుల దురవస్థను గాంచినాఁడు. అప్పుడాతని రూపమును ఎఱ్ఱయ వర్ణించిన తీరు -

శ్రీకృష్ణుఁడు మహాదీప్తాసనముపై నాసీనుఁడై యుండెను. -

సీ॥ "నీలాద్రిఁ దనరు మాణిక్యపు శిఖరంబు
క్రియ రత్ననూత్న కిరీట మెసఁగ
గగనంబు నడిమి చక్కటి నొప్పు నరుణాంశు
కరణిఁ గౌస్తుభము వక్షమున వెలుఁగ

జలరాశిఁ బొదివిన సాంధ్యపయోదంబు
క్రమమునఁ బీతాంబరము దలిర్ప
మేచకాభ్రంబున మెఱయు సురేంద్ర చా
పము లీల వనమాల ప్రస్ఫురిల్ల

తే. గీ. నల్లనునుఁ జాయ మే నొప్పఁ దెల్లదమ్మి
విరుల సిరిగన్న కనుదోయి యరుదుగాఁగ
నమరు జగదీశు సకల హితార్థ జన్ము
జన్మ విరహితు వసుదేవ జాతుఁ గాంచి"

హ. వం II-4-68

ఆతని రత్నకిరీటము — నీలాద్రిపై నొప్పు మాణిక్య శిఖరమువోలె నొప్పినది. ఇతని తనుచ్ఛాయ నీలాద్రి వర్ణమును బోలినదని, యాతని యాకారము పర్వతము వలె నౌన్నత్యముగలదని తెలియుచున్నది. ఆతని వక్షస్థలము విశాలమైనది. అందు కౌస్తుభ మణి కాంతులంతటను ప్రసరించు చున్నవి. అది 'గగనంబు నడిమి చక్కటి నొప్పు జరుణాంశు కరణి, నున్నదఁట; ఆకసము వలె నీలమై విశాలమైన దాతని వక్షము. జలరాశిని సాంధ్య పయోధరము చుట్టినట్లుగ నితని కటి భాగమున పీతాంబర మొప్పు చుండినది.

ఆతని వక్షము నందలి వనమాల మేచకాభ్రమున మెఱయు సురేంద్ర చాప ముతోఁ బోల్పఁ బడినది. వనమాల యందు పలు వర్ణముల పుష్పము లుండును. ఆతని వక్షము విశాలమై నీలవర్ణము గలిగి యుండినది. విశాల వక్షమును మేచకాభ్రముతోడను, వనమాలను ఇంద్రచాపముతోనుఁ బోల్చుట-ఇంద్ర ధనుస్సు మాలాకార ముగా వంగియుండుట - పోలిక సమంజసముగ నున్నది. కన్నుదోయి కాంతులు తెల్ల దమ్మి వైభవముతో నొప్పినవి ఇట్లమరు జగదీశుని, సకల హితార్థ జన్ముని, జన్మవిరహితుని వసుదేవ జాతుని గాంచినాఁడు. ఇచ్చట 'జగదీశుఁడు', 'సకల హితార్థ జన్ముఁడు' — అను పద ప్రయోగము లభిప్రాయ గర్భితములు. జగముల కంతటికిని - ఈశుఁడు గనుక — నాతఁడు తప్పక జగత్త్రాణమునకై యత్నించు నని, జగత్త్రాస మొనరించు దుష్టుల పీచ మణచఁగల వాఁడని ధ్వనించు చున్నది. జన్మరహితుఁ డగు నీతని జన్మకు కారణము - సర్వుల హితము. కనుక సాధువుల కహితమును కాంక్షించు వారి నాశ మొనర్పఁగలఁ డని ప్రతీయమాన మగు చున్నది.

అతని కటాక్షములు - తెల్లదమ్మి విపుల శోభను కలిగినవి. తెలుపు సత్త్వ గుణము నకు ప్రతీక. సాత్త్వీక గుణముతో నిండిన చూపు తత్త్వసారమునే ప్రసరించును తప్పక అతఁ డనుగ్రహింపఁ గలఁడని స్ఫురించు చున్నది.

పర్వతము వోలె సమున్నత భావములు, గగనము వలె సువిశాల మగు హృదయము, సాగరము వంటి గంభీర స్వభావము - కలవాఁడని ధ్వనించు చున్నది. ఇచ్చట వాచ్యార్థము పొసఁగు చున్నను, మఱొక రమణీయ మగు నర్థము గోచరించు చున్నది. కనుక - వివక్షితాన్యపర వాచ్య ధ్వనిలో అసంలక్ష్యక్రమ వ్యంగ్యమున భావధ్వని గోచరించు చున్నది. మనుల ననుగ్రహింపఁ గలఁడను ధర్మవీరమున కుత్సాహ మీరూపమున స్ఫురించు చున్నది. శ్రీకృష్ణుఁ డాలంబన మగు నీ యుత్సాహము పాఠకుని యందు రసపుష్టి నందలేదు. కనుక భావధ్వని.

శ్రీకృష్ణుఁడు 'మురాసురాది రాక్షస వీరులపై విజృంభించినాఁడు. కఠోర బాణమును సంధించి, రిపు మస్తకము నేసెను. ఆ మకుటాంశువు లఱ్వఁగబడి మురుఁడు హతుఁడయ్యెను. మురుని చంపి శ్రీకృష్ణుడు పాంచజన్యమును పూరించి నాఁడు. తదారావము త్రిలోకంబులకు బాధాకరమై పర్వినది.

" జలధుల్ పిండలి నందుఁగాఁ గలఁగె నాశావారణశ్రేణి బె
గ్గిలి మొగ్గం బడియెం జరాచరచయ క్లేశోత్తరంబై ధరా
వలయంబంతయు గ్రక్కసం గదలె గీర్వాణావళుల్ సాధ్వసా
కులమయ్యెన్ హరపంకజాసనులు ప్రక్షోభించి రంతర్గతిన్.

హ. వం. II-4-36

జలధులు పంకమగుట - దిగ్గజములు తూలి మ్రొగ్గంబడుట - ధరామండల మంతయు గ్రక్కునఁగదలుట - చరాచరములు క్లేశము నొందుట - గీర్వాణబృందము సాధ్వసముచే నాకుల పడుట - పాంచజన్య ధ్వానము యొక్క ప్రచండతను సూచించుచున్నది.

శ్రీకృష్ణుని పాంచజన్యధ్వానమెంత ఔద్ధత్యము గలదో - చరాచరములను చలింపఁ జేసినదో తెలియజేయు చున్నది.

ఇచ్చట శ్రీకృష్ణుఁ డాలంబనముగ - పాంచజన్యధ్వాన ముద్దీపనముగ 'దిగ్గజ ములు తూలిపోవుటలు, జలధులు లింకి పోవుటయు, అనుభావములుగ గీర్వాణావళల

ఆకులత - ఆవేగమను వ్యభిచారీ భావముగ-ధరావలయము గ్రక్కున గదలుట 'త్రాస' యను వ్యభిచారిగా - పాఠకుని యందలి క్రోధమునకు దీప్తి కలిగి రౌద్రరసము పుష్టి నందుచున్నది.

ఇచ్చట-నీ పాంచజన్యరవము గావించిన సంచలనము రౌద్రమును స్ఫురింపఁ జేయుచున్నది.

ఇచ్చట వాచ్యార్థము పొసఁగుటలేదు. వాచ్యార్థము పొసఁగక మఱొక రమణీయార్థము గోచరించు చున్నది. కనుక నిది అవివక్షితాన్యపర వాచ్యధ్వనిలో - -అత్యంత తిరస్కృత వాచ్యధ్వని యిది. ఎందుల కన - దిగ్గజములు తూలి ముందునకుఁబడుట - జలధు లింకి పంక మగుట - అసంభవము. కనుక వాచ్యార్థము పొసఁగదు.

శ్రీకృష్ణుఁడు శివుని గురించి తపమాచరించుటకై కైలాసమున కేగినాఁడు అచ్చట మధ్యేరాత్రంబున నతఁడా ప్రదేశమున సంచరించు చున్నాడు. అక్కడ శ్రీకృష్ణుని దృష్టికి గోచరించిన మునుల స్వరూపము - శాంతరసోద్బోధకము.

సీ॥ పంచాగ్ని మధ్య తపస్వులు గొందఱు
సలిలాధి వాస నిశ్చలులు గొంద
ఱా బద్ధ తరులతా ధ్యానులు గొందఱు
నిరశన వ్రత సమన్వితులు గొంద
ఱేకాంతికత్వ నిశ్శోకులు గొందఱు
జపయజ్ఞ విధి విచక్షణులు గొంద
ఱమిత నిరంతర యజనులు గొందఱు
ప్రాణ సంయమనైక పరులు గొంద

తే॥ గీ॥ ఱగుచు జటిల ముండిత నగ్నులాదిగా, న
నేక రూప తపోనిష్ఠ లెసఁగ నొప్పు
మునుల నెలవులు ప్రీతిఁ గన్గొనుచు వివిధ
కాననాభ్యంతరములఁ గలయ మెలఁగి.

హ. వం. II-5-106

శ్రీకృష్ణుఁడు మునుల నెలవుల ప్రీతితో గన్గొనుచు కాననాభ్యంతరములందు కలయఁదిరిగినాఁడు.

కొందఱు పంచాగ్ని మధ్యమున తపస్సు గావించు చుండిరి. జలమధ్యమున నిశ్చలులై కొంద ఱుండిరి. తరులతల యం దాబద్ధులై. ధ్యాన మగ్నులైన వారు కొందఱు, నిరశనవ్రతులు ఏకాంత ధ్యాన సంతుష్టులు కొందఱు, జప యజ్ఞవిధి విచక్షణులు కొందఱు, ముండిత శిరస్కులు, నగ్న దేహులునై యనేక రూపముల తపో నిష్ఠులై యుండిరి.

వీరి రూపు, వీరి నిష్ఠ, ధ్యాన మగ్నత జప యజ్ఞములు, నిరశన వ్రతములు - పాఠకునియందలి శమ మను స్థాయికి పోషకము లగుచున్నవి.

సలిలాధివాసము, నిరశన వ్రతాదులు. అనుభావములు; మునులాలంబన విభావము - ప్రశాంతవాసము, కాననాభ్యంతరములు ఏకాంతవాసము — నిష్ఠలు - ఉద్దీపన విభావములై - నిర్వేదమను వ్యభిచారీ భావమును శాంతమైనది.

ఇచ్చట వాచ్యార్థము గోచరించుచునే శాంతము స్ఫురించు చున్నది గనుక వివక్షితాన్యపర వాచ్య ధ్వనిలో - అసంలక్ష్య క్రమ వ్యంగ్యమున రసధ్వని యిది

"న యత్ర దుఃఖం నసుఖం న చింతా
నద్వేషరాగా నచకాచి దిచ్ఛా
రసస్స శాన్తః కథితో మునీంద్రైః
సర్వేషు భావేషు శమప్రధానః"

అన్నట్లు ఈ మునీశ్వరుల తపోనిష్ఠను, యజ్ఞయాగములను, జప ధ్యానములను, గాంచిన పాఠకునియందలి సమభావము నిర్వేదమై, తృష్ణాక్షయమై, క్షణకాలమైనను పుష్టి చెంది - శాంతరసముగా పరిణితి చెందినది.

బదరీ వనమున శ్రీ కృష్ణుఁడు తపము గావింపఁ దలచినాఁడు. స్వస్తికాసన మును బంధించి, సమాధిస్థుఁ డైనాఁడు. అప్పు డాతని రూపు.

సీ॥ స్వస్తికాసనము నిశ్చలముగా బంధించి
తనువుఁ గంధరయుమస్తకము సరిగ
నక్కనై నిలువ నాసాశిఖరంబుపై
నరమోడ్పు చూడ్కి యేకాగ్ర సరణి

నిలిపి మూలాధార నిర్గత నిర్గుణ
ధామంబు షడ్గ్రంథి దళన కారి
యై పోయి పరమాంబరామృత బింబంబుఁ
గరపంగఁ దోఁపన తొరఁగు సోనఁ

తే॥ గీ॥ దడిసి తన్మయానంద తంద్రాళు వగుచు
నొకఁడు నెఱుగని సామరస్యోదయమున
నలర నెంతయు నొప్పె నయ్యాది సిద్ధుఁ
డఖిల సిద్ధులు దనసిద్ధి నభినుతింప

హ. వం II-5-164

ఇది సమాధిస్థుస్థుఁడగు శ్రీకృష్ణుని రూపు. ఇది యాలంబనముగా పాఠకుని యందలి శమ మనుస్థాయి తన్మయానంద తంద్రాళు వగుట – అనుస్తంభ ప్రళయాది సాత్త్విక భావములచే, నిర్వేదమను వ్యభిచారీ భావముతోఁ గూడి – ఒకఁడు నెఱుఁగని సామరస్యమను అనుభావముచే శాంతరస మగుచున్నది ఈ శాంతమున కాలంబనము పరమాత్మ స్వరూపమే: అతని తన్మయత్వమున తన్ను తాను మఱచి-సమస్త సాంసారిక విషయములు నిస్సారములని – పరమాత్మ స్వరూప జ్ఞానమే–శాశ్వతమని పాఠకుఁడు శాంతరస పూరితుఁడగుచున్నాఁడు.

ఇది వివక్షితాన్యపర వాచ్యధ్వని.

భీభత్సరః మునకు – వ్రేపల్లె గొల్లలందఱును – పశురోగములు తమకు నంటుకొనుటచే బాధపడుచున్నారు.

సీ॥ "జ్వరవేగమునఁ దూలి పొరలిరి కొందఱు
నందు నందులు సొచ్చి చదిసి పడిరి
కొందఱు వెసరోమ కూపంబు లన్నియు
నవిసి నెత్తురు గార నవయవములు
చీములు గట్టంగ శీర్ణంబులై దంత
ములు గదలంగ నెమ్ములు నొగులఁగఁ
గంఠ జిహ్వాధర ఘ్రాణ కర్ణంబులు
పొక్కులై యేర్పఁగ నొక్కఁడైనఁ

ఆ॥ వె॥ ద్రావఁ దడవలేక తలచీర లెఱుఁగక
యార్తులైరి కొంద అంత వట్టు
గోపమందిరములు కుష్ఠ దుర్గంధ మ
యంబు లయ్యె వికృతి యగ్గలింప"

హ. వం. II–5–164

ఇది జుగుప్సను పుట్టించు రోగభూయిష్ఠుల ఆకార విశేషము.

ఇట్లు స్థాలీ పులాక న్యాయము ననుసరించి, కొన్ని యుదాహరణములను మాత్రమే గ్రహించి రసపరముగ నన్వయించుట జరిగినది.

ఈ విధముగా తఱచి చూచినపుడు ఎఱ్ఱయ రూప వర్ణనలు - కొన్ని రసమున కుద్దీపనములుగా, భావధ్వనులుగా, రసద్యోతకములుగా - పాఠకుల కానందము నొనఁగూర్చి యుత్తమ కావ్యముగా రూపొందించినవి.

కనుక ఎఱ్ఱయ వర్ణనా చతురుఁడు, ప్రబంధ పరమేశ్వరుఁడు.



# 7. ఎఱ్ఱయ - మనోభావ వర్ణన

మానసప్రవృత్తి వర్ణనా కౌశలము ప్రబంధ కవుల కొక ముఖ్యలక్షణము. పాత్రల బహిరాకార చేష్టలతోపాటు తదీయ హృదయగతాభిప్రాయములను గూడ వ్యక్తము చేయుటయే వివరణ కౌశల మనఁబడును. అట్టి భావ వ్యక్తీకరణమును ఎఱ్ఱయ హరి వంశమున పెక్కుచోట్ల గాంచవచ్చును. శ్రీకృష్ణుఁడు కాళియ హ్రదమున దూకినపుడు యశోదా నందుల విలాపము, శ్రీకృష్ణుఁడు మథురకు పోవునపుడు గోపికలు పొందిన అనుభూతి వర్ణన, కంస మరణమున నతని భార్యలు జననియు పొందిన శోకము - నరకాసుర వధ ఘట్టమున సంభాషణలు - మూలమున లేని యీ వర్ణనలు - ఎఱ్ఱయ మనోభావ వర్ణనా వైదగ్ధ్యసు చాటు ఘట్టములు. ఇంచిలి వ్యంగ్యవైభవము, - హరివంశ ముత్తమోత్తమ కావ్యమని చాటుచున్నది.

స్థాలీపులాకన్యాయముగా 'నరకాసుర వధ' - ఘట్ట మిందులకు దృష్టాంతముగా పరిశీలింపఁ బడుచున్నది.

నరకుఁడు సుర దైత్యాదులచేఁ బరాజయమును బొందకుండు నట్లుగాఁ పద్మ భవునిచె వరము వడసినాఁడు. వరదర్పితుఁడై - తొలుత సింద్రుని పీటి కేగి ముష్టిఘాతములచేఁ బగిల్చెను. కయ్యమునకు వేగ వెలువడు మని సింహనాద పూర్వకముగాఁ బిలిచెను. త్రైలోక్యము ఘూర్ణిల్లునట్లుగా జంభారిని చూచి, సంరంభముతో తాకెను. ఇరువురకు ఘోర సంగ్రామ మైనది.

యమ, వరుణ, కిన్నరేశులు తమ తమ సేనలతో నమరాధిపునకు బాసటయై నిల్చిరి. హయగ్రీవ, నిశుంభ మురాభిధానులు - దానవ నాయకులు ముర్వురు నరకునకు బాసట యైరి. ఇఱు తెఱంగుల కయ్యము సంభవించినది. అందిరు వైపులవారు నొండొరువులఁ దూవుల నఱికియుఁ జాపంబులు ద్రుంచియుఁ దూణంబులు వ్రచ్చియుఁ గృపాణంబులు నుఱుమాడియుఁ గంటకంబులు సించియు, నెఱుకులు నొంచియు, వాహనంబులు వికలంబు సేసియు, దేహంబులు తూలించియు, నాభీల విక్రమంబున విజృంభింప నమ్మహా సమ్మర్దమ్మున క్రాంతుఁడు కలఁగిపాఱెసు అర్థవిభుఁడు రాజతాద్రి కేగెను. వరుణుఁడు పరుగు లిడెను. అమరేంద్రుఁడు స్వర్గమునే వదలినాఁడు: నరకుఁ డమరావతిని సొచ్చినాఁడు. అమర భవనంబు

లన్నింట నరకుడు తనవిజయమును చాటఁబంచెను. వాసవుని సింహాసనము నధిష్ఠించి, యూర్వశిని రావించినాఁడు. ఇచ్చట ఊర్వశీ నరకులకు సంభాషణ జఱిగినది ఈ సంభాషణ మూలమున లేనిది.

ఊర్వశితో నరకుఁడు—

"వరుణుని తోలి కుబేరుని జడిపితిని. వైవస్వతుని గెలిచితిని. హరిఁ బోఁజోపితిని. నేనే ఈశ్వరుడను. సర్వామర్త్య సిద్ధోరగాసుర గంధర్వ వియచ్చరులకు మెచ్చులు మీరునట్లుగా మనోజానీక సంక్రీడల సత్కరింపు" మనినాఁడు. మనోజ – అనీక – సంక్రీడలు. ఇచ్చట ప్రతి పదమునందును విశేషార్థము ప్రతీయమాన మగుచున్నది. ఇచ్చట నరకుఁడు నిజముగా ఊర్వశిని ప్రేమించి వచ్చిన వాఁడు కాఁడు. కేవలము కామతృష్ణను తీర్చుమనినాఁడు. ఈ వాంఛా పూర్తితో తన దర్పమును, ఇంద్రుని పరాభవమును, సూచించుట ముఖ్యమని భావించినాఁడు. వరుణ కుబేరాదుల పరిభవించి, ఇంద్రునిఁ గూడ పాఱఁద్రోలిన తన విజయమున కిది కానుక యని తలఁచినాఁడు.

ఊర్వశి – దేవేంద్రుని వారాంగన. ఆతని యధీనము నందుండిన యప్సరస. ఆమెను తన వశము గావించుకొనిన – అది దేవేంద్రునకు పరిపూర్ణ పరాభవమని భావించెనే కాని, యతఁడా ఊర్వశిని ప్రేమించుటయో, వియోగముతో తపించుటయో లేదు. "వరుణుని, కుబేరుని, యముని పరాభవించినవాఁడను ఇంద్రునంతటి వానిని పోఁద్రోలితిని. కనుక స్వర్గమున కీశ్వరుఁడను – నేనే. ప్రభువగు నన్ను వారాంగనవు కావున సర్వసిద్ధ గంధర్వాదులకు ప్రీతిఁ గొలుపు నట్లుగ మనోజనీక సంక్రీడల తేల్చు మ"నినాఁడు. ఇది కోరిక కాదు – ఆజ్ఞ. "ప్రభువగు నన్ను వారాంగన వగు నీవు నీ సయ్యాటల చేత గౌరవింపు" మని యాదేశించినాఁడు "ఒకవేళ నీవంగీకరింపనిచో నీ కధిపతి యగు నింద్రునే లెక్కింపని నేను నిన్ను బలాత్కారముగా నైనను స్వీకరింతు" నను భావము ప్రతీయమాన మగుచున్నది.

ఇచ్చట వాచ్యార్థము పొసఁగుచునే విశేషార్థము గోచరించు చున్నది. వాచ్యము మఱొక అర్థమును గోచరింపఁ జేయుచున్నది. ఇది సంలక్ష్య క్రమ వ్యంగ్యము.

అతని గర్వమును అహంకారపూరిత మగు వాంఛను ఊర్వశి పసిగట్టినది. అప్పు డాతని యాదేశమును తిరస్కరింపఁ జాలదు. ఆమె కంతటి శక్తి లేదు. ఇంద్రాదులే యాతని ధాటి కాఁగలేక పలాయితు లైనపుడు, అబల యగు తాను ఆ

దానవేంద్రుని ముందు ఎంతటిది ? కనుక నెట్లయినను నితని బారినుండి తప్పించు కొనవలయును. అందుల కొక యుక్తిని పన్నినది. అతని ఆదేశములో నుండిన దర్పమును గర్వమును గమనించినది. ఆ గర్వమును రెచ్చగొట్టుటకై యుక్తి యుక్తమగు నొక నియమము నుంచినది. ఆ నియమము శీఘ్రముగా నరకుని పతనమునకు సాధనమైనది.

"అత్యుత్కటైః పుణ్యపాపై రిహైవ ఫల మశ్నుతే" అనునట్లుగా నత్యుత్కట పాపముచే శీఘ్రఫల భాక్కును గావించు నట్టిది.

అప్పుడు ఊర్వశి పలికిన పలుకులు —

చ॥ అనుటయు నమ్మృగాక్షి యిది యట్టిద యంతటి వాఁడవైన నీ
పెనుపస దే? తలంపరిపు భేదన! సంయమి కోటి భక్తితో
నిను నిఖిలాధ్వరంబులను నిత్య సమర్చితుఁ జేసి రేని, నే
నను ముద మొప్పఁ గైకొని వినూత్న విహార రసాబ్ధిఁ దేల్చెదన్
హ. వం. II-4-43

అంతటి మహత్త్వంబు గని నన్ను కామింపుము" అని రెచ్చగొట్టినది. కాని యంతటి మహత్త్వము కలుగఁ జాలదని ధ్వని. 'అంతటి' యనుటలో అసాధ్య కార్యము గోచరించు చున్నది.

ఒక వీరాధి వీరుని, అందును దేవేంద్రాదులనే పాఱఁద్రోలితినని తన పరాక్రమమున కహంకారముతో విఱ్ఱవీగువానిని, 'నీ కీపని చేతనగునా ? చేతనైనచో నిన్నంగీకరింతును" అను పలుకులు - అతని వీరత్వమును దంభమును కించ పఱచు నట్టిది. అహంకారముపై దెబ్బవేయుట వంటిది. అతఁడు తప్పక ఆపని చేయుటకై ప్రయత్నించును ఊర్వశి నరకాసురున కంతటి పట్టుదలనే కలుగఁ జేసినది. అప్పుడే మునులను నతఁడు బాధించుట - మునుల శాపమో - వర గర్వనాశమో - సంభవించుట కాఁగలదు.

అనుటయు నమ్మృగాక్షి - 'అది యట్టిద' - అది యంతటిదే - అంతటి వాడవైన — 'నీ పెనుపసదే తలంప' - అని పలికినది. 'ఓహో ! అటులనా ? అంతటి వాడవా ? - అట్లు కుబేరుని జదిపి, వరుణునితోలి, వైవస్వతుని గెలిచి నంతటి శక్తిమంతుఁడవా ? - ఇంద్రుని పోఁద్రోలితివా ? అటులయిన నీ యాధిక్యము తక్క

వది కాదే? " అని యుబ్బించినది. "రిపు భేదన" అని సంబోధించినది. శత్రువు లను భేదించు దిట్టవు నీవు. ఇప్పుడు నేను కల్పించు శత్రువులను భేదింపుము. అప్పుడు నీ యాధిక్యము అల్పమైనది కాదని యంగీకరింతును. అని వ్యంగ్యమును ధ్వనింపఁ జేయుచున్నది. అంతటి కార్యమేదనిన – 'సంయమికోటి – భక్తితో నిన్ను అఖిలాధ్వరము లందు నిత్య సమర్చితుఁ జేయుట" – ఇది నియమము. ఈ వాక్యము చిన్నదైనను, నిదొక మహత్తరమగు అసాధ్య కార్యమును ధ్వనింపఁ జేయుచున్నది

ఇంత వరకును దేవతలతో న్యాటలాడితివి. ఓడించితివి. వీరాధి వీరుఁడనని విఱ్ఱవీగు చుంటివి. అది కాదు నీ మహత్త్వము తెలియఁ జేయునది. సంయమి కోటి నిన్ను సమర్చితుఁ జేయవలె. సంయమి – ఇంద్రియ నిగ్రహము కలవాఁడు. ఇంద్రియ నిగ్రహముతో సచ్చిదానంద స్వరూపుని సాక్షాత్కారమునకై సాధన గావించువాఁడు.

అట్టి సంయమి నరకుని వంటి దైత్యుని అర్చితుని చేయఁడు. చేయఁజాలడు. అదియు – సమర్చితుని – సమ్యక్ అర్చితునిఁ జేయవలెను. అట్లు ఒకసారి గాదు. ఒక దినము గాదు. నిత్యము సమర్చితునిఁ జేయవలయును: అదియు బలాత్కారము ననో, భయము వలననో కాదు – భక్తితోఁ జేయ వలయు నఁట! ఒక సంయమికాదు. ఎవరో ఇరువురు కాదు. సంయమికోటి చేయవలయునఁట! ఇది అసాధ్యవిషయము. ఒక యజ్ఞము నందుకాదు – ఎన్ని యజ్ఞములు సంయమికోటి చేసిన – అన్నింటి యందును భక్తితో నరకునే పూజింప వలయునఁట! అదియు నిత్య సమర్చితునిఁ జేయవలయునఁట! అప్పుడు ఆ యూర్వశి ముదమొప్ప స్వీకరించి, "వినూత్న విహార రసాబ్ధి" తేల్పఁగలదట! ఇది యంగీకారముగా గన్పించు చున్నది.

పైకి విధిగా కనిపించు చున్నను – నిచట నిషేధము వ్యంగ్యముగా స్ఫురించు చున్నది. వాచ్యము 'తేల్చెదను' అని యంగీకారముగా గోచరించు చున్నను పైన నేను విధించిన నియమములు అసాధ్యములు కనుక నీవు నెఱవేర్పలేవు. కాన నేను అంగీకరింపను' అని నిషేధము స్ఫురించు చున్నది.

అదియుగాక, భౌతికముగా ఇంద్రాదులను గెలుచుట వలన, ఇంద్రాద్యాధిక్యము సిద్ధింపదు. సంయమి కోటిచే భక్తితో ననవరతము పూజింపఁ బడినపుడే యది సిద్ధించును. ఇంద్రాదుల గెలుపు గెలుపు కాదు. కా ముని గెలుపు గెలుపు అన్న భావము కూడ ఇచటస్ఫురించు చున్నది.

వాచ్యార్థము పొసఁగు చున్నది. అయినను, మఱొక అర్థము ప్రతీయమాన మగుచున్నది కనుక వివక్షితాన్య పరవాచ్య ధ్వనిలో - అసంలక్ష్యక్రమవ్యంగ్యము, రసాభాసము. 'ఏకత్రైవ దానురాగశ్చేత్' అనుదానిని బట్టి రసాభాసము.

బలాత్కారముగా నంగీకరించిన నది రసాభాసమె కాని రసముకదు. ముద మొప్ప స్వీకరించి, 'రసాబ్ధి'లో తేల్చఁ గల దఁట!

నరకుఁడు గర్వాహంకారములతో మునులపై సర్వాధ్వర కర్తలపై, హోతలపై, నుద్గాతలపై విశృంఖలముగా వీరవిహారము చేయపలసియున్నది. అందుకు ప్రేరక శక్తిగా చవులూరించినది ఎఱ్ఱయ యూర్వశి. అప్పుడు నరకుఁడు మునుల శాపమో భక్తవత్సలుని నుండి శిక్షయో పొంది శీఘ్రముగా నశింపఁ గలఁడు. పునః స్వర్గమున నింద్రుని సామ్రాజ్యము స్థాపితము కాఁగ దు. తత్కాలమున నరకుఁ డామెపైఁ గావించు బలాత్కార చర్యలు తప్పిపోఁ గలవు. ఇంతటి ఫల మీ నియమము వలన స్ఫురించు చున్నది. ఇది మూలమున లేని ఎఱ్ఱయ వర్ణన.

నరకుఁ 'దత్తుకాక' యనీ వెడలినాఁడు. సురపతి వీడు చూచాడి సురతరు కోటి నున్మూలించెను. సుమేరు రత్నముల ద్రవ్వి - తండమ్ముల గొని, సురకన్య వినూత్న రూప యౌవన గర్వితలగువారిని - ఎనిమిదివేల మందిని చెఱగావించెను. విశ్వకర్మని కూతుఁ జేకొని, యదితిదేవి కుండలముల నపహరించి నాఁడు. ఎవ్వరికిని చూడరానివి, కొనఁ రానివి యా కుండలములు. అట్లే పదునాలుగు జగములం దెచ్చట ఏ పగిది యనర్ఘ వస్తువులు కనిపించినను తెండని తన భృత్యుల నాజ్ఞాపించెను.

ఆ దానవులనేకులు సకల దిశల సంచరించి, సర్వజీవులను పీడించిరి. సమస్త వస్తువులను చూఱఁగొని, యశేష పురుష సముదాయమును పరాభవించిరి. సమంచిత రూప విభవాభిరామ లగు రామలను చెఱఁ బెట్టిరి అప్సర స్త్రీలందరను పట్టు వడిరి. యక్ష కిన్నర సిద్ధ సాధ్య విద్యాధర కాంతలెందరో అసంఖ్యాకములుగాఁ జెఱఁబడిరి, అంచఱును ఏకవేణీధారిణులు, అనవరత బాష్పాలోచనలునై విముక్తికై యెదురు చూచుచుండిరి నరకుఁడు తనపురమునకు నాలుగు పొలిమేరలందును, ముర, హయగ్రీవ, నిశుంభ, పంచజనులను రాక్షసాధిపతుల యుద్ధ సన్నద్ధులఁ గావించెను.

మురాసురుఁడు - భూమండలము నందంతటను చరించి, పూజ్యయజనములఁ గాసి చేసెను. భూసుర శ్రేణిని వధించెను, తాపసుల బాధించి నరేంద్రాళిని వివిధో

హాయకులచే కలంచెను, ధర్మవిరోధమే కర్తవ్యమని తలఁచి ప్రజలను వేమరు కావించెను.

ఒకనాఁడు నకరకుఁడు బదరీ వనమునందు పుణ్యయజన తత్పరులై కూడి యున్న తపస్వి పుంగవులను పెక్కండ్రు గాంచెను. ఊర్వశి వాక్యములు ప్రేరకములై మునులతో తన్ను యజ్ఞభాగభోక్తను గావింపు"డని యాదేశించినాఁడు. జగముల పరిపాలన సేయఁ గర్తయగు మహేంద్రుని కాక, దానవుఁడు, దుష్టమనస్కుఁడు నగు నరకుని 'కొలువఁజాల' మని పలికిరి. నరకుని దంభము భంగమై క్రోధ మినుమడించినది. విజృంభించినాఁడు. తన సేవకులను బిలచి,— "ఈ బ్రాహ్మణులు క్రొవ్వి వెడ యజుపు లఱచు చున్నారు. వీరు పూనిన పని భగ్న మొనర్పుఁ" డని యాజ్ఞాపించినాఁడు. వారు కోయని యార్చుచు—

సీ॥ "యజ్ఞశాలలు వ్రచ్చి యగ్నికుండంబులు
పూడ్చి పశుశ్రేణి మాడ్చి విడిచి
హోతలఁ బ్రామి యుద్గాతలఁ బొరిగొని
యుపదర్శకుల సదస్యులను మోది
యరణులు గాల్చి యూపావళి విడిచి ద
ర్భలు స్రుక్స్రువములను బాఱవైచి
చరువులు భక్షించి సర్వాన్నరాసులు
వెదచల్లి సోమంబు పదటఁ గలిపి

తే॥ గీ॥ తాపస స్త్రీలఁ జెఱచి తత్కన్యకా చ
యంబుఁ జెఱవట్టి యచమానులైన వారి
జడలు వ్రాకులతోఁ గట్టి చదియ నడిచి
యాప్రదేశము దారవైరి యసురవరులు"

హ. వం. II-4.57

ఇది యసురవరులు మునులను పీడించిన విధానము. మూలమున లేని మునుల దురవస్థ యిది. సాధువుల నింత తీవ్రముగ బాధించిననే కాని - ఆర్తత్రాణ పరాయణుఁడు-సాధుజనవత్సలుఁడు-అతి శీఘ్రముగ ప్రసన్నుఁడై రక్షింపనురాఁడు. కనుక ఎఱ్ఱయ నరకునిచే నింతటి దుండగములను చేయించినాఁడు. ఆ ముని లంతటి

బాధలను తాళఁజాలక-శ్రీకృష్ణునికడకు పయనమైరి. వసిష్ఠ, వాసుదేవ, కపిలాదిమునులు ఎడనెడ పుణ్యతీర్థములం దవగాహ మొనర్చుచు నడచిరి. అధిక తపశ్శీలురగు బ్రాహ్మణులు పరిపీడితు లగుటకు. పాతివ్రత్య భూషణం బగు యోషిద్గణంబు దూషణంబునం బడుటకు - డెందంబు లెసయ, "త్రైలోక్యంబునుఁ గావఁబూని యవతారక్రీడఁ గైకొన్న" వాసుదేవుని సమీపించిరి. జగదీశుని, సకల హితార్థ జన్ముసిఁ గాంచిరి. ఆతని కటాక్షములు - తెల్లదమ్మి విరుల సిరి కలిగినవి. శ్వేతవర్ణము సత్త్వగుణమునకు ప్రతీక. తప్పక ప్రసాద గుణముతోఁ గూడిన దృష్టి - యనుగ్రహమును చూపఁ గలదని ధ్వని. ఆతనిఁ గాంచి నంతనే యానంద శీతల చేతస్కులైరి. అప్పుడు వారి మనములలోని భావ పరంపరలు

ఉ॥ అక్కట లెల్లఁదీర్చి జనులందఱఁ బ్రోచుటకుం బ్రసన్నుఁడై
యిక్కరుణాకరుం డిచట నిట్లు లరారఁగ నింతకాలమున్
రక్కసుచేత నక్కట పరాభవ మొందితి మెవ్విధంబునన్
నక్కొనసున్న మర్త్యులకు నిక్కము ప్రాక్తన భోగ్య కర్మముల్
హ వం II-4-70

వ. అడియునుం గాక.

మ॥ పరమాత్ముస్వారిఁ జూత మంచుఁ గను తెప్పల్మోడ్చి లోలోననే
తెరువుల్వాఱు మనంబుఁ బట్టి బలిమిందివ్యాంగఁ దివ్యాంగ దు
స్తర దుశ్శాసిక యయ్యెఁ బూర్వవిధి ప్రత్యక్షంబుఁగా నమ్మహా
పురుషుం గంటిమి నేటి నుండి సుకరంబుల్ సిద్ధిపారంపరుల్
II-4-72

కం॥ తపము తపమంచు నడపుల
నుపగత జడబుద్ధిమునికి రొందఁగ హరిఁ జూ
పుపకారంబయ్యె రిపుని
యపకారం బిట్టి భాగ్య మబ్బుట కతనన్.
II-4-73

వ. అనుచుం గడియఁ జనుదెంచుటయు" -

ఇది వాసుదేవునిఁ గాంచినప్పటి మునుల, మనోభావము.

అక్కఱలెల్లఁ దీర్చువాఁడు, జను లందఱకుఁ బ్రోచుటకుఁ బ్రసన్నుఁడైన వాఁడు. ఇక్కరుణాకరుండు. ఇచ్చటన్ - ఇట్లు ఎలరారఁగన్ - అక్కట ఇంత కాలమున్ రక్కసుని చేత పరాభవ మొందితిమి.

అందరి యక్కరలను దీర్చునని, యభయ హస్తుఁడై, యీ కరుణా స్వరూపుఁ డిచ్చట నీ విధముఁగా ప్రకాశించుచుండఁగనే మేమింత కాలము రక్కసునిచే నింత పరాభవము నొందితిమి. 'ఇచ్చటన్' అనుట - ఎచ్చటనో పాల సముద్రమున నిదురింపలేదు సత్యలోకమున లేఁడు. భూలోకమునకే దిగి వచ్చినాఁడు'. అని ధ్వనించుచున్నది. 'ఇట్లు' - అనుట లీలామానుష విగ్రహము ధరించి సాధుజన హితార్థియై - 'తెల్లదమ్మి విరుల సిరిఁగల వీక్షణములతో - కరుణా కటాక్షములతో ప్రసరింపఁజేయుచు' - నని. ధ్వనించుచున్నది. 'కరుణాకరుఁడు' - అనుటచే - ఇతరుల బాధలను దీనుల దుఃఖములను గాంచి ద్రవించి పోవువాఁడని ప్రతీయమాన మగుచున్నది.

ప్రసన్నుఁడై యున్నను నింతకాల మాయనను సమీపింపలేదు. ఆ రక్కసునితో బాధల పడితిమి' అని తమ యజ్ఞానమునకై వ్యథఁ జెందు చున్నారు. ఇచ్చట 'ఇట్లు' 'ఇచ్చటనే' యను పదములకు వాచ్యార్థము పొసఁగక - అర్థాంతర సంక్రమితమైనది. "ఎవ్విధంబులన్ నెక్కొనకున్నె మర్త్యులకు నిక్కము ప్రాక్తన భోగ్య కర్మముల్" - తాము పడిన బాధలు - ఇంతటి ఆర్తత్రాణ పరాయణుఁడుండఁగను - సంభవించుటకు హేతువును సమర్థించు కొనుచున్నారు. ఇచ్చటనే సాధుజన వత్సలుఁడున్నప్పుడు వారి కంతటి బాధలు కలుగరాదు. అయినను కలిగినవి. 'ప్రాక్తన భోగ్యకర్మములు ఎవ్విధంబునను అనుభవింపక తప్పదు." అని సమర్థనీయమగు నర్థమును సమర్థించుటచే - కావ్యలింగాకారమైనది. ఇట్లు సాలంకారమగు నర్థాంతర సంక్రమిత వాచ్యధ్వని యిది

పదగత ధ్వని. అవివక్షిత వాచ్యము, వాచ్యము - 'ఇచ్చట - ఇట్లు' అనుట కర్థములు మనోహరముగ ధ్వనించుచున్నవి. కనుక అలంకార ధ్వని.

ఇట్లు గత పరాభవ స్మృతులు. ఇంతటి సాధుజన వత్సలుఁడు, కరుణామూర్తి రక్షకుడై యిచ్చటనే యుండియు బాధల ననుభవించితిమి కదా ! యను వ్యథ వెంటనే విధి బలీయమను భారతీయ వేదాంతముచే సమర్థనము - వీరి మనోభావ పరంపరలు. 'అవశ్యమను భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్' అను సనాతన సిద్ధాంతము నిచ్చట మునుల ముఖమున తెలియఁజేయుచున్నాఁడు ఎఱ్ఱయ.

అనంతర మిట్లనుచున్నారు. 'కనుఱెప్పలను మోడ్చి. లోలోననే పరమాత్ముని జూతమనుచు - వేయి తెఱువులకుఁ బాఱు మనస్సును పట్టి బంధించి - బలాత్కారముగా విషయములనుండి విముఖము గావించిః ఈద్వగా దుస్తరమైనది. శాసింప రానిది. అట్టిది మేము పూర్వము గావించిన పుణ్యబలముచే నితని నిచ్చటనే ప్రత్యక్షముగా కనుగొంటిమి. ఇఁక నేటినుండి సిద్ధి పరంపరల సుకరములు అని యా పరాత్పరుని ప్రత్యక్షముగా గాంచినందులకు హర్షించుచున్నారు మునులు.

ఆ శత్రువగు నరకాసురుడు చేసిన యపకారమును, నుపకారముగనే పరిణమించినదని తృప్తిపడుచున్నారు. 'అతడట్లు బాధింపకుండినచో మేమిచ్చటికి వచ్చెడువారమా? అంతటి భాగ్యము కలుగుటకా రాక్షసుఁడు పీడించుటయే కారణము. లేకున్న 'తపము-తప' - మనుచు నడవులయందు జడబుద్ధితో నుండువారి కిట్లు హరి దర్శన భాగ్యము లభించునా? అని-అంతమునకా నరకాసురుఁడు పీడించుటయే తమ కింతటి భాగ్యము కలిగించినదని హర్షించిరి. ఇట్లు అంతమున మానసికానందము. ఇది మూలమునలేని - ఎఱ్ఱయ వర్ణించిన మునుల మానస భావపరంపర. ఇట్టి భావ పరంపరలలో జనార్దనుని సమీపించిన నతఁడు ససంభ్రమముగా సముత్థితుఁడైనాఁడు. వారి నాసనానార్ఘ్యపాద్య మధుపర్కములతో పూజించెను. కృతాంజలియై వారితో క్రతువులు నిర్విఘ్నములా? వ్రతములు ననుప హతములైనవా? ఎయ్యది కృత్య మాజ్ఞాపింపుఁడు. మా యంతరంగము లుత్సుకములై యున్న" వని గోవిందుఁడు వారిని ప్రశ్నించినాడు

అనురాగాన్వితులగు మునులు తాము తెచ్చిన బదరీ ఫలముల నుపహారముగా నర్పించి - భక్తితో నంజలి ఘటించి, - "దేవా! ఇవి నీవు తొల్లి నరసఖుండవై విహరించిన పుణ్యాశ్రమ తరువుల వలన నానీతిములైనవి. నీ చేతం బూర్వభుక్తంబులైనవి." అని యా ఫలమహిమ నుగ్గడించి, యాతని నారాయణావతారమును స్మరింప జేసిరి. బాలురను, గర్భవతులను, మహాత్ములను రిక్త హస్తములతోఁ జూడఁదగ దను సంప్రదాయమును ఎఱ్ఱయ మునులు చక్కగా పాటించినారు.

వేరు విధముగా ప్రారంభింపక, "క్రతువులు నిర్విఘ్నములా? వ్రతములు, తపములు, అనుపహితములాయని వారి విన్నపములను శీఘ్రముగా వినుటకై ప్రశ్నించిన ప్రశ్నలు. వారి రూపు - రేఖలు, అ స్తవ్యస్తమగు ఆకారము, భిన్నాభిన్నములైన వ్రత సాధనములు - అతని కప్పుడే వారిస్థితిచెప్పకయే తెలియఁబఱచినవి. కనుక నికనాలస్యము లేక వచ్చిన కారణమును నేరుగా వినుటకై యుత్సుకుఁడైనాఁడు.

శ్రీ కృష్ణునకు మునీశ్వరుల తపోమహిమ శాపశక్తి సంపూర్ణముగా తెలియును. అయినను ఇట్టి దైన్య స్థితియందు తన్నర్థించుటకు వచ్చుట తన మహాత్మ్యమును ప్రపంచమునందు ప్రకటించుటకే యనియు తెలియును. కనుకనే—

మ॥ పరమబ్రహ్మ పదైక్యబోధ మహిమం బ్రాజ్యంబు మీ యోగభా
స్వర సామ్రాజ్యము ధర్మ నిత్యము భవత్సత్యంబు మీ రీయెడన్
బరిపూర్ణాత్మకులార ! నేడు నను సంభావ్యాన్వయోదగ్రుఁగా
గరుణింపంగఁ దలచుటొక్కటి యగా కర్జంబు మీ రాకకున్.

హ. వం. II-4-76

మీరు నన్ను గౌరవభాజనునిఁ గావించు టొక్కటే కర్తవ్యముగా తలంచి యిచ్చటికి వచ్చిరి కాకున్న మీ యోగ భాస్వర సామ్రాజ్యము పరమ పదముతో నైక్యమును తెలుపునట్టిది. ప్రాజ్యమైనది. ధర్మమే నిత్యముఁగాఁ గలది. సత్యమైనది. అట్టి యోగులై పరిపూర్ణత్ములైన మీ రిచ్చటికి నన్నర్థించుటకై వచ్చుట, తనకు గౌరవ స్థానంబును ప్రాప్తింపఁ జేయుటకే కాని యన్యము కాదు. లేకున్న మీరు తలంచిన నరకుని నెప్పుడో మీ శాపముచేత హతమార్చెడివారు. కాని, ఆ కీర్తి నాకు దక్కించుటకై యింత దూర మేతెంచిరి. మీయోగ సామ్రాజ్య మెంతటిదో నాకు తెలియదా ? అని వారి మహిమను తెలియజేయుచున్నాఁడు. అప్పుడు తపస్వులు తమ దయనీయ స్థితిని తెలుపుకొనిన సందర్భము మూలమున లేని భావప్రకటన.

మొదట నరకుని అమానుష శక్తిత్వమును, వరగర్వమును గురించి వివరించినారు అనంతరము త్రైలోక్య పరాభవకరణమే తనకు వినోదంగానెంచి, నరకుఁడు చేసిన దుండగములను వర్ణించినారు అనంతరము తమ్ము యజ్ఞభాజనముగా నతని స్వీకారింపవలెనని యడుగుటయును, వారు నిరాకరించినపుడు గావించిన దుష్ట కార్యములను - పరాభవించిన తీరును వర్ణించిరి. ఇట్లు నరకుఁడు తమ్ము ప్రత్యక్ష నరకమునఁ ద్రోచినాఁడని, నరక చ్ఛేదనకరుఁడు, నరసఖుఁడు నగు శ్రీకృష్ణుఁడు అనాథులగు వారిని కరుణింప వలసినదని మొఱలిడిరి. 'జితామిత్రా :' —అని సంబోధించి, 'జితామిత్రుఁడవగు నీవు ఆ అమిత్రుని గెలువు'మని హెచ్చరించినారు.

ఇట్లని చెప్పు మునికోటి మాటల కచ్చెరువును, వగపును మనంబులో పెనఁగొనినది—

చ॥ అను మునికోటి మాటలకు నచ్చెరువు న్వగపు న్మనంబులో
చెనఁగొనదైత్య చేతలకుఁ జేర్చిన రోషము విస్ఫురద్విలో
చన యుగళంబు భ్రాంత విలసత్కరుణారుణకాంతిఁ జేయ న
ద్దనుజ విచ్ఛేది మ్రానుపడి తానొక పల్కును బల్కకత్తఱిన్.

హ. వం. II-4-$8_8$

ఇచ్చట భావద్వంద్వము - మ్రానుపడుట, ఒక్క పలుకు పలుక కుండుట - స్తంభప్రళయములను అను భావములను తెలుపుచున్నవి. విస్ఫుర ద్విలోచన యుగళము - భ్రాంత విలసత్కరుణారుణకాంతి వివక్షితాన్యపర వాచ్యధ్వనిలో - అసంలక్ష్య క్రమ వ్యంగ్యమున భావసంధి, ఉభయ భావములను గోచరించుచున్నవి. విస్మయము - క్రోధము అను రెండు స్థాయీభావములు కనిపించును.

ఇట్టి పాటులకు గురియైరి కదా యని తానట్లు వారినుపేక్షించి నందులకు చింత; తన కార్య విస్మరణకై వెతఁ జెందుట - ఈ రెంటింటిచే చింతాస్తిమిత మూర్తియైనాఁడు. ఇతని పాటు గాంచి మునులాశ్చర్యమగులైరి. పరాత్పర స్వరూపునకు చింత ఎందులకని యాశ్చర్యము, తామంత వఱకు పలికిన పలుకులలో నేమైన దోషము లుండి యా దోషములాతనికి బాధ కలిగించినవేమో యను నెపుడు అతఁడి రాక్షసుని బారి నుండి ఏకారణమునైన తమ్ము రక్షింపఁ జాలక వెత చెందు చుండెనా యను సంశయము - అంతటి మహిమాన్వితున కట్టి దశ కలిగి నందులకు సంభ్రమము - ఈతని వెత నెట్లు నివారింపవలెను సంభ్రమము - ఇవి సందడింప మునీంద్రు లందరును' నొండొరువుల మొగంబులు చూచి యేక ముఖంబగు చిత్తంబుతో నయ్యుత్తమ శ్లోక సనాథలగు దివ్యగాథలు" పరికీర్తించిరి.

'అచ్చెరువు' - అను నొక్క పదము వెనుక నెన్నో భావములు గోచరించుచున్నవి. 'దుష్టశిక్షణ'కై యవతరించితిని సాధు రక్షణయే కర్తవ్యముగాఁ గలవాఁడను, బాల్యమునుండియు, శకటాసుర, కేశి, అరిష్టనేమ్యాది రాక్షసుల నెందఱినో నేలఁ గూల్చితిని. కంసుని వంటి రాక్షసునే దునుమాడితిని. అయినను నా కావించిన విశ్వకల్యాణ కార్యములీ మునుల బాధలతో వమ్మయి పోయినవే! నరకుని - ఇంతవరకు - మునిశ్రేష్ఠుల నీ దశకు తెచ్చునంత వరకు నుపేక్షించితినే? - యని యచ్చెరువు. వారి దయనీయ స్థితినిఁ గాంచి వెతఁజెందుట - 'వగపు'

ఇట్టి ద్వంద్వములగు వ్యభిచారీ భావములతో నవాక్కయిన శ్రీకృష్ణుని రూపమునుఁ గాంచి - మునులొండొరులనుఁ జూచుకొనిరి ఈ ముఖములు చూచుకొనుటలో - "ఏమి చేయుదము ? ఎట్లు శ్రీకృష్ణుని సుముఖునిఁ గావింతుము." అను ప్రశ్న పరంపరలు ప్రతీయమానము లగుచున్నవి.

ఏమియును తోచక - భక్తజన సులభుని - స్తోత్ర ప్రియుని, గానలోలుని - దివ్య గాథలనే కీర్తించుటయే సమంజసమని, 'జయ జయ జగదీశ' యని యాతని మహిమల నుతింపఁబొడఁగిరి. అవతార మహిమలను కీర్తించిరి. భక్తజన వాత్సల్యమును స్మరింపఁ జేసిరి.

కం॥ "నీవు విషణ్ణుఁడ వగుటయు
నీ విశ్వంబునకుఁ జాల నెగ్గు జనించున్
నీ విశ్రాంత కపసాద స
మావేశము సర్వ మంగళావహము హరీ !"

హ. వం. II-4-91

అని ప్రాథేయ పడిరి. నీవు విషణ్ణుఁడ వయిన నీ విశ్వమునకు చాల నెగ్గు జనించును. కనుక విశాల ప్రసాద భావమును గ్రహింపుమని కోరిరి.

అతని సృష్టి - స్థితి - లయకార్యములఁ దడవిరి. ఆర్తత్రాణ పరాయణత్వము సంభావించిరి. అక్షర త్రయాత్మకమగు నోంకార రూపమును స్మరించిరి. ఆ ఓంకారమున కతని తత్త్వమే వాచ్యపదమని పొగడిరి.

కం॥ "క్రతుమూర్తివి క్రతుకర్తవు
క్రతుఫల యోగాత్మకుఁడవు క్రతు రిపుహనన
వ్రతధరుఁడవు క్రతు పతిపి
వతుల దయోపేత హృదయ ! యంభోధిశయా !"

II-4-95

యని నుతించిరి. "నీవు క్రతుమూర్తివి, క్రతుకర్తవు, క్రతుఫల యోగాత్మకుఁడవునై యుండఁగా, నా దైత్యుఁడొకండు తన్ను క్రతు భోక్తను చేయవలయునని మీ కింతటి పాటు కలిగించినాఁడు. "క్రతురిపుహననవ్రత ధరుడవు' - ఈ పదములో నెంతో అర్థము గోచరించుచున్నది. క్రతువులకు శత్రువులగు వారి నందరిని చంపు వ్రత

మును ధరించిన వాఁడవే! ఆ నరకుఁడు క్రతురిపుఁడు. అతని హననము గావింప నేల యుపేక్షించెదవు ? అని సూచన.

క్రతుపతివి నీవే గనుక - నీ క్రతుపతిత్వమును నిలఁబెట్టుటకైన నాతని సంహరింపవలసి యున్నది రెమ్ము.' అను హెచ్చరిక ధ్వనించు చున్నది. 'క్రతురిపు హనన వ్రతధరుఁడవు' - అను పదమున ముఖ్యార్థ బాధ కలుగలేదు. వాచ్యార్థము గోచరించుచునే, మరొక రమణీయార్థము స్ఫురించుచున్నది కనుక - సంలక్ష్య క్రమ వ్యంగ్య ధ్వని పదగతమైనది.

'అతుల దయోపేత హృదయ' - అని సంబోధన సాటిలేని దయగలవాఁడవు. మా యీ దైన్యమును గాంచి దయఁదలఁచి పరాభూతులమగు మా కూరట కలిగింపుము' - అని విన్నపము స్ఫురించుచున్నది.

"అంబోధిశయా !" అంబోధియందు శయనించిన వాఁడవు. నీ యీ యవతార కారణము నూహింపుము. శీఘ్రముగా కర్తవ్యోన్ముఖుఁడవు కమ్ము. దుష్టుని శిక్షింపుము"- అని బోధ.

ఇట్లి పద్యమునందుత్తమ ధ్వని గోచరించుచున్నది.

"భవత్ప్రియ భక్తులూర్జిత శ్రీకులు, పీతశోకులు, గరిష్ఠ వివేకులు దైత్యమర్దనా !"- యని పలికిరి. ఇచ్చట - భవత్ప్రియ భక్తులము మేము. ఊర్జిత శ్రీయుతులై యుండవలసిన వారము. మా యీ దుర్గతిని చూడుము అని ప్రేరణ పీతశోకులై యుండవలసినవారము మా యీ దుర్గతిని శోకమును గుర్తించుము, అని వ్యంగ్యము.

గరిష్ఠ వివేకులు - నీ భక్తులమగు మేము గరిష్ఠ వివేకము గలవారము, కనుకనే ఆ రాక్షసుని మాశాపమునకు గురి చేయక దుష్టశిక్షణకై యవతరించిన నీకడ కేతెంచి నీకే ఈ కార్యము నప్పగించు చున్నామని సూచన. అందులకే 'దైత్యమర్దనా !"- అని సంబోధనతో దైత్య నాశమునకు పురికొల్పుట - ఎందరెందరో దైత్యులను నాశమొనర్చినవాఁడవు. అట్టి నీ వుండఁగా, ఆ నరకుని మాత్రము మే మెందులకు శాపముచే హతమొనర్పవలయునని - ఇచ్చటికి వచ్చి నీకు విన్నవించుచుంటి మని తెలుపుట స్ఫురించు చున్నది.

ఇట్లు మునులు మహనీయ వాక్యములతో శ్రీ కృష్ణుని నుతించిరి. ఇది మూలమున లేని భావ ప్రదర్శన. అభిప్రాయ గర్భితము, ధ్వని గర్భితము నగుస్తుతి.

అఖిల యాదవులు నుతిమతులై చేతులు మోడ్చి, ఔదలలం గదియించి, "దేవా! ప్రసన్నుండగు" మని యభ్యర్థించిరి. భవదీయాశ్రయుల మమ్ముల ననుగ్రహింపు మని ప్రార్థించిరి. అప్పుడు - శ్రీకృష్ణుడు—

"పాపాత్ముండగు దైత్యునినే మీరు పడిన పాటులకు కోప మధికమై మనస్సునకు సంక్షోభము కలిగిన దంతియే! ఇదియే నా ప్రమాస్పడుటకు కారణము. మీ మంజులాలాపములతో ప్రకృతిస్థుండ నయితిని ఇంక పెక్కుమాట లేల?" అని - తిరిగి శ్రీకృష్ణుండిట్లను చున్నాడు.

మ॥ విలయోద్దీప్త పతంగ మండల సమావిర్భావ దుర్భాస సం
కలనారౌద్ర పరాక్రమంబయిన చక్రం బస్మదాభీల దో
ర్వలభీక్షేప విరూపమై నిగిడి గీర్వాణారి కంఠచ్ఛిదా
చలితోదగ్ర కబంధుఁ జేయు నపహృతైన్యంబుగాఁ జెచ్చెరన్"

హ. వం. II 4-100

"విలయోద్దీప్త పతంగ మండల సమావిర్భావ సంకలనా రౌద్ర పరిక్రమంబయిన చక్రంబు" - ఈ సుదీర్ఘమగు సమాసము ఓజోగుణ భరితమై తత్కాల రౌద్రమునకు వ్యంజకమై యొప్పుచున్నది.

'సమావిర్భావ' - 'దుర్భావ' - 'చక్ర' 'రౌద్ర' వంటి సంయుక్తాక్షరావృత్తి రేఫాక్షరావృత్తి - గాఢ బంధత్వమును వ్యంజిత మొనర్చు చున్నవి. ఈ "విలయోద్దీప్త...చక్రంబు" అని సంయుక్తాక్షరావృత్తితో చదువు చున్న సమాసము, చక్రమును క్రోధముతో గిరగిర త్రిప్పుచున్నట్లు భాసింపఁజేయును. ఇది రసమునకు ఒగిన బంధము. 'ఆ గీర్వాణారి' - యనుటలోని 'ఆ' - యనుట - యమ కుబేరాదులను పాఱఁద్రోలి' దేవేంద్రుని గెల్చినవాఁడు, మునులను ముప్పు తిప్పలఁ బెట్టినవాఁడు - అట్టి నీచుఁడు అను భావములను వ్యంజిత మొనర్చుచున్నది.

అట్టియా గీర్వాణారిని కబంధుని చేయుటలో - కంఠచ్ఛేదన చేయుటలో - నా యీ చక్రముగ్రముగ చలింతునని - గిరగిర త్రిప్పుచు చూపుచున్నట్లున్నది ప్రళయకాలము నందలి మార్తాండ బింబము వలె తీక్ష్ణతతో రౌద్రమున పరిక్రమించు చక్రము' - అనుటచే నెవ్వరును నా చక్రశక్తిని ఆపఁజాలరని యా నరకు నెవ్వరును ఇఁక రక్షింపలేరని - స్ఫురించు చున్నది. అస్మదాభీలదోర్వలభీక్షేప విరూపమై' యనుటలో మొదటనే అతి భయంకరముగ పరిభ్రమించు

నది దానికి నాభుజవలయ విక్షేపము తోడై మఱింత విరూపమును చేయఁగల దని వ్యంజితమగుచున్నది. 'చెచ్చెరన్' - అనుటలో ఇంత వఱకు తెలిసియో, తెలియకయో నా కర్తవ్యమును విస్మరించితిని. ఇఁక నాలస్యము చేయుట జరుగదను నిశ్చితాభిప్రాయము గోచరించుచున్నది.

ఇట్టి పలుకులలో - సుదీర్ఘ సమాసముతో చక్రభ్రమణ ప్రచండతను తెలియ జేయుచు రౌద్రము దీప్తిమంతమై ధ్వనించుచున్నది.

ఇచ్చట - నపహృతసైన్యముగా' ననునది - అతని నొక్కనినే కాదు. సైన్య సహితముగా నిర్మూలింతునని తెలుపుచున్నాఁడు.

'రౌద్ర' - అను పదము వాచ్యముగా నున్నను. ఇందా రౌద్ర స్ఫూర్తి చక్రమున కన్వయించుటచే, రసమునకు భంగము కలుగదు. ఇచ్చట రౌద్ర రసము ధ్వనించుచున్నది.

'అస్మదాఖిల దోర్వలభిక్షేప విరూపమై' యను పలుకులందు అనుర్గమను వ్యభిచారి - 'చెచ్చెరన్' అనుచోట ఔత్సుక్యమును వ్యభిచారి - నాయకుఁడగు శ్రీకృష్ణుని యందగు స్తంభప్రళయాది - యను భావములతో క్రోధమను స్థాయి పుష్టి చెంది 'రౌద్ర' రసమును వ్యంజింపఁజేయుచున్నది

'అగీర్వాణారి' యనుటలో - పద గత ధ్వని - అర్థాంతర సంక్రమితము - రౌద్రము. ఇచ్చట వాచ్యార్థ భావము ననుసరించి వ్యంగ్యము. రౌద్రము రూపెత్తిన పదముల, సమాసముల విన్యాసమిది

ఇట్లని - శ్రీకృష్ణుఁడు -

"మీ రేమియు చింతింపక చని - సమస్త భక్ష్య విధులను ప్రారంభింపు" డనినాఁడు. "బృందారక యువ - లోచన వారులు వెసనింకఁ గాక వారక యుంకన్ అని వారి నాశ్వాసించినాఁడు. "స్థావర జంగమాత్మకము లగు నీ జగంబు లన్నియు మద్విక్రమముచే భీతి విరహితము లగుగాక ! - యని అభయ మొసగినాఁడు.

ఇచ్చట - శ్రీకృష్ణుఁడు శీఘ్రముగా నరకి వినాశము కాఁగలదని, బృందారక యువతీ లోచనము లందలి బాష్పము లింకిపోవు, జగంబులు భీతి రహితములై సుఖ శాంతులతో మనఁగలవని సమాశ్వాసించుట .

మూలమునలేని ఎఱ్ఱయ వర్ణనలు.

ఊర్వశిని నరకుఁడు వాంఛించుట, యూర్వశి నరకునితో యజ్ఞభోక్త వయిన తరువాత రమ్మనుట. నరకుఁడు మునులను పీడించుట, శ్రీకృష్ణుఁ డభయ మొసంగుట మూలమునలేని యీఘట్టములోని సన్నివేశము లుత్తరోత్తర కార్యములకు కారణములై నరకుని శీఘ్రవినాశమునకు - హేతువులైనవి. ఆ క్షణమే దివినుండి దేవగణముల జయ జయ ధ్వనులువ్పొంగినవి. 'ధర్మంబు ధన్యంబగు గాత' యని మును లాశీర్వ దించి వెడలి పోయిరి.

నరకాసుర వధ కింతటి పీఠిక నేర్పఱచినాఁడెఱ్ఱయ.

ఊర్వశి నియమములతో ప్రారంభమై మునుల యశీర్వాదములతో నంతమైన నరకాసుర వధకు రంగస్థల మింత పటిష్టముగా నేర్పడినది.

అనంతరము దేవరాజగు నింద్రుఁడు ప్రవేశించి, - నరకుని యాగడములను విన్నవించుకొనను. ఇది మూలము నందును గలదు. దేవేంద్రుఁడు -

తే॥ గీ॥ "ఏమ నీయున్న కడకు నిట్లేగు దేర
వలసినట్టి కార్యము సాధు వత్సలాత్మ"—అని

II-4-114

అని ఉపక్రమించి నరకుని యాగడముల తెలియఁజేసెనాఁడు—వాని భుజగర్వము సైపఁగలేక యుండుటన్ సిరుల దొఱంగి వచ్చితిమి చెన్నటి మానుషజాతిలోనికిన్'- అని తమ దేశ వాస వియోగములను తెలియఁ జేసెనాఁడు.

మూలమున అమిత్ర కర్మన' యని సంబోధించి, యదితిదేవి కుండలములను నపహరించినది మాత్రము తెలిపెను ఎఱ్ఱయ హరివంశమున 'సాధువత్సలాత్మ' యని సంబోధించినాఁడు. నీవు సాధుజనులయందు వాత్సల్యము గలవాఁడవు కదా యీ సాధుజనుల సంతాపమును పోగొట్టు'మని సూచన. సాధువులయెడ వాత్సల్యము గల నీ నామమును చరితార్థము గావించుకొనుమని ధ్వని, ఎఱ్ఱయ ఇంద్రుఁడు మునులు పొందిన బాధలను వర్ణించె కాని మూలమున ఆ వర్ణన లేదు

"అనపహార్యంబు లెవ్వాని కదితి దేవి
కుండలంబులు సురలోక మండనములు"—

II-4-115

అట్టివానిని గొని పోయెనని తెలిపెను.

మునుల యాశ్రమము లన్నింటిఁ జొచ్చి చెఱచెనని; క్రతువులను, ధర్మమును నాశ మొనర్చెనని, వివరించెను. సాధువుల యలజడి కిది గుఱుతు. ఇది కొలఁది యను నదే లేదని తెలిపెను. కనుకనే 'సాధువత్సలాత్మ' యని సంబోధించినది. ఈ సంబోధన వాచ్యార్థము నెఱిఁగించుచునే, యొక విలక్షణమగు నర్థమును సూచించు చున్నది. కనుక వివక్షితాన్య పర వాచ్యధ్వని యిది. సాధువులందు వాత్సల్యముగల నీ వుపేక్షింపఁదగదని స్ఫురణ.

అనంతరము శ్రీకృష్ణుని పౌరుషమును తట్టి లేపుటకై యిట్లనుచున్నాడు. "నీ వాశ్చర్య పరాక్రమముతో విశ్వైక రక్షార్థివై దేవారాతులను గూల్చుచుండుటను విని నీ తేజము సైరింపక యుగ్రావష్టంభత నీ కాజియందు పరాభవ మొనర్ప నెల్లప్పుడు నీ వైరమునే కాంక్షించు చుండును కావున నూర్జిత బాహుశ్రీ వెలయునట్లుఁగ రిపుని చెఱచుటయే తగిన కార్యమని బోధించినాఁడు. ఇట్లు పలికి తనతో నేతెంచిన వినయానవతుఁ డగు వినతా తనయునిఁ జూపి, యితనిపై జయ ప్రస్థానమును గావింపుమని కోరెను. శ్రీకృష్ణుఁడు చక్ర శార్ఙ్గాదులను గైకొని సత్యభామను రావించి, గరుడా రూఢుఁడై చనినాడు మూలమునను, సత్యభామా సహితుఁడై వెడలుట కలదు. కాని, యామెతో యుద్ధము చేయించుటలేదు.

భయంకరమగు యుద్ధము జరిగినది. మురాసురుని పాశముల భేదించి, తీవ్ర కఠిన చక్రధారలచే మురాసురుని దునిమెను. నిశుంభునితో యుద్ధ మొనర్చి, మొండెము ద్రొల్ల సేసెను. హయగ్రీవునిఁ బరిమార్చెను. అఘోరపాల, విరూపాక్ష, పంచ జనులు— మొదలగు ఎనుబది నాలుగువేల రాక్షసులను చంపెను. రక్తము వెల్లువలై పాఱినది. కొందఱు వాసుదేవుని చక్రపాతంబుల వొలసిరి. గదాసికౌమోదకీ ఘాతంబుల మఱి కొందఱు మడసిరి. పాంచజన్య ధ్వానంబుల కొందఱి గుండె లవిసినవి. తురంగ మాతంగ, పురుష శరీర శకలంబులచే ధరణీతల మంతయు వ్యాపించినది.

మూలమున యుద్ధభూమి యందు పరస్పర సంభాషణలు లేవు. కాని, ఎఱ్ఱయ నరకుఁడు యుద్ధభూమి యందు శ్రీకృష్ణునితో –

"అననిలో సింద్రుని గౌరవమును మాన్పితిని. తక్కిన దేవతలను లెక్కింపను. ఈ మూఁడు లోకములను కలంచితిని, అక్షోభ్యుఁడై పేరెక్కిన నరకుఁడను వాఁడను. సురారి శ్రేష్ఠుఁడను. నా పేరున్న చోట – ఏ వీరుని మాహాత్మ్యమును

పనికిరాడు. నీ విచ్చటి కేల వచ్చితివి ? ఎవ్వఁడవు ? ఈ లావరిపులు గెక్కడి యది? ఈ వారిజ నయన యెవ్వరు ? అని ప్రశ్నల పరంపరల ముంచెను.

నరకుని శౌర్యపరాక్రమముల నెఱిఁగిన వాఁడెవ్వఁడును, తానై వచ్చి యుద్ధము గావింపఁ జాలఁడు. కనుక వీఁ డెవఁడో తన పరాక్రమము తెలియని వాఁడై యుండునని తెలుపుకొను చున్నాఁడు. అంతవఱకును మురనిశుంభాదులతో యుద్ధ మొనర్చిన ఈతని పరాక్రమము సామాన్యము కాదని తెలిసినది.

ఇతఁడొకఁడే యుద్ధమునకు రాక, వెంట నొక అపూర్వసుందరినిఁగూడ తెచ్చి నాఁడు. ఆమెను గాంచ నంతనే నరకుఁడు మోహపరవశుఁడైనాఁడు. జగము నందలి స్త్రీ రత్నముల నందఱిని తెచ్చి తన నగరమునందే బంధించిన తనకీ స్త్రీ రత్న మింత వఱకు దృష్టి గోచరము కాలేదను విస్మయము. అందులకే, "ఈ వారిజ నయన ఎవ్వరేర్పడఁ జెపుమా ?" యని అడుగు చున్నాఁడు. జగమున తనకింత వఱకును అపజయమే లేదు. ముల్లోకములును తన పేరు వినినంతనే భీతిల్లినవి. కాని యీ నాఁడొక శత్రువు తానైవచ్చి పరాక్రమాటోపమున విజృంభించు చున్నాఁడు. క్రోధమొకవైపు, ఆ వచ్చినవాఁడు సామాన్యుఁడై యుండఁడను తలంపొకవైపు, ఆ వెంట వచ్చిన లతాంగి తన వశము కావలయునను నిశ్చయము మఱొకవైపు – ముప్పిరి గొన్నవి. కనుకనే, "నిన్ను నీ ప్రౌఢ బలమొప్ప నిహతుఁ జేసి, యేను గైకొనఁగల వాఁడ నీ లతాంగి" నని పలికినాఁడు. 'ఓపితేని తలఁక కొక్కింత బంటవై నిలువు" మని పలికినాఁడు. ఇది మూలమున లేని సంభాషణ.

అప్పుడా పరమేశ్వరుఁడు – అద్భుతాత్మ్మన కిట్లను చున్నాఁడు. "నేను త్రిలోక ప్రసిద్ధుఁడగు వాసుదేవుఁడను, నీకు శ్రుత పూర్వుండ నగుదునో కానో యెఱుంగ. ఈ బామ సత్యభామ. మదీయ ప్రేయసి. ఇవ్విహంగమంబు – విహంగమకుల చక్రవర్తియగు వైనతేయుఁడు, మద్వాహనము. నా వచ్చిన కారణము – అఖిల లోక హితార్థము సమస్త కార్యధుర్యుఁడనయి, నిన్ను బోరిఁ గొనుటకు. ఇంక నెయ్యది కావలెను చెప్పు" మనినాఁడు.

'ఇది పరస్పరము శత్రువు లెదురు పడినపుడు అందొకఁడు ప్రశ్నించిన ప్రశ్నపరంపరలకు మఱొకఁడు దర్పముతో, గర్వముతో నిచ్చు ప్రత్యుత్తర పరంపర

"అఖిల లోక హితార్థము నిన్ను చంపుటకు వచ్చితిని – ఇంకేమైనను కావల యునా ? నీ ప్రశ్న లన్నింటికి నుత్తరములు వచ్చినవా ?" యనుపలుకు లందొక

పరిహాసపూర్వక మగు దర్పము, విలాసము కనిపించు చున్నవి. అప్పుడు నరకుఁడు 'మఱియుం బెలుచనవ్వినాఁ' డఁట !

ఇదొక దృశ్యప్రదర్శన. ఒకరి నొకరు పరిహాసముగా ప్రశ్నించు కొనుటలు, ప్రత్యుత్తరమును వెడనవ్వుతో నొసంగుటలు· శత్రువులను తిరస్కరించు భావముతోఁ గూడిన చేష్టలు. 'పెలుచఁగా నవ్వుట' - అత నిధైర్యము కొంత చలించెనో యని తెలుపుచున్నది. వెంటనే అసురజాతికే ఘాతకుఁ డితఁడు ఈతని నిట్లు వదల రాదను క్రోధ మతిశయించి యా పెలు చందనము - పరిహాసముగా మారినది. ఇట్లా పెలుచగా నవ్వుట'లో ధైర్యస్ఖలనము వెంటనే వెక్కిరింపుఁగా మారినట్లు గోచరించు చున్నది. క్రోధావిష్టుఁడై యిట్లు పలుకు చున్నాడు -

"ఏమేమీ వసుదేవ నందనుఁడవే యీ వెట్టి భాగ్యంబొ సం
గ్రామం బెన్నఁడొ నర్తునో కడిమియైఁ గంసారితో నంచుఁ జే
తో మోదంబునఁ గోరు చుండుదుఁ గడుందోరంబుగా నుంజె మ
త్కామంబోపిన యంతయుం బెనఁగు నీదర్పంబు పెంపేర్పడన్
హ. వం. II-4-153

'నా చేతం జిక్కి వెడలం బడ నేర్చెదే?' యని యదల్చి, యసుర వీరుఁడు వృష్ణివీరునిం దాకి, పెల్లేసినన్ - నరకుఁడు.

"భువిలో వసుదేవ నందనుఁడని యొకఁడు - బాల్యమాదిగ శకటాసుర, కేశి అరిష్ట నేమ్యాదులను అవలీలగా సంహరించెనని విని యుండెను. కంసుని వంటి ప్రచండ పరాక్రమ వంతుని రూపుమాపెనని వినియుండెను. అట్టి యా శూరుఁడు తన యెదుటనే నిలచియున్నాఁడు. ఆ కంసాది రాక్షస భంజకుఁడితఁడా ? అను విస్మయము. ఆరాక్షసజాతి విలయ కారకుఁడీఁకఁ జిక్కెను బో యను సంతోషము మిశితమై" ఏమేమీ ? వసుదేవ నందనుఁడవా నీవు ? అని ప్రశ్నించి నాఁడు. ఈ ద్విరుక్త ప్రశ్నార్థకములో ఆశ్చర్యము, క్రోధము, సంతోషము ప్రతీయమానములగు చున్నవి. ఇఁక నీతని తప్పక జయించి, హతమార్చి తీరవలయునని ధృత్యుత్సాహ ములు గోచరించుచున్నవి. "సంగ్రామం బెన్నఁ డొనర్తు నాకో కడిమియై కంసారితో నంచు చేతో మోదంబున, గోరుచుండుదు" - అని తన చిరకాల వాంఛను తెలియం బఱచి నాఁడు. ఆ చిరకాల వాంఛ, ఆ భాగ్యము నేఁడబ్బినదని సంతోషించు చున్నాఁడు. బాహువుల తీట వోవునట్లుఁగా నితనితో కయ్యమొనర్చు నవకాశము

తనంత తానబ్బినందులకు హర్షము వ్యంజితమగుచున్నది. కడిమియై యుద్ధమొనర్ప నతని బాహువులు కోరుచుండిన వఁట! అంతటి యోధునితో నింతటి యోధునకు సంగ్రామ మైననే యది చూపఱుల కానందము. కనుకనే "ఓపిన యంతయుం బెనఁగు నీ దర్పము పెంపేర్పడన్" అని రెచ్చఁగొట్టుచున్నాఁడు. నీతో యుద్ధరంగమున స్వైర విహార మొనర్పఁగలను. రమ్ము ఓపినంతయు 'పెనఁగు' యని యుద్రేక పఱచు చున్నాఁడు. ఈ పలుకుల వలన వీరరసము ధ్వనించుచున్నది.

ఒక వీరాధివీరునకు సాటి వీరునితో యుద్ధ మొక సంబరము. అదియు చిర కాలమునుండి కోరుచుండినాడఁట! గీర్వాణ ప్రభృతులను కయ్యమున కకావికలు గావించిన తాను, తిరితిరిఁవి కుండలముల నపహరించినను తాను దేవేంద్రుని సైతము సంగరమున చీరికిఁగొనని తాను - ఇపుడొక దైత్యారితో సంగర మొనర్చు చున్నాఁడు. 'ఇదెంతటి భాగ్యము!' అను హర్షము స్ఫురించు చున్నది.

"నా చేతం జిక్కి వెడలం బడ నేర్చెదే!" - యని తన శౌర్యము నందు ధృతి. కంసారితో యుద్ధమున కుత్సాహము కూడి - ఇచ్చట వీర రసము-ధ్వనించు చున్నది.

ఇచ్చట నాచ్యార్థము పొసఁగు చున్నను మఱొక రమణీయార్థము గోచరించు చున్నది. కనుక వివక్షితాన్య పరవాచ్య ధ్వనిలో అసంలక్ష్యక్రమ వ్యంగ్యము, "ఏమేమీ! వసుదేవ సూనుఁడవె?" యనుటలో - హర్షమను వ్యభిచారీ భావము, 'కంసారిచే యుద్ధ' మనుటలో ఔత్సుక్యము, గర్వము మున్నగు వ్యభిచారీ భావము లచే పుష్టమై, నరకుఁ డాలంబనముఁగా పాతకుని యందలి యుత్సాహము - రసా భాసముగా పరిణమించినది

ఇట్లిన్ని భంగుల సందర్భమున కనుగుణమగు వాక్యముల పొందికతో, భావ ముల పరంపరలతో - రచించిన ఎఱ్ఱన భావ వైశద్యమున, సందర్భానుగుణముగా రచింపఁగల సమర్థుఁడని తెలియుచున్నది.

ఇది మూలమున లేని సంభాషణ - భావ పోషణ.

భీకర సంగ్రామము జరిగినది. తూపులు తూపులతో ఢీకొన్నవి. నరకుని నిశాతసాయకముచే లక్ష్మీ నాథుని ఫాలము గాయపడినది. మూర్ఛితుఁడై కొంత తడవు గరుడుని స్కంధముపై వ్రాలినాఁడు. అప్పుడు ఎఱ్ఱయ కొంత కాలము సత్యభామతో యుద్ధము చేయించినాఁడు. ఇది మూలమున లేని ఎఱ్ఱయ చిత్రణ.

సత్యభామ పరిచర్యలతో శ్రీకృష్ణుఁడు కొంత తడవునకు సేద దేరినాఁడు. సమంచి తోత్సాహ సాహస భాసిని యగు నా భామిని చేతికిఁ దన శార్ఙ్గమా నిచ్చి యంప పొదల నమర్చినాఁడు. ఆ క్షణమున సత్యభామ -

పీర్వ్రతము స్త్రీ రూపమును ధరించినట్లున్నదఁట ! ధైర్య మక్షిణాకృతిఁ దాల్చి నట్లుండినవి. నరకునితో మహారణ ప్రక్రియకు ప్రారంభించినది.

ఎత్తుగడ - ఇట్లిరువురి చేతను కొంత తడవు, యుద్ధము చేయించినాఁడు. ఆమె యుద్ధకౌశలమునకు పీతాంబరుఁడు ప్రీతుఁడై తన కంఠము నందలి హారమును దీసి యాసతి కంఠము నందుంచి ప్రసాదన దృష్టితో "లోచన పారణము గావించుట" - వాచ్యార్థము కుదరదు. ఉపవాసానంతరము మిక్కిలి యాకొన్నవాఁడు గావించు భోజనమునకు 'పారణ' మని రూఢి. ఇట్టి లోచనములతో అత్యాశఁగా భుజించుట కుదరదు. ఆకలితో ఆవురావురుమని తినుట - లోచనములతో కాదు. కనుక వాచ్యార్థము పొసఁగక - మరొక రమణీయ యార్థము స్ఫురించుచున్నది. సంపూర్ణ తృప్తి ఘటించినదని ప్రతీయమాన మగుచున్నది. కనుక అవివక్షిత వాచ్యము. అత్యంత తిరస్కృతమగు వాచ్యార్థము కలది. కనుక - అత్యంత తిరస్కృత వాచ్యధ్వని ఈ వాక్యమున గోచరించుచున్నది.

ఆమె నట్లు సంభావించి యుద్ధమునకుఁ బూనెను. కొంతతడవు రథముపై- అనంతరము నరకునితో గదతో యుద్ధము గావించెను

"సమస్తామర సిద్ధ గంధర్వ కిన్నర ఫణాధర కళత్ర కంఠ సూత్రంబులు గాచుటయే వ్రతముగాఁ గలవాఁడగు నాకృష్ణుఁడు సుదర్శన చక్రముతో పగతుని ఛేదించినాఁడు. 'వికటస్ఫూర్తిఁ దదస్త్రిరాజము' - అసురను వేగముగా తాఁకగా నాపాద మస్తకము - సర్వాంగము రెండు వ్రయ్యలైనది. ధరణీదేవి సాకారయై యా సమయమున ఘోర సమర మధ్యంబున నున్న సుతుని కౌగలించు కొనినది. అతని కర్ణంబుల తేజరిల్లు నదితిదేవి కుండలముల గోవిందున కొసంగి, బాష్పలోచనయై కేలుమోగిచి. "త్రిలోక ద్రోహి యగు పుత్రుని నీవే ఇచ్చితివి నీవే ఇప్పోకులఁ బుచ్చితివి. దిక్పాలు - సిద్ధులు - తపస్వులు - గతజ్వరులై మోదమును దాల్చెదరు గాక ! చరాచర భూతావళికి సుస్థితి కలుగుఁగాక ! ఈ రత్న కుండలములఁ గొని తత్తనూభవుని తండ్రి పదవి యందు నిలుపుము." అని ప్రార్థించిన ఆ పలుకుల నాదరించినాఁడు. శ్రీకృష్ణుఁడు నరకుని రత్నసంచయ మును పరిగ్రహించి, పదియాఱువేల కన్నియల చెఱ విడిపించి నాఁడు.

మూలమున భూదేవి శ్రీకృష్ణునితో -

"దత్తస్త్వయైన గోవింద! త్వయైవ వినిపాతితః
యథేచ్ఛసి తథా క్రీడ బాలః క్రీడనకైరివ"
"ఇమే తే కుండలే దేవ ప్రజాస్తస్యాను పాలయ"

అని ప్రార్థించినది. అంతియేకాని, చరాచర భూతావళికి సుస్థితి దివిజులు - సిద్ధులు - తపస్వులు - మోదమును దాల్చుట - మూలమున లేని ఎఱ్ఱయ అశంసలు.

ఇట్లే నరకాసుర వధ ఘట్టమున- ఊర్వశీ నరకుల సంభాషణ-నరకాసురుఁడు మునులతో పలుకుట, మునులు శ్రీకృష్ణుని కడ మొఱలిడుట, యుద్ధమున శ్రీకృష్ణ నరకాసురుల పరస్పరాలాపములు - ఎఱ్ఱయ మనో విశ్లేషాత్మక మగు వర్ణన లను చక్కఁగా తెలియఁ జేయుచున్నవి.

మఱొక ఘట్టము - ఎఱ్ఱయ మనోభావ చిత్రణను
తెలియఁజేయు నట్టిది.

శ్రీకృష్ణుఁడు శివుని గుఱించి తపమొనర్చుటకై కైలాసమున కేగుచున్నాఁడు. ద్వారకను వదలి కొంతకాలము అధికారమును వీడి పోవుచున్నాఁడు.

ఆ సందర్భమున -

ద్వారకాధిపతి శ్రీకృష్ణుఁడు. ప్రజాపాలకుడు, సంరక్షకుఁడు నగువాఁడు. కొంతకాలము రాజ్యమును వదలిపోవు చున్నాఁడు. అప్పుడు తన రాజ్యమును సద్రపఱచి, కట్టుదిట్టములలో నుంచి పోవ నెంచినాఁడు. ఆ సందర్భమునందలి శ్రీకృష్ణుని పలుకులు - చేష్టలు - ఎఱ్ఱయ నిశిత మనోభావ పరిశీలనకు నిదర్శనములు రాజులను రాజనీతిని, ప్రజలను - ప్రజల మనస్తత్వమును చక్కఁగా గుర్తించి రాజ సభలలో నెంతో కాలమున్నవారు కాని ఇట్టి సూక్ష్మ పరిశీలనా నైపుణ్యమును ప్రదర్శిం పఁజాలరు. ఒక పరిపాలకుఁడు తన అనుపస్థితి యందు - రాజ్యము నితరులచేత నెట్లప్పగించి పోవుచున్నాఁడో గమనింపవలసి యున్నది. యదు ప్రవీరుల సభను ఏర్పఱచి నాఁడు.

సీ॥ "నాకు నిప్పుడు నాక నాయక వంద్యుఁ బి
నాకి ననాద్యైక నాథు నభవు
దర్శింపఁ గైలాస ధరణీ ధరమునకుఁ
దడయకఁ బోవంగఁ దగిన కార్య

మొకటి గల్గిన యది యుద్యోగ మెలరారఁ
బోయిన వినుఁడేను వోవఁ దడవ
ఘనుఁడు రంధ్రాన్వేషి గావునఁ బౌండ్రుఁ డే
తెంచి యీపురి నిరోధించుఁ గడిమి

తే॥ గీ॥ జగతి యదుహీనఁ గాఁ జేయఁ జాలువాఁడు
వాఁడు గావున మీరు నావచ్చునంత
దాఁక రేయును బవలునుద్యమ మెల్లఁ
గాన వలయు సన్నాహలస్య కలనఁ బురము."

హ. వ. 2-5-129

శ్రీకృష్ణుఁడు కైలాస ధరణీ ధరమునకుఁ దానొక కార్యార్థ మేగు చుండుటను తెల్పినాఁడు. తానెందులకు పోవుచున్నాఁడో తెలుపలేదు. ప్రభువులు సాధారణముగా తమ అనుజీవులకు తామెందులకు పోవుచుందురో, ఆవిషయమును విశదముగా తెలియఁ జేయు నవసరములేదు. తెలియఁ జేయరు. ఇది సామాన్య ప్రజలందఱితోఁ గూడినసభ. ఆప్తులకో, మంత్రులకో, చారులకో - ఒక వేళ చెప్పవచ్చు నేమోకాని - సాధారణ ప్రజల సభలలో తెలుపరు. "కైలాస ధరణీ ధరమునకుఁ దడయక పోవంగఁ దగన కార్యమొకటి గల్గిన యది" - 'మాకు కార్యమొకటి - గలిగినది.' - ఇది అధికారులు చెప్పు తీరు. ఎఱ్ఱయ సూక్ష్మపరిశీలన ఇట్టి పదముల లోను కనిపించు చున్నది.

రంధ్రాన్వేషి గావున పౌండ్రుఁ డేతెంచి, పురిని నిరోధింప వచ్చును. జగతిని యదుహీనఁగాఁ జేయఁజాలు వాఁడు. కావున నే సమయమున నైనను దండెత్తి వచ్చునని, తాను వచ్చు వఱకును రేయును, బగలును ప్రయత్న శీలురై, జాగరూకులై యుండవలయునని - ఆదేశము లిచ్చుచున్నాఁడు. పురరక్షణ బాధ్యత గలవాఁడు పురిని వదలి పోవునపుడు చేయు హెచ్చరికలివి.

ఉ॥ ద్వారములందు రక్ష సువిధానముగా నొనరించి ముద్రలే
కేరిని వెల్వడం జొరగ నీక యనేక రథాశ్వదంతి మ
ద్ధారణ సైన్యసన్నహన దర్పితులై వివిధాయుధ ప్రభల్
ఘోర నిరూఢి నెల్ల దెసలం బొదువంగఁ నుండుఁ డిమ్ములన్.

హ. వ 2-4-130

ఆ॥ వె॥ వేట దోఁట యనుచు వీడు వెల్వడి పోవ
వలదు చరులఁ బనిచి వైరి తెరవు
లరసి గెలుచు వెరవులన్నియుఁ దలపోసి
విక్రమంబు గారవించు టొప్పు. హ. వ. 2-4-131

ద్వారములందు మిక్కిలి జాగరూకతతో రక్షణ విధానము గావింప వలయునని - రాజముద్ర లేనిదే పురబహిర్ద్వారముల నుండి యేరిని వెల్వడనీక చొరఁగ నీక యుండ వలయునని హెచ్చరిక లిచ్చినాఁడు. నలుదిక్కుల చతురంగ బల సమన్వితులై, వివిధాయుధములతో నెల్లప్పుడును సన్నద్ధులై యుండు డని జాగ్రత పఱచు చున్నాఁడు. ప్రభువు ననుపస్థితి యం దనుజీవులు కొంత యథేచ్ఛా విహారములు గానించుటయు కలదు. అది గుర్తించిన ఎఱ్ఱయ - శ్రీకృష్ణునిచే నతని యనుచరుల కిట్లాదేశము లిప్పించు చున్నాఁడు.

వేటకని, తోటకని పురము వెలువడి పోవలదు. చారులను బంపి యెప్పటి కప్పుడు శత్రు సమాచారములను తెలిసికొను చుండ వలసినది. వైరిని గెలుచు మార్గముల నరసి పరాక్రమము చూపవలసినది. అని యాదేశించినాఁడు.

అంతటితో నతనికి తృప్తి కలుగలేదు.

వ॥ అని పలికి సాత్యకి నాలోకించి నీవు ధనుర్వేదంబునం బారీణుఁడవు. సమరధురీణుండవు. నీ వలన నిన్నగరంబు లబ్ధరక్షణంబుగా వలయు, నఖిలయాదవశ్రీ యును నీకు నిల్లడవెట్టితి నని స్తోత్రములతో నెక్కించినాఁడు. హ. వ II-5-132

ఇవి యొక గొప్ప రాజకీయ చతురుఁడు చేయుపని. రాజకీయ చాతుర్యము నతి సూక్ష్మముగా పరిశీలించినవారు వ్రాయు రచన -

ప్రతిభా సంపన్నులు యోగ్యులు నయిన వారిని పొగడి, 'నీ వలననే ఈ నగరంబు లబ్ధ రక్షణంబు గావలయు" - నని నగర రక్షణ బాధ్యతతోఁ గూడిన గురుతర కర్తవ్యమును అప్పగించుట - రాజకీయ నైపుణ్యము. ఇందు - 'నీవే యీ పనిని చేయ సమర్థుఁడవని నా విశ్వాసము. కనుకనే ఎందరో ధీరులు, కార్యశూరులు, చతురులు నున్నను - నీ పైననే ఈ కార్యభారము నుంచితిని. ఎట్లు చేసెదవో చూచెదను." అను విశ్వాసము ధ్వనించుచున్నది. ఇచట వాచ్యార్థము పొసఁగుచునే మరొక రమణీయార్థము గోచరించుచున్నది. కనుక వివక్షితాన్యపర వాచ్యధ్వని.

అప్పుడా విశిష్టవ్యక్తులు పొగడ్తలకు పరవశించి, వారి నమ్మకమును వమ్ము చేయకుండుటకై తమ సామర్థ్యశక్తుల పాటుపడి కార్యసాఫల్యమునకై తపింతురు. తమపై ప్రభువునకున్న విశ్వాసమును నిలబెట్టుకొనుటకు, తమ విశిష్టతను సార్థక మొనర్చుకొనుటకు శక్తికి మించియు ప్రయత్నింతురు

"అఖిల యాదవశ్రీయును నీకు నిల్లడ వెట్టితి" నని యొక రాజు శ్రేష్ఠుడొక యోధున కప్పగించుట యొక రాజకీయపు టెత్తు.

అంతట సాత్యకి యుబ్బిపోయి —

"దేవా! నీ యాజ్ఞాబలంబును, బలదేవు సాహాయ్యకంబును నాకుం గలుగ నెయ్యవియు నసాధ్యంబులు గలవే? శక్ర - వరుణ - కుబేర పురస్సరులై సురలరుగు దెంచిన జయింతుఁ బెండ్రుఁ డెంతవాఁ డవధరించెద కాదె. నిశ్చితంబగు నంతఃకరణంబు తోడ నరిగి యభిమతంబు సాధించి దేవర విచ్చేయు" మని పలికినాఁడు. శ్రీకృష్ణుఁడు తలంచి నట్లుగనే జరిగినది. ఇది యొక వాగ్దాన మిచ్చుట వంటిదే! 'నీ యనుపస్థితి యందు ప్రాణములను సైతము లెక్కసేయక నీ పురిని కాపాడుదును. చూడు నా దీక్ష' - అని ప్రమాణముచేసి - చెప్పినంత మాట యిది. అంతటితో శ్రీకృష్ణుఁడాగలేదు. ఉద్ధవు నుపలక్షించి —

మ॥ విబుధాచార్యుని యంతవాఁడవు మహావిఖ్యాతి నీతిస్థితిం
 బ్రబలంబై భవదీయ ధీబలము సెప్పంజట్టలీ విశ్వముం
 గబళింపంగ సమర్థమిట్టి నినునిక్కంబేను గార్యంబు పొం
 దుబుధోత్తంసము తెల్పఁజొచ్చి మదిలోఁ దూగాడెదన్ సిగ్గునన్.

II-5-133

"ఆహా! బుద్ధియందు బృహస్పతి యంతవాఁడవు నీవు. మహాప్రఖ్యాత నీతి స్థితియందు భవదీయ ధీబలము విశ్వమునే కబళింపఁ జాలు నట్టిది. ఇంతటి ధీశాలియగు నీకు కార్యవిధానమును గురించి తెల్పఁబోవుచుంటినే యని సిగ్గుతో సేసుకంజ వేయు చున్నాను." - ఇట్టి ముఖస్తుతులు, వచోవైచిత్రి - ప్రభువుల నుండి పొం[illegible] నింకేమి? పిల్లినైన పులిని గావించి నాట్యము చేయింపఁగలవు. ఈ వాఙ్మాధుర్యమె పాలనా యంత్రమును సమర్థముగా నడుపు వారికి సాధనము. ఇట్టి సమర్థము లగు వాక్యసాధనములనే శ్రీకృష్ణుఁ డుద్ధవునిపై ప్రయోగించినాఁడు.

వ॥ "అయినను జెప్పవలసి యున్నది. యదువీరులు కేవల వీరవ్రత శౌండులు. పాండిత్య నిత్యుండవైన నీవు వీరల విక్రమోద్ధతి యనుద్ధత నీతిపేశల మగు నట్లుగా నడుపు' మనిన –

అయినను – అట్లైంతో సంకోచము కలుగు చున్నను – చెప్పు చుంటి నని – చెప్పవలసియున్నది గనుక చెప్పుచున్నానని – చెప్పుట యొక్క యుక్తి. యదు వీరులు కేవలము వీరవ్రతము నందే శౌండులు. నీవు ధీశాలివి. పాండిత్య నిత్యుండవు. నీ పాండిత్యమున కా భుజబలము తోడైనపుడే వివేకముతోఁ గూడిన రాచకార్యములు నెఱవేరఁగలవు కనుక బుద్ధిబలము భుజ బలము కలసి వివేకముతోఁ గూడినపుడు, చేయరాని కార్యమేమి గలదు ?" – ఇట్లిరువైపుల వారి సామర్థ్యమును కొనియాడుచు కలసి మెలసి రాజకార్యమును సఫలము గావింపు డని యడుగుట – చాణుక్యుని వంటి రాజనీతి చతురుఁడు చేయుపని. యంతటి రాజకీయ కౌశలము తెలిసినవాఁడు వ్రాయు సంభాషణ.

ఇట్టిది – రాజసభలను, రాజకీయ సంభాషణలను అనుభవించిన ఎఱ్ఱన వంటి వారికే వర్ణింపతరము.

ఇట్లు రాజనీతి చాతుర్యమును, పురమును అధికారమును వదలిపోవు ప్రభువులు ప్రయోగించి, ధీమంతులను, బలవంతులను కలిపి, రాజ్యాంగ సంరక్షణ యందు నిలుపువారు. అప్పుడే వారి తంత్రము ఫలియించి, రాజ్యము సురక్షితమై మూడు పూవులు, ఆరుకాయలుగా నభివృద్ధి చెందెడివి.

ఉద్ధవుఁ డప్పుడు సంతోషాంతరంగముతో పరవశించి –

కం॥ "నామీఁద కరుణ గాదే
యీ మెయిఁ బెద్దఱికమిచ్చి యిట్లాడుట నీ
వే మనుజుఁడవఁ బ్రసన్నుఁడ
వా మనుజుఁడ చూనె ధన్యుఁ డఖిలము నందున్"

హ, వ. II-౬-౧౩౫

అని యా కృష్ణుని ప్రసన్నతకు హర్షించి కార్యనియుక్తి కత్యానందముతో శిరసా వహించినాఁడు.

ఇఁక మూలమున —

ఇచ్చటను శ్రీకృష్ణుఁడు యాదవుల నేకత్ర పఱచి నాఁడు. సాత్యకిని స్తుతించెను, ఉద్ధవుని పొగడెను

"మయా విరహితం చేమాం యది జానాతి పుండ్రకః
ఆగమిష్యతి రాజేంద్రో యోత్స్యతే చపురీ మిమామ్
హ. వ. భ. పు. 74-21

పాషాణైః కర్షణీ యైశ్చ సన్నద్ధా భవతస్వకైః
విధాయచ కపాటాని మహాద్వారాణి యత్నతః
హ. వ. భ. పు. 74-23

ఏకఏవ మహాద్వారో గమనా గమనే సదా
ముద్రయా సహగచ్ఛన్తు రాజ్ఞో యేగంతు మీప్సవః
హ. వ. భ. పు. 74-24

నచాముద్రః ప్రవేష్టవ్యో ద్వారపాలస్య పశ్యతః
యావదా గమనం మహ్యం తావదేవం భవిష్యతి
హ. వ. భ. పు. 74-25

మృగయానాత్ర కర్తవ్యా నచక్రీడా బహిః పురాత్
జ్ఞాతవ్యాశ్చ పరే స్వేచ గమనాగమనే సదా 75-26

దీనికి ఇంచు మించుగా ఎఱ్ఱయ అనువాదము యథాతథముగనే కనిపించుచున్నది. - "ఏకఏవ మహాద్వారో" - "గమనాగమనే సదా" అనువానికి 'ద్వారములందు రక్ష సువిధానము గావింపు' - డని ఒక ద్వారము ననేక ద్వారములుగా చేసి, సురక్షితములు గావింప వలయునని - మార్చినాఁడు ఎఱ్ఱయ. 'జ్ఞాతవ్యాశ్చపరే స్వేచ గమనా గమనే సదా" - అనుదాని కనువాదమున "చయలఁ బనిచి వైరి తెరువులరసి గెలుచు వెరవులన్నియు తలపోసి విక్రమంబు గారవించు టొప్పు" - అని కొంత మార్చినాఁడు ఇచ్చట మూలమునలేని 'చారులు' కనిపించు చున్నారు. మూలమున 'స్వేపరే జ్ఞాతవ్యాః' - అని యూహ్యము గావించిన దానిని ఎఱ్ఱయ వాచ్యముగా 'చారులఁ బనిచి' యని తెలుపుటఁ జూడ నానాటి రాజులు చారుల కంతటి

ప్రాముఖ్యమిచ్చి యుండి రనియు నెఱ్ఱయ "రాజాన శ్చార చక్షుషః" అను రాజనీతిని చక్కఁగా గుర్తించిన వాఁడనియు తెలియు చున్నది.

సాత్యకినిఁ గాంచి మూలమున కృష్ణుఁడు –

"అప్రమత్తుఁడవై గదాఖడ్గముల ధరించి యుండు' మని యాదేశించినాఁడు. ఇహం నృపాశ్రయమగు పురిని మిక్కిలి జాగరూకుఁడవై రక్షింపు మనినాఁడు.

'న చ నిద్రా త్వయా కార్యా శాస్త్రిణాం శాస్త్రతత్పర 75-2

నచవ్యాఖ్యా త్వయా కార్యా శాస్త్రిణాం శాస్త్రతత్పర
నచవాదస్త్వ యా కార్యో వాదిభి స్సహ వృష్ణిప 75-3

త్వంహి యోద్ధా బలీజ్ఞాతా ధనుర్వేదాఖ్య వేదవిత్
తథాకురు యథావీర నోపహాస్యా భవేదియమ్' 75-4

ఇచ్చట రాత్రులందు నిద్రింపకుమని, శాస్త్రతత్పరుఁడై శాస్త్ర వ్యాఖ్యలు చేయుచు వాదనలో నిమగ్నుఁడవు కావలదని ప్రతి వాదులతో శాస్త్ర చర్చలలో మునిఁగి పోవకు మని హెచ్చరించినాఁడు. ఈ పురిని పరిహాసము పాలు కాకుండునట్లు చూడు" మని ప్రబోధించి నాఁడు.

మూలమున శ్రీకృష్ణుని వాక్యములలో సాత్యకిపై సంపూర్ణ విశ్వాసముంచిన పలుకులు వినిపించుటలేదు. ఏ శాస్త్ర వ్యాసంగముననో, ప్రసంగముననో వ్యగ్రుఁడై పురరక్షణ కార్యమును ఏమఱ వచ్చునను సందేహము కనిపించుచున్నది. అట్టి వ్యస ము వలదని హెచ్చరిక వినిపించుచున్నది. 'యోధుఁడవు బలవంతుఁడవు. జ్ఞానిని ర్వేద విదుఁడవు, ఈ పురి పరిహాస భాజనము కాకుండునట్లు చూడు" మని దేశము కనిపించుచున్నది. ఇట్లొక వైపరీత్య బుద్ధి, బల శౌర్య జ్ఞానములందు శ్వాసము కనిపించు చున్నను, – కార్య నిర్వాహణ దీక్షయందు సందేహము ధ్వనించుచున్నది.

ఇట్టివి అధికారులు తమ బాధ్యతల నితరుల కప్పగించు నపుడు చేయు హెచ్చరికలే। వ్యసనియైనవాఁడా విషయ వ్యాసంగమున వ్యగ్రుఁడు కావచ్చునను మానవ సహజమగు బలహీనతను వలదని వారించి నాఁడు. ఈ మాటలు వినిన సేవకులు భయముతోఁ గూడి పనిచేయఁగలరు.

ఎఱ్ఱయ హరివంశమున 'నీవు ధనుర్వేద పారీణుఁడవు, సమరధురీణుఁడవు, నీ వలన నిన్నగరము - లబ్ధ ప్రతిష్ఠము కావలయును. అను నిశ్చిత భావముతో 'అఖిల యాదవశ్రీయును నీకు నిల్లడ వెట్టితి'నని సంపూర్ణ విశ్వాసముతోఁగూడిన గురుతర బాధ్యతను అర్పించుట ధ్వనించుచున్నది. అప్పగింతలు పెట్టుట కనిపించుచున్నది. అప్పుడు సేవకులు శక్తికి మించి పనిచేయఁగలరు

ఎఱ్ఱయ - ఇట్లు మానవ మనస్తత్వమును చక్కఁగా విమర్శించి, పరిశీలించి, కార్య సాఫల్యము కలుగు మార్గమున కుచితమగు పలుకులనే చెప్పించినాఁడు.

ఇఁక మూలము నందు - ఉద్ధవునితో - శ్రీకృష్ణుఁడు పలికిన పలుకులకు యథాతథానువాదమే యున్నది. "లబ్ధా మమసముత్పన్నా వసత స్తన సాంప్రతమ్" అను దీనికి "కార్యంబు పొందు బుద్ధొత్తం సమతెల్పఁజొచ్చె మదిలోఁ దూగాదెడన్ స్సిగునన్" అని సరియైన అనువాదమె యున్నది. కాని, ఎఱ్ఱయ అంతటితో నాగ లేదు. ఇంకను వర్ణించు చున్నాఁడు". అని పొగడ్తలతో నింపినాఁడు. ఇవి మూలమున లేని స్తుతులు.

ఇట్లు ప్రభువులు స్తుతులతో పైకెత్తినపుడే అను జీవులును పరవశించి పరుగు లిడుచు పనులు చేయుదురు. ఇట్టిపి ఎఱ్ఱయ - మానవ మనోభావముల నెంత నిశిత ముగ పరిశీలించి చిత్రించెనో తెలియఁజేయు చున్నది.

ఈ విధముగా మానసిక భావ ప్రపంచమున - విశాలముగ సంచరించి, సందర్భానుగుణముగ, పాత్రల స్వభావానుగుణముగ ఎఱ్ఱయ మనోభావ విశ్లేషణ గావించిన తీరు మెచ్చఁ దగినది.

మహాశోక ఘట్టము :

కంసుఁడు శ్రీకృష్ణుని చేతికిఁ జిక్కి విగత జీవుఁడయినాఁడు. అతని భార్య లందఱును గుండెలు బాదుకొనుచు నేతెంచిరి. ఎడతెగక యశ్రుబిందువు లొలుకు చుండ కురులు చెదరిపోవ, మూర్ఛ పోదివి కొనిరాగా నందఱును వచ్చి పతిపైఁ బడి యాక్రందించిరి.

సీ॥ నృపగంధి హస్తివై నీవన్య నృప గంధ
మించు కంతయు సైప కింతదాఁక
సార్వకాలిక మద స్ఫార విశృంఖల
లీల వర్తింపంగఁ గాలుఁ జాత్యఁ

జలమెత్తి గోకుల సంభూతనుగు కృష్ణ
పేరసింహముఁ దెచ్చి విడిచె నీకుఁ
జేష్టింప లేవైతి చిక్కితి మడిసితి
నీ పోక లరిది వర్ణింప నధిప

తే. గీ. యార్త కరిణీ సమాన దురంత దశకు
భాజనమ్ముల మైతిమి రాజ మమ్ము
నరయఁ దగదె నీమన్నన యకట యెందు
వోయెఁ జెప్ప లేవైతివి పోవునపుడు. హ. వ. I-9-155

"ఆ మన్నన లెందుఁ బోయినవి? పోవునపుడు చెప్పలేవైతివి? మాపై ప్రేమ లేక పోవచ్చునుగాక! ప్రియబంధువులు, మిత్రులు, అమాత్యులు - నీకేమి తక్కువ చేసిరి? వారందఱిని వదలి దివికేగితివి. వికసించిన కమలము చిదిమిన వాడి పోవునట్లు - నీ ముఖము వాడిపోయినది కన్నులు వివర్ణ తారకములై సౌందర్యమును కోల్పోయినవి. ఈ శూన్యభావమును నే నెట్లు చూడఁ గలము? ఆ రమణీయ కుండలము లెక్కడఁ బోయినవి? కర్ణములు గండతలముల నంటికొనినవి. ఆ చారు కిరీట మెట్లొరిగినది? నరేంద్రత నీకు లేదె? ఆ భూరి భుజాంతరాభరణము లెగి యిట్లేల యి ధూళి గ్రుంగెనే? దేవతలను దేవేంద్రుని పరాజితుఁ గావించిన వాఁడవు. అమర్త్యప్రాయుఁ డగు మర్త్యుఁడొకఁడింత శీఘ్రముగా నిన్నుఁ గూల్చెనే"? - యని విలపించు చున్నారు

కం. "సురపురి మధురకు నెక్కుడె?
సురకాంతలు మాకుదోరయె? సురభంజన నీ
వరుగుట యొప్పని పని, నే
మరలుము మామాట వినుము మముఁగావఁ దగున్"

I-9-161

"సురభంజన"- యని సంబోధించు చున్నారు ఈ పదమర్థ గర్భితము. నీవు వీరస్వర్గము నలంకరించితివి. స్వర్గమునందలి యప్సరస్త్రీలతో విహరించుట కేగితివి. కాని-యది నీవంటి వారికి తగదు నీకార్యము-సురలను భంజించుట స్వర్గమును స్వర్గవాసులను పీడించుట. కాని యిట్లు స్వర్గము నలంకరించి స్వర్గము నందలి స్త్రీలతో

విహరించుట 'సురభంజనుఁడ' వగు నీకు తగినపని యని ధ్వని. ఆ సురపురము మధుర కంటెను ఎక్కువా? సురకాంతులు మాకంటెను అధికలా? అచటి కెందుల కేగితివని యడుగుచున్నారు.

"సురభంజన"– యను పదమున అంతటి సురవినాశకున కిట్లు సురపురమున కేగుట తగునా యనుభావము ప్రతీయమానమగుచున్నది. ఇచట శబ్దార్థము పొసఁగుచునే మరొక యంశము చెప్పుటయందు పర్యవసించినది కనుక వివక్షితాన్య పరవాచ్య ధ్వని – పద గతమైనది.

కంసుని మదేభముఁగా భావించి, అభేదము చెప్పి, యా మదేభము అన్యనృప గంధము సహింపక విశృంఖలముగా విహరించు చుండ కృష్ణుఁడను సింహము వచ్చి యాతనిని చంపినదని - ఆ సింహము కరిని చంపఁగా - నా రక్తకరిణులఁగోలె దురంత దశకు భాజనలై రనియు, ఆ మన్నన యెట పోయినదనియు, పోవునపుడు చెప్పనైన లేదనియు - విలపించు చున్నారు.

ఇచ్చట కంసుని భార్య లాలంబనముగా "అక్కట" "వమ్మయిపోయెనే"? "చెప్పలేవైతివే?" యను పలుకులు – దైన్యము, చింత, ఆర్తియను వ్యభిచారీ భావములుగా "కన్నులు వివర్ణతారకము లయినవే" – "భూరి ఘనకాంత రాభరణములు తెగి ధూళి గ్రుంగినవే?" – యనుట అనుభావములుగా, దేవేంద్రాదులను భయభీతులను గావించిన నీవు ఒక్క గోపబాలుని చేఁజిక్కితివె?" – యనుట ఆవేగముగా పాఠకుని యందలి శోకమను స్థాయి భావము పుష్టమై రసమగుచున్నది.

తే॥ గీ॥ "నేల నాలుగు చెఱఁగుల నృపులు నీకు
నధిక నమ్రులై తమ సొమ్ములంత వట్టు
నిచ్చి బ్రతికిరి నీ శౌర్యమేల యిట్లు
గోపబాలుని చేఁజిక్కె భూప సింహ! ?

హ..వం. I-9-162

యని విలపించిరి.

ఇచ్చట 'భూపసింహ' 'గోపబాలుఁడు' అనుపదములు ధ్వని పూర్ణములు. భూమిని పాలించువారు భూపులు. ఆ భూపులందరిలో సింహసదృశుఁడు. అట్టి భూప సింహుఁడు గోపాలుని చేతఁ జిక్కినాఁడు. గోపాలుఁడును బాలుఁడయిన

వాఁడు. నృప గంధ హస్తియై యన్య నృప గంధమును వమ్ము చేసినవాఁడు. దేవేంద్రాదులను యుద్ధమున భయభీతులఁ గావించినవాఁడు. వార్ధీశుని గేహము సొచ్చి యచట వెలుగొందు సమస్త వస్తుమణి సందోహము తెచ్చినవాఁడు "నేల నలువైపుల నృపాలురు వినమ్రముగా సొమ్ములు తెచ్చి సమర్పింప వారిని బ్రదికించినవాఁడు. అట్టి 'భూపసంహరుఁడు' - అని ధ్వనించుచున్నది. అట్టివాఁడు - విధి వక్రించుటచే సాటి వీరునిచే మరణింపలేదు, శౌర్యశౌండుని వలన నేలపాలు కాలేదు. "గోప బాలుని" చేఁజిక్కినాఁడు. 'చిక్కె' - అనునది దయనీయ స్థితిని తెలుపుచున్నది.

అలఁతి యలఁతి సమాసములు, మాధుర్య గుణముతోఁ గూడిన రచన యిది. ఇచ్చట - పాఠకుని చిత్తద్రుతికి సులభశైలి వైదర్భీరీతి, దోహదమొసంగుచున్నవి. కరుణరసపుష్టి కుపకరించుచున్నవి.

### వామదేవ భరద్వాజులు - శ్రీకృష్ణు నెఱింగి స్తుతించుట :

వామదేవ భరద్వాజులు తీర్థార్థులై ముదముతోఁ జరియించుచు, వటవృక్ష సమీపమున శ్రీకృష్ణ బలరాములను గాంచినారు. తదాకర తేజోవిభవంబుల కద్భుతమునంనిరి. "ఇగ్గోవ కులంనండిట్టి మూర్తులు కలుగు టెట్లొకో" యని సమాధి నిమీలితేక్షణులై తమ తపో మహిమ చేతనే వారల సముద్భవమును, తత్కారణమును గుర్తించినారు. అప్పుడు —

మ॥ జలజాతోద్భవరుద్రుఁడాదిగాఁ బటుమతుల్సర్వ ప్రయత్నంబులన్
బలవంతంబగు చూపుఁజూచియును గావంజాలకున్నట్టి, ని
ష్కలు. సూక్ష్మోదయు నాద్యునచ్యుతు నినున్నన్నొంటి మిచ్చోటను
జ్వలగోపాకృతి నుండనెట్టివియొ నస్మద్భాగ్య సంతానముల్

హ. వ. I-6-189

తే॥ గీ॥ ఏము చదివిన చదువులు నేము విన్న
వినుకులును నేను నడపెడు వివిధ విధులు
నేఁడు ఫలియించెఁ బరమేశ నీవు కరుణ
యలర నిచ్చట ప్రత్యక్షమైతి గాన"

ఇది శాంతరసోద్బోధక మగు స్తుతి.

నానారస భావములు పుట్టకముందు స్వస్థముగా నున్న చిత్తవృత్తి శాంతమయము. ఈ రసము ఉత్తమ పురుషార్థమగు మోక్షమునే యనుసరించి యుండును. "కమల సంభవుఁడు మొదలగు పటుమతులు సర్వ ప్రయత్నములతో బలవంతముగ నంతర్దృష్టితోఁ జూచియును - కానం జాలకున్నట్టి సూక్ష్మోదయుని - ఆద్యుని, అచ్యుతుని, నిన్ను కనుగొంటిమి" - అనుట - పరమాత్మ స్వరూప జ్ఞాన మగుటచే నిది యాలంబనము. "మా భాగ్య పరంపర లెంత గొప్పవో" - గోపాలాకృతి నున్న నిన్ను కనుఁగొంటి మనుట - ఆత్మ తుష్టిని తెలియఁ జేయుచున్నది. ఇచ్చట-తృష్ణా క్షయము గోచరించుచున్నది గాన - పాఠకుని యందలి 'శమ' మను స్థాయి.

"మా చదువులు - మా శ్రవణ జ్ఞానము, మా యజ్ఞయాగా ద్యనుష్ఠానములు-నేడు ఫలియించె" ననుట - హర్షమను వ్యభిచారీ భావము "నీవిట కరుణచే ప్రత్యక్ష మయితివి గావున" - భగవదనుగ్రహమును, జీవదయ - అను వ్యభిచారీ భావముచే "ఎట్టిదియొ అస్మద్భాగ్య సంతానము" అను హర్షాది- అనుభావముచే స్థాయి పుష్టమై రసానందమునుఁ గలుగఁజేయు చున్నది. భగవద్దర్శనము ఉద్దీపన విభావమైనది - శాంతము రసము.

## ఘంటాకర్ణుని ముఖమున వెలువడిన భావములు

శాంత రసానుభూతి కలిగినపుడు- జీవితము నిస్సారమను జ్ఞానము కలుగును' జీవకారుణ్యము - భావము

మ॥ జననంబుల్ మఱి కల్గెనేనియును నాజన్మంబులందెల్ల నా
మన మీశాన భవన్మనోజ్ఞ పదపద్మ ధ్యాన తాత్పర్యముం
గనుఁగా కంచిత కల్పభూరుహ భవత్కారుణ్య మాన్యములం
దనఁగా విందు మదీయవాంఛఁ దగుఁజేయన్దేవ నీ కెమ్మెయిన్.

హ. వ II-5-195

జననము తిరిగి సంభవించినచో - నా జన్మంబు లందెల్ల-ఈశాన - నామనము నీ మనోజ్ఞ పదపద్మ ధ్యానమునే పొందునుగాక। "అంచిత కల్ప భూరుహ" అని సంబోధనము. భగవంతుని అపార కరుణాసాగరుఁడని, వాంఛితార్థ ఫలప్రధాతయని సూచించు చున్నది.

ఇచట – పరాత్పరుని భగవత్తత్త్వజ్ఞాన మాలంబనముగా "నీ కారుణ్యమాన గ్రముం దనఁగా విందుము" అను భగవ దనుగ్రహమును వ్యభిచారి భావమును "మదీయ వాంఛ దగుఁజేయన్" – అని పరమాత్మ పదపద్మ ధ్యాన మిమ్మని యాచించుట – ద్వేష వర్జిత రాగ విరహిత – పరమాత్మ ప్రాప్తికై వాంఛ – మతి – యను వ్యభిచారియై పాఠకుని యందలి 'శమము'ను పుష్టి నొందించు చున్నది. ఇది వివక్షితాన్యపర వాచ్య ధ్వని. అసంలక్ష్య క్రమ వ్యంగ్యము – భావధ్వని.

ఈ విధముగా ఎఱ్ఱయ మనో భావముల వర్ణనను – అందలి ధ్వనిని పరిశీలించిన – ఎఱ్ఱయ ప్రకృతి వర్ణన యందెంత సమర్థుఁడో – రూపవర్ణనయందును అంతే సమర్థుఁడనియు – భావవర్ణన యందును, అంతటి వ్యంగ్య భూయిష్ఠమగు రచనలే గావింపఁగలఁ డని – అందులకే ఎఱ్ఱయ వర్ణనా నిపుణుఁడగు కవియని తెలియు చున్నది.

# 8. ఎఱ్ఱయ - గ్రామీణ చిత్రణ

భారతీయ జీవితమునకు దర్పణము గ్రామము. అతి ప్రాచీన భారత జీవనమే గ్రామ జీవనము. అట్టి గ్రామ ప్రజల కుటుంబ జీవనము, విశ్వాసములు, ఉత్సవములు, జాతరలు, పండుగలు ఆటలు, పాటలు, పూజలు సమస్తము – ఎఱ్ఱయ హరివంశమున ప్రతిబింబించుచున్నవి. ఎఱ్ఱనకు జానపద జీవితము నందభినివేశము మిక్కుటము. ఇతడు గ్రామీణుల, గ్రామముల జీవనమును కనులారగాంచి యనుభవించి యుండవచ్చును. చదలువాడ, గుడ్లూరు గ్రామములందు జీవితము గడిపినపుడు గ్రామీణ జీవితమునందలి ప్రతి అంశమును పరిశీలించి యుండవచ్చును. సందర్భము, సన్నివేశము వచ్చినపుడంతయు తన హరివంశమునందా గ్రామముల జీవితమును స్వతంత్రముగా వర్ణించి యున్నాడు. ఇవి చాలవఱకు మూలమున లేనివి. కనుకనే ఎఱ్ఱయ వర్ణనా నిపుణుడు.

ఆనాటి గ్రామములు, గ్రామాధికారులు, ప్రభువులకు కప్పములు చెల్లించి సర్వస్వతంత్రులై యుండిరి. ఉత్సవములందు గ్రామాధికారులు తమ తమ కప్పములతోఁ బాటుపాయనములుఁ గొనివచ్చి రాజులతోఁ బాల్గొనుచుండురు. ఆనందించుచుందురు.

గ్రామముల, పట్టణముల సమూహామే రాజ్యము. రాజు సర్వాధికారియైనను గ్రామాధికారి గ్రామాధిపత్యమును వహించెడివాడు.

పల్లెలలో కలహము లేర్పడినపుడు సమరస భావములతో పరిష్కరించుకొనుచుండిరి. ప్రజలను గ్రామాధికారి కష్టములలో నాదుకొనుచుండువాడు. గ్రామాధికారులు గ్రామమున కాపద సంభవించి నపుడు ప్రజలతోఁబాటిదే జీవనమని పాలు పంచుకొనువారు

ఎఱ్ఱయ – హరివంశమునందు – పశులకాపద సంభవించి, గ్రామీణులు గ్రాసవాసముల కిబ్బంది పడుచుండిరి. అపుడు గ్రామాధికారియగు నందుడు ప్రజలతోడిదే తన జీవనమని యాపదలలో వారి కండగా నిల్చినాడు.

గ్రామములు బీడుపడి పశువులకు మేపెద్దదిర్లై గ్రాసవాసముల కిబ్బందులు కలిగినపుడు ఒక్కుమ్మడిగా గ్రామీణులు తరలి మఱొక్కచోట గ్రామము నేర్పరచుకొనుచుండిరి. ప్రజావాసులు వలసపోయిన తీరు – ఇందులకు నిదర్శనము.

అది కాళిందీతీరము. నందుడా తీరమునందుఁ బోవుచున్నాడు. అది పుష్పిత, ఫలిత అనేక తరుషండమండితము. నలువైపులందు వెలుఁగులందు పెనుదొడ్లు మర్పఁబడి యున్నవి ఆ దొడ్లయందు గడ్డిమేసి పేకువజామున ఆవులు సుఖముగా పరుండి నెమరువేయుచున్నవి. ఆ గోసమూహము హుంకారముతో బిలువగా వత్సములు గుర్తించి తల్లులవైపు సమ్ముఖములై పరుగు లిడుచున్నవి. మఱొకవైపున వృషభములు - వీని మూపురములు వలుదలై యుండిన దర్పముతో అంకెవేయుచున్నవి. కాలుద్రవ్వి క్రోడాడుచుండినవి. మిక్కిలి పొగరుతో నున్నవి. దీని మెడలు కఱకెక్కినవి అట్టి వృషభములు ఆవుల వెంటఁ దగులుచున్నవి. ఒండొంటిని చేరనీయక బలియు అంకెలతో కాలుద్రవ్వి క్రోడాడుచున్నవి. అచ్చటి ప్రజలకు ఆవుల నోటి నురువులు, పెయ్యల రేణములు, పాలకుండల మసి, – ఇవియే శరరమున కలంకారములు.

గోపాలురు పాలుపిదికి. తలుగులు తాళ్ళు, - తలల, మొలల చుట్టినారు, కొందఱటునటు కలయఁబాఱుచు క్రేపుల నేర్పరచుచున్నారు. మఱికొందరు వల్లియలు వైచి, కోడెలనుఁ బట్టి లాగుచున్నారు. లాఁగి కాలురులచే బట్టుకొని జట్టి కాంద్రకు వశంబు సేయుచున్నారు.

పారవశ్యమున తిరుగువారు కొందరు చూడుగొడుపులు, ముకుత్రాళ్ళు, ముకుబంతులు మొదలగు సాధనములఁగొని వచ్చి తెవులు గొంట్లను చికిత్సించువారు కొందరు, మరి కొందరు చూడలఁ దరిఁజేరనీయని - ఆవుల తొలగ గట్టి పిళ్ళు వెట్టియు, మందులను చల్లియు చాల బంధించి చేపెఱింగించుచున్నారు కావటి మోపుల మోసి మోసి, కొందరికి, కంది, కాయలు కాచి మూపులు వంగిపోయినవి. పక్వమగు వరి వెన్నులు తలకు దట్టముగా నంటుకొనుటచే దట్టమయి పిండిన దుర్గంధము వచ్చుచుండినది. కొందరి అవయవములు పసుల కొమ్ముల తాకుటచే, అడవి క్రంపల యేటులచే, మన్నియ ముచ్చుల పోటులచే గంట్లుపడి కరకెక్కినవి. కపిల కన్నులు, వేడగు చూపులు వారివి. ఎఱ్ఱని నారలు గలిఁగిన కన్నులు వారివి భయముఁ గొలుపు ఎలుఁగులతో నెల్లయెడల త్రుళ్ళుచుండిరి.

కొందరు గోపికలు చనుకట్టులఁ గట్టినారు. భుజమూలముల బిగి సొంపు నిండుగా నుండినది. చిలుము ఊరుచున్న యిత్తడి కడియములను ధరించినారు. కంచు టుంగరములు వేళ్ళ కమరి యున్నవి. కడపలమూతులను గట్టిగా పట్టినారు. వారి చేతులు కెందామరల సొబగును తిరస్కరించునట్టివి వెండ్రుకలు చికిచికిగా

చెవక యున్నవి. పిల్లమేఘములతో నావరింపఁబడిన చంద్రరేఖను బోలినవారి ఫాల భాగములు చెమర్చు చున్నవి. సిందుర యూర్పులతో, చనుఁగవల వ్రేగుతో పిఱుదుల భారములతో, పాలయు చూడ్కులతో, సరిత్తోయములఁ దెచ్చుచుండిరి. వారి కాంచన కంకణములు — ఘణఘణాత్కారములు సేయుచుండినవి.

దధి మథన పారీణలగు బాలికలు మనోహరముగ పాడుచు మధించుచుండిరి. అప్పుడు వారి కంఠ సూత్రపుల వలనములు, బాహులతాందోళనములు, పయోధర సంఘర్షణలు శ్రోణి సన్నహనములు మృదుగీత మాధుర్యములు మనోహరములు.

కొందఱు బాలికలు, ఘృత తక్రములను విక్రయించు చున్నారు. గృహ సమ్మార్జనము గావించు వారొకచోట, శిశువుల నోదార్చు వారొకవైపు, బాలకులకు భృతకులకు భుక్తినిచ్చువారొకచోట — ఇట్లు గరిష్ఠ కుటుంబినులు, కార్యవ్యగ్రతచే చిటిముడిపాటు దోపమెలఁగు చుండిరి. గోపగోపికల యీ యుదాత్త వ్యాపారములచే ఘోషము సర్వప్రకారముల సుభగమయి యొప్పినది.

కుటీర కవాటములు, నవతృణాచ్ఛాదితములు. సర్వత్ర అజ్యపచన గంధము వ్యాపించి యుండినది. ఒక యెడ పాలు మరుగుచున్న శబ్దము, మఱొక చోట అర్భకులు తినఁగా జారిపోయిన మీఁగడలతోడి కబళములు, దధి బిందువులొక్కచోట అట్టి ఘోషమున ప్రవేశించి వాఁడు నందుడుఁ.

ఇది ఎఱ్ఱయ చిత్రించిన గ్రామ మార్గము. గ్రామము. ఇది యానాఁటి పల్లెల పల్లెజనుల వైభవము. ఘూలము నందలి నందుఁడు పోవు పల్లెమార్గము. పల్లీయ తము.

హ. వి. 5–15 నుండి

"కుమారస్కంధ వాహ్యాయాం శిబికాయాం సమాహితః
సంవేశయా మాసశిశుం శయనీయం మహామతిః
జగామచ వివిక్తేన శీతలానిల సర్పిణా
బహూదకేన మార్గేణ యమునాతీరగామినా
స దదర్శ శుభే దేశే గోవర్ధన సమీపగే
యమునా తీరసంబద్ధం శీతమారుత సేవితమ్
విరుతశ్వాపదైః రమ్యం లతావల్లీ మహాద్రుమమ్

గోభిస్తృణ విలగ్నాభి స్స్యందతీభి రలంకృతమ్
సమప్రచారంచ గవాం సమతీర్థ జలాశయమ్
వృషాణాం స్కంధఘాతైశ్చ విషాణోద్ఘృష్ట పాదపమ్
ఘాసామిషాదానుస్సృతైః శ్యేనైశ్చ మిషగృధ్నుభిః
సృగాల మృగసింహైశ్చ వసామేదాసిభిర్వృతమ్
శార్దూల శబ్దాభిరుతం నానాపక్షి సమాకులమ్
స్వాదువృక్షఫలం రమ్యం పర్యాప్తతృణ వీరుధమ్
గోవ్రజం గోరుతం రమ్యం గోపనారీభిరావృతమ్
హంభారవైశ్చ వత్సానాం సర్వతః కృతనిస్వనమ్
శకటావర్తవిపులం కంటకీ వాటసంకులమ్
పర్యంతే ప్యావృతం వన్యైః వృహద్భిః పతితైర్ద్రుమైః
వత్సానాం రోపితైః కీలైః దామభిశ్చ విభూషితమ్
కరీషాకీర్ణ వసుధం కటచ్ఛన్నకుటీమఠమ్" హ. వ. 5-24

ఇది మూలమున నందుడుఁ పోపు మార్గము. ఎఱ్ఱయ మార్గము పుష్పిత ఫలతరువులచే నలంకృతమై పెనుదొడ్ల యందు పోకు మేయచుండు గోవులతో రమ్యమై తల్లుల అంబారవమును గుర్తించు వత్సముల నాదములతో దర్పముతో ఱంకెలు వైచు వృషభములతో, కాలుద్రవ్వి కోరాడు పొగరు కోడెలతో నిండియుండును. మూలమున శ్వాపదములు, తృణ విలగ్నములగు గోవులు ఒకేచోట కనిపించును. లతావల్లీ సమన్వితములగు మహాద్రుమములతో, వృషస్కంధముల ఒరపులకు ఒరసిపోయిన వృక్షములతో, మాంసాదములగు క్రూరమృగములతో, శార్దూల శబ్దరుతములతో, నానా పక్షుల కలకలములతో నిండిపోయి యుండును. ఒకేమార్గమున శార్దూలాది క్రూర మృగముల శబ్దములు, తృణాసక్తములగు గోవులును కనిపించును.

ఇది పరస్పర విరుద్ధము, అసంభవము. స్వభావము చేతనే సాధువులగు గోవులు - సృగాల మృగములతో, శ్వాపదయుతములతో, నిండిన ప్రదేశమున, నిర్భయముగ సంచరింపఁజాలవు. బెదరు బెదరుగా నొకచో సంచరించుచున్నను, తృణ విలగ్నములు కాఁజాలవు. పయోధారలు స్రవించుచు సంచారము చేయఁజాలవు ఒకవైపు "సమప్రచారంచగవాం సమతీర్థ జలాశయమ్" అని వ్రాయుచు, "సృగాల

మృగ సింహైశ్చవసామేదాసిభిర్వ్యాతమ్" అనుట పరస్పరము పొసఁగని విషయము. అట్లు నిరంతరము క్రూరమృగము లుండుపట్టుల గోవులు సంచారము సలుపఁజాలవు. సలిపినను జీవంతములై మనఁ జాలవు.

ఒకే శ్లోకమున "విరతశ్వాపదై రమ్యం" అనియు "గోభిస్తృణ విలగ్నాభిః" అనియునున్నది. ఇది అసాధ్యమగు విషయము. ఇట్టివాని నతి సూక్ష్మముగ పరిశీలించి ఎఱ్ఱయ "క్రూరమృగములను - మృగధ్వనులను శ్యేనములను, అమిష గృధ్నము-లను వసామేదాసు'లను శార్దూల శబ్దాభిరుతములను పూర్తిగా తొలఁగించి ఆప్రదేశమును శాంతముగ సుందరముగ చిత్రించి వేకువజామున ఆవులు సుఖముగా పరుండి నెమరు వేయునట్లు నిర్భీతిదమగు ప్రశాంత ప్రదేశమున నిలిపినాఁడు. ఇట్లు సూక్ష్మముగ పరిశీలించుచు మూలమున పరస్పర విరుద్ధము లగు వానిని తొలఁగించుచు వర్ణించిన యెఱ్ఱయ, ఔచితీ నిర్వహణ దక్షుఁ డనుటలో సందియము లేదు. 'శార్దూల శబ్దాభిరుతం' - 'హంభారావైశ్చవత్సానాం సర్వతః కృతనిస్వనః' - ఇదియును అసంభవము. 'శార్దూలములు ఘోషించుచోట వత్సము లుండుట అవరు బెదరును కలిగించునేకాని శాంతి యుండదు. కనుక భయానక రసస్ఫూర్తి కలిగించు వర్ణనలను తొలగించి, వ్రజనివాసమును నిర్భయ ప్రదేశముగ ఆనందజనకముగ చిత్రించినాఁడు ఎఱ్ఱయ.

మూలము నందు - హ. వి. ౫ ౨౬ నుండి

"క్షేమ్యప్రచార బహుళం హృష్టపుష్ట జనావృతమ్
దామనీ పాశబహుళం దధిమండార్ద్ర మృత్తికమ్
మంధాశ వలయోద్గారై ర్గోపీనాం జనితస్వనమ్
కాకపక్షధరై ర్బాలైః గోపాలక్రీడనాకులమ్
సార్గళద్వార గోవాటం మధ్యేగోస్థాన సంకులమ్
సర్పిషా పచ్యమానేన సురభీకృత మారుతమ్
నీలపీతాంబరాభిశ్చ తరుణీభి రలంకృతమ్
వన్యపుష్పావతంసాభి ర్గోపకన్యాభిరావృతమ్
శిరోభిర్ధృత కుంభాభి ర్బద్ధై రగ్రస్తనాంబరైః
యమునా తీరమార్గేణ జలహారీభిరావృతమ్

సతత్ర ప్రవిశన్ హృష్టో గోవ్రజం గోపనాదితమ్
ప్రత్యుద్గతో గోపవృద్ధైః స్త్రీభి ర్వృద్ధాభి రేవచ
నివేశం రోచయామాస పరివర్తే సుఖాశ్రయమ్ 5-31 వరకు

మూలమునందలి గోపాలురు హృష్టులు, పుష్టులు, వారి కడత్రాళ్ళు, తలుగులు మాత్రముండినవి. మూలమున గోపాలురు నిరలంకృతులు ఎఱ్ఱయ హరివంశమున గోపాలురు సాలంకృతులు. వారికి ఆవుల నోటినురువులు, పాలకుండల మసి, పెయ్యల రేణములు, శరీరమున కలంకార ప్రాయములు. ఎఱ్ఱయ పల్లెలోని ప్రజాజీవితము గోవులతో అత్యంత సన్నిహితము. వసామేదాదులను, మాంసమును భుజించు జంతువులు, క్రూర మృగములు ఎఱ్ఱయ పల్లెమార్గమునందు మచ్చుకైన కానరావు. ఆవులు తుష్టిఁగా తిని నెమరువేయుచు కూర్చొని యుండును వత్సములను అంబారవములతో పిలుచుచుండు ను ఆపిలుపులు గుర్తించి వత్సములు త్రుళ్ళి ప్రతినాదము నొసంగుచు, నొండొంటిని దాటుకొని తల్లులను చేరుచుండును. ఇట్లు గోవత్సముల సహజ ప్రేమను ఎఱ్ఱయ హరివంశమున గాంచనగును. మూలమున నీ వాత్సల్యపూరిత సన్నివేశము లేదు. వత్సములు మాత్రము 'సర్వతః' స్వనము గావించుచుండును.

మూలమున వ్రజము కేవలము 'హృష్టపుష్ట జనావృతమ్' ఇఁక గోపాలురను గుఱించిన నర్తన గానము. కాని ఎఱ్ఱయ హరివంశము నందలి గోపాలురకు శాస్త్రయ మెక్కువ. గోసేవాభావ మధికము. గోకార్యభార మధికము. పాలు పిదికి త్రాళ్ళు, తలుగులు తలమొలల చుట్టినారు. కొంగజుట్టు నటు కలయఁబాఱుచు క్షేపుల నేర్పఱచు చున్నారు. మఱి కొందరు వల్లియలు వైచి కోడెలను బట్టి లాగుచున్నారు. కాలురుల చేఁబట్టుకొని జట్టికిం(డ్రకు వసంబు చేయుచున్నారు. మూడు గొడుపులు, ముకుత్రాళ్ళు, ముకుబంతులు, మొదలగు సాధనములఁగొని వచ్చి తెవులు గొంట్లను చికిత్సించువారు కొందరు, దూడలను దరిచేర నీయని ఆవులం దొలఁగం గట్టిపిళ్ళు వెట్టువారు, కొందరు, మందులు చల్లియు, చాల బాధించి చేపెఱింగిచువారు, మఱికొందరు కనిపింతురు. పెక్కు విధముల కావడులు మోసి మోసి వీరి భుజములు వంగిపోయి, కంది కాయలుఁగాచి యుండును. ముదుక పెన్నులంటికొని, వొలవలచు చుంచు తలలుగల వారును, పసుల కొమ్ములు తగిలి అడవి కంపల యేటుల, మన్నియ ముచ్చుల పోటులచే గంటులుపడి కఱకెక్కిన అవ

యవములు గలవారును ఎఱ్ఱయ హరివంశమున కనిపించు గోపాలురు. మూలమున నేమాత్రము లేని వర్ణన ఇది. ఆ పల్లెలోని గోపాలుర చేష్టలను, ఆకారమును అతి సహజముగా వర్ణించినాఁడు – ఎఱ్ఱయ.

పల్లె జీవితము నెంతఁగనో అనుభవించి, ఆనందించి, పరిశీలించి యుండిననే గాని ఇంత చక్కఁగా వర్ణింపలేరు. మూలమున గోపాలుని వర్ణన ఏమాత్రము కనిపింపదు.

ఎఱ్ఱయ గోపాలుర నిత్యజీవితము నెంతగనో అభివర్ణించినాఁడు. వీరికైనందిన కార్యక్రమముల నింత చక్కఁగా వర్ణించినట్లు మూలమున కన్పింపదు. కనుకనే సూక్ష్మ పరిశీలనా చతురుఁడగు నెఱ్ఱయ వర్ణనా చాతుర్యమునకు ఆద్యబ్రహ్మ :

"వల్లియలువైచి కోడెలనుబట్టి లాగుట" – అత్యవసర మైనపుడు గోపాలురు చేయుపని. జట్టికాండ్రకు వానిని వెంటనే వశంబు చేయుటయు వాని పొగరణగించు పనియే: ఇట్టి పల్లె జీవనుల కార్యక్రమము నతి నిశితముగ పరిశీలించిన ఎఱ్ఱయ పరిశీలనాశక్తి శ్లాఘనీయము.

మూలము నందలి వ్రజమున –

గోపకన్యలు వన్యపుష్పములచే నలంకరించుకొని యుందురు. శిరములపై జలకుంభముల ధరించి యుందురు స్నానాగములను బంధించికొని యమునా తీర మార్గమున జలము తెచ్చుచుందురు. అంతమాత్రమే.

ఎఱ్ఱయ గోపబామినుల కార్యక్రమము గృహిణీ సహజమైనది ఎఱ్ఱయ వ్రజ వాసమున స్త్రీలు –

దధి మథనము గావించు నపుడు మనోహరముగ గీతముల నాలపింతురు కంఠసూత్ర వలనములు, బాహాలతాందోళనములు, పయోధర సంఘర్షణలు, శ్రోణి సన్నహనములు – ఈ చలద్దృశ్యము –

ఎఱ్ఱయ వ్రజవాసమున స్త్రీలు మధించునప్పటి వారి స్వరూపము నెంత నిశిత ముగ పరిశీలించి, చిత్రించినాఁడో తెలియు చున్నది. వారి కంకణ ఝణఝణా త్కారములు మూలమున లేవు. "సర్పిషా పచ్యమానేన సురభీకృత మారుతమ్" అని మూలమునందు – ఎఱ్ఱయ హరివంశమున –

'సర్వత్ర ఆజ్య పచన గంధము వ్యాపించు చుండినది. ఒక యెడ పాలు పెరుగుల శబ్దము వినిపించును. అర్భకులు తినఁగా జారిపోయిన మీఁగడతోఁ గూడిన కబళము కనిపించును. దధి బిందువులు పడి యుండును.

ఇఁక మూలమున గోపికలు - నీలపీతాంబరము ధరించి యుందురు. వన్య పుష్పముల నవతంసముగాఁ గలవారు. "శిరోభిర్ధృత కుంభాభి ర్బద్ధైర్గ్రస్తనాంబరైః" ఇంత మాత్రమే వీరి యలంకరణము.

ఎఱ్ఱయ హరివంశమున గోపికలు - చిలుమూరు ఇత్తడి కడియములు ధరించి యుందురు. మూలమున ఇత్తడి కడియములు కానరావు. చనుకట్టు ధరించి భుజమూల ముల జిగి సొంపుతో కంచు టుంగరములు ధరించి కడవల మూతుల బిగియఁబట్టి నడుచుచుందురు.

చెమర్చిన ఫాలభాగము, నిడుదయూర్పులును, చనుఁగవల వ్రేగు, పిఱుదుల భారము - తోయము తెచ్చునప్పటి వీరి రూపము. ఇది మూలమునలేని రూప వర్ణన. ఆనాటి పల్లెపడుచుల కార్యసంరంభమును తెలియఁజేయును.

నీటిని దెచ్చునపుడు పల్లెస్త్రీలను - ఎఱ్ఱయ పరిశీలించి యుండును. ఆ రూప మును తన మనః ఫలకమున పొందుపఱచి హరివంశమున చూపి యుండును.

ఆనాటి పల్లెపడుచుల కడియములు ఇత్తడివి. పుత్తడివిగావు. చిలుము పట్టి యుండును. ఉంగరములు కంచువి. ఇది మూలమున లేని ఆభరణ విశేషము. ఎఱ్ఱన కాలము నాటి గ్రామీణ యువతులు ధరించు చుండునవి కావచ్చును. పల్లెలందు ఆజ్యపచన గంధము పరిమళించుచుండును. బాలకులు తినఁగా జారిన మీఁగడలు ఆనాఁటి పాడిని తెలియఁ జేయుచున్నవి. ఇట్లు మూలమును నామమాత్రముగ ననుస రించుచు స్వతంత్ర రీతుల రచించి క్రొత్తమెరుగుల దిద్దినాఁడు - ఎఱ్ఱయ.

గృహసమ్మార్జనము చేయు గృహిణులు బాలకులకు, భృత్యులకు భుక్తి నొసంగు గృహిణులు కార్యవ్యగ్రతచే చిడిముడిపాటు పడుచుండు గృహిణులును ఎఱ్ఱయ హరివంశమునఁ గనిపింతురు.

ఎఱ్ఱయ ఆంధ్రజాతిని, ఆంధ్రస్త్రీ దినచర్యలను అభిమానించినవాఁడు. సందర్భము వచ్చినదని తన గ్రంథమున కెక్కించినాఁడు. ఇది మూలమునందు లేని వర్ణన.

పెద్దకాలి మేకపోతు లుండుటచే గ్రామములనేకములగు బాధలకు గుఱియగు చుండుట సహజము. అట్టిదే హరివంశము నందలి పల్లెజీవులకు నొకమారు సంభవించినది.

అప్పుడు —

సీ॥ ఎఱువు తిప్పలుగాని యెల్లమందలు గోను
దెక్కి మేపుదు చోట ద్రొక్కువడియెఁ
దరులోలి నఱుకఁ మొదళులు సిక్కంగ బొం
పము లేడి జాడలు వడియెఁ బోదలు
మనువులు పసుల కాల్మడిఁ బుచ్చి దొరుగండి
ద్రంతలు పెనుఁ రొంపి ద్రంతలయ్యెఁ
బూరి పంటలు చెడిపోయె రాయిడిఁ గ్రంప
లోనఁగా దవ్వుల గాని లేదు.

తే॥ గీ॥ పులుగు పూరెడు పోవడి పొలములందు
మెలఁగి వెదకినఁ బుట్టదు మెకములడఁగెఁ
గూరఁగాయఁ గట్టెయు విల్చికొనఁగ వలసి
యునికి ద్రేపల్లె వీటి పట్టునకుఁ దొరఁగె" హ. వి. 1-6-5

ఇట్లు బహుకాల మొకేచోట నుండినప్పుడు ఆ ప్రదేశము నివాసమునకు యోగ్యము కాకపోవును.

ఎరువులు తిప్ప కుప్పలగును. పశువుల రక్తము త్రాగు క్రూరమృగములు మందలలో ప్రవేశించి వానికి భయము గొలుపును. మేయఁగా మేయఁగా పశువులు మెలుంచుచోట త్రొక్కువడి గ్రాస యోగ్యము కాకపోవును. తరువులను పదునుగా నఱుకుటచే మొదళ్లు చిక్కిపోయి పొదలు నశించి కేవలము జాడలు మాత్ర ముండి పోవును. సిడులు నశించును. ఆకులు, కొమ్మలు నఱుకుటచే తరువులు నామమాత్ర ముగా నుండి పోవును. మనువుల పసుల మూత్రములలో ప్రుచ్చిపోవుటయుఁ గలదు. తోటలు పల్లములు రొంపితో నిండిపోవును. నీరు లేక పంటలు నాశము అగు టయు, గడ్డిలేక పశుగ్రాసము కొఱవడుటయు గలదు. క్రంపలు దూరము వఱకు లేకుండుటయు, పిట్టలు పడి పొలము నాశము చేయుటయు, మాంస భక్షకులకు

మాంసమే కఱవగుటయును సంభవించు చుండును. కూరగాయలు వెలయిచ్చి కొన వలసి వచ్చుచుండును. ఇట్టివి పల్లెలను నివాస యోగ్యము కాకుండ చేయునవి. అప్పుడు ఆ బాధల నెదుర్కొని, అనుభవించి, విసిగి, వేసరి వలస పోవుటయును గలదు.

మూలమున, 'వాస్మిన్ వనే శక్యం గోపాలై స్సహ క్రీడితుమ్' అను దానికి ఎఱ్ఱయ 'వ్రేపల్లె వీఁథి పట్టునకుఁ దొరఁగె" యని రమ్యముగా మార్చినాఁడు. మూల మున - 'క్రీడించుట (కాలక్షేపము)కు సాధ్యముకాదు' అనఁగా - ఎఱ్ఱయ 'నివాస యోగ్యముకాదు' అని స్పష్టముగా తెలిపినాఁడు.

ఎఱ్ఱయ దీనినే —

"అనఘ ! విను మొక్కటి చెప్పెద
నెనయఁగ మనపుట్టి బుద్ధి యెఱుఁగుట మొదలి
వ్వనము నివాసం బైనది
మనవారికి వింక నిచోటు మంచిది యగునే ?"

1-6-03

అని - మనవారు పుట్టినప్పటి నుండి, బుద్ధి నెఱింగిన నాటి నుండి ఇదే వనమును నివాసము గావించుకొని - ఆ మమతచే ఎన్ని కష్టములు వచ్చినను, వదలఁజాల కున్నారు. ఈ చోటు మన వారి కింక మంచిదికాదు' - అని నవర్ణించినాఁడు.

మూలము నందలి కొన్ని శ్లోకములకు అనువాదము లేదు. "నిరానందం నిరా స్వాదం నిష్ప్రయోజన మారుతమ్" అను దానికి అనువాదము లేదు.

"నిరానందం నిరాస్వాదం" అను పదములు ఎఱ్ఱయ పద్యములలో వ్యంగ్య ములు. మూలములో వాచ్యములు 'నిష్ప్రయోజన' అనుపదమున మారుత మెందు లకు నిష్ప్రయోజన మైనదో తెలుపలేదు. 'నిర్విహంగమ్' అనుదానికిని అనువాదము లేదు.

"తరులోని నరుక మొదళులు సిక్కంగ జొంపము లేది జాడలు వడిమోఁదొధలు' అనునొక్క వాక్యములో "అవగతమితం సర్వం' మొదలుకొని 'నిర్వ్యంజన మివాశ నమ్" అనువఱకుఁగల ఏఁడుశ్లోకముల భావమును గుప్పించి సంక్షిప్త పరచి నాఁడు. కనుక ఎఱ్ఱయకు భావము ప్రధానము. ఇతని యధీనములో వర్ణనావైచిత్రి

...హుడు యుండును. కనుకనే యుచితమని తలంచిన భావ్యము నుండి సుందర భావములను సృష్టింపఁ గలఁడు. సంక్షిప్తమైన భావమునకు విశాల పరిధి నేర్పఱుపఁ గలఁడు. సుదీర్ఘమైన వర్ణనలను సంకుచిత పరిధిలో నిముడ్చనుఁ గలఁడు. కనుకనే ఎఱ్ఱన ప్రబంధ పరమేశ్వరుఁడు. హ. వి 8-17 నుండి

"విక్రీయ మాణైశ్చాక్రైశ్చ కాష్ఠైశ్చ వనసంభవైః
ఉచ్ఛిన్న సంచయ తృణైః ఘోషోఽయం నగరాయతే
శైలానాం భూషణం ఘోషో, ఘోషాణాంభూషణం వనమ్
వనానాం భూషణంగావః తాశ్చాస్మాకం పరాగతిః
తస్మా దన్యద్వనం యామః ప్రత్యగ్రయవసేంధనమ్
ఇచ్ఛాం త్యనుప భుక్తాని గావో భోక్తుం తృణానిచ
తస్మాద్వనం నవతృణం గచ్ఛంతు ధనినో వ్రజాః
సద్వార బంధావరణా సగృహక్షేత్రిణ స్తథా
ప్రశస్తావై ప్రజాలోకే యథావై చక్రచారిణః
శకృన్మూత్రేషు తేష్వేవ జాతక్షార రసాయనమ్
తృణాః భుజంతేగావో నాపితత్పయసే హితమ్
స్థలీప్రాయాసు పథ్యాసు నవాసు వనరాజిషు
చరావ స్సహితా గోభిః క్షిప్రం సవాహ్యతాం వ్రజః
శ్రూయతేహి వనం రమ్యం పర్యాప్త తృణసంస్తరమ్
నామ్నా బృందావనం నామ స్వాదువృక్ష ఫలోదకమ్"
8-22 వరకు

"శైలానాం భూషణం ఘోషః" అను శ్లోకమునకు - ఎఱ్ఱయ అనువాదము యలేదు.

"పర్వతములకు అవుల మందలే ఆభరణములు. ఆ అవుల మందలకు ఆభరణము వనములు వనముల కాభరణములు గోవులు. ఆ అవులే మనకు గతి" అని ఒకచో, తెలిపి, మఱొకచో, "ఈ ప్రదేశము గోపాలురకు క్రీడించుట కనువుగ లేదు. కనుక మరొకచోటికి పోవుదము అనుటయు అంత పొత్తుకుదరని వాక్యములు. కనుక నీ శ్లోకమును అనువదించలేదు.

"అరణ్యే మిద మల్పోదం అల్పవృక్షం నిరాశ్రయమ్
అన్వేషిత మవిశ్రామం దారుణం విరళ ద్రుమమ్"

అను శ్లోకమునకును అనువాదము లేదు. ఇది పునరుక్త మగుచున్నది. భావములు పునరావృతములైనందున వదిలివేయఁబడినది.

ఎఱ్ఱయ - 'కూరఁగాయఁ గట్టియ విల్చికొనఁగ వలసె' అనుట - 'పీటి పట్టునకుఁదొరఁగె' వాసస్థానమున కనువు లేదనుట - మూలము నందలి -

"విక్రియమాణైః కాష్ఠైశ్చ శాకైశ్చవన సంభవైః
ఉచ్ఛిన్న సంచయ తృణైః ఘోషోఽయం నగరాయతే"

అను మూలమునకు దగ్గరలో నున్న అనువాదము. 'ఘోషోఽయం నగరాయతే' అనుటకు 'పీటి పట్టునకు దొరగె' అను వాచ్యమును వ్యంగ్యము గావించినాఁడు ఎఱ్ఱయ.

"తరులోలి నఱుక మొదళులు సిక్కంగ జొం
పములేది జాడలు వడియెఁ బొదలు"

అని తరువులు శాఖావిహీనములై ఛాయా రహితములై, 'ఓలినఱుక' - వరుసఁగా నరుకగా మొదళ్ళు చిక్కిపోయి పొదలు శాఖల గుబురుల క్షీణించినవి (జాడలు పడినవి) అని యూహింపఁ జేయుచున్నాఁడు 'అన్వేషితాన్యవిశ్రామం" "అల్పవృక్షం" "నిరాశ్రయం" అను వానిని పాఠకుల యూహకే వదలినాఁడు. "మడువులు పనుల కాల్మడిఁ యిచ్చె" అనునొక్క వాక్యమునకు మూలము విస్తృత వ్యాఖ్యాయుతము.

"శకృన్మూత్రేషు తేష్వేవ జాతక్షార రసాయనమ్
నతృణం భుంజతే గావో నాసి తత్పయసే హితమ్"

ఇచ్చట - 'మాటికి ఆవుల మూత్రముతో చెడిపోయినదై క్షారరసముతో గూడి యుండుటచే గోవులు తృణముల నారగించుటలేదు. అది క్షీరమునకు హితముకాదు.' అని మూలమున్నది. ఇచట హరివంశమున చెడిపోయినది తృణముకాదు- మడువులు- కొలనులు.

మూలము ననుసరించి - అర్థము సమంజసమే యైనను, నివాసము ను మార్పు నంతటి క్లిష్ట సమస్యకాదది. ఎందుల కన - ఒకేచోట చిరకాలము కట్టి ఉంచినపుడు

ఒకచో గడ్డి మేయుచుండినచో - అవి ఒకే చోట మేసిమేసి - తఱచుగ మూత్రము విడిచి నలిపి, ఆ మిగిలిన గడ్డిని మూత్రమయము గావించుట కలదు. కాని అపుడు వెంటనే స్థలము మార్చియో, క్రొత్తగడ్డిని వేసియో, ఆ పాతచోటును పరిశుభ్ర పఱచియో, గోవులను రక్షించు చుందురు. ఇది గోవులు కలిగిన సర్వులకు సామాన్యమే! అంతమాత్రముచేత స్థలము వదలి పోరు కాని ఎఱ్ఱయ హరివంశమున చెడిపోయినది - మడువులు - ఇదికొంత ఆలోచింప వలసిన విషయమే!

ఒక గ్రామములో నొకే కొలనుండవచ్చును. ఆ కొలనులోని నీటికై మాటికి గ్రామములోని పశువులన్నియు రావచ్చును. మాటికి గ్రామము నందలి ఆ పశువు లన్నియు నచటికేగి, నీటిని త్రావి, త్రొక్కి మూత్ర విసర్జనము చేసి వచ్చుచుండ వచ్చును. అప్పుడానీరు పాన యోగ్యముగాక చెడుటయు గలదు కుళ్ళిపోవుట సంభవము. 'జాతక్షార రసాయనము' మూలము నందలి తృణ సముదాయము. ఎఱ్ఱయ హరివంశమున 'మడువులు పసుల కాల్మడిఁ బ్రుచ్చినవి' - కనుక నొకే ప్రదేశమున కట్టివేసినపుడు పసువుల మలమూత్రములచే నా ప్రదేశమున గడ్డి నాశమగుట పల్లె ప్రజల నిత్యానుభవమే. అంతటితో వారు గ్రామమును వీడిపోరు. కనుక ఎఱ్ఱయ "మడువులు పసులకాల్మడిఁ బ్రుచ్చె" నని మడువులను క్రుళ్ళఁజేసి నివాసత్యాగము నకు పిలుపు కల్పించినాఁడు. ఎఱ్ఱయ పల్లీయుల, గోవుల బాధ నొక్క సీసము నందే యనువదించి, మూలము నందలి పదునైదు శ్లోకముల భావము నిమిడ్చి సంక్షిప్త పఱచి, కథా గమనమున కడ్డు తగులక సాగించినాఁడు. ఇది యాతని శిల్పము.

అట్టి గ్రామ నివాసము కష్టమైనపుడు ఒక్కుమ్మడిగా కలసి గ్రామీణులు వలస పోవుచుండుటయు గలదు. అప్పుడెఱ్ఱయ గ్రామీణు లొకరి నొకరిట్లు పురి కొలుపుకొను చున్నారు.

సీ॥ బండ్లు మెట్టింపుపై బరువు లెక్కింపు మీఁ
దళ్ళను బూన్పు కావళ్ళ నునుపుఁ
బదిలంబుఁగా నేతి పనఁటులు క్రొత్త గో
నియల బియ్యము వడ్లు నెనుమలి వడ్లు
నొనవిరి ప్రాలును నొకరంగఁబోసి చాఁ
పలు మంచములు మీఁద బలియఁ గట్టి
దామెనలును పల్లె త్రాళ్ళనుఁ దలుగులు
కవ్వము ల్గాడవలి కత్తి సూడు హ వ. I- 8-22

తే॥ గీ॥ గొడుపు వాదోళ్ళు మొదలుఁగాఁ జెనకయుండ
వలయు ముట్లెల్లఁ దెమ్మి కంటలపు టెడ్ల
నాయితము సేయు ముదుసళ్ళ నాడు వారి
గంప మోపులు ముందఱఁ గదలు మనుము

వ॥ "అని మఱియుఁ బెక్కుభంగుల యెలుంగుల నొక్క కోలాహలం బెసంగ మంద యంతయు నొక్కపెట్ట కదలి లావుమానసులు కదుపులం గొని ముందఱం బోనఁ బిఱుంద బండ్లును, బండ్ల జాడం దక్కిన ప్రజయును నడువందరుణ తరుణీ జనంబు లొండొరుల తోడి మేలంపుటాలాపంబులం బ్రమోదకరంబులగు వినోదంబుల నదటు మీఱి కడచి చనం బంగ్వంధ జరఠప్రముఖులు గ్రుస్సియోలాకు వడనెడ నెడం గావలియై తగువారు నడిపింప నవ్విధంబునం జని బృందావనంబు ప్రవేశించి యుచిత ప్రదేశంబులు నివేశంబులుఁగా నిరూపించి గోపాల ముఖ్యులు నిలువ నాక్షణంబ" హ. వ. I–6 23

ఇట్లు పరస్పరము ఆయత్త పఱచుకొని బయలుదేర చుండిరి. బండ్లను త్రొక్కించి, యాబండ్ల పైన బరువుల నెక్కించుట, దళ్ళను బూన్చుట, కావళ్ళయందు నేతి కుండ లుంచుట, క్రొత్త గోనియలందు పలురకముల వడ్లు, ప్రాలు పోసి మీఁద చాపలు మంచములను కట్టుట, ధామెనలు, తలుఁగులు, త్రాళ్ళు కవ్వములు, కొడవళులు, కత్తి మొదలగు సాధనములు చెడకుండ భద్రపఱచుట, ఎడ్ల నాయత్తము చేయుట, ముదుసళులను, ఆడువారిని, కంపమోపులను ముందఱ సంపుట – ఇవి పరస్పరము ప్రేరేపించుకొనుచు సంసిద్ధములగు పనులు.

ఇఁక వారు బయలుదేరు నపుడును నెంతో క్రమము ననుసరించు చుండువారు. లావుమానుసులు కదుపులఁ గొని ముందఱ నడచుచుండిరి. బలిష్ఠు లగువారు ముందుఁగా వెళ్ళుచుండుట – సరియైన రక్షణకై చేయునట్టి పని.

వారి వెనుకనే బండ్లు పోవుచుండును. ఆ బండ్ల వెనుక తక్కిన ప్రజ నడుచుచుందురు. తరుణ తరుణీమణుల కిదియొక యుత్సాహజనకమగు ప్రయాణము. కనుక, నానందముతో నొండొరుల మేలము లాడుచు, ప్రమోదావహ మగు వినోదము లతో మనము మీఱి నడచుచుండిరి. పంగులు, అంధులు, జరఠ ప్రముఖులు, – వీరు ఏ యాధారము లేక నడువఁజాలరు. కనుక కొంత బందు వీరికి రక్షకులై నడపించు

కొని పోవుచుండిరి. ఈ విధముగా బృందావనమును ప్రవేశించి, యుచిత ప్రదేశమున నివాసము నేర్పఱచుకొనిరి.

ఇది - ఎఱ్ఱయనాటి వలసపోవు విధానమును చక్కగా చిత్రించు చున్నది. ఆ కాలమునందును - చిరకాలమొక ప్రదేశమునందే నివసించుటచే గ్రాసవాసాదులకును పశుగ్రాసమునకును ఇబ్బంది కలుగు చుండెడిది. అప్పుడు క్రొత్తప్రదేశములకు వలస పోయెడివారు

దీనికి మూలము -

"నంద గోపో బృహద్వాక్యం బృహస్పతి రివావదత్
అద్యైవ నిశ్చయ ప్రాప్తిర్యది గంతవ్య మేవనః
శీఘ్రు మాజ్ఞాప్యతాం ఘోషః సజ్జీభవత మాచిరమ్
తతోఽవఘుష్యత తదా ఘోషే తత్ప్రాకృతైర్జనైః
శీఘ్రం గావః ప్రకల్ప్యంతాః భాండం సమభిరోప్యతామ్
వత్సయూధాని కాల్యంతాం యుజ్యంతాం శకటానిచ
వృందావన మితః స్థానాత్ నివేశాయచ గమ్యతామ్
తచ్ఛ్రుత్వా నంద గోపస్య వచనం సాధుభాషితమ్
ఉదతిష్ఠ ద్వ్రజ స్సర్వ శ్శీఘ్రం గమన లాలసః
ప్రయాహ్యుత్తిష్ఠ గచ్ఛామః కింశేషే యాహి యోజయ"

హ. వం. 9-9 నుండి 9-14 వరకు

ఇది మూలము నందలి వ్రజవాసుల కోలాహలము.

"వృషభముల కల్పింపుఁడు. భాండముల నెక్కింపుఁడు, వత్స యూధములను కూర్పుఁడు, శకటములను వినియోగింపుఁడు." - వంటి మాటలు మూలమున వినిపించుచున్నవి.

"ప్రయాహి" "ఉత్తిష్ఠ" "గచ్ఛామః" "కింశేషే" "యాహి" 'యోజయ' వంటి గమన సంరంభము మూలమున కన్పించుచున్నది. బయలుదేరుము, లెమ్ము, మనమందఱము వెళ్ళుచున్నాము. ఏమి నిద్రించుచున్నావా ? వెళ్ళుము. బండ్లను సమకూర్పుము ? వంటి సంరంభోత్సాహములు మూలము నందలివి. కాని, ఎఱ్ఱయ వర్ణనలోని క్రమబద్ధమగు రక్షణ వ్యవస్థ కట్టుదిట్టములు మూలమున కానరావు.

"బండ్లను మెట్టింపుము" "బరువుల నెక్కింపుము" దళ్ళను బూన్పుము" "నేతిపనఁటుల కావళ్ళ యందు నునుపుము" వంటి క్రమబద్ధమైన కార్యచోదనము ఎఱ్ఱయ హరివంశము నందలిది.

మొట్టమొదట బండ్లపై గడ్డివేసి త్రొక్కి సిద్ధమొనర్తురు. బరువుల ననంతరము కూర్తురు. పైన కప్పు - తాటియాకుల వంటి వానితో నీడకై యేర్పాటు చేయుదురు. అనంతరము భుజములపై కావళ్ళను సిద్ధ మొనర్చి అందు నేతిభాండముల నుంతురు. ఇట్లు ఎఱ్ఱయ గ్రామ ప్రజలు వలస పోవుటలు కనులారఁ గాంచి యుండును. క్రమబద్ధ మగుగ మన వ్యవస్థను పరిశీలించి యుండ వచ్చును. ఎఱ్ఱయ నాఁటి గ్రామీణ వలస యాత్రలు ఇట్టివేయై యుండవచ్చును.

మూలము నందలి పోడిపోడి యగు సంరంభము కంటెను క్రమ బద్ధమగు కార్యపటిష్ఠత ఎఱ్ఱయ హరివంశమున కనిపించుచున్నది. అచ్చట వ్యాఘ్ర ఘోషము వంటి మహా ఘోషలు - సాగరఘోషముల వంటి శుష్కములగు ఘోషలు వినిపించు చుండినవి. ఇచ్చట - 'పదిలంబుగా నేతి పనఁటులు, కావళ్ళ కట్టుఁడు' 'క్రొత్త గోనియలందు వడ్లు వోయుఁడు" "మీద చాపలు, మంచములు బలియఁగట్టుడు" అను పదార్థ రక్షణకైన కార్యవ్యగ్రతతోఁ గూడినట్టి ఘోషలు వినిపించుచున్నవి.

మూలమున —

'గోపీనాం గర్గరీభిశ్చ మూర్ధ్ని చోత్తంభితైర్ఘటైః
నిష్పాత వ్రజాత్పంక్తిః తారాపంక్తిరివాంబరాత్
నీల పీతారుణై స్తాసాం వస్త్రై రగ్రస్తనోచ్ఛ్రితైః
శక్రచాపాయతే పంక్తి ర్గోపీనాం మార్గగామినీ
దామినీ దామభారైశ్చ కేచిత్కాయావలంబిభిః
గోపా మార్గగతా భాంతి సావరోహా ఇవ ద్రుమాః
స వ్రజో వ్రజతా భాతి శకటౌఘేన భాస్వతా
పోతైః పవన విక్షిప్తైః నిష్పతద్భి రివార్ణవః
క్షణేన తద్వ్రజ స్థానం ఈరిణం సమపద్యత
ద్రవ్యావయవ నిర్ధూతం కీర్ణం వాయస మండలైః
తతః క్రమేణ ఘోషః స ప్రాప్తో బృందావనం వనమ్
నివేశవిపులం చక్రే గవాం చైవ హితాయచ"

హ. వి 9-15 నుండి 9-20 వరకు

మూలమున స్త్రీల వర్ణనయే అధికముగాఁగలదు. పలు వన్నెల పైవస్త్రము లతో నింద్ర ధనుస్సులవలె నుండిరని, తక్రభాండములను శిరమున ధరించిపోవుచు ఆకసము నుండి దిగివచ్చిన తారలవలె నుండిరనియు, పలువిధముల దామములను పైనవేసికొని నడచుచు, ఊడలతోఁ గూడిన వృక్షముల వలె నుండిరని స్త్రీల వర్ణనయే అధికముఁగాఁ గలదు కాని, అన్నిరంగము లందలి వారిని వర్ణింపలేదు. శకట సమూహములు వేగముగా పోవుచుండఁగా పవన వేగముతో వేగముగా పోవు జల పాతములతోఁ గూడిన సముద్రము వలె నుండిన దఁట! అంతియకాని, క్రమబద్ధముఁగా పోవునప్పటి పలు వన్నెల వారిభావములను, భిన్న వయస్సుల భిన్నావస్థలవారి మానసిక స్థితి, పోవు విధానమును మూలము నందు లేదు. ఎఱ్ఱయ వలసపోవు విధానములో –

దుర్బలులకు రక్షణ, పశుగ్రాసాదులకు భద్రత, యువతీ యువకులలో నుల్లాసము కన్పించుచున్నది.

బలిష్ఠులగు వారు ముమ్ముందు పోవుచుండుటచే చోరాది దుష్టులు చుట్టుముట్టఁ జాలరు. వారి వెన్కనే పశువులు, ధాన్యములతోఁ గూడిన బండ్లు తరలినచో వానికి సరియగు రక్షణ చేకూరును. అంగవిహీనులను జరాగ్రస్తులను, దుర్బలులను, నడిపించుచు, వారి బాగోగుల నరయుచు పోవువారు, ఎఱ్ఱయ హరివంశమున కనిపింతురు. అట్టివారు తప్పక ఉండవలయును కూడ – యువతీ యువకుల కిట్టి ప్రయాణము ఉల్లాస జనకములు. కావున వారు పరిహాసము లాడుకొనుచు, నవ్వుచు, త్రుళ్ళుచు వెళ్ళుచుందురు. ఇది ఎంతో సహజమగు వర్ణన.

ఇట్లు – ఎఱ్ఱయ హరివంశము నందలి గ్రామము – తరలుటలో నెంతో క్రమ బద్ధమగు వ్యవస్థ కానవగును. సర్వరంగము నందలి వారిస్థితి గతులు వర్ణింపఁ బడినవి.

మూలమున – ఒక క్షణకాలమున వ్రజభూమి ఊసరక్షేత్రమయి, ధాన్యముపై కాకులు మూగినవి. ఎఱ్ఱయ హరివంశమున నీ శ్లోకమున కనువాదము లేదు.

అట్లు వలస బయలుదేరిన వారు. పోయి పోయి ——

కం॥ "ఒక యామమాత్ర పఱపిది యని
సకల జనము చూడ నర్ధ చంద్రాకృతియై
శకటావళి విడియఁగఁ గడు
వికట స్థితి నెల్లవారు విడిసిరి గలయన్"

హ. వం. 1-6-24

ఈ విధముగా సకల జనులు చూచుచుండఁగా నర్ధచంద్రాకారమున నొక్క యామడ వైశాల్యమున విడియఁగా - అంత -

చ॥ గుడిసెలు వన్నియున్ ఘననికుంజము లిండులుఁగాఁగఁజొచ్చియున్
బెడఁగగు జొంపముల్గలిగి పేర్చిన మ్రాకుల క్రింద నుండియున్
గడఁక యెలర్ప దొడ్లకును గ్రంపలు వైచియు నొక్కనాటిలో
నడరఁగఁ బ్రాతకాపులయి రక్కడ గోపకుటుంబు లందఱున్"
హ. వం. 1-6-26

గుడిసెల నేర్పఱచుకొనిరి. ఘన నికుంజముల నిండ్లుగాఁ జేసికొని యందు ప్రవేశించిరి. దట్టములగు జొంపములు పేర్చిన మ్రాకుల క్రింద విడిసిరి. దొడ్లకు క్రంపలు కొట్టిరి. ఈ విధముగాఁ నొక్కనాఁటితో తమ తమ నివాసము లేర్పరచుకొని, యక్కడ గోపకుటుంబు లందరును ప్రాఁత కాపులయిరి. ఆనాఁడు గ్రామముల చుట్టును రక్షణకై క్రంపలు కొట్టుట గలదు.

ఈ వర్ణన ఎఱ్ఱయది. అతి సహజమైనది. ఇఁక నచ్చట నివాస మేర్పఱచుకొనిన తరువాత -

శా॥ శృంగారంబులు సేసి గోపికలు భాసిల్లంగ గోపాలురు
త్తుంగాంగంబులతోడ నెల్లకడలం బ్రుళ్ళంగ గోబృందముల్
మాంగల్యాకృతిఁ గ్రాల నెంతయును సామగ్ర్యంబునం బంధులు
పొంగంబల్లె సముజ్జ్వలోత్సవములం బొంగారె నానాటికిన్".
హ. వ. I-6-27

గోపికల శృంగారము, గోపాలు రుత్తుంగాంగంబులతో భాసిల్లుట, గోబృందములు మాంగల్యాకృతితో నొప్పుట, బంధువులు సమృద్ధిగా నుప్పొంగుట - ఇట్లు పల్లె దినదినము పొంగారుట గలదు.

ఇట్లు వలసపోయి నూతన గ్రామములలో క్రమముగా స్థిరపడి పోవుట - ఎఱ్ఱయ వర్ణన.

ఇఁక మూలమున -

తతః క్రమేణ ఘోషస్సః ప్రాప్తో బృందావనం వనం
నివేశం విపులం చక్రే గవాంచైవ హితాయచ

శకటావర్త పర్యంతం చంద్రార్ధాకార సంస్థితమ్
మధ్యే యోజన విస్తీర్ణం తావద్ద్విగుణ మాయతమ్
కంటకీభిః ప్రవృద్ధాభి స్తథా కంటకితద్రుమైః
నిఖాతోచ్ఛ్రిత శాఖాగ్రై రభిగుప్తం సమంతతః
మంథై రారోప్యమాణైశ్చ మంథ బంధాను కర్షణైః
అద్భిః ప్రక్షాళ్యమానాభి ర్గర్గరీభి రితస్తతః
కీలై రారోప్యమాణైశ్చ దామనీ పాశపాశితైః
స్తంభనీభిః ధృతాభిశ్చ శకటైః పరివర్తితైః

హ. వి 9-20 నుండి 9-24 వరకు

"యోజన విస్తీర్ణమును, రెండుయోజనముల పొడవును, గలిగిన ప్రదేశమున అర్ధచంద్రాకారముగా విడిసిరి ఇదిమూలము-దీనిని సవరించి, ఎఱ్ఱయ ఒక్క యామడ వైశాల్యము అని దీర్ఘ చతురస్రమును చతురస్రము గావించినాఁడు. అపుడే అర్ధచంద్రాకారముగా విడియుట సరిపోవును. చంద్రుఁడు సంపూర్ణ వృత్తము. ఆవృత్తము నర్ధచంద్రాకారము గావింప వలయుననిన అది చతురస్రమునందే సరిపోఁగలదు. కాని యోజన విస్తీర్ణము రెండు యోజనముల పొడవుగలది - ఆ వైశాల్యము దీర్ఘచతురస్రము కాని, చతురస్రము కాఁజాలదు. ఇట్టితి సూక్ష్మాంశములను గూడ పరికించి అనువాదమును సమకూర్చుకొని పోవువాఁడు ఎఱ్ఱయ.

మూలమున - కంటకాగ్ర శాఖలను కంటకిత వృక్షములను నాఁటి తమ ప్రదేశములను సురక్షిత మొనర్చుకొనిరి దధి మథనమునకై రజ్జువు నాకర్షించుచుండిరి. మజ్జిగ కుండలను కడుగుచుండిరి గుంజలు పాతువ రొకచోట - అనేక స్తంభములను పలుచోట్ల నాటువారు - ఉండిరి.

బండ్లను గిరగిర త్రిప్పువారు కొందఱు, మథించుటకై పాత్రను, రజ్జువును వారొకవైపున నుండిరి.

"స్తంభనీభి ర్ధృతాభిశ్చ శకటైః పరివర్తితైః
నియోగ పాశై రాసక్తై గర్గరీ స్తంభ మూర్ధసు
ఛాదనార్థం ప్రకీర్ణైశ్చ కటకై స్తృణ సంకటైః
శాఖావిటంకై ర్వృక్షాణాం క్రియమాణై రితస్తతః

శోధ్యమానై ర్గవాం స్థానైః స్థాప్యమానై రులూఖలైః
ప్రాఙ్ముఖైః నిచ్యమానైశ్చ సందీప్య ద్భిశ్చ పావకైః
సవత్స చర్మాస్తరణైః పర్యంకైశ్చావరోపితైః
తోయముత్తారయ న్తీభిః ప్రేక్ష న్తీ భిశ్చతద్వనమ్
శాఖాశ్చాకర్షమాణాభిః గోపీ భిశ్చ సమ న్తతః
యువభి స్థవిరైశ్చైవ గోపైర్వ్యగ్ర కరైర్భృశమ్
విశసద్భిః కుఠారైశ్చ కాష్ఠాన్యపి తరూనపి
"తద్వ్రజ స్థాన మధికం శుశుభే కాననావృతమ్
రమ్యం వన నివేశం వై స్వాదుమూల ఫలోదకమ్"

హ. వ. 9-25 నుండి 9-29 వరకు

మూలము నందలి వ్రజవాసులింత కార్యవ్యగ్రతను చూపుచున్నను - ఎఱ్ఱయ వ్రజవాసుల సంరంభ మాదిలో పటిష్టమై, నిర్దిష్ట స్థానమును చేరు వఱకు క్రమశిక్ష ణలో నుండి, చేరిన తరువాత నొకటి రెండు పద్యములలో ముగిసిపోయినది.

పురిటి పాపను, శ్రీకృష్ణుని తొట్టెలో పరుండఁ బెట్టుకొని వచ్చు నందుఁడు గ్రామవైభవమును విస్తృతముగా నిరీక్షించి నాఁడు. వలస బయలుదేరు నపుడు నందుని యాజ్ఞఁగొని, వ్రజవాసులు దళ్ళను బూన్చి, కావళ్ళనునిచి, తలుగులు, త్రాళ్ళు బంధించి, నేతి పనఁటుల నెత్తికొని, ధాన్యమును కట్టి - మిక్కిలి జాగ్రత్తగా బయలుదేరినారు. అదొక విస్తృత వర్ణన యైనది. తిరిగి అంతే విశాలముగా గ్రామ నిర్మాణ వైభవమును వర్ణించిన పాఠకులకు విసుఁగు జనింపవచ్చు ననుకొని గ్రామీణ వర్ణనల పఠించుపట్ల వైముఖ్య మేర్పడ వచ్చునని, ఆ కార్యమును పూర్తిగా విసర్జించి ఎఱ్ఱయ ఒక్కపద్యములో వారచ్చట నెలకొన్న వైనమును చెప్పివదలినాఁడు. పునరుక్తి కాఁగలదని, కావ్యత్వహాని సంభవింప వచ్చునని - ఈ పై "కంటకభి" నుండి "ఫలోదకమ్" వఱకును గల వానిని పూర్తిగా అనువదించక వదలినాఁడు. వారు గావించిన కార్యక్రమ సారమంతయు నొక్కపద్యములో చెప్పి ముగించినాఁడు.

"గుడిసెలు వన్నియల్ ఘన నికుంజము లిండులు గాఁగ"

"ఒక్కనాటిలో నొనరఁగఁ బ్రాతకాపులయి" రని సంక్షేపముగా వా రేర్పఱచు కొనిన సౌకర్యములను చెప్పి పాఠకుల యూహకే వదలినాఁడు. అట్లుగాక -

కంటకిత వృక్షముల స్థాపించుటలు, ఉలూఖలముల నేర్పఱచుటయు, పూర్వాభిముఖముగా నడుగుట, అగ్నిహోత్రముల కల్పించుట, చనిపోయిన దూడల చర్మములతో చేయఁబడిన పడుపులను దింపుకొనుట, వృక్షశాఖల నీడ్చుట, మజ్జిగ కుండలను కడుగుట, గుంజలను పాతుట, త్రాళ్ళుకట్టుట – వంటి దినచర్యల–కార్యక్రమముల నాటా కావ్య శిల్పమున కేమాత్రమును మెఱుఁగులు దిద్దజాలవని ఎఱ్ఱయ ఆ శ్లోకములను పూర్తిఁగా పరిహరించినాఁడు.

ఎఱ్ఱయ హరివంశమున నొక్క పద్యములో "ఒనరంగఁ బ్రాతకాపులయిరి" "గదిసెలు వన్నెయును, ఘన నికుంజములను ఇండ్లుఁగా జేసికొని, దట్టమగు జొంపములు పేర్చిన మ్రాకుల క్రింద విడిసిరి. దొడ్లకు కంపలు కొట్టి ప్రాతకాపులయిరి. గోపికలు శృంగారంబుల సేసికొనుట, గోపాలుర ఉత్తుంగాంగములతో నెల్లయెడలఁ గ్రుక్కుచుండుట, గోబృందములు మాంగల్యాకృతిఁ గ్రాలుట – బంధువు లుప్పొంగుట వంటివే ఎఱ్ఱయ వర్ణనలు.

వారప్పుడే తమ గ్రామమును సర్వ సమృద్ధమైన దానిఁగా, సర్వసాధన సంపూర్ణమైన దానిఁగా, జేసికొనిరని చెప్పకయే తెలియుచున్నది. ఇందు ఎఱ్ఱయ హరివంశమునందు వారి గ్రామ సౌకర్యములు వ్యంజితములైనవి. కాని మూలమునందలి దినచర్యల పట్టికను తొలఁగించినాఁడు.

తరువాత –

కం॥ శ్వేతుకరుఁడై హరి, దమ
నేమరక ప్రయోజనము లెల్లనడుపఁగా
శ్రీమంతులై రి మిగులఁగ
నామందం గలుఁగు గోవులందరు దోడ్లోన్

హ. వ 1-6-28

అను దానికి మూలము నాలుఁగు శ్లోకములు. —

"పూర్వమేవతు కృష్ణేన గవాం వైహిత కారిణా
శివేన మనసా దృష్టం తద్వనం వన చారిణా
పశ్చిమేతు తతోరూక్షే ఘర్మమాసే నిరామయే
వర్షతీ వామృతం దేవే తృణం తత్ర వ్యవర్థత

నతత్ర వత్సాస్సీదంతి నగావో నేతరే జనాః
యత్ర తిష్ఠతి లోకానాం భవాయ మధుసూదనః
తాశ్చగాః స్న ఘోషస్తు సచసం కర్షణోయువా
కృష్ణేన విహితం వాసం తమధ్యాసత నిర్వృతాః"

హ. వ. 10-32 నుండి 10-35 వరకు

అను నాలుగు శ్లోకముల సారమును ఒక్క పద్యమునఁ జొప్పించినాఁడు - ఎఱ్ఱయ.

గోవులకు హితకారి, వనచారియగు శ్రీకృష్ణుఁడు క్షేమము నాశంసించుచుండ వత్సములు గాని గోవులుగాని, జనసందోహముగాని ఎట్టి వినాశమును పొందుట లేదు - అని మూలము నందలి నాల్గు శ్లోకముల సారమును ఒకపద్యమున చొప్పించి సంక్షేపించి, పాఠకుల యూహకే వదిలినాఁడు - ఎఱ్ఱయ

హరి క్షేమం కరుఁడై తమ్ము నేమఱక కాపాడుచున్నాఁడు. తమ ప్రయోజనముల నరయుచున్నాఁడు. ఆ మందంగల గోపులందఱును క్రమముగా శ్రీమంతులైరి. అని వారి వైభవమును వ్యంగ్యముగాఁ జెప్పినాఁడు.

మూలములోని వివరణ పూర్వకములగు వాక్య విన్యాసమును, సంక్షిప్తమగు సూహ్యమానయుత వాక్య వైభవముగా మార్చినాఁడు.

ఈ విధముగా గ్రామవాసులు చిరకాల మొక్కచోటనుండి గ్రాసవాసముల కిబ్బంది కలిగినపుడు వలసపోవుట - నూతన గ్రామ నిర్మాణము గావించుకొనుట, క్రమక్రమాభివృద్ధిని పొందుట, అనాదిగా వచ్చుచుండు అభ్యాసము. ఇది ఎఱ్ఱయ నాటికిని పరిపాటియై యుండవచ్చును. దానిని అనుభవించి పరిశీలించిన ఎఱ్ఱయ లేఖినికి సన్నివేశము అబ్బినంతనే సంపూర్ణముగ చిత్రించి యుండవచ్చును. మూలమును మార్చి కూర్చి, సవరించి వ్రాయుటకు మార్గమై యుండవచ్చును.

అప్పుడప్పుడు పల్లెలలో సామూహికముగా, 'మారి' మొదలగు రోగములు సంభవించుటయును గలదు. కొన్ని వ్యాధులు పశువులలో ప్రారంభించి ప్రజలలో ప్రవేశించి, వారిని నాశము గావించుటయును గలదు.

అట్టివే వారు పడిన బాధలు హరివంశమునఁ గాంచవచ్చును. ఒకసారి -

పార్శ్వము లందు నెత్తురు ప్రవహింపఁ జొచ్చినది. కొన్ని అతిసార బాధచే గ్రేవులు చిక్కిపోగా తునిసి పడునేమో యనునంత దుర్దశకు వచ్చినవి.

పశువులకు వరిడి, పప్పు, కప్పును, వావురు, కడుపూద, అదుచు, త్రిక్క - మొదలగు తెవుళ తెన్నియో తగిలి యెంతయును ఉగ్రముగా బాధించినవి. ఎఱ్ఱయకు పశువుల రోగి విషయము చక్కగా తెలియునని తెలియు చున్నది. వాని పేర్లు, పేర్లతోఁ గూడ లక్షణములఁ దెలుపుట - ఇందలి విశేషము. అప్పటి వాని దశ వర్ణించుట సూక్ష్మ పరిశీలనము. అప్పుడు వయోవృద్ధులగు గోపాలురు - అనుభవస్థులు కావున మంత్రములచేతను, ఔషధములచేతను, తత్ప్రతీకారమును గావించు చుండుటయును గలదు.

వ॥ "అంతయు నుపలక్షించి వయోవృద్ధులగు గోపాలురు మంత్రములఁ నౌషధంబుల నగ్ని కర్మాదులం దత్ప్రతికారం బుపక్రమించి, యవి యన్నియును నిష్ఫలంబులైనం జేష్ట దక్కి నిలిచిరి. యమునా తీరాకాననములం జరియించు ప్రాణులు, మృగపక్షి సర్పాదులు సూక్ష్మజంతువులు లోనుగా వివిధవ్యాధి పీడితంబు లయి మృగ కల్పములగుచు వచ్చె, నట్లు దొడఁగిన యుపద్రవంబు లంత నిలుపక గోప ప్రకరంబులయందును ప్రవేశించిన" -

హ. వం. 1-6-47

గోపాలురను వ్యాధిగ్రస్తులై బాధపడుచుండు వారు. ఇది మూలమునలేసి వర్ణన. పశువుల రోగబాధలు, గోపాలుర రోగములు, వృద్ధులు శాంతిఁ గావించుటలు, ఈ ఘట్టమంతయును మూలమునలేని ఎఱ్ఱయ వర్ణన.

అపుడు గోపాలుర దశ -

సీ॥ జ్వర వేగమునఁ దూలి పొరలిరి కొందఱు
సందు సందులు సొచ్చి చదిసి పడిరి
కొందఱు వెసరోమ కూపంబు లన్నియు
నవిసి నెత్తురుఁగార నవయువములు
చీములు గట్టంగ శీర్ణంబులై దంత
ములు గడలంగ నెమ్ములు నొగులఁగఁ
గంద జిహ్వాధర ఘ్రాణ కర్ణంబులు
పొక్కులై యేర్పఁర నొక్కఁడైనఁ

ఆ॥ వె॥ ద్రావఁదడువ లేక తలచీర లెఱుఁగక
యార్తులైరి కొంద అంత వట్టు
గోప మందిరములు కుష్ఠ దుర్గంధమ
యంబు లయ్యె వికృతి యగ్గలింప. హ. వ 1-6-48

అప్పుడు నరుల - గోవుల - మృగముల రోగములతో గూడిన యార్తనాదము దిగంతములందంతట విజృంభించినది. యమునా నదీ విపినములందంతట ఆర్తనాదము మిన్నంటినది. జ్వరవేగమున తూలి పొరలుట, సందు సందులఁజొచ్చి నడువలేక నలిఁగి పడుట, రోమకూపము లవిసి నెత్తురు కార నవయవములు చీములు గట్టుట - శీర్ణములై దంతములు కదలుట - ఎమ్ములు నొప్పిపడుట - కంఠము, జిహ్వ, అధరము, ఘ్రాణము, కర్ణములు - వీనియందు పొక్కు లేర్పడుట. - ఈ బాధలు పశువుల రోగముల బాధలు. ఆ పశువుల రోగములు, నరులకు తగులుకొని వారు నానాబాధలు పడుటయును గలదు.

ఇట్లు పశు సమాజము, ప్రజలు రోగపీడితులైనపుడు - ఆవ్యాధి తమ్ము పీడించుచున్నను, నందుని వంటి నాయకులు ప్రజలకు బాసటగా నిల్చి వారి కష్టములను తమవిగా భావించి బాధా నివృత్తికై యత్నించుటయు గలదు. అందుకే - నందుఁడు -

తే॥ గీ॥ ఏను బుట్టంపుఁ జెలులును నెందు వోదు
మిచ్చటన యుండఁగా నేమి వచ్చినేని
ననుభవింతము గాకని చనక నిలిచె
నంద గోపుఁడు దానును సుందరియును" హ. వ. 1-6-51

ఇట్లు ప్రజలందఱును నాయకునితోపాటు సామూహిక సహనముతో కష్ట నష్టములను, సుఖ సంతోషములను సమముగా పంచుకొనుచుండిరి. పురుషకారము వ్యర్థమైనపుడు - భగవంతు నాశ్రయించుట - భారతీయుల జన్మసిద్ధ గుణము. కనుక నాసమయమున గోపవృద్ధుఁడొకండు లేచి - కూడం బిలిచి -

సీ॥ పశుసమాశ్రయమున బ్రదుకు చున్నారము
మనము తత్పశు సంఘమునకుఁ బ్రభుడు
వృషకేతనుండగు విషకంఠుఁ డద్దేవుం
డటఁగాన సద్భక్తి నమ్మహాత్ము

నర్చింపఁగా శాంతి యగు నెల్లవిధముల
వేద పారగులైన విప్రవరులఁ
బిలిపించి శాస్త్ర సంభృతయుక్తి కల్పిత
మార్గంబుతో దేవ మందిరమున.

తే॥ గీ॥ దోఁడఁగు డీ యనుష్ఠానంబు జడత యుడిగి
యనిరఁ గులవృద్ధు మాటకు నాత్మలందుఁ
దద్ద విశ్వాస మొలయంగఁ దక్షిణంబ
గోపులెల్లను దగు వస్తుకోటిఁ గూర్చి. హ. వ 1-6-54

పూజాది కార్యములు గావింప కుల వృద్ధు లాదేశింతురు. అట్టి పెద్దల యాదేశమును కాదనక గ్రామప్రజ లందఱును శిరసావహింతురు

శాంతి గావించుట, పూజలు, జాతరలు - ఇట్టివి మానసిక శాంతిని, తద్వారా శరీర సౌఖ్యమును నొసంగునని భారతీయుల నమ్మకము.

ఇది మూలమునలేని ఎఱ్ఱయ విశ్వాస ప్రదర్శన. ఎఱ్ఱయ నాటి గ్రామీణులు గ్రామ వృద్ధుల యాదేశములను శిరసావహించుట, వ్యసనములు వచ్చినపుడు, రోగాది దుఃఖములు సంభవించినప్పుడు అందఱును గుమ్మిఁ గూడుట - ఆ కష్టమును తొలఁగించు కొనుటకు కలసి యాలోచించుకొనుట, అట్టి యాలోచనలలో వృద్ధులు, అనుభవజ్ఞులును చెప్పిన ఆదేశములను శిరసా వహించుట - అనాదిగా వచ్చెడి యాచారము కనుకనే మూలమున లేని యీ సన్నివేశమును సమకూర్చినాడు ఎఱ్ఱయ.

ఇఁక నా గోపాలకులు, రోగశాంతికై గావించిన శివపూజా వ్రత విధానమును గాంచిన - నాటి పూజా విధానము లెట్లుండెడివో అవగత మగుచున్నది.

వ॥ శివభక్తియుఁ దదీయ తంత్ర జ్ఞానంబును, దదాచార ధుర్యతయుం గల యార్య ద్విజోత్తములఁ బ్రార్థించి, తత్క్రియా నిర్వహణంబునకు నియోగించిన నమ్మహాత్ములు విహితోపవాస నియమ సమాహితులై తత్సమీప స్థితంబగు శుద్ధ స్థానంబు నందు —

తే॥ గీ॥ ఎలమి బుత్విక్కులను వరియించి కుండ
మండలో దారపూర్వక మహిత తంత్ర

మఱి కోయంబున్ గ్రవ్యంబు లందు శుద్ధి
చేయ నధివాస నాదులఁ దొలుతఁ జేసి
పంచామృతంబులఁ బంచ గవ్యంబుల
 విమలోదకంబులఁ గ్రమము తోడ
నభిషేక మొనరించి యఖిలేశ్వరుని సమం
 చితగంధ సమితి నర్చితునిఁ జేసి
భూరి సౌరభ చారు పుష్ప దామంబులఁ
 బూజించి బహువిధ స్ఫురిత ధూప
తతి యిచ్చి కపిలాఘృత ప్లుత వర్తికా
 రమ్య దీపముల నారతు లమర్చి

హ. వ. 1-6-56

భక్ష్య భోజ్య లేహ్య పానీయ బహువిధనై
వేద్యములు ఘటించి హృద్య లీల
నివలు సేలు నట్లు పరిచర్య నడుపుచుఁ
గొలిచి రేఁడు దివసములు గ్రమమున

హ. వ. 1-6-57

తఁగ నిప్పగిదినిఁ దప్పక
నగజా స్కందేశ వృషభ నందీశుల, స
ర్వగుణాఢ్యు వినాయకుఁ
బ్రగుణార్చనముల భజించి భావించి రెదన్.

హ. వ. 1-6-58

ఉత్తమంబగు శివమూర్తి యుత్తమాంగ
మున నతి స్థూల ఘృతధార లనవరతము
దొరఁగు చుండెను మూఁడు నధ్వర దినంబు
లన్నిఁటను విప్రవిహిత ప్రయత్న నిష్ఠ"

హ. వ. 1-6-59

వ॥ అగ్ని ప్రతిష్ఠ గావించి, ఋత్విజులు వాగీశ్వర సంభూతంబగు శివాలయంబు నందు శివసంహితా మంత్రంబుల నాజ్యపాయసా పూప ప్రముఖంబుల హోమించి రయ్యాయి విధంబుల నెల్లవారును మృత్యు పరిహారకంబులగు మంత్ర పఠనంబులు, శాంతి ప్రదంబులగు కళ్యాణ ధ్యానంబులును, ననుష్ఠించు చుండిరి."

హ. వ. 1-6-60

"పరమేశ్వరు ముందఱం గొందఱు భ్రూ విక్షేపంబుల నక్షివివర్తనంబులం జరణ తాళంబుల, హస్త విన్యాసంబుల నతి మనోహరంబును, కుతూహలావహంబును నగు భక్త్యావేశ నర్తనంబు ప్రవర్తించి, ప్రదక్షిణ ప్రణామాదు లొనరించి రిట్లుండ నేఁడవు నాటి మధ్యాహ్న సమయంబు నందు."

అనాఁటి పూజా విధాన మిది. ఈ పూజావిధానము మూలమునలేదు. ఎఱ్ఱయ నాటి పూజావిధానమిది.

గ్రామములందు అరిష్టములు సంభవించినపుడు వృద్ధుల ఆదేశానుసారము శాంతి పూజలు గావించుచుండిరి. అందు శివపూజా విధాన మిట్లుండును.

ఋత్విజులను వరించుట యొక కార్యక్రమము. కుండ మండలములు గావించుట - ఒక మండలమునందు హోమ కుండమును నిర్దిష్ట పరిమాణమున నిర్మించుట ఒక కార్య క్రమము. ద్రవ్య శుద్ధి - పూజావిధానము నందు మఱొక భాగము.

పంచామృతము, పంచ గవ్యము, విమలోదకములు - వీనితో నఖిలేశ్వరునిఁ గ్రమముగా నభిషేక మొనరించుట - సముంచిత గంధ సమితి నర్చితునిఁ గావించుట- మిక్కిలి పరిమళము గలిగిన పుష్పదామములతోఁ బూజించుట - బహువిధ ధూపములు - కపిలగోవు ఘృతముతో నిక్తములైన వర్తికలతో దీపములు - అరతులమర్చుట - ఇవి పూజలో మఱొక భాగము.

భక్ష్య, భోజ్య, లేహ్య, పానీయములు, బహువిధములు - నైవేద్యము సమర్పించుట - ఇట్లు రాత్రిం బవళ్ళను ఏడు దివసములు గావింతురు.

అగజాస్కందులను, వృషభ నందీశులను, వినాయకుని అర్చించి, భావించుట - శివమూర్తియుత్తమాంగమున - అనవరత ఘృత ధారా సమర్పణలు - ఈ విధముగా శివపూజ గావించు విధానము ననుసరించు చుండిరని తెలియుచున్నది. హోమములు, మృత్యుపరిహారక మంత్ర జపములు, ఉపద్రవ శమనకారులగు మహా

ఇవి మంత్ర స్తోత్ర పఠనములు – శాంతి ప్రదములగు కల్యాణ ధ్యానములు – ఇవి ఆ పూజలోని మఱొక భాగము

ప్రాంగణమున నర్తనలు, ప్రదక్షిణ ప్రణామాదులు, పూజా సమయమున గానించు మఱి కొన్ని విధులు. శివసంహితా మంత్రములు, ఆజ్యపాయసాపూప పదార్థములచే హోమము.

ఇట్లతి భక్తితో సప్తవాసరము అతిభక్తి పూజింపఁగా వారి కార్యసాధనకు సూచనలు గలుగు చుండినవి. దేవతలో, భూతములో – ఆవేశించి వారి ఆర్తి నాశము నకై ఆదేశము లిచ్చుచుండినవి.

అప్పుడు ఎఱ్ఱయ హరివంశమున —

శా॥ "ఆ విప్రావళిలోన వేదముల వేదాంగంబులం గోవిదుం
డైన ట్టిల్లు మహాద్విజుండొకఁడు భూతావేశముం బొంది తీ
వ్రావష్టంభముతోడ నొత్తిలి మహాహాసంబుఁగావించుచు
న్దేవోన్నతి యెలర్పఁ బాడుచును నర్తించెం గఠోరంబుగన్

హ. వ 1-6-61

తే॥ గీ॥ అతనిఁజూచి యచటి విప్రులంత వట్టు
వారు నిది యేమియొయని భూరి విస్మ
యంబుఁ బొందంగ వృత్త గీతానసాన
మున నతండిట్టులను సభ్య జనముతోడ."

హ. వ. 1-6-62

వేద వేదాంగ వేత్తయగు నొక విప్రుఁడు భూతావేశమునుఁ బొందినాఁడు. అట్లు భూతావేశము నెవరో యొకరు పొందుట, అట్లావేశించిన భూతములు కార్యసాధన మార్గములు తెలుపుట జరుగుచుండెడిది భూతావిష్టులు వికటాట్టహాసము చేయుటలు – పాడుటలు – కఠోరముగ నర్తించుటలు – తదితరులు వారి చేష్టలఁజూచి యాశ్చర్య పడుటలు – భక్తిభావముతో వారి వాక్కుల నాలకించుటలు – జరుగు చుండెడివి.

ఆ విప్రుఁడు – విరోచన తనయుఁడగు దైత్యుఁడు కపిత్థ వృక్ష రూపమున విషోత్కట విషపాశి యెసఁగ, కాళిందీ దక్షిణ తీరమున జనించినాఁడనియు – నాతని పిదప వెంటనున్న విషకంటక వృక్షములై చుట్టును జనించినారనియు. నాతని

భార్యలు గోవులై పొదలిరనియు, నవ్వేలఁగ మ్రాను పుట్టి పంద్రెండేండ్లకు పూచి, ఫలియించు ననియు, నా ఫలముల నాగోవులు భక్షించు చుండు ననియు, గలదు. అవ్విధం బిప్పుడు జరుగుచున్నది. ఆ విషవృక్ష గంధముచే జనంబులకు నానావిధ రోగబాధలు జనించినవి. ఆ సరిజ్జలమును దోషభూయిష్ఠమైనది. ప్రేపల్లె తత్సమీపము నందుండుటచే నింతపుట్టె. నంద గోప సూనుండగు కృష్ణుండును, బలదేవుండును, నవ్విష భూజంబును భజింప నోపుదురు" అని పలికి భూతము విడిచి పోయినది ఇట్టివే ఆనాటి పూనకములు - భూతావేశములు.

దేవతలఁ పూని, యెవరి యందో ప్రవేశించి, చెప్పుట - వారట్లు చెప్పిన దానిని ప్రజలు నమ్మి ఆచరించుటలు-గ్రామములలోని ఆనాఁటి ప్రజల ప్రబల విశ్వాసములు.

ఇది మూలమునలేని ఎఱ్ఱయ గ్రామీణ చిత్రణ. గ్రామముల లోని జాతరలు, పూజలు, బలులు, శాంతి కార్యక్రమములు, భూతములావేశించి, ఆదేశించుటలు - అనాదిగా భారతీయ గ్రామీణు లాదరించు ఆచారములు - విశ్వాసములు.

## గ్రామము నందలి బాలుర క్రీడలు

ఒకపరి గ్రామీణ బాలకులు, చేరువ పొలము లందు చిఱుత కూశఁటులు దూఁగాడుచుండఁగా తిరుగు చుందురు చెలఁగోలలు చేతఁ బట్టి చల్ది చిక్కముల గ్రహించి పాఱుచుందురు.

ఒక యెడ వృకముల తోలి కూతలిడుదురు. వృక్షాగ్రముల కెగఁబ్రాకుదురు జున్నులు రేపి, గోపబాలురకు తేనెను బోయుదురు. మధురాన్నములచే భోజనము చేయుదురు. కిఱ్ఱు చెప్పులను ధరించువారు. మాసిన గోచి గట్టి సకల మనోహర ఖేలన రసమున తేలియాడుదురు. చేరువ నదులలో, చెఱువులలో నీదుచుందురు. ఇవి వారి క్రీడా విశేషములు.

హరివంశమున శ్రీకృష్ణ బలరాములు —

తమఁబోడు గోపబాలకులంగూడి యాడ వత్స సముదాయ పాలనంబుల వినోదంబుఁగా ప్రమోదింపఁ దొడంగిరి. అమ్మహోత్సవ సమయంబున —

హ. వ. 1-5-254

తే॥ గీ॥ చిఱుత కూఁకట్లు దూఁగాడఁ జేతి చల్ది
చిక్కములు సెలగోలలు చెలువు మిగులఁ
గిఱ్ఱు చెప్పులు దొడినున్న గఱ్ఱ-తడువు
తెలమితోఁ గట్టి చేరువ పొలము లందు.

హ: వ. 1-5-255

చ॥ వృకములఁ దోలియార్చుచును వేడ్కఁ బాడుచుఁ గూఁతవైచుచుం
బ్రకట మహీరుహాగ్రములు ప్రాకుచు జున్నులు రేఁచి తేనె గో
షకులకుఁ బోయుచు న్మధుర భక్తముచే కళులారగించుచు
న్నకల మనోజ్ఞ ఖేలన రసంబునఁ దేలిరి బాలయాదవుల్"

హ. వ. 1-5-256

ఆనాఁటి బాలురకు చిఱుత కూఁకటులు వ్రేలాడు చుండినవి చేత చల్ది చిక్కము సెల గోలలు, కాలియందు కిఱ్ఱు చెప్పులు, బిళ్ళగోచి, — ఇది ఆనాఁటి బాలుర — గ్రామీణ బాలుర ఆకార విశేషము. చేలవెంబడి, గట్లవెంబడి, పసుగిలిడు చుందురు. అప్పుడు వృకాదులు కనిపించిన తోలి కూఁతలు పెట్టుచుందురు.

ఒకపరి యాదవులు యమునా నదితీరమున విహరించు చున్నారు.

శ్రీకృష్ణుఁడు గోపాళితో —

సీ॥ "ఒండొండ యిద్దరి నుండి యుద్దరి దాఁక
నీఁదారు పురుడున నీఁది యీఁది,
మునిఁగి లోలోనన చని దవ్వుదవ్వుల
ననువున నెగసి పెల్లార్చి, యార్చి,
కడఁ గానరాని పెన్మడువులఁ బఱతెంచి
యుతికి వేకడుఁ దేలి మెఱసి మెఱసి
యొండొరుఁ బేర్కొని మోలమోలని రేఁచి
యదటునఁ జల్లు పోరాఁడి యాడి

ఆ॥ వె॥ వాద్య భంగము జలము వాయించి వాయించి
పాడి పాడి కెరలి యాడి యాడి

తనిసి మూఁడు జాల తఱి ప్రొద్దొకించుక
చల్లవడిన నల్ల నల్ల వెడలి." హ. వ 1-6-101

– ఇది నీటిలో నీఁదులాడు నప్పటి చక్కని చిత్రరచన. ఈదరి నుండి ఆదరి వఱకు నీదుచుఁ బోవుచుందురు. లోలోననే మునిఁగిపోయి, యీదుచు చాల దూరము వఱకు కనిపించక హఠాత్తు గా మఱెక్కడనో తేలుటయు సీతలోని వైవిధ్యమే ! గట్టిగా కేక లిడుచు పెద్దమడువులోని కుఱికి శీఘ్రముగా దేలుట ఈతలోని విధానమే !

ఒకరి నొకరి పేర్కొంచు, 'ఓలయో' లని విజృంభించు చుందురు. నీటి జల్లులతో నాడు కొందురు. జలమును వాద్యము వలె వాయించు చుందురు. పాడుదురు. కెరలి యాడుదురు. ఇట్లు చిరకాలమునుండి తృప్తిగా నీది యీది – చల్లఁ బడిన తరువాత నీటినుండి బయటికి వత్తురు.

ఇట్లు గోపాలురు సాయంకాలము వఱకు నచ్చటనే నదీతీరమునఁ గడపి పల్లె చేరుకొనుటఁ జూడ ఆనాటి గ్రామీణ బాలురు చేరువ పొలములయందు ఆడుచు, నదీ తీరములందు విహరించుచు, నదులం దీదుచు – క్రీడాకుశలురై యుండుటను – ఎఱ్ఱయ గాంచి, రచించి యుండవచ్చునని తెలియుచున్నది.

తరువాత –

వ॥ గోపాలురు శ్రీకృష్ణపాలనంబు గనిన వారు గావున భామ లలరి బరిధానా దుల నలంకృతలై, మనోజ్ఞ వేషంబులతో నిలిచి రయ్యెడు కుమారు లిద్దఱు నటమున్న తల్లులు పుత్తేరఁ బరిచారకులచేత నుపనీతంబులైన ధౌతాంబర ప్రముఖ పరిష్కారం బులు గైకొని రప్పుడు పుత్రుని విచిత్ర విక్రమోత్సవంబునకు నానందించి నదుం డాయత్తంబు సేయించిన చతుర్విధాన్నంబులు – గొని గోపకుటుంబినులును దారక దారికా సహితంబుఁగాఁ జనుదెంచినం దత్ప్రయత్నంబున –

తే॥ గీ॥ సముచిత ప్రవేశంబున జలజ నాభుఁ
డగ్రజుం డగ్రపాతంబు నందు నిలువఁ
దానుఁ బెద్దలుఁ జెలికాండ్రుఁ దగఁగ నార
గించి తాంబూలములు గొని మించి రోలమి.

హ. వ 1-5-102

వ॥ కొంతొకసేపు విశ్రమంబు నొంది తదనంతరంబ సముత్థితుండై కదలి లోకక్షేమకరంబులగు శకునంబులు గనుంగొనుచుం దద్ధులవ్విధం బభినందింపం జనుం దెంచె నప్పు డొండొరులం గౌగలించుచుం బరువులు వెట్టుచుం దాయుచు నెలుంగెత్తి నవ్వుచుం బాడుచు వేణు వీణాధ్వని మిశ్రమంబుగాం బడుపటహ ధ్వని వాద్య వాదనంబు లొనర్చుచు గోపాలు రాలోక నీయంబులగు సమ్మోద సంభ్రమంబుల నొప్పి యప్పురుషోత్తము నుందఱుం భిఱుందునుం బౌర్యంబులను దత్పౌరుషంబు ప్రశంసించుచు బెరసిరట్లు వచ్చియండబు సాయాహ్న సమయంబున వ్రేపల్లె సొచ్చి తమ యిచ్చనుండిరి" . హ. వ 1-5-103

ఇది గ్రామీణ బాలుర విహార యాత్రల వినోదంబుల చిత్రణ.

గ్రామీణులు సామూహి కోత్సవములు, భోజనములు, క్రీడలు, ఆనందాను భవములు, - కలిసి మెలసి జరుపుకొను చుండువారని తెలియుచున్నది ఒండొరులం గౌగలించుటలు — పరువులు పెట్టుటలు - తాయుటలు - ఎలుగెత్తి నవ్వుటలు — పాడుటలు — వేణు వీణాధ్వని మిశ్రమంబుగా వాద్యవాదనంబులు, సమ్మోద సంభ్రమములు గావించుకొనుటలు - గ్రామీణుల అల్ప సంతోషిత్వమును, నిత్య సంతృప్తిని, సామూహికానందమును, సామూహిక జీవనమును తెలియం జేయుచున్నది. బాలుర విహార యాత్రలు జలక్రీడలు. సామూహిక భోజనములు సలుపుచుండెడివారు. పాడుటలు వేణువీణాదుల వాయించుటలు, ఎలుగెత్తి నవ్వుటలు - వీరి నిత్యానందమును తెలుపుచున్నవి. జానపదులు కష్టజీవులైనను, ఆ కష్టముతో యాటపాటలలో, వాద్య విశేషములలో మఱచిపోవు వారని తెలియుచున్నది.

ఈ నాటికిని పల్లెల యందిట్టి యానందములు గాంచనగును.

మూలము. —

"క్వచిద్గాయన్క్వచి త్క్రీడన్ సంచూర్యంశ్చ క్వచిత్క్వచిత్
పర్ణ వాద్యం శ్రుతి సుఖం వాదయంశ్చ క్వచిద్వనే"
గోపవేణుం సుమధురం కామాత్తమపి వాదయన్
ప్రహ్లాద నార్థం చ గవాం క్వచిద్వనగతో యువా
గోకులేంబు ధరశ్యామః చచారద్యుతి మాన్ప్రభుః
రేమేచ తత్ర రమ్యాసు చిత్రాసు వనరాజిషు."

మూలము నందలి బాలురకు చిఱుత కూకటులు లేవు. కిఱ్ఱు చెప్పులు లేవు. సెలగోలలు లేవు చల్దిచిక్కములు తెలుగు హరివంశములోని బాలురవే! వృక్షాగ్రముల పైకి ప్రాకుటలు, కోయని యార్చుటలు, వృకముల తోలుటలు తెలుఁగు హరివంశము లోని తెలుఁగు బాలురవే!

ఈదుట - విహారయాత్రలలో సావందించి త్రుళ్ళుట - వీనికి మూలములేదు. కనుక ఎఱ్ఱయ జానపద బాలుర జీవితము, తెలుఁగు బాలుర పల్లె జీవితమునే ప్రతిబింబింపఁ జేయుచున్నది. అనువాదమైనను హరివంశము - ఆంధ్రుల ఆంధ్రత్వమును ముద్రవేసిన ఎఱ్ఱయ వర్ణనలో జాతీయతాముద్ర భద్ర పఱుపఁ బడినది.

పల్లెపట్టుల యందలి ప్రాతఃకాల వైభవము :-

కం॥ గోవర్ధన నిర్ఝరముల
పై వేమఱు సుడిసి గోప బర్హామయవతం
సావళి గదల్చుచును బ్రం
దావన పవనము మెలంగెఁ దద్వ్రజమలరన్

హ. వ 1-8 165

అది ప్రాతఃకాలము. వ్రజమున ప్రాభాతిక వాయువు వీచు చున్నది. గోవర్ధనపర్వత నిర్ఝరముల నుండి వచ్చుచున్నది. అందుచే శైత్యము కలిగి యున్నది. గోపుల బర్హామయాలంకారమును కదల్చు చున్నది. అనఁగా మాంద్యము గలిగి వీచుచున్నది ఇట్లు ప్రాతఃకాలమునందలి మారుతము మాంద్య శైత్యముల వహించి యాహ్లాదమును కలిగించుచున్నది —

చ॥ ప్రమదము లుల్లసిల్లఁ దనుపారఁగ నిద్రలువోయి పల్మఱుం
గమియ నెమర్చి మేపఱుపఁగాఁ బొరిబెండలు వెట్టిలేచి వ
త్సములఁ దలంచి పంచితివి చన్నులచే పొదవంగఁ బెంపుతో
గొమరుఁగ జారు హుంకృతుల గోవులు చెన్నువహించె మందలన్

హ. వ I-8-166

తే॥ గీ॥ పనులలోన యెరువు తిప్పలఁ బరుండి
మేలుకని యాలఁ బిదుకఁగ మెలఁగు గోష్ఠ

పతుల మెత్తని కడఁక ప్రభాతమునకుఁ
దాన తోడవయి వ్రజమహోత్సవ మొనర్చె."

హ. వ. I-8-167

కడుపార నారగించి యానందముగ నిదురవోవుట, పలుమారు నెమరు వేయుట మేపఁజాఁగి పోఁగా పెండలు పెట్టి లేచుట, తమవత్సముల తలంచి, పంచ తిల్లుట. చన్నులు చేపునకు రాఁగా హుంకార మొనర్చుట – గో సహజములగు చేష్టలు.

అలపు చూచుకొనుచు, గడ్డి వేయుట – దూడలను వదలుట – పాలు పిదుకుట ఇత్యాది కార్యములకై గోష్ఠ పతులు పూనుకొనుచు, కార్యవ్యగ్రతచే – ఆవసుల ఎఱువుల కుప్పలలోనే పరుండి మేల్కొని నంతనే కార్యాసక్తులగుట గ్రామీణుల సహజ కార్యములు.

ఈ ప్రాతఃకాల రచన ఎఱ్ఱయ స్వీయరచన. మూలమున లేని ఎఱ్ఱయ పరిశీలనా ప్రదర్శన. గోవుల సహజాత ప్రవృత్తిని, గోష్ఠపతుల కర్తవ్య వ్యగ్రతను. కనులకుఁ గట్టినట్లుగ వర్ణించిన ఎఱ్ఱయ సహజ కవి మార్దవ కవి.

శ్రీకృష్ణుఁడు వ్రజవాసులను ఆప్రదేశము నుండి తరలింప నిశ్చయించినాఁడు. తన గాత్రమునుండి క్రూరమృగములను సృష్టించినాఁడు. అప్పుడా క్రూరమృగ ముల వలన వ్రజవాసులు – గోవులుపడిన బాధలు – సామాన్య గ్రామీణు లప్పు డప్పుడు క్రూరమృగములచే నెదుర్కొను బాధలే :

ఎఱ్ఱయ హరివంశమున ఆ క్రూరమృగములు పల్లీయులను పెట్టిన బాధలు –

సీ॥ నీళ్ళకు నేటిలోనికి డిగ్గఁగాఁ బెద్ద
తెఱపి పెయ్యలఁ బట్టి నుఱిచె నేఁడు
వడిఁగూడి పాలకావళ్ళఁ దేరఁగ మంద
వాండ్రను బొరిఁగొని వ్రచ్చెనేఁడు
వేకువ కడఁ బోయి పోకు మేయఁగఁ జాడి
యావులఁ బొదివి చెండాడె నేఁడు
పులికైనఁ జెలఁగి మార్మలయఁ జాలెడు మేటి
యాబోతుఁ గిట్టి యుక్కడచె నేఁడు.

తే॥ గీ॥ గొల్ల లేమంటి నప్పుడు గొంటియ కొదమ
నెత్తుకొని పోవు తోడేళ్ళ కిట్టి సేత
లెందు వింటిరొ యని జను లెల్లఁ దల్ల
డిల్ల వ్రేపల్లె దద్దయు డిల్లఁ బడియె. హ. వ 1-6-10

అప్పుడప్పుడు వృక శార్దూలాది క్రూరమృగములు అరణ్యము నుండి పల్లె లోనికి జొరఁబడు చుండుట గలదు. అప్పుడవి పొంచి యుండి నీళ్ళకని యేటిలోనికి దిగిన పెయ్యలను చంపుటయు, పాలకాపళ్ళను మోసికొని పోవుచుండు మంద వాండ్రను వ్రచ్చుటయు. వేకువకడ పోతు మేయు పాడియావుల చెండాడుటయు, పులికైన వశపడని మేటి యాఁబోతును గిట్టి యుక్కడచుటయు, - గలదు.

గొల్ల లేమంటి యున్నప్పుడు గొంటియ కొదమల నెత్తికొని పోవుట - ఇట్టివి పల్లెపట్టుల యందు సామాన్యముగ జరుగునట్టివే :

మూలమునందు —

"వృకా న్నిపతితాన్ దృష్ట్వా గోషు వత్సేష్వథో వృషు
గోపీషు చ యథా కామం వ్రజే త్రాసోఽభవన్మహాన్
తే వృకాః పంచ బద్ధాశ్చ దశబద్ధా స్తథాపరే
త్రింశద్వింశతి బద్ధాశ్చ శతబద్ధా స్తథాపరే
నిశ్చేరు స్తస్యగాత్రేభ్యః శ్రీవత్స కృతలక్షణాః
కృష్ణస్య కృష్ణవదనాః గోపానాం భయవర్ధనాః
భక్షయద్భిశ్చ తైర్వత్సాంస్త్రాసయద్భిశ్చ గోవ్రజాన్
నిశి బాలాన్ హరద్భిశ్చ వృకైరుత్సాద్యతే వ్రజః
నవనే శక్యతే గంతుం నగాశ్చ పరిరక్షితుమ్
నవనాత్కించి దాహర్తుం నచవాతరితుం నదీమ్
త్రస్తావ్యుద్విగ్న మనసోఽగతా స్తస్మిన్వనేఽవసన్
ఏవం వృకై రుదీర్ణైస్తు వ్యాఘ్రతుల్య పరాక్రమైః
వ్రజో నిష్పంద చేష్టస్స ఏకస్థాన చరః కృతః"
హ. వి 1-8-32 నుండి 8-38 వరకు

గోవులపై, వత్సములపై, గోపాలురపై, గోపాంగనలపై – యథేచ్ఛగా పడు చుండిన వృకములఁ గాంచి, వ్రజస్థానమంతయు భయానక పరిస్థితిని నెమరుకొనినది. అయిదు, పది, ఇరువది, ముప్పది, నూరుగా – ఇట్లు గుంపులు గుంపులుగా శ్రీకృష్ణుని గాత్రముల నుండి అవృకములు పుట్టుచుండినవి. శ్రీకృష్ణుని శరీరమునుండి నల్లని ముఖములతో బయలువెడలిన అవృకములు భీతిసిఁ గొల్పుచుండినవి. దూడలను తినఁ జొచ్చినవి. గోవులను బాధించుచుండినవి. రాత్రులందు బాలకులను అపహరించుచుండినవి. ఇట్లా వ్రజమంతయు నాశమగు చుండినది.

ఆ గోపాలుర వ్రజ వాసులు – నిర్భయముగా వనమునందు వెళ్ళలేరు. గోవులను రక్షింపలేరు. అరణ్యము నుండి అవసరమగు పదార్థములను తేఁజాలరు. నదిని దాటలేరు. అందఱును భయభీతులు, త్రస్తులు ఉద్విగ్నమానసులు వనము నందే యుండిపోయిరి. ఈ విధముగా వాఘ్యతుల్య పరాక్రమముగల ఆ వృకములు సమస్త వ్రజమును నిశ్చేష్టము. ఏకదేశ చరమును గావించినవి – ఇది మూలము.

ఎఱ్ఱాప్రెగడ వృకములు మూలములోని వృకముల కంటెను మిక్కిలి సమయ స్ఫూర్తి గలవి. వంచనా బుద్ధితోఁ గూడినవి. సమయముచూచి, అదను కనిపెట్టి దూడలను చంపుటో, ప్రజలను హింసించుటో, గొల్ల లేమఱినపుడు గొఱియ కొదమల నెత్తుకొని పోవుటయో, పాలకావళ్ళఁ దెచ్చు మందవాండ్రను చంపుట యో చేయు చుండినవి. మూలమున నట్టి సూక్ష్మ వివరణ లేదు. పాలకావళ్ళు తెచ్చు మంద వాండ్రను చంపును. పాలకావళ్ళు తెచ్చువారి చేతులయందు బరువు లుండును. నలువైపుల దృష్టియుండదు. అట్టి వారిని బట్టుకొనుట సులభము. ఎఱ్ఱాప్రెగడ వృకములు అట్టి పనియే చేసినవి.

"భక్షయద్భిశ్చ తైర్వత్సాంస్త్రాసయద్భిశ్చ గోవ్రజాన్"

అను మూలమునకు – "నీళ్ళకు నేటిలోనికి డిగ్గఁగాఁ బెద్ద తడిపి పెయ్యలఁ బట్టి నుడిపె నేడు" అని – నీళ్ళకని ఏటిలోనికి దిగినపుడు పట్టెనని సందర్భమునుఁ గూడ విశదీకరించినాఁడు. "పంచబద్ధాః దశబద్ధాః త్రింశద్వింశతి బద్ధాశ్చ, శతబద్ధాస్తథాపరే" – అను మూలమునకు "పదియును బదియేను నిరువదియును ముప్పదియు దాటుపడి నిత్యంబున్, గొదగొని తిరిగి వధింపఁగ గడలఁగ రాదయ్యె గొల్లగమి కెవ్వొటన్" అని 'శతబద్ధాః' అను దానిని తొలఁగించి – మఱియు పెద్ద గుంపును వారించి యున్నాఁడు. మూలమున నందఱును భీతావహ పరిస్థితి యందు

స్నారు. చేష్టలుడిగి కూర్చొనినారు. ఏకదేశ స్థితులయి కదల కున్నారు. ఇది మిక్కిలి భయపడిన వారి చేష్ట లుడిగిన చర్యలు మూలమునందు గలవు. దీనిని తొలఁగించి ఎఱ్ఱయ గోపాలురను ముందుకార్యమునకుఁ దొడంగిరి. "గోపప్రవరు లందఱుంగూడఁ బడి నంద గోప సమేతంబుఁగ మంతనం బుండి" ముందటి యుత్పాతములకు డెందంబుల నొచ్చినారు. "ఏమి సేయుదము. ఎక్కడికింబోద మీప్రొద్ద కదల వలయు"నని విచారించు చున్నారు.

మూలమున - అప్పుడు వ్రజవాసు లిట్లు చెప్పుకొను చున్నారు.

"ఏవం ధూమ్రారుణాంగానాం దంష్ట్రిణాం నఖ కర్ణినామ్
వృకాణాం కృష్ణవక్త్రాణాం బిభీమోనిశి గర్జతామ్
మమ పుత్రో మమ భ్రాతా మమవత్సోఽథ గౌర్మమ
వృకై ర్వ్యాపాదితా హ్యేవం క్రందతి స్మగృహే గృహే
తాసాం రుదిత శబ్దేన గవాం హంభా రవేణ చ
వ్రజస్యోద్ధాపనం చక్రుః ఘోషవృద్ధా స్సమాగతాః"

హ. వి 9-4 నుండి 9-6 వరకు

'ధూమ్ర వర్ణము గలిగి యున్నవి. కృష్ణ ముఖములు కలిగి యున్నవి. కోఱలతో నున్నవి, గోళ్లతో ఱక్కు చున్నవి. రాత్రులందు గర్జించుచున్నవి. ఇట్టి ఈ వృకములకు భయపడుదుము.

ఇంటింటను, "నా పుత్రుని వృకము చంపినది. నా సోదరుని, నా వత్సమును, నాగోవును చంపినది" అని ఆక్రందించుచున్నారు 'వారి ఆక్రందన శబ్దములతో, గోవుల అంబారవములతో, వ్రజ వృద్ధులు - ఆ నివాసము నచ్చట నుండి మార్చుటకే నిశ్చయించి నారు.' ఇది మూలము.

మూలమున కేవలము ప్రజల భయానక స్థితికి మాత్రమే ప్రాధాన్య మివ్వఁ బడినది.

"నవనే శక్యతే గంతుం నగాశ్చ పరిరక్షితుమ్
నవనాత్ కించి దాహర్తుం నచవా తరితుం నదీమ్" 8-36

అని ప్రజలు తమ భయావహస్థితిని తెలుపుచున్నారు.

"మమ పుత్రో, మమభ్రాతా, మమవత్సశ్చ గౌర్మమ, అని యాక్రందించు చున్నారు. మూలమున ప్రజాపరిస్థితి ఎక్కువగా వర్ణింపఁబడఁగా – ఎఱ్ఱయ వృకముల వంచనా నైపుణ్యమునకే ప్రాధాన్య మొసంగి నాఁడు. ఆ వృకములు ఎప్పుడు, ఎక్కడ, ఎట్టి పరిస్థితులందు, పశువులను ప్రజలను హింసింపఁగలుగు చున్నవో సూక్ష్మముగఁ బరిశీలించి వివరించినాఁడు. మూలము ప్రజల భయానక స్థితిని వర్ణించినది. రెండును భిన్నములు, అయినను రెండును సుందర భావనలే; ఒకటి మానవుల మనో విభ్రమమును వర్ణించిన – మఱొకటి జంతువుల వంచనా శక్తిపై మొగ్గు చూపుచున్నది ఒకటి పల్లె ప్రజల భయాందోళన పరిస్థితిని చిత్రింపఁగా మఱొకటి వారి భయాందోళనలకు మూలభూత మగు వృకముల వంచనా వైవిధ్యము వివరించుచున్నది.

కనుక రెండును ప్రశంసావహ వర్ణనలే! భావనా ప్రధానములే!

## కుటుంబ పద్ధతి

సమిష్టి కుటుంబము ఆనాటి విశిష్టత. తండ్రి జీవించి యున్నంతకాలము తండ్రిదే పెత్తనము. స్త్రీ పురుషులు – భార్యాభర్తలుగా, తలిదండ్రులుగా, సోదరీ సోదరులుగా - సంఘ సంక్షేమమునకు పాటుపడుచుండువారు బహు భార్యాత్వము నిషిద్ధముకాదు. దొరలు, సంస్థానాధిపతులు, మహారాజులు బహుభార్యాయుతులు. మహమ్మదీయుల ప్రభావము దీనికి కొంత కారణము కావచ్చును. భార్యలు భర్తయెడ భయ భక్తులతో మెలఁగు చుండిరి.

నందుఁడు వ్రజమున కధిపతి. యశోద అతని భార్య. పల్లె ప్రజల సేవకై పరస్పర సహకారముతో ప్రజానాయకుడుగా, గ్రామాధికారిగా నందుఁ డుండువాఁడు.

యశోద పసి బాలుఁగగు శ్రీకృష్ణుని శకటము క్రింద నిదురపుచ్చి, సమీపము నందలి యేటికి నీళ్ళకు నేగినది. వచ్చునప్పటికి కా శకటము తలక్రిందలై యుండును. అదిగాంచి పఱతెంచి వచ్చి పుత్రు నెత్తికొనినది. బాలుఁడు క్షేమముగా నుండుటఁ గాంచినది. 'నీ జనకుఁడు వచ్చిన న్నెన్ని విధముల కష్టపెట్టునో?' ఇంతయును జూచి, కోపము చెందునేమో' యని బాలుని విపత్కర పరిస్థితికి బాధయు, భర్త వలని భయమును ఏకకాలమునందే యనుభవించినది.

"నిన్నిట పాఱవైచి తగ
నిద్దుర వోయెఁడు బాపఁడంచు నే
మిన్నక నీళ్ళనాట యను
మిత్తికి నేటికిఁ బోయితి న్నిజం
బన్న కుమార ! ఇంకిపుడ
యర్థి భవజ్జనకుండు వచ్చి, న
న్నన్ని తెఱంగులం బఱుపఁ
డింతయుఁ జూచి తనర్చు నల్కతోన్"

హ. వ 1-6-10

- అని దిగులు చెందుచున్నది. 'నిన్నిట పాఱవైచి' యనుట తన నిర్లక్ష్య వైఖరిగా తన్నుతానే నిందించు కొనుచున్నది. 'నీళ్ళనాట యను మిత్తికి నేఁటికిఁ బోయితిన్'- అని, 'ఆ చచ్చిన నీళ్ళాట' అని తిట్టి నట్లుఁగా తన నీళ్ళాట కేగుటను కించపఱచినది.

"భవజ్జనకుండు వచ్చి నన్నెన్ని తెఱంగులం బఱపఁడు" - అని భర్తయెడ తనకుగల భయభక్తులను తెలుపుకొనినది.

ఇట్లు నాఁటి భార్యలు భర్తలయెడ భయము, భక్తి కలిగి మెలఁగెడి వారని తెలియుచున్నది.

భర్తవచ్చి వెంటనే —

నావలనం దప్పు సాలఁగలదు. మీరు సహింపవలయు. నే నిష్పాపని నెప్పటి యట్ల యీ బండి క్రింద మంచంబున నిదురవుచ్చి, యేఱు కుఱంగలి గాపునం గ్రమ్మఱం జనుదెంతు నని జలావగాహనంబున కరిగి మగుడఁ నప్పటి కిది యిట్లై యున్నయది. మన భాగ్యంబునం గుమారు నీ బారి గడిచె' నని తన యపరాధము అడుగకనే చెప్పఁ దొడగినది. ఇది ముందటి కాళ్ళకు బంధము వేయుట వంటిది. ఈ విధముగా నాటి గృహిణులు భర్తలకు భయపడు వారయ్యు సత్యసంధలని తెలియుచున్నది.

కృష్ణుని యాగడములకు తాళలేక గోపికలు యశోదను సమీపించినారు. అందులో నొకతె —

చ॥ కలయఁగఁ జాలు పిండి పుల
కండము వెన్నయుఁ బెట్టె యట్టులై
యలవడ వండితిఁ బతియు
నాత్మజులుం బ్రియపడ్డ నాలుగే
నలకుల దొంతి డించి యవి
యన్నియు నుగ్మలి! నీ తనూజుఁ డో
ప్పాలు వడ బ్రమింగెఁ జోద్యమిది
బూతము లున్నవి గాక కద్దునన్

హ. వ. I-5 224

కం॥ మగఁ డింక నన్ను నైఁచును
దిగవిడుచుం జంపుఁగాక తెల్లము మది న
మ్మిగ పుట్టునె యిది చెప్పిన
మొగమోటన నునుపు చుండి మానితి నబలా!

హ. వ. I-5-225

అని యనుచున్నది. ఇట్లు భర్త చంపునని భయపడు వనితలు ఆనాఁటి కుండిరి. ఇది మూలమున లేని ఎఱ్ఱయ సృష్టి.

మూలముల శకటము క్రింద బాలకుఁ డుండినపుడు శకటము విపర్యస్తమై యుండినది. అప్పుడు యశోద అచ్చటికి పరుగున వచ్చినది.

"కింతు వక్ష్యతి తేపుత్ర! పితా పరమ కోపనః
త్వయ్యధశ్శకటే సుప్తే అకస్మాచ్చ విలోదితే"

హ. వి. 7-10

"కిం మే స్నానేన దుస్స్నానం కించమే గమనే నదీం
పర్యస్తే శకటేపుత్ర! యాత్వాం పశ్యామ్యపావృతామ్"

హ. వి. 7-1

– అని విలపించినది. భయపడినది. మూలమున – "తేపితా పరమ కోపనః" అను దానికి ఎఱ్ఱయ, "భవజ్జనకుండు వచ్చి నన్నెన్ని తెఱంగులం బఱపఁడు" అని మూల

మున కోపనుఁడు కాఁగా - కోపిష్ఠి కార్యములకు గూర్చి భయపడు చున్నది ఎఱ్ఱయ యశోద. మూలమున 'కిం మే స్నానేన దుస్స్నానం' అనుదాని కెఱ్ఱయ నీళ్ళనాట యను 'మిత్తికి నేటికిఁ బోయితిన్' అని 'చచ్చుస్నానము' అనునట్లు పలికినది. ఇది యాంధ్రుల తిట్టు

మూలమున నందగోపుఁడిది తెలిసి పరుగున వచ్చినాఁడు.

"ప్రత్యువాచ యశోదాతం భీతా గద్గద భాషిణీ
నవిజానా మ్యహం కేన శకటం పరివర్తితమ్ హ. వి. 7-16

అహం నదీం గతా సౌమ్య చైల ప్రక్షాళనార్థి నీ
ఆగతాచ విపర్యస్తం అపశ్యం శకటం భువి" హ. వి. 7-17

అని యశోద విలపించినది. మూలమున యశోద భీత - గద్గద భాషిణి. 'ఈ శకట మెవ్వరు త్రిప్పిరో తెలియదు. నేను వస్త్రము లుదుకు కొనుటకై నదికి వెళ్ళి యుంటిని. వచ్చునప్పటి కిట్లైనది.' అని పలికినది

ఎఱ్ఱయ యశోద, "నావలన తప్పు సాలఁగలదు మన్నింప వలయు' అని తన తప్పిదనమును అడుగకయే విన్నవించు కొనినది. "ఏఱు కుఱంగలి" గావున అనునది ఎఱ్ఱయ హరివంశము. "అహం నదీం గతా' అని మూలము. "ఏఱు సమీపము గావున పోయియుంటిని. లేకున్న పోయి యుండను." అని తన తప్పి దమును కొంత సవరించు కొనుచున్నది. మూలమున ఇది లేదు. ఇట్లు మూలము కంటె ఎఱ్ఱయ హరివంశము నందలి యశోద తప్పు నొప్పుకొనుట - సమర్థించుకొను టను చూపి - ఆనాటి స్త్రీల స్వభావమును తెలియఁజేయు చున్నది.

ఆనాఁడు పల్లెప్రజలు అనేకములగు నుత్సవములు జరపుకొను చుండిరి. అందులో ఇంద్రోత్సవమొకటి. వానలు చక్కఁగా కురిసి, సస్యశ్యామలముఁగా పంటలు పండి పాడి యినుమడించి నపుడు - పశువుల కారోగ్య మధికమై అభివృద్ధి యైనపుడు - తుష్టియును పుష్టియును కలిగి ప్రజలు తృప్తులై యింద్రోత్సవమును గావించు కొనుచుందురు. ప్రతి వత్సరము నీ యుత్సవము చేయుచుందురు.

ఎఱ్ఱయ హరివంశమున —

సీ॥ కురిసె వానలు సస్యకోటియుఁ దృణగుల్మ
తరులతా తతులు వర్ధనము నొందెఁ
బసుల కారోగ్యసంపద తోడఁ గూడఁగఁ
బుష్టియుఁ దుష్టియుఁ బొలుపుమిగిలెఁ

ప్రజలు స్వప్రజలయి పాడియుఁ బంటయు
 నొదవంగఁ గని తృప్తి నొందువారు
రాజులు నియత సంరక్షణఁ గావింప
 సహిత తస్కర బాధ లందవెందుఁ

తే॥ గీ॥ గాన నిది యుజ్జ్వలోత్సవ కరణమునకు
సనుయ మేఁ టేట మన చేయు శక్రపూజ
సేయవలవదె యింకెడ సేయనేల
యని వినిశ్చిత కార్యులై యాక్షణంబ హ. వి. 1-7-121

తే॥ గీ॥ పల్లెలో నెల్లఁ జాటఁగ బనిచి వలయు
వస్తువులు సమకూర్చు ప్రవర్తనమున
సక్తులై యుండఁగాఁగని సరసిజాక్షుఁ
డెల్ల గోపాలకులఁ జూచి యల్లనగుచు. హ. వి. 1-7-123

ఇట్లు ఉత్సవముల చేయనెంచి దినమును నిర్ణయించి, పల్లెలో నెల్లరకుఁ దెలియునట్లు చాటఁబంచుట వస్తువులు సమకూర్చుకొన వలయునని తెలియఁ జేయుట, ఆయుత్సవముల పూర్వ విధానము.

అప్పుడు సరసిజాక్షుఁ డల్లనగుచు "ఇదేమి" యని ప్రశ్నించి నందున - గోపాలురిట్లు చెప్పుచున్నారు.

కం॥ గోవులకు మేలు చేసిన
యావేలుపు గొల్లవారి యర్చనలకు నె
చ్చోవలయు వాఁడు గావున
దేవేంద్రునిఁ గొలుతు మేము దృఢభక్తిరతిన్
హ. వి. 1-7-126

కం॥ క్షేపులు వర్ధిల్లుటయును
నోపి పసులు పాలు గురియు చునికియునన్నం
బేపార మనకుఁ గలిమియు
నాపరమేశ్వరుని యీఁగి యని యెఱుగుమనా!
హ. వి. 1-7-127

తే॥ గీ॥ అతనియిచ్చిన పుణ్యంబ యతని పూజ
గా, సమర్పించి మనము సుఖంబు గాంతు
మనఘ ! మనలఁ జెప్ప నేల యాతఁ డఖిల
మునకు మూలంబు కూడు నీరును సృజింప

హ. వ. 1-7-128

అని ఇంద్రునికి కృతజ్ఞత తెలుపుచు ప్రతి సంవత్సరము నుత్సవము జరుపుకొందురు. ఈ పరమేశ్వరుని యనుగ్రహము చేతనే పసులు వర్ధిల్లుటయుఁ పాడి పంటలు సమృద్ధిగాఁ నుండుటయు జరుగును. కనుక నతని యిచ్చిన పుణ్యంబు యతనికి పూజగా సమర్పించి కృతజ్ఞతలు తెలుపు కొనుచుందురు. ఇది గ్రామ ప్రజలకు ప్రకృతియెడ గౌరవము, దేవతాభావము; భక్తి

వర్షము వలననే పృథ్విసంతుష్టిఁ జెందును. సమస్త జగము వర్షము వలననే అమృతమయ మగును. ఆ వర్షము వలన తృణము అభివృద్ధి చెందును ఆ తృణముల తిని గోవులు క్షీరధారల కురిపించును వత్సవంతము లగును

వృష్టినిచ్చు మేఘము ఎచ్చట కనిపించునో అచ్చట తృణాభావము లేదు సస్యాభావము లేదు. అచ్చటి జను లాకటిచే తపించరు. సూర్యుని దివ్యకిరణములు జలముల శోషింపఁ జేయుచున్నవి. ఇంద్రుఁడా జలమును వర్షించుచున్నాఁడు. అప్పుడా సూర్యకిరణ రూపము లగు గోవులు పవిత్ర జలమను క్షీరము నొసంగు చున్నవి. ఆ క్షీరములను మేఘరూపమున నుండు ఘటములు భద్రపఱచుచున్నవి.

ఈ పది శ్లోకములలోని భావమును రెండు పద్యములలో ఎఱ్ఱయ వ్యక్త పఱచి నాఁడు. "గోవులకు మేలు చేసిన వేలుపు. గొల్లల యర్చనలకు తగినవాఁడు. కనుక దేవేంద్రుని కొలుతుము" అని క్రేపులు వర్ధిల్లుటకు పసులు పాలు గురియుటకు, తనకు సమృద్ధిగా అన్నము లభించుటకు ఆ యింద్రుని యోగియే కారణము. కూడును, నీరును సృజింప నతఁడే మూలము గనుక నతఁడిచ్చిన పుణ్యము నతని పూజకే సమర్పింతము" - ఇది మూలమునకు ఎఱ్ఱయ అనువాదము. ఇట్లతి సంక్షేపమున నెఱ్ఱయ అనువాదము సాగినది. కాని మూలమంతటితో నాగిపోలేదు.

1) ఇంద్రుడు సూర్య కిరణముల ద్వారా నీటిని గ్రహించి, మేఘముల ద్వారా వర్షింపఁ జేయును. అనెడు ప్రకృతి సత్యము ఏడు శ్లోకములలో వర్ణింపఁ బడినది. - దీనికి అనువాదము లేదు.

2) ఆ జలము వలననే సమస్త విశ్వమును సుఖముగా జీవింపఁ గలుఁగు చున్నదని తెలియఁజేయ బడినది — దీనికిని అనువాదము లేదు.

3) సూర్యాది దేవతలకు, మేఘములకు నింద్రుఁడే ప్రభువు గనుకను ఆ ఇంద్రునిచేతనే వర్షాది ప్రజా సౌఖ్యకార్యము జరుగు చున్నది. కనుక నాతని యుత్సవములు గ్రామీణులు జరుపుకొందు రనుట, సూర్యకిరణములు వర్షమును గ్రహించి మేఘములద్వారా వర్షింపఁ జేయుట అను శాస్త్ర విషయము — కావ్యము నందనవసరమని భావించి ఎఱ్ఱయ వదిలి యుండవచ్చును. కనుక ఏడు శ్లోకములకు అనువాదము లేదు

మూలము నందలి ఇంద్రుని మహిమను, సుమారు పది శ్లోకముల సారమును గ్రహించి ఒక్కపద్యమునందే ఇమిడ్చి కావ్య శిల్పమునకు భంగము రానీయక మెరుగులు దిద్దినాఁడు ఎఱ్ఱయ.

"మేఘము లురుముటను గర్జించుట అందురు". ఒకచోట దుర్దిన రూపమున ఇంద్రుఁడును, మఱొకచోట అంజనాకారమునను, విరిగిన మేఘరూపములతో నుండును. ఆకసమున వ్యాపించును." వంటి నిరలంకార వాక్యములను విసుఁగు జనింప వచ్చునని పరిహరించినాఁడు. ఇట్లు మొత్తము పదియునేడు శ్లోకముల సుదీర్ఘ వాక్య విన్యాసమును రెండు పద్యములలో వస్తు గమనమునకు హాని గలుగకుండ కాపాడినాఁడు ఎఱ్ఱయ. అందుకే రసపుష్టిని కలిగించు సూక్తి వైచిత్రి కాద్యుఁ డనిపించుకొనినాఁడు ఎఱ్ఱయ

ఇంద్రపూజ వలదని పర్వతపూజ చేయవలసినదని శ్రీకృష్ణుఁ డాగ్రామ ప్రజల నాదేశించినాఁడు. అప్పు డిట్లను చున్నాఁడు.

"కాననలోఁ జరించి గిరికందరలన్ వసియించి గోవులన్
మానుగఁ బెంచి వీనివలనన్ బ్రదుకొంది మనస్సుఖంబుమై
భూనుత యున్నవారమటు బుద్ధి నెఱింగిన నెల్లభంగులన్
గానలుఁగొండలుం బశులు గాదిలి వేల్పులు గొల్లవారికిన్.

హ. వ. 1-7-131

కం॥ ఎలమిఁ దమజాతి వేల్పుల
గొలిచి యుభయ లోకసుఖము గోరుటఁ దగుఁగా

కిలవేల్పు లుండఁ గొలుతురె
పలువేల్పుల నెవ్విధంబు పాలసులైనన్."

హ. వ. 1-7-182

ఆ॥ కర్షకులకు నెలవు గ్రామ సీమావళి
యవుల నడవులిందు లాటవికుల
కడవులందుఁ గొండ పడలు మనకుఁ జోటి
లింత వట్టు దెలయ నెఱుఁగవచ్చు. హ. వ. 1-7-183

అని యాదేశించినాఁడు కానలు కొండలు, పసులు, గొల్లవారికి వేల్పులు. ఆ గొల్లలు కానలందు చరింతురు. గిరికందరము లందు వసింతురు. గోవులను చక్కగా పెంతురు. వాని వలన జీవింతురు. వీరు సుఖముగా నుండుటకు గోవులే కారణము. కావున కొండలు, కానలు, గోవులు – ఇవి గొల్లవారికి దేవతా స్వరూపములు. కావున తమ తమ జాతి దేవతలను కొలిచి యుభయ లోకసుఖముల నొంద వలయునే కాని, "ఇలవేల్పులుండఁగా పలువేల్పుల గొలుచుట పాతక" మని శ్రీకృష్ణుని ముఖ మున ఎఱ్ఱయ తెలుపుటనుజూడ ఆనాఁడీ యభిప్రాయ ముండి యుండవచ్చును. అని తెలియుచున్నది.

గోపాలురు శ్రీకృష్ణుని యాదేశమును మన్నించినారు. పర్వతపూజ చేయ సమకట్టినారు. ఆ పూజా విధానము పల్లెప్రజల పూజా విధానము. ఆ సంరంభము ఎఱ్ఱయ నాటి పల్లీయుల సంరంభమే :

"గోపప్రముఖులు భూదేవతల రావించి పుణ్యాహవాచన పురస్సరముగా గిరి యజ్ఞ మహోత్సవంబునకు నుపక్రమించిరి. అంతట —

సీ॥ కైసేసి గోపాల కామిను లొండొండ
యాబాల వృద్ధులై యరుఁగుదేరఁ
వగ దళత్కుసుమావ తంసులై గోపకు
మారు లంతఁటికినిఁ దారకడఁగఁ
పాయసంబులు నపూపంబుల మోదకం
బులును లోనగు నన్నములును బెక్కు

మాంసంబులును హృద్య మధువులు బహువిధ
వ్యంజనంబులును దధ్యాజ్య దుగ్ధ
తే॥ గీ॥ ములును గావళ్ళ బండ్లను వలయు భంగి
నిడి యథోచిత జనము లింపెలయ నడువ
వివిధ వాదిత్రములు మ్రోయ వృద్ధ గోపు
లోలి నడిపింప జాతరయొప్ప మిగిలె హ. వ. 1-7-145

ఆనాటి గ్రామముల జాతరయిది. ఆ బాలవృద్ధు లత్యంతోత్సాహముతో చక్కగా నలంకరించు కొందురు. దిగ్దళత్కుసుమములతో తమ్ముకై సేసి కొన్నారు. పాయసములు, అపూపములు, మోదకములు. పెక్కు మాంసములు, హృద్యమధువులు. బహువిధ వ్యంజనములు. దధి - ఆజ్యదుగ్ధములు కావళ్ళయందు మోచికొని పోయెడువారు. అట్లు వెడలునపుడు వివిధ వాదిత్రములు మ్రోయుచుండినవి. వృద్ధులు నడపించుచుందురు.

"ఇవ్విధంబునఁ జని గోవర్ధనంబునకు నత్యంత సమీపంబున - గోమయ విలిప్తంబును, రంగవల్లీ విచిత్రంబును, నగు మనోహర స్థలంబున నందఱుం గృష్ణుం బరివేష్టించి నిలువ నతండు తాన యధ్యక్షుండై యయ్యాజనోప కరణంబు లన్నియుఁగైకొని, మహనీయ స్థండిలంబున నమ్మహాశైలంబు నుద్దేశించి, మహితార్చనములు సేసి, బహ్వపూప సూప పశూపహార సహితంబగు నైవేద్యంబు సమర్పించి యఖిల గోపాలుర నక్కొండకు పుష్పాంజలు లొసంగను, నమస్కారంబులు గావింపను బనిచి" - ఉపహారముల నర్పించి యాశీర్వాదములఁ బడసిరి.

ఇది పూజాక్రమము. ఈ విధానమున పశుబలులు, మాంసనైవేద్యము, (పశూపహారములు) విశేషము. శివపూజా విధానమున పశూపహారములఁ గానము. పర్వతపూజల యందు పశూపహారము - మాంసనైవేద్యము కనిపించుచున్నది ఇది యానాటి ప్రజల పూజా వైవిధ్యమై యుండవచ్చును.

సాత్త్విక దేవతల పూజలలో బలులు, పశూపహారములు ,మాంస నైవేద్యములు ఉండవు. తామస దేవతలు - అమ్మవారు, దుర్గాది శక్తులు - వీరికి సహజముగా పశుబలు లుండును. ఇది యానాటి నుండియు వచ్చునాచారము.

తదనంతరము పశుపూజ గావింతురు. —

పశుపాలు రందఱు– "పసుల కొమ్ము లర్చించియుఁ, చిఱుగజ్జెల పేరులఱుతం గట్టియు, వనలతా వలయంబులు దలలఁ జుట్టియుఁ, బలుతెఱంగుల నలంకరించి, యార్చుచుఁ గొండచట్టు నొక్క వెల్లిగా వెలిచి యచ్చటచ్చట సివాళించి, బడసి వైచి మ్రొక్కి, యొక్కటం ద్రుళ్ళుచు నుల్లాసంబు నొంది" —

మత్త॥ పాయసంబుల రొంపులుం బహుభంగి బూరెల తిట్టలున్
నేయుఁ బాలును దేనియల్ గడునిండి పాతెడు నేఱులున్
వేయి వేలు దలిర్ప నొప్పెడు విప్ర భోజనముల్ యథా
న్యాయ దక్షిణ లుల్లసిల్ల నొనర్చి రెంతయు ధన్యతన్.

హ. వ.1-7-152

వ॥ సమస్త దీనానాథ సముదయంబులం దనియఁ జేసి తామునుం దమ తమ వర్గంబుల తోడంగూడ, యజ్ఞ శేషాన్నం బమృతంబుఁగా నుపయోగించి పండువు నిండించి క్రమ్మఱి" హ వ. 1-7-153

ఇది జాతరలోని తినుబండారముల వైభవము. కావళ్ళయందు, బండ్లయందు, సమస్తోపహారములను, పూజాద్రవ్యములను నుంచుకొని, ఆ బాలవృద్ధులును నలంకరించు కొని పోవుటతో ప్రారంభము.

'గోమయ విలిప్తము', 'రంగవల్లీ విచిత్రము', – తరువాతి కార్యక్రమము గోమయముతో నలుకుటలు, రంగవల్లులతో విచిత్రముగ నలంకరించుటలు, ఆనాటి జాతరలోని వైభవములు. యజనోపకరణీయముల తోడ మహితార్చనము. అనంతరము – బహు అపురూప – పశూపహారముల సమర్పణ – నమస్కార పూర్వకముగా నాశీర్వాదముల పొందుట – అనంతరము పశుపూజఁ గావించుట.

అనేక భంగుల భోజనములతో విప్రవరులను సంతుష్టులఁ జేయుట – దీనానాథులం దనియంజేయుట – యజ్ఞశేషాన్నము నమృతముగా భుజించుట జరుగుచుండెడిది.

తాము పర్వతముల వలన పశువుల వలన నుపకారములు పొందుచున్నారు. ఆ యుపకారమునకు ప్రతిగా కృతజ్ఞతలు తెలుపుకొనుట – ఈ పూజావిధానము యొక్క ఉద్దేశ్యము.

మూలమునందు - శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు -

'వయం వనచరా గోపా సదా గోధన జీవినః
గావోఽస్మద్దైవతం విద్ధి గిరయశ్చ వనానిచ

హ. వి. 16-02

కర్షకాణాం కృషిర్వృత్తిః పణ్యం విపణి జీవినామ్
గావోఽ స్మాకం పరావృత్తి రేతత్త్రైవిధ్య ముచ్యతే

హ. వి. 16-03

విద్యయా యో యయా యుక్త స్తస్య సా దైవతం పరమ్
సైవ పూజ్యార్చ నీయాచ సైవ తస్యోపకారిణీ

హ. వి. 16-04

యోఽన్యస్య ఫల మశ్నానః కరోత్యన్యస్య సత్క్రియాం
ద్వావనర్థౌ సలభతే ప్రేత్య చేహచ మానవః

హ. వ. 16-05

... ... ... ...

... ... ... ...

స్థితశ్చక్రే మహస్త్రాత్ శ్రీమాన్ గిరిమహ స్స్వయమ్
త్వత్ప్రణీతోద్య గోపానాం గవాం హేతోః ప్రవర్త్యతామ్

హ. వి. 17-11

భాజనా న్యుప కల్ప్యంతాః పయసః పేశలానిచ
త్రిరాత్రం చైవ సందోహః సర్వఘోషస్య గృహ్యతామ్"

హ. వి. 17-12

శ్రీకృష్ణుడు ఇట్లు చెప్పుచున్నాడు -

"ఆర్యా! మేము వనచారులమగు గోపాలురు. గోధనమే మాకు జీవనాధారము. గోవులే మా దేవతలు. గిరులు అరణ్యములే మాకు దైవ సమములు. కర్షకులకు కృషియే వృత్తి, వ్యాపారము వైశ్యుల వృత్తి. మావృత్తి గోరక్షణ. ఈ మూడును మూడు విధములు. ఎవ్వడే విద్యతో గూడియుండునో అదే వానికి సర్వోత్తమ

మైనది. ఆ విద్యయే యర్చనీయము. అదే పూజనీయము. అదే ఆతని కుపకరించు విద్య.

... ... ... ...

... ... ... ...

ఈ విధముగా శ్రీకృష్ణు దుపన్యసించుచు పోయిన మూలములోని యేబది శ్లోకముల భావమును గ్రహించి ఐదారు పద్యములలో సంక్షేపించి నాఁడు. ఇలవేల్పు లుండఁగా పలువేల్పుల గొలుచుట భావ్యము కాదన్నాడు. అట్లు శ్రీకృష్ణుఁడు గోపాలురను పర్వతపూజ చేయవలసినదిగా ఆజ్ఞాపించినాఁడు. అతని యాదేశమును మన్నించి, ఇంద్రపూజను వదలి పర్వత యజ్ఞమునకు సంసిద్ధులైనారు.

అప్పుడు —

"కుమారా ! నేటినుండి ఇంద్రోత్సవ మాగిపోయినది. ఇది పర్వత యజ్ఞము' ఈ యజ్ఞము, గోవులకును, గోపాలురకును శ్రేయస్సును సమకూర్చు గాక !"

క్షీరపూరితము లగు పాత్రల సమకూర్చుఁడు. బావులపై సుందర భాజనముల కల్పింపుఁడు. నూతనములగు కాలువలను, గుండములను, క్షీరములచే నింపుడు. భక్ష్యములను, భోజ్యములను, పేయములను, సంసిద్ధ పఱపుఁడు మాంసపాత్రలను, ఓదన భాజనములను సమకూర్చుఁడు. మూఁడురాత్రుల ఘోషసందోహమును ఏకత్ర జమ చేయుఁడు"

ఇది ఘోషములోని సంరంభము మూలమున. ఉత్సవ సంసిద్ధత. ఇచ్చట - కాలువలను. గుండములను క్షీరములతో నింపవలసినదిగా నాదేశించుట జరిగినది. అది అసాధ్యము, అనూహ్యము నగు విషయము. కనుక ఎఱ్ఱయ సవరించి, "దధ్యాజ్యదుగ్ధములను, గావళ్ళ, బండ్లను వలయుభంగి" నిడుటకై ప్రేరేపించినాఁడు. ఇట్లు మూలము నందలి, అసాధ్యములను, అతిశయములను ఎఱ్ఱయ సాధ్యములు, సహజములు గావించినాఁడు

మూలము నందలి దధికుండములు, క్షీర ప్రవాహములు (కాలువలు) మాంస రాసులు, అన్నపర్వతములు ఉండిన - ఎఱ్ఱయ హరివంశమున దధ్యాజ్య దుగ్ధముల కావళ్ళయందే పోయినవి. కాలువలు ప్రవహింపలేదు. అది అసంభవము.

ఎఱ్ఱయ పర్వతప్రాంతము - "గోమయలిప్తంబు, రంగవల్లి విచిత్రితంబు" నైనది.

మూలమున గంధ మాల్యములు, వివిధ ధూపములు మాత్ర ముండినవి. మూలమున శ్రీకృష్ణుఁడు పర్వత స్వరూపుఁడై వారు భక్తిభావముతో నొసంగినవి స్వయముగా ఆరగించినాఁడు. అనంతరము మిగిలిన వానితో -

"తర్పితాశ్చాపి విప్రాగ్ర్యాః తుష్టాస్సంపూర్ణ మానసాః
ఉత్తస్థుః ప్రీతమనసః స్వస్తి వాచ్యం యథా సుఖమ్"

హ. వి. 17-22

'విప్రులు తృప్తులైరి. (సంపూర్ణ మానసులు) ప్రీతమనస్కులై స్వస్తి వాక్యములతో లేచిరి' -ఎఱ్ఱయ హరివంశమున-పర్వత యజ్ఞసమయమున విప్రులేకాదు "సమస్త దీనానాథ సముదయంబును' తనిసెరి. దరిద్రులే నారాయణ స్వరూపులని యఱ్ఱయ భావించి యుండవచ్చును. వారి తృప్తియే నారాయణ సేవయని యెంచి, యుండ వచ్చును. అందులకే మూలము నతిక్రమించి, దీనులను, అనాథులను యజ్ఞసమయమున తృప్తులను గావించినాఁడు. ఇట్టి సూక్ష్మ విషయములలో గూడ, ఎఱ్ఱయ తన భావమును చొప్పించి, మూలమున లేనివి కూర్చి, తన రచనా స్వాతంత్ర్యమును తెలుపుకొన్నాడు.

అనంతరము మూలమునలేని పశు పూజా విధానమును రచించి, ఎఱ్ఱయ తన గోభక్తిని ప్రదర్శించినాఁడు. ఎఱ్ఱయ హరివంశమున - యజ్ఞానంతరము - పశూపహారము, మాంసనైవేద్యములును నైన తరువాత పశుపూజ గావించిరి. పశుపాలురందఱు - "పసుల కొమ్ముల నర్చించుటఁ జిఱుగజ్జెల పేరులమరఁ గట్టుట - వనలతావలయంబులం దలలంజుట్టుట - అలంకరించుట -" ఇది మూలమున లేని పశువుల అలంకరణ. ఎఱ్ఱయ కాత్మతృప్తి గలిగించినట్టి రచన. అతని గోభక్తిని దెలుపువర్ణన.

అప్పుడప్పుడు పల్లెల యందతివృష్టి సంభవించుటయు గలదు. అపుడు గోవులును, గోపులును పడు బాధలు అనంతములు.

ఇంద్రుఁడు పర్వతయజ్ఞమును గాంచి, కుపితుఁడై తన్నారాధించ లేదని ప్రచండ వృష్టిపాతమును గావించినాఁడు. అప్పటి పల్లియులదశ - పసులబాధలు -

"కులిశనిపాతదాహమునఁ గొన్ని నశింపఁ బ్రచండ వాయువుల్
బలువిడిఁ ద్రేయఁ బెల్లగిలి భగ్నములై చెడఁ గొన్ని వెల్లువల్
బలియుటఁ బీడితంబులయి పాడరఁ గొన్నియ శేషభూరుహా
వళులకుఁ దీవ్ర దుఃఖ దశవచ్చె నెఱిం దదరణ్య భూములన్"

హ. వి. 1-7-168

అట్టి సమయంబున నిరంతరధారా - పాతాంబునం దడిసి నలుదెసలం బుచి శ్రేయు వాయువునఁ గొందలపోయి యొండొంటి చాటున కొదిగి కదఁగానక నిలువం బడియుఁ గొమ్ములొడ్డి, కన్నులు మోడ్చి కడతెప్ప నీళ్ళు గాఱం దలలు దిగ్గవైచి ముందట బెట్టుకొని గంగడోళ్ళం బొదువుకొని యంభారవంబుల నాక్రందించియు వెల్లువ కతన డెంపిలేక నిలువగాలుండి యుండి యోటజికాళ్ళు వడంక సైరణ దప్పి నెటి దప్పం బెనుకొంపిలోనం ద్రెళ్ళియుఁ బెలుచ మెఱచు మెఱుంగులం జెదరి యదరంట నుఱుము పేరుఱుముల బమ్మెరపోయి, మందపట్లు విడిచి ఇట్టు నట్టునుం దెరలఁ దిరిగియు నాహారంబు లేక యీద చాటువడి మెయిం జాలక యెత్తువడి తెవులు గొంట్లు, మదునళ్ళును, మఱియు, బలవంతము లైనవియుఁ జేవఁ దక్కియుఁ బసులు పెక్కు బాధలం దల్లడిల్లఁ బసుపాలురును గుడిసెలు కూలి బండ్లు దడదడం దూలి సొమ్ములు శిథిలపడి, పాకాది క్రియలు మాలి దోహనంబులు నిలిచి మహాక్లేశంబునఁ గొందలంబు నొంద నందఱుఁ గృష్ణ కృష్ణ కావుము, గోవులనును మాకును దిక్కు నీవయని యాక్రోశింప గోవులున్ముఖంబులై యఱచుచు శరణంబు వేడు విధంబున దన వలనక పఱతేర' – ఇది ఎఱ్ఱయ పల్లెయాసుల, గోవుల అతి వృష్టి బాధల స్వరూపము.

మూలమునందు —

"తేనో త్పాతాంబు వర్షేణ గావో విప్రహతా భృశమ్
హంభారవైః క్రందమానా నచేలు స్స్తంభితోసమాః
హ. వ. 18-21

నిష్కంపసక్థి చరణాః నిష్పంద్యత్న ఖురాననాః
హృష్టరోమార్ద్ర తనవః క్షామకుక్షి పయోధరాః
హ. వ. 18-22

కాంశ్చిత్ప్రాణాన్ జహుః శ్రాంతాః నిపేతుః కాశ్చిదాతురాః
కాంశ్చిత్సవత్సాః పతితాః గావశ్శీకర వేజితాః
హ. వ. 18-23

కాంశ్చి దాక్రమ్య క్రోడేన వత్సాంస్తి ష్ఠంతి మాతరః
విముఖాః శ్రాంత సక్థ్యశ్చ నిరాహారాః కృశోదరాః
హ. వ. 18-24

"పేతురార్తా వేపమానాః గావో వర్షపరాజితాః
వత్సాన్ చోన్ముఖకా బాలాః దామోదరముఖాః స్థితాః
త్రాహీతి వదనైర్దీనైః కృష్ణమూచురివార్దితాః"
హ. వ. 18-25

మూలమునందు - ఖురములు, ముఖములు చేష్టలు దక్కుట, ఉదరములు, పయోధరములు గ్రాసములు లేక క్షీణించుట వంటివే కాననగును.

ఎఱ్ఱయ పశువులనేక విధముల వర్ష ధారలతో, వర్షా ప్రవాహములతో, యుద్ధము చేయుచున్నవి.

"పఱచి యొండొంటి చాటున కొరగుచున్నవి. క్రొమ్ములొడ్డి కన్నులు మోడ్చి కడ తెప్పల నీళ్ళుగారం దలలు డిగ్గ వైచుచున్నవి. అంబారవంబుల నాక్రందించు చున్నవి. చెంకి లేక నిలువనుండి యుండి కాలు ఓరడి సైరణ దొరంగి పెను రొంపిలోఁ ద్రెళ్ళుచున్నవి. - ఉఱుములు మెఱుపులకు దిగ్భ్రాంతి చెందినవి. మంద పట్లు విడిచి యీఁద నుపక్రమించుచున్నవి. తెవులు గొంట్లు, ముదుసళ్ళు, ఈ బాధలకు నోడి మరణించుచున్నవి.ఇఁక గోపాలుర గుడిసెలు కూలిపోయినవి. బండ్లు తడబడుచున్నవి. సొమ్ములు శిథిలపడినవి. పాకాది క్రియలులేవు దోహనములు లేవు. తృణము లేదు, అంతయు జలమయము కాఁగా శ్రీకృష్ణుని కావుకావుమని మొఱలిడు చున్నట్లున్నవి.

మూలమున గోవులదశ మాత్రమే వర్ణింపఁబడినది. ఎఱ్ఱయ హరివంశమున గోవుల - గోపాలుర బాధలును చిత్రింపఁబడినవి.

అతివృష్టి కలిగినపుడు ప్రతి దేశము నందును ఇట్టివే సంభవించు చుండును. అంతట జలమయము. ఎటు చూచినను జలమయమే! గ్రాసవాసముల కిబ్బంది కలుగును. ఎచ్చటను తృణము కన్పించదు. గ్రాసములు లేక పశువులు క్షీణించును. ...బారవముల నాక్రందించును నిలువలేక పెనురొంపిలో పడిపోవుచుండును. ...ములకు, మెఱుపులకు దిగ్భ్రాంతిని చెందును. గుడిసెలు కూలిపోవును. అతివృష్టి ...భవించు నపుడొంటొంటి చాటునకు తలదాచుకొనుటకు పశువులు పరుగులిడు చుండుటయు సహజము. ఇట్లు ఎఱ్ఱయ సహజ చిత్రకారుడు.

విశ్వాసములు :-

దాన ధర్మములు, తీర్థ సేవలు - వీనియందు ప్రజలకు ప్రగాఢ విశ్వాస ముండెడిది. పూజాసమయములందు, జాతకర్మాది సందర్భముల యందు అన్నదానములు, సంతర్పణలు, జరుపుచుండిరి. జాతరలు, ఉత్సవములు జరుపు కొనుచుండిరి. పూజలు, యజ్ఞములు గావించుచుండిరి. రోగ శాంతులకై దేవతా పూజలు సల్పుచుండిరి. అతిథి అభ్యాగతుల నాదరించుచుండిరి. బాలురకు 'దిష్టి' తగులకుండ దిష్టి తీయు నాచారమూ నాఁటిదే !

యశోదా నందులు - శకటము విపర్యస్తమైనపుడు, సురక్షితముగ నుండు శ్రీకృష్ణుని కనుఁగొన్నారు. అప్పుడు - "అచ్చోటి ధూరజము పుచ్చి పిడిచివైచి, తూఁపొడిచిరి. విశేషించి నందుఁడు బృందారకులకెల్ల వందనంబు సేసి నందనునకు నభయప్రదుఁలుగా నభ్యర్థించె" - ఇది మూలమునలేని వర్ణన. శ్రీకృష్ణునకు-పూతన విషపూరిత దుగ్ధము నిచ్చుటకు వచ్చితానే మరణించినది. అప్పుడా బాలుని, పూతన భయంకరాకార శవమును గాంచినారు. అఖిల గోపాలకులు నయ్యుపాయంబు దప్పిన యొప్పిదంబు పేనవేలు భంగులం గొనియాఁడి యా డాకినీ కళేబరంబుఁ దొలంగం దిగిచిరి. నందుఁ డానందంబున సూ ం దా నెత్తుకొనినాఁడు -

"గోకరీష మిశ్రితంబగు ధూరజంబు పరఁగం గావి రక్షా తిలకంబు వెట్టి -

సీ॥ శ్రీనాయకుండు రక్షించు నీ ముందర
వేధ రక్షించు నీ వెనుక దిక్కు
వరుస నీ దక్షిణ వామ భాగంబులు
రక్షింతు రవ్విరూపాక్ష గుహులు
నీ మీఁదు దిగువయు నీరజాహితుఁడు వా
సుకియు రక్షింతురు ప్రకట కరుణ
దిక్కులుగాద్పు నీ తకింన చోటులు
రక్షింతు రెప్పుడు నక్షతముఁగ

తే॥ గీ॥ స్వస్తిఁ గావించు నీకు వృషధ్వజుండ
నాకులైశ్వర్య శాలి పినాక పాణి

నిత్యశివలగు గోవులు నియత పుణ్య
యైన భూమియు నిను నెల్లయందుఁ బ్రోచు"

హ. వ 1-5-161

—"అని యిట్లు బాలరక్షార్థంబు పూర్వమునిఁ కల్పితంబులగు మంత్రంబులు జపియించి" – ఇట్లు దృష్టి తగులఁగూడ దని సర్వవిధముల సర్వదేవతల ప్రార్థించుట, భూరజంబు తూపొడిచి రక్షా తిలకంబు పెట్టుట – వారి సద్యశ్చర్యలు.

ఇవి మూలమునలేని వర్ణన. ఈనాటికి పల్లెలలో నీ 'దిష్టి' తీయు నాచారము కన్పించుచున్నది. ఆతిథ్యము నొసంగుటలో – భారతీయుల దొక విశిష్టత. అది అనాదినుండియు గౌరవింపఁబడు నొక ఆచారము.

అక్రూరుఁడు వ్రేపల్లె కేఁగినాఁడు. అప్పుడు రామకృష్ణు లాతనితో నొక్క బంతిన యారగించిరి. గోరసధారలతో (నెయ్యి, వెన్న, పాలు, పెరుఁగు మజ్జిగ) హృద్యముఁగా విచిత్రాహారములను సమర్పించిరి. ఒక్క చోటన మహాశోభాఢ్య శయ్యోపరి శయనించిరి. ఒక్కచోటనే భోజనము, ఒక్కచోటనే శయనము – అభిమానాదరములను సూచించు ప్రక్రియలు, చతురాలాపములఁ గావించుకొనిరి.

వ॥ "అతఁడుం దానును నొక్కబంతిన విచిత్రాహారము ల్గోరస
 ప్లుతి హృద్యంబులు గాఁగఁ గైకొని దయాలోలాత్ములారోహిణీ
 సుత దామోదరులొక్కచోటన మహాశోభాఢ్య శయ్యోపరిం
 జతురప్రీతి శయించి కార్యకథనాసంసక్తులై యున్నెడన్"

హ. వి. 1-8-146

ఇది యానాటి అతిథి సత్కార స్వరూపము. ఒక్కచోటన – ఒక్కబంతిన విచిత్రాహారములు, గోరసము హృద్యముఁగాఁ గైకొనుట, ఒక్కచోట మహాశోభాఢ్య శయ్యయందు ప్రీతిని శయనించుట – ఈ మొదలగునవి అతిథి సత్కార భాగములు.

గ్రామాధికారులు రాజులకు కప్పములు చెల్లించెడివారు. ఉపాయనములను గ్రహించి, చని రాజులొనర్చు నుత్సవము లందు పాల్గొనువారు.

"నందగోపాలాదులు నారాజునకు నయ్యేటం బెట్టవలయు నప్పనంబులుఁ బాడియావులు నెనుములుఁ బొగరు కోడెలు నజావిక ప్రముఖంబులుఁగొని గోరసంబులు సాలం గూర్చుకొని వేఁగుజాము గలుగం బయనం బయి కదలిరి"

ఈవిధముగ గ్రామాధికారులు రాజులకు పాడియావులను, నెనుములను, పొగరు కోడెలను, అజావిక ప్రముఖంబులను, గోరసంబులను - అప్పనములుగాఁ బెట్టు చుండిరని తెలియుచున్నది.

బలరామ కృష్ణులు కంసుని సభ కేతెంచినారు. అతని పట్టణమును పరిశీలించు చున్నారు.

"అనేక నరనాయకోపాయన సహస్రంబుల నజస్రంబులై గ్రందుకొను కరి తురగస్యందన సుందర వస్తు విస్తారంబుల నత్యుదారంబగు కంస మందిర ద్వారంబు ప్రవేశించిరి"

ఆనాఁటి గ్రామీణులు నరనాయకులును, రాజుల కిట్టి యుపాయనముల సమర్పించు చుండిరని యూహింప వచ్చును.

మూలము :-

"యాస్యంతి చ వ్రజా స్సర్వే గోపాలాస్స పరిగ్రహాః
కంసాజ్ఞయా సముచితం కరమాదాయ వార్షికమ్"

సముచితమగు వార్షికమగు కప్పముగొని గోపాలు రందఱు కంసుని యాజ్ఞచే వత్తురు" - "సముచితమగు కప్పము" - అనుట మూలము.

కాళియుండుండు మడుఁవునందు శ్రీకృష్ణుఁ డుఱికినాఁడు. ఆప్పుడా ఆవేదనను గ్రామీణు లందఱును అనుభవించిరి.

"గోపాలురుం దమలోనన వగఁచి యింక శోకింపంబనిలేదు. మనమిమ్మడుఁగు లోనం గృష్ణుం డుఱికినయట్ల యుఱికి యిక్కుఱకుఁ బాముతోడ నెబలావునఁ బెనంగి కుమాచు విడిపింతము గాకున్న నతని తోడిద లోకంబుగాఁ, గాళియకాలాహి యను కాలుని పాలువడి చిక్కుదము" అనుచున్నారు.

శ్రీకృష్ణుని దుండగముల సహింపలేక జోటికిఁగట్టి కార్యవ్యగ్రతచే లోనికేఁగినది యశోద. అపుడు వృక్షముల కూల్చినాఁడు, ఆ వృక్షములు కూలినవని పల్లె యంతయు బాలుని క్షేమమునకై గగ్గోలు పడినది.

శ్రీకృష్ణుండు కాళింది మడువున దూకినపుడు అతనితోడిదే లోకమని తాముసు దూకుటకు నిశ్చయించుకొనిన బాలుర భావములు - ఆనాటి సంఘీ భావమును దెలుపు చున్నవి.

ఉపసంహారము :-

గ్రామీణ ప్రజల జీవితమున మూలముతో బోల్చి చూచినపుడు, ఎఱ్ఱయ హరివంశ మున నెన్నియో విశేషములు తెలియుచున్నవి. కొన్ని రెండు గ్రంథము లందును సామాన్యములు. కొన్ని మూలము వలనే పరిమితములు. కాని పెక్కులు విశేష ములు ఎఱ్ఱయ హరివంశమునకే చెల్లినవి.

సామాన్యము :-

గ్రామీణులు సంఘజీవనము గడుపుచుండిరి. జాతరలందు నుత్సవములందు, ప్రజలందఱును సామూహికముగ పాల్గొనుచుండిరి గ్రామాధికారులు కష్టసుఖము లందు ప్రజలకు బాసటగా నుండిరి. భూతావేశములను - పూనకములను నమ్ము చుండిరి. పూజలు - శాంతులు - మొదలగు సమయములందు గ్రామవృద్ధుల యాదేశములను అందఱు పాటించుచుండిరి. - రోగశాంతులకై శివపూజాది వ్రతముల నాచరించుచుండిరి. గోవులతోడిదే తమ జీవితమని వానిని కంటికి ఱెప్పవలె కాపాడు చుండిరి.

జాతరలు - ఉత్సవములు - జాతసంస్కారాదులు - ఇట్టి సమయములందు, దాన ధర్మములు - అన్నదానము వస్త్రదానము గావించుచుండిరి. తుష్టిగాఁ దిన్ని పుష్టిగాఁ నుండి, తమ జీవనము నలుగురికి నుపయోగముగా, నాడుచు - పాడుచు కలసి మెలసి శ్రమైక జీవనులై సంఘజీవులై ఆనందించు యథాలాభ సంతుష్టులు పల్లె పజలు - ప్రజలు - గ్రామాధికారుల యాజ్ఞలకు లొంగినను, నియంతృత్వము లేదు.

ఎఱ్ఱయ గ్రామ యువతు లోకపరి శ్రీకృష్ణుని యాగడములకు తాళఁజాలక యశోదతో, "పోయెద మెచ్చటి కైనను" అని నిష్ఠురము లాడుచున్నారు. అపుడు యశోద కోపింపలేదు, కలహింపలేదు, వారికి, నచ్చఁజెప్పుచున్నది. 'మీరు లేక వేగునె మాకున్' అని వారి ప్రాముఖ్యతను పొగడినది.

"చేసెం జేయఁడు బాలకుఁ
డాసుర పుం బనులు నిజములని యెవరు బలే"

యని బాలకుని యాగడములను సవరించుచున్నది.

"ఇంకిట చూచుకొందు, నితని నెట్లడం చెదనో" యని వారికి ధైర్యము కలిగించి పంపినది. ఇట్లు గ్రామాధికారి భార్యయైనను ప్రజలను పోగొట్టుకొనలేదు. అట్టి స్వభా

వమే ఆనాటి గ్రామాధికారులది. నందుఁడు గ్రామాధికారి. గ్రామప్రభువుల కుమారు లాగడములు చేసినపుడు, గ్రామీణులు 'ప్రభువుల పుత్రు' లని యణఁగి యుండు వారుకారు. ముఖముపైనే అడుగు తత్త్వము కలవారు. ఆనాడు ప్రజలలో నింతటి ధైర్యముండిన దని చెప్పవచ్చును.

గ్రామీణులలో సంఘీభావము వెన్నతోఁ బెట్టినవిద్య. కనుకనే శ్రీకృష్ణుఁడు కాళియ మడువులోనికి దూకినపుడు, అతని తోడితే తమ లోకమని బాలురు తాముసు మడువులోనికి దూకెద మని నిర్ణయించుటఁ జూడ, అన్యాయము జరిగినపుడు ముఖ ముపై నడుగుట, కష్టములలో సహకరించి వారి ప్రాణములే తమవిగా భావించుట, ఉత్సవములలో కలసి మెలసి యానందించుట ఆనాటి గ్రామీణుల స్వభావము.

కోపించి తూలనాడినపుడు 'పాలకులును' మీచు లేక వేగునె మాకున్' అని 'పాలితుల' నోదార్చి అందఱి సహకారముతోడనే తామచ్చట. అధికారము కల్గియున్నా మని, వారిని పొగడి, అనునయించి, సంతోషపెట్టువారు.

శ్రీకృష్ణుఁడు మడువులోనికి దూకినపుడు ఒక్కుమ్మడిగా పల్లెయంతయును పరువిడి వాపోవుచు, నందునికి మార్గము చూపుచు, యశోదను పట్టుకొనిపోవుటఁ జూడ - ఆనాటి సంఘీభావము, సోదరభాతృత్వము, పరస్పర సహకారమును దెలిసి కొన వచ్చును.

గ్రామీణులలో ఆస్తిక భావము వెల్లివిరియు చున్నది. పశువుల తోడిదే తమ జీవితమని యెంచువారు.

ఈ విధముగ ఎఱ్ఱయ పల్లెలు తెలుఁగు పల్లెలెనవి. ఆ బాలురు తెలుగు పల్లీయులు. వారిక్రీడలు - ఆంధ్రుల క్రీడలు. ఎఱ్ఱయ గ్రామీణుల ఆచారములు, ఆంధ్ర గ్రామీణుల ఆచారములు, ఆ గోపికలు తెనుఁగు వనితలు. ఆ యశోద తెలుగు ఇల్లాలు.

# 9. ఎఱ్ఱయ - మూలము నందలి వదలిన ఘట్టములు - త్యాగహేతువులు

ఎఱ్ఱయ - "నన్నయభట్ట తిక్కకవి నాధులు చూపిన త్రోవ పావనం బెన్న" నని నన్నయ - తిక్కనల త్రోవ తనకు పరమ పావనమని భావించిన వాఁడు. ఈ భావముతోనే హరివంశాంధ్రీకరణమునకు నుపక్రమించినాఁడు.

నన్నయ తిక్కనల భారతము అనువాదమయ్యును, అతి స్వతంత్ర పద్ధతిలో నడచినది. అనువాదమయ్యును, ఎవరికి వారు తమదైన యొకశైలిని స్థాపించు కొనినారు. వారు చూపిన త్రోవ పరమ పావన మని భావించిన ఎఱ్ఱయయు - తన ధ్యేయమున కనుగుణముగ హరివంశమును మార్చి, కూర్చి యనుపదించినాఁడు. తనదగు 'వర్ణనాత్మక శైలి'ని స్థాపించుకొనినాఁడు తన లక్ష్యసిద్ధికై - మూలము నందలి కొన్నిఘట్టముల ననువదింపక పూర్తిగా తొలఁగించి నాఁడు. అట్లు తొలఁగించిన ఘట్టములను, తొలఁగించుటకుఁ గల కారణముల నరయవలయును - అట్లాయాఘట్టములను తొలఁగించుటచే ఎఱ్ఱయ సాధించనదేమో గుర్తింపవలసియున్నది.

అట్టు తొలఁగింపఁబడిన వానిలో 'ఆర్యాస్తుతి' యొకటి. ఇది ముప్పదియేడు శ్లోకములతోఁ గూడిన మాయాదేవిని గూర్చి గావించిన స్తుతి.

ఈ స్తుతి - యా సందర్భమున నంత సుదీర్ఘమైనది యనవసరము గనుక వదలివేసినాఁడు.

## — నానావ్రతములు —

**పుణ్యక వ్రత విధానము :-** ఉమాదేవి పుణ్యకవ్రత విధానమును. ఫలమును వర్ణించుట - ఈ వ్రతములో పాటు నానావ్రతముల పట్టికను, మూలమున సుమారు రెండు వందల అరువది యైదు శ్లోకములను అనువదింపక వదలినాఁడు

పుణ్యక వ్రతవిధానము - ఇదియొక వ్రత విధానమును, ఆ వ్రతమున చేయ వలసిన నియమములను, ఆచరింపవలసినయనుష్ఠానములను, వ్రతానంతర ఫలమును తెలియఁజేయు వివరణ పట్టిక. ఈ వివరణ వలన కథకుఁగాని, పాత్రచిత్రణకుఁగాని రసపుష్టికిఁగాని ప్రయోజనము లేదు గనుక ఎఱ్ఱయ దీనిని వదలి వేసినాఁడు.

నానా వ్రతముల విధానము - వ్రతములు. వ్రతములను గావించు రీతులు - వ్రతఫలములు - ఇవి సంస్కృత హరివంశము పురాణము గనుక, అపురాణ లక్ష్యము ధర్మోపదేశము గనుక సరిపోయినది. తెలుఁగు హరివంశము కావ్యము గనుక నివి యనవసరమని భావించి, ఎఱ్ఱయ వీనిని తీసివేసినాఁడు.

ఈ వ్రతముల విధానము సుదీర్ఘమై విసుగు జనించున దైనను, అనాఁటి దేశ, కాల, సంఘ పరిస్థితుల కట్టి బోధ అత్యవసరమై యుండవచ్చును. అకాలమున నుచితమై ఎఱ్ఱయ కాలమున - దేశమున సుదీర్ఘములై యుండవచ్చును

పిండారక తీర్థయాత్ర :-

సముద్ర యాత్రఁ గావించుట షోడశ స్త్రీ సహస్రములతో క్రీడించుట, జలక్రీడ లాడుట - మూలమునుండి యనువదించక తొలఁగించినాఁడు. నారదుని వంటి దేవర్షి స్వయముగ రాసక్రీడను నిర్వహించుట - సత్యభామ దులను చూచి, చూచి నవ్వుచు చేష్టల ననుకరించుట - ఆ నారదుని పాత్రను దివినుండి భువికి దింపుట యౌటిది. కనుక ఎఱ్ఱయ ఈ ఘట్టమును తెలిఁగింపలేదు.

ఈ విధముఁగా - అంధకాసురవధ పిండారక తీర్థయాత్ర, నికుంభవధ, వజ్రనాభునివధ, ప్రభావతీ హరణము, హంస డింభకోపాఖ్యానము - ఎఱ్ఱయ పూర్తిగా వదలిన ఘట్టములు.

షట్పురవధ :- వైశంపాయనుఁడు జనమేజయునితోఁజెప్పిన కథ యిది. ఈశ్వర వరప్రసాది నికుంభుడు-

కథా సంగ్రహము :- రుద్రుఁడు త్రిపురముల నాశమొనర్చినపుడు ప్రధానులగు అసురోత్తము లనేకులు మిగిలిపోయిరి. వారు త్రిపుర బాసు లయ్యును, రుద్రుని బాణమునకు గుఱికాలేదు. జ్ఞాతి వధచే తపించుచుండిరి, సత్పురుషులకు ప్రీతిపాత్ర మగు జంబూమార్గమునకు వెళ్లి తప మాచరింపఁదొడఁగిరి. అతిత్యాగ కభిముఖులు, వాయుభక్షకులునై బ్రహ్మను గుఱించి లక్ష సంవత్సరములు తప మాచరించిరి. కొందఱు కపిత్థ వృక్షము నాశ్రయించిరి. మఱి కొందఱు ఉదుంబర వృక్షము క్రింద తప మాచరింపఁదొడంగిరి, మఱి కొందఱు సృగాల వృక్షచ్ఛాయ నాశ్రయించిరి. కొందఱు వట వృక్షాగ్రముపై నుండి బ్రహ్మను గూర్చి తప

మాచరింపఁదొడగిరి. అప్పుడు పితామహుఁడు ప్రత్యక్షమై వరమును కోరుఁడని యాదేశించినాఁడు. ఆది మధ్యాంత రహితుఁడు ఉమా సహితుఁడు నగు త్ర్యంబకుని ద్వేషించు నసురులు, వరమును కోరలేదు. అభవుని మహిమను గుర్తించిన కొందఱు మాత్రము వరము కోరిరి. తక్కిన వారిని రుద్రునిపై ద్వేషము సాధించు మార్గము దప్ప మఱేమైనను కోరుఁ డని యడిగెను. అప్పుడు వారు సర్వదేవతలకు నవధ్యులగు నట్లు, షట్పురము అందు వసించునట్లు సర్వకామములు సమృద్ధము లగునట్లు, రుద్రుని వలన భయము కలుగ కుండునట్లు వరము నర్థించిరి.

అప్పుడు బ్రహ్మ, "అసురులారా ! మీరు దేవతలకు శంకరునకు అవధ్యు లగుదురు. సన్మార్గవర్తనులైన బ్రాహ్మణులను బాధించ కుందురు గాక ! మోహవశమున జగత్తున కాశ్రయులగు బ్రాహ్మణులను చంపినచో సర్వభూత హితుఁడగు నారాయణునిచే నాశమొందఁ గలరు" అని తెల్పి వరమొసంగి, యంతర్హితుఁడయ్యెను.

అనంతరము మహాదేవ భక్తులగు తక్కిన వారికి, స్వయముగా మహాదేవుఁడే దర్శన మొసంగి ఇట్లనెను

"ఓ అసురోత్తములారా ! హింసాదంభములను వదలి మీరు నన్నే ఆశ్రయించితిరి. కావున సంతసించి, వరమొసఁగు చున్నాను. మీ కీ సత్కర్మ దీక్ష నొసంగిన బ్రహ్మర్షులతోపాటు మీరును స్వర్గలోకమున కేఁగుఁడు. ఇచ్చటనే కపిత్థ వృక్షమూలమున నివసించువారు 'కాపిత్థకు' లని పిలువఁ బడుదురు. వారికి నాతో సమానమగు లోకము లభింపఁ గలదు. ఈ క్షేత్రము అందు వసించు వారి పూజా తపములు ద్విగుణీకృత ఫలముల నొసంగును. ఔదుంబరులు, కాపిత్థకులు సృగాల వాటీయులు – దృఢవ్రతులు నైన ధర్మాత్ములు – వీరి నెవరు పూజింతురో వారీప్సిత గతిని పొందుదురు." అని వరమొసంగి రుద్రలోకమునకు వెళ్ళెను.

ఆ షట్పురమున నొక బ్రాహ్మణుఁ డుండెను అతఁడు చతుర్వేద పారంగతుఁడు. యాజ్ఞవల్క్యుని శిష్యుఁడు. ధర్మగుణాన్వితుఁడు బ్రహ్మదత్తుఁ డను పేరఁ బరగువాఁడు. అతఁడు వసుదేవుని మిత్రుఁడు, సహాధ్యాయి ఉపాధ్యాయుఁడు. అతఁ డావర్తానదీ తీరమున యజ్ఞదీక్షితుఁడు. అతని సఖ్యమును పురస్కరించుకొని, వసుదేవుఁడా యజ్ఞమునకు వెడలెను. మునిశ్రేష్ఠు లనేకు లాయజ్ఞమును దృఢవ్రత దీక్షతో నుపాసించుచుండిరి. వైశంపాయన జాబాల్యాది మునులు ఆయజ్ఞము నధిష్ఠించి యుండిరి. ఆసమయమున వరగర్వితులగు నికుంభాది షట్పుర వాసులగు దైత్యులు విజృంభించిరి.

"యజ్ఞభాగమును మా కొసఁగి, నీ కుమార్తెలను మా కొసంగుము. లేదా యజ్ఞ ధ్వంసము గావింతు" మని దర్పముతో నడిగిరి. అందులకు బ్రహ్మదత్తుఁడు నిరాకరింప, నికుంభాదులు, రోషముతో యజ్ఞవాటికను ధ్వంసము గావించిరి. బ్రహ్మదత్తుని కన్యల నపహరించిరి. యజ్ఞవాటిక అస్తవ్యస్తమైనది.

బ్రహ్మదత్తుఁడు - వాసుదేవుని, బలదేవుని గదుని తలంచినాఁడు. విషయము నెఱింగిన కృష్ణుఁడు ప్రద్యుమ్నునితో - "పుత్రా ! వెళ్ళుము, మాయతో బ్రహ్మదత్తుని పుత్రికల శీఘ్రముగా రక్షించు. నేనును యాదవ వీరులతో షట్పద పురమును చేరుకొందును " అని పంపెను. ప్రద్యుమ్నుడు వెంటనే షట్పద పురమునకు వెళ్ళి మాయతో కన్యల రక్షించినాఁడు అట్టి కన్యలనే మాయతో సృష్టించి, అసురుల యొద్ద నుంచెను. అచ్చట తిరిగి యజ్ఞ కర్మలు శాస్త్రోక్తముగా ప్రారంభమైనవి. ఈ లోపల యజ్ఞమున కాహూతులైన, జరాసంధ, దంతవక్త్ర, శిశుపాల, పాండవాదులు — అచ్చటి కేతెంచిరి. నారదుఁడును అచ్చటికి - వచ్చినాఁడు. యాదవులకు నితర క్షత్రియులకు యుద్ధము కల్పింప వలయునని యాతని నిశ్చయము. నారదుఁడు నికుంభుని సమీపించి యిట్లనెను. -

"బ్రహదత్తుఁడు శ్రీకృష్ణుని స్వరూపము, వసుదేవుఁ డాతని సఖుఁడు అతని కైదువందల మంది భార్యలు, ఐదు వందల కుమార్తెలు, కుమారులు. ఆ కన్యలు వివాహితులైనను నిత్యము కన్నియలవలె భాసింతురు, పరిమళముతో వాసింతురు. అప్సరసల వోలె నృత్తగీతముల ప్రదర్శింతురు. ఆకన్యలలో చాలమందిని యదుముఖ్యుల కొసగినాఁడు. కేవల మొక నూఱుగురు మాత్రము మిగిలిరి. కావున నిచ్చటికి వచ్చిన రాజుల నందఱిని ఆ కన్యల పొందుటకై పురికొల్పుము. స్నేహము తోను, ఉపాయనములతోడను యుద్ధమునకు సాయపడున ట్లొనర్పుము". అని పురికొల్పెను. పాండవులు తప్ప నందఱును యుద్ధమునకు సన్నద్ధులైరి. ఇంతలో శ్రీకృష్ణుఁడు బలదేవాదులతోఁ గూడి సేనాసమేతుఁడై యచ్చటి కేతెంచెను. యజ్ఞరక్షణకు పాండవులను నియమించెను తక్కిన సేనలును గృహద్వారమున నిలిపెను. జయంత ప్రవరులను స్మరించెను. యుద్ధమునకు సంసిద్ధుడైనాఁడు.

ఇచ్చట — నికుంభుని యాధిపత్యమున అసుర సేనలు సన్నద్ధులైరి. భయంకర యుద్ధము సంభవించినది రక్తము వెల్లువలై పాఱినది. హెచ్చరికలు, పలాయనములు, వీరోత్సాహములు మిన్నంటినవి. శ్రీకృష్ణునిచే నికుంభుఁడు హతుఁడైనాఁడు.

ఇదియే మూలము నందలి నికుంభవధ, షట్పురనాశము, తెలుపు కథ. ఎఱ్ఱయ పూర్తిగా వదలిన ప్రాసంగికేతి వృత్తము. ఈ కథ ఈశ్వర వరప్రసాదుల దౌష్ట్యమును కించపఱచి, ఈశ్వర వరప్రసాది యగు నికుంభుని నాశము తెలియఁ జేయుచున్నది. ఆ వరప్రసాదిని యుద్ధమున హతమార్చిన శ్రీకృష్ణుని యమానుష శక్తిత్వమును చాటునట్టిది ఇది హరిహరా భేదతత్వమును పాటించును ఎఱ్ఱయకు గిట్టలేదు. ప్రధాన కథానాయకుని గుణములకు మెఱుఁగులు దిద్దునట్టిదే యైనను, ఎఱ్ఱయ భావమునకు విరుద్ధమగు విషయమును ప్రతిపాదించునది కనుక ఎఱ్ఱయ ఈ ఘట్టము ననువదింపక వదలినాఁడు.

ఇట్లు – కథానాయకుని మహిమలఁ దెలుపు ఘట్టము లింకను ననేకము లుండుటచే, కథలోని వైవిధ్యమునకు భంగము కలిగి, ప్రాసంగికేతి వృత్తములే మిక్కుటములై ప్రధానకథాగమనము కుంటుపడవచ్చునని భావించి, యెఱ్ఱయ తొలఁగించినాడు.

ఎఱ్ఱయ అనువదించక పరిత్యజించిన మఱొక కథ –

## అంధకాసుర వధ – సంక్షిప్త కథ :–

ప్రభవిష్ణుండగు విష్ణుండు తన పుత్రుల నందఱిని చంపిన కారణముగా దితిదేవి కశ్యప భగవానుని పుత్రులకై ప్రార్థించినది. తపస్సుచే, శుశ్రూషచే, మధుర వాక్కులచే, తుష్టునిఁ గావించినది. అతడు సంతుష్టుఁడై వరమొసంగెను. రుద్రుఁడు తనకంటెను అధికుఁడు. కనుక నారదుఁడు కాక తక్కిన దేవతలందఱి చేతను అవధ్యుఁడగు పుత్రుని వరముగా పొందినది. ఇట్లొసంగి కశ్యపుఁడు తన అంగుళితో దితిదేవి యుదరమును తాకెను. వెంటనే వేయిభుజములు, సహస్రమస్తకములు, ద్విసహస్ర నేత్రములు, అన్నియే పాదములు కలిగిన పుత్రుఁడు జన్మించెను. అతఁ డంధుఁడు కాకున్నను, నంధునివలె నడచుచుండుటచే అంధకుఁడని పిలువఁబడినాఁడు. తా నవధ్యుఁడని తెలిసి గర్వించినాఁడు. లోకముల బాధింపఁ దొడఁగెను సర్వలోక భయంకరుఁడై, యప్సరసలను దెచ్చి తన యింట బంధించెను. రదార పరద్రవ్యాదుల నపహరించెను అనేకులను అసురులను సాయముఁగాఁగొని త్రిలోక విజయమునకు నిశ్చయించెను.

దేవేంద్రుఁ డంధకుని విజయమును తండ్రియగు కశ్యపునకు దెలుపుకొనెను. కర్తవ్యమేమని ప్రశ్నించెను. కశ్యపుఁ డంధకుని వారించినాఁడు. అట్లు వారించినను సరకు గొనక. నా దుష్టుఁడు నందన వన వృక్షములను పెల్లగించెను. ఉచ్చైశ్శ్రవము

యొక్క సంతానమును హరించెను. దిగ్గజముల సంతానములను దేవతలు చూచు చుండఁగనే బలాత్కారముగా గొనిపోయెను. యజ్ఞ యాగములు గావించు వారిని విఘ్న పరచెను. తపమొనర్చువారికి భంగమును కలిగించెను. యజ్ఞకర్తలు యజ్ఞములు చేయఁజాలరైరి. తపస్వులు తపమొనరింపలేకుండిరి. ఆతని యిచ్ఛ ననుసరించియే పవనుఁడువీచుచుండెను. ఆదిత్యుఁడు తాపమును ప్రసరింపఁ జేయు చుండెను. చంద్రుఁడు నక్షత్రములును, ఆతని యాజ్ఞమేరకే ప్రకాశించుచుండిరి. ఆతనికి భయపడి విమానము లాకసమున సంచరింపవు. సమస్త జగమున ఓంకారము వినిపించుటయేలేదు. వషట్కారము లేదు. మాటికి - కురువులు, భద్రాశ్వులు. కేతుమాలులు - వీరిపై దండెత్తి పోవు చుండినాఁడు. దేవతలు, దానవులు - ఆతనికి భయపడి సన్మానించు చుండిరి. అంధ పీడితులగు ఋషులు బ్రహ్మవాదులు ఏకత్ర సమావిష్టులై యాతని వధోపాయమును చింతింపఁ జొచ్చిరి. వారిలో బృహస్పతి రుద్రుఁడొక్కడే వీనిని చంపఁ గలఁడు. అతఁడే యీతని అత్యాచారముల నెఱింగి చంపఁగలఁడు.

"వ్రతం హి దేవదేవస్య భవస్య జగతాం గురోః
సంతోఽ సద్భ్యో రక్షితవ్యా బ్రాహ్మణాస్తు విశేషతః"

"ఆ దేవదేవుఁడు సత్పురుషరక్షణయే వ్రతముఁగా గలవాఁడు". అని చింతించి యందఱును నారదుని శరణు పొందిరి. అంధకుని నాశమునకై నారదుని శంకరుని కడకు పంపిరి.

నారదుఁడు వెడలి మందారవన మధ్యమునం దుండు మహేశునిఁ గాంచెను. విషయమును విన్నవించి యాతని యంగీకారమును పొంది యా మందారమాలికను ధరించి వెళ్ళెను. సంతాన తరుపుష్పమాలికను గూడ ధరించి నాఁడు. ఆ మాలిక యుత్తమోత్తమ సుగంధమును వెదజల్లు చుండినది. ఆ మాలికను ధరించియే యంధకుని కడకేగెను. అంధకుఁడా సంతాన పుష్పమాలికా గంధము నాఘ్రాణించి, యచ్చెరువు నందెను. "ఎక్కడి దీ సుగంధ పుష్ప" మని యడిగెను. అప్పుడు మహాముని అంధకునితో "వీరా! మందరాచలముపై నున్న వనము నందలి దీ పుష్పము ఇది శూలపాణి సృష్టి. ఆ మహేశుని ఇచ్ఛలేనిదే ఆ వనము నందెవ్వరును ప్రవేశింపలేరు. ఉమాసహితుఁడై, పరమేశుఁడచ్చట క్రీడించు చుండును ప్రవరోత్తము లద్దాని ననవరతము రక్షించు చుందురు. స్త్రీరత్నములను, మణి రత్నములను, కోరినశ్రేష్ఠ వస్తువులను ఆ వృక్షములు ఫలరూపమున నొసంగు చుండును.

ఆ వనము, స్వయంప్రభమైనది. సూర్యుఁడుగాని, చంద్రుఁడు గాని యచ్చట ప్రకాశింపరు కొన్ని వృక్షము లచ్చట గంధములను, కొన్ని వస్త్రములను, కొన్ని జలములను ఇచ్చుచుండును. కోరినటువంటి - భక్ష్య, భోజ్య, పేయ, చోష్య, లేహ్యములను ఆ తరువులందు జనించును. ఆ మందార వనమునం దుండు వారికి ఆకలిదప్పులుండవు.

"స్వర్గస్యాపిహి తత్స్వర్గం సుఖానామపి తత్సుఖమ్
బభూవ జగతస్సర్వం ఇతిశ్చే ధీయతే మనః"

అది స్వర్గము కంటె అధికమగు స్వర్గము. సుఖములకును సుఖమొసంగునది" అని పొగడెను అంధకుఁ డాతని మాటలు విని మందరపర్వతమున కేగ నిశ్చయించినాఁడు గొప్పగొప్ప మేఘము లావరించినవి. మహౌషధము లందుండినవి. నానా సిద్ధ లోకచోట, మహర్షి గణ మొకవైపు, చందనాగరు వృక్షములు, సరళద్రుమములు కిన్నరోద్గీతములు, బహుసర్పములు ఫలములు గాలిలో నాట్యమొనర్చు చుండినవి. హంసలు, మహిషములు, సింహములు నిండినవి.

అంధకుఁడా మంథరాచలమునకు అధిష్ఠానదేవతతో 'నీ యందలి వనము నొసంగు' మని యడిగినాఁడు. దేవత మాయమైనాఁడు. క్రుద్ధుఁడై యంధకుఁడు యుద్ధమునకై సింహనాద మొనర్చెను. 'ఇదిగో నిన్నిప్పుడే చూర్ణముగావింతు' నని యొక శిఖరము పెకలించి మఱొక శిఖరముపై కొట్టెను. రుద్రుని యనుగ్రహముచే నా పర్వతము చెక్కుచెదరక పూర్వము వలె భాసించినది. ఆ పెల్లగింపబడిన శిఖరములు - అసురులనే వెనుదిరిగి కొట్టసాగినవి.

అప్పు డావనములో నంధకుఁడు "నీవు కాదు, నిన్ను సంరక్షించిన అధికారిని రమ్మనుము అతనితోనే యుద్ధము నొనరింపఁ గలను" అని పలికెను. అప్పుడు మహేశుఁడు క్రుద్ధుఁడై యేతెంచినాఁడు. అతని కోపమునకు ముల్లోకములు కంపించినవి. హరతేజాగ్ని సర్వత్ర వ్యాపించెను. సర్వగ్రహములును కంపింపఁ దొడఁగినవి. అంగార వర్షము కురిసినది. గిరులు కంపించినవి. చంద్రుఁ డుష్ణకిరణుఁడై నాఁడు. సూర్యుఁడు శీతప్రభుఁడైనాఁడు. బ్రహ్మజ్ఞులు బ్రహ్మజ్ఞానమును మఱచిరి. అశ్వములు గోవులను ప్రసవించినవి. గోవులశ్వములను ప్రసవించినవి. వృక్షములు కుప్పలు కూలి దగ్ధములైనవి. అట్టి భయంకర వాతావరణమున యుద్ధము సంభవించినది. శూలి యంధకునిపై శూలమును విసరినాఁడు. అది

యంధకుని యుదరముపైఁబడి భస్మసాత్తు గావించినది. దేవతలు సంతుష్టులై శంక రుని నుతించిరి. దేవ దుందుభులు మ్రోగినవి. పుష్పవృష్టి కురిసినది. ముల్లోకము లు హర్షించినవి. దేవ గంధర్వులు పాడిరి. అప్సరసలాడిరి. బ్రాహ్మణులు వేదముల పఠించిరి. యజ్ఞములఁ గావించిరి. గ్రహములు ప్రకృతి స్థములైనవి, దిక్కులు శాంతించినవి, ఉమాసహితుడై - ఇంద్రాది దేవతలతోఁగూడి పారిజాతమున శివుడు విహరించెను.

ఇది యంధకాసురవధ. ఈయుపాఖ్యానము ప్రధానేతి వృత్తమున కేమాత్రము నుపకరింపదు. కథాగమనమున కడ్డు కలిగించునది. మహేశుని యసాధారణ శక్తిని శిష్టరక్షణాసక్తిని, దుష్ట నాశమును తెలుపునదే యైనను - ఈ యుపాఖ్యానము హరి వంశ కథకుఁగాని హరివంశ పాత్రలకుగాని. ఏమాత్రముపకరింపదు. హరిమహిమతో నెట్టి సంబంధము లేనిది. కనుక ఎఱ్ఱయ దీనిని పూర్తిగా తొలఁగించి, వస్త్వైక్య మును కలిగించినాఁడు ప్రధానేతి వృత్తమునకు పోషకములు కాని, యుపాఖ్యాన ములన్ను తెనిఁగింపక, కావ్యత్వమును పుష్టి నందించుటకై పాటుపడెను. ఇట్లీవిధముగా కొన్ని ఘటనలను తొలగించి, యెఱ్ఱయ తన హరివంశమునకు కావ్యస్వరూపమును తీర్చి దిద్దినాఁడు.

## ఎఱ్ఱయ అనువదింపక వదిలిన మఱొక ఘట్టము
## భానుమతీహరణము — నికుంభవధ

యాదవులందఱును నొకపరి క్రీడాసక్తులై యుండిరి. అపుడు నికుంభుఁడు భానుని పుత్రిక యగు భానుమతిని అపహరించెను. భానుని సోదరుఁడు వజ్రనా భుడు. అతని కుమార్తె ప్రభావతి. ప్రద్యుమ్నుఁడామె నపహరించి వజ్రనాభుని చంపెను.

భానుమతిని మాయచే నపహరించినపు డంతః పురమున కోలాహలము చెలరేగి నది. ఆ కోలాహలమును విని, యుగ్రసేన వసుదేవులు కవచధారులైరి. వారి కెవ్వరును కన్పించలేదు. వెదకుచువారు శ్రీకృష్ణుని కడకేతెంచిరి. విషయము నెఱిఁగి శ్రీకృష్ణుఁడు గరుడు నధిరోహించెను. మాయావులలో శ్రేష్ఠుఁడగు నికుంభుఁ డాము గ్గురను చూచి మూఁడు రూపములుఁగా మాఱెను. యుద్ధ మొనరింప మొదలిడెను ఎడమ చేతితో భానుమతిని పట్టుకొనియే, కుడిచేతితో యుద్ధము చేయుచుండినాఁడు. ఆ ముగ్గురు సమర్థులైనను, భానుమతికి దెబ్బలు తగులునను భయముతో మిక్కిలి

జాగ్రత్తగా యుద్ధము చేయఁజొచ్చిరి. అందుచే నికుంభుడు మాయమై హరితపక్షి రూపమును పొందెను. అతఁ డెక్కడికి వెళ్ళినను ఆ ముగ్గురు వెంబడించి పీడించు చుండిరి. మహేశ ప్రభావము కలవాఁడు గనుక నికుంభుఁడు గోకర్ణ ప్రాంతమున పడిపోయెను. ఆయనను చూచి, ప్రద్యుమ్నుఁడు, భానుమతిని గ్రహించి, ద్వారకలో భద్ర పఱచి, తిరిగి యుద్ధమునకై వచ్చెను. ఈ లోపల శ్రీకృష్ణార్జునులు నికుంభుని వెంబడించు చుండిరి. నికుంభుఁడు షట్పుర గుహలో ప్రవేశించెను. అచ్చటనేయుండి బిలము నుండి వచ్చుచుండఁగా, ఆ ముువ్వురను అడ్డగించిరి కోపించిన భయంకర మగు గదతో పార్థుని తలపై కొట్టెను. అదృశ్యుఁడై ప్రహరించుటచే దిక్కు తెలియక అర్జునుఁడు మూర్ఛిల్లెను. అదే విధముఁగా మాయతో ప్రద్యుమ్నునిఁగూడ ప్రహరించి, మూర్ఛితుసఁ గావించెను ఇరువురును మూర్ఛిల్లుటఁ గాంచి శ్రీకృష్ణుఁడు క్రోధోద్రిక్తుఁడై కౌమోదకి గదను గ్రహించి, నికుంభునిపై కుఱికెను. ఇరువురకును భయంకర యుద్ధము సంభవించినది. ఐరావతముపై నుండి ఇంద్రుఁడు వీక్షించు చుండెను. గిర గిర గదలు త్రిప్పిరి. శ్రీకృష్ణుఁడు నికుంభుని గదాప్రహారముచే మూర్ఛితుఁ డయ్యెను. నికుంభుఁడును శ్రీకృష్ణుని గదాప్రహారముచే మూర్ఛితుఁ డయ్యెను.

శ్రీకృష్ణుఁడు మూర్ఛితుఁ డగుటతో జగత్తంతయును హాహాకార మొనరించినది. స్వయముఁగా నింద్రుఁ డాకాశ జలముచే తడిపెను. "అంతటి మహాత్ముఁ డాత్మేచ్ఛతోఁగాక మూర్ఛిల్లుటఁ గలదా ?" యని తలంచుచుండిరి. కొంత తడవునకు మూర్ఛతేరి శ్రీకృష్ణుఁడు - చక్రము తీసి చంప నుద్యోగించినాఁడు. ఇది తెలిసిన నికుంభుఁడు మాయతో నెచ్చటికో యెగిరిపోయి నాఁడు ఈ మాయ కృష్ణునకు తెలియదు. ఇంతటితో ప్రద్యుమ్నార్జునులు తెలివి నొందిరి. ప్రద్యుమ్నుఁడు, మాయ విద్యలు తెలిసినవాఁడు. శ్రీకృష్ణునితో, "నికుంభుఁడిటలే'దని తెలిపెను. అది విని యాకళేబరమును నాశ మొనర్చ శ్రీకృష్ణుఁ డానందించెను. తక్షణమె - కోట్ల కొలది వీరవరుల, నికుంభాకారులను, నాకసమున, దిశలందు, భూమియందు - సర్వత్ర గాంచిరి. సహస్ర సంఖ్యలో శ్రీకృష్ణార్జునులను ప్రద్యుమ్నుడును కనిపించ సాగిరి. ఈ దృశ్యము చూడ ముచ్చటగా నుండినది.

సహస్ర సంఖ్యల కోలాహలములతో నికుంభరూపములు అర్జున రూపములను ఎత్తుకొని పోఁజొచ్చినవి. మాయలకే మాయలను కల్పించు నా కృష్ణుఁడు నిజమైన నికుంభుని గుర్తించినాఁడు. చక్రముతో తల నుత్తరించినాఁడు. అర్జునుని వదలి

నికుంభుఁడు క్రిందపడి మరణించెను. అట్లు పడిపోవుచున్న అర్జునుని ప్రద్యుమ్నుడు గ్రహించెను. అనంతర మందఱును ద్వారక కేగిరి. అచ్చట శ్రీకృష్ణుఁడు నారదునకు నమస్కరించెను. నారదుఁడు భానుఁడను యాదవుపైఁ గాంచి దుఃఖింపకుమని యాశ్వాసించెను. అతఁడు –

"ఒకప్పుడీ భానుమతి రైవతోద్యానమున నాడుచుండి, దుర్వాస మహర్షికి కోపము కలిగించినది. అతఁడు శాపమిచ్చెను. 'ఈ దుష్టచేష్టలను చేసినందున నీ కన్య శత్రుహస్తమును పొందఁగల'దని శాపము నొసంగెను. నీ సుతకై నేనును తక్కిన మునులును అనేక విధములుగా ప్రార్థించితిమి. అప్పుడు దుర్వాసుఁడు దయఁదలఁచి, 'నామాటకు తిరుగులేదు. అవశ్య మీకన్య శత్రు హస్తము పొందఁగలఁదు కాని యేదోషమును లేక, తిరిగి భర్తను పొంది బహుపుత్రయై, బహుధనయై సౌభాగ్యవతియై ప్రకాశింపఁగలదు. కనుక నీభానుమతిని సహదేవున కొసంగుము. ఈ పాండు సుతుఁడు ధర్మాత్ముఁడు; శూరుఁడు; శ్రద్ధాళువు." అని తెలిపెను.

అనంతరము – భానువు ఆకన్యను, సహదేవున కొసంగి వివాహము గావించెను. ఇది కథ

అంతమున నీ కథా శ్రవణమునకు ఫలశ్రుతి –

"ఇమం కృష్ణస్య విజయం యః పఠేత్ శృణుయా దథ
విజయం సర్వకృత్యేషు శ్రద్దధానో లభేన్నరః

ఇట్టి కథయు శ్రీకృష్ణుని విజయము తెలుపునదే; ఇదియును నా నికుంభుని వంటిదే, నికుంభుని కథను – అర్జునునకు శ్రీకృష్ణుఁడు చెప్పు సందర్భమున – "నికుంభుఁడొక మహాభూతము ఉత్తర కురు దేశములకు వెళ్ళి లక్ష సంవత్సరములు – మహాదేవుని గుఱించి తపసు గావించెను. శివుడు ప్రత్యక్షమై వరము కోరుమనెను. అప్పుడు తనకు – దేవతలకు, అసురులకు – అవధ్యములగు మూడు రూపముల నొసంగు మని ప్రార్థించెను.

అప్పుడు; నాకు గాని, విష్ణువునకుఁగాని, బ్రాహ్మణులకుగాని అప్రియ మాచరించినచో, శ్రీహరిచేత చావగలవు, తక్కిన ఎవ్వరును నిన్ను చంపలేరు." అని తెలిపినాఁడు.

"షట్పుర, సందర్భమున ఒక శరీరమును చంపెను. భానుమతి హరణ సందర్భ మున మఱొక శరీరమును నాశమొనర్చెను. మూడవ శరీర మేమైనదో, హరివంశమున తెలుపలేదు.

కనుక నిట్లొక రాక్షసుని మూడు రూపములను చంపుటకు మూడు కథలను పెంచవలయు ననిన ప్రధాన కథ కంటెను ప్రాసంగికములే అధికము లయిపోవును.

ఇట్లు కథాగతి కుంటుపడుటయే గాక ప్రధానకథ అప్రధాన మయిపోవుటయు గలదు. కథాగమనము కుంటు వడక, సుదీర్ఘేతి వృత్తమును సంక్షేపించుటకై యెఱ్ఱయ ఈ కథను కూడ తొలఁగించినాఁడు.

వజ్రనాభుని తపస్సు : ఎఱ్ఱయ తెనిగించలేదు.

నికుంభవధ సందర్భమున వజ్రనాభ వధ ప్రస్తావము కలిగినది, కదా ! దానిని వివరింపుమని యడుగుటతో వైశంపాయనుఁడు జనమేజయునకు కథను చెప్పు చున్నాఁడు.—

వజ్రనాభుఁ డొకసారి మేరుపర్వత శిఖరముపై గొప్ప తపము గావించెను. బ్రహ్మతుష్టుఁడై వరము కోరుమనెను. దేవతలచే నవధ్యత్వమును, వజ్రపురాధిపత్య మును వజ్రనాభుఁ డడిగినాఁడు.

ఆ వజ్రపురమున వాయువుగూడ స్వచ్ఛందముగా ప్రవహింపదు. కోరకనే సమస్తవాంఛలు నా నగరమున లభించు చుండినవి. ఆ నగరము శతసంఖ్యాకము లగు నుద్యాన వనములతో నిండినది. వరదానమును పొంది వజ్రనాభుఁడు దర్పించి జగముల పీడింప మొదలిడెను. ఇంద్రుని కడకేఁగి, "నేనే స్వర్గమును పాలింపఁ దలఁచుచున్నా" నని యడిగెను. ఇంద్రుఁడు బృహస్పతితో మంతనమాడి వజ్ర నాభునితో, "మాతండ్రి కశ్యపుఁడు యజ్ఞ దీక్షితుఁడై యున్నాఁడు. ఆ యజ్ఞము సమాప్తమైనను తరువాత నతఁడెట్లు తలంచిన నదే విధముగా నిర్ణయించెదము" అని పలికెను. ఆవిషయమును వజ్రనాభుడు వెళ్ళి కశ్యపుని అడిగెను. కశ్యపుఁడు తాను గావించు యజ్ఞము పరిసమాప్తియగు నంత వఱకు వేచియుండుమనెను. వజ్రనాభుఁ డంగీకరించి, నిజపురమున కేగెను. ఇంద్రుఁడు ద్వారక కేఁగి శ్రీకృష్ణునకుఁ దెలిపెను

కశ్యపుని యజ్ఞము నందు భద్రనాముఁడను నటుఁడు తన యుత్తమ నాట్య ముతో మహర్షుల సంతుష్టులఁ గావించెను. అప్పుఁ డాతనిని వరము కోరుమనిరి. ఆ నటుఁడు సరస్వతీ ప్రేరితుఁడై దేవేంద్రకృష్ణుల యిచ్ఛానుసారముగా, "సప్తద్వీపము

లందు బ్రాహ్మణులు సర్వత్ర నన్నాదరింతురు గాక! నాకు ఆకాశగమనము, స్థావర జంగములతో నవధ్యత్వము సిద్ధించునుగాక! బ్రదికిన చనిపోయిన యే వ్యక్తిరూపము నైన నేను పొందుదును గాక! జరా రోగములు నన్నంటకుండును గాక! మునులు, ఋషులు తుష్టి చెందుదురుగాక!" యని వరమును కోరెను. "అట్లే యగుగాక" యని మునులు వరమొసంగిరి.

ఆ నాటి నుండియు దైవీశక్తిని సంపాదించిన నటుఁడు సప్తద్వీపవతి యగు పృథ్వియందు సంచరించు చుండెను. అనంతరము – ఇంద్రుఁడు దేవలోకమున నివసించు హంసలను పిలిచెను. ఇట్లనెను.

"ఓ పక్షులారా! మీరు కశ్యపవంశ సంజాతులరు. దేవతల విమాన వాహకులు ఆ దేవతల కత్యవసరమగు కార్య మొకటి సంభవించినది. మీరు సర్వత్ర సంచరించు వారు. కనుక వజ్రనాభుని యంతఃపురమునకు వెళ్ళుడు. ఆ వజ్రనాభుని కన్యారత్న మతిలోక సుందరవతి ప్రభావతి. ఆ కన్య హైమవతీ వరప్రసాదిని. ఆమె బంధువులు స్వయంవరమును నిర్ణయించిరి. మీ రటకేగి ప్రద్యుమ్నుని గుణ గణములను వర్ణింపుఁడు. అనంతర మామె సందేశమును గ్రహించి, ప్రద్యుమ్ను కందఁజేసి, యా సందేశమున కుత్తరము నందింపుఁడు ఈ మధ్యలో మీ మేధాశక్తిని కూడ ప్రయోగించి కార్యమును సానుకూల మొనర్పుఁడు. బ్రహ్మతో వరమును పొందిన వజ్రనాభుఁడు మొదలగు వారు దైత్య దానవులకును అవధ్యులు. వారు ప్రద్యుమ్నాది దేవకుమారులచే తనే వధ్యులు. భద్రనటుఁడు వరప్రసాది. అతని వేషమును ధరించి, ప్రద్యుమ్నాది యాదవులు – వజ్రనాభుని చంప నానగరమునకు వెళ్ళఁగలరు. ఇంకను సమయోచిత ప్రజ్ఞతో మాకార్యము నెఱవేర్పవలసి యున్నది.

ఆ వజ్రనాభుని యభీష్ట ప్రదేశమున దేవతలు ప్రవేశింపలేరు. ఇంద్రుని వాక్కులను విని హంసలు వజ్రపురమునకు వెళ్ళినవి. మధురకూడితము లొసర్చినవి. రమణీయ స్వర్ణ కమలములతోఁగూడిన సరోవరములందు వెళ్ళినవి. సంస్కృత భాషను మాటలాడుచుండినవి. అంతఃపుర దీర్ఘిక లందు విహరింపఁ జొచ్చినవి. వజ్రనాభుఁడు వానినిఁ గాంచి, వాని మధుర వాక్కులకు ముగ్ధుఁడై, "మానగరమునకు రండు. ఉత్సవము లైనపుడు మీగృహముగనే భావించి, యథేచ్ఛగా వచ్చుచు పోవుచుండుడు." అని పలికినాఁడు. ఈ విధముగా తమ సుమధుర భాషలచే

రాజాంతఃపురమును ప్రవేశించి యందఱితో పరిచయమునుఁ బొందినవి. పలువిధము లగు కథలచే నచ్చటివారి నలరించినవి. అట్లు విహరించుచు వజ్రనాభుని సుతను ప్రభావతిని గాంచినవి. ఆ రాకుమారికి 'శుచిముఖి' యను హంస సఖియైనది. శత సంఖ్యాకములగు నాఖ్యానకములను తెలిపి మిక్కిలి ప్రీతి పాత్రమైనది.

ఒకనాఁడు ప్రభావతితో, "ప్రభావతీ! నీవు త్రిలోక సుందరివి. నీకు స్వయంవరము కల్పించినపుడు నీ తండ్రి యెందఱినో పిలువఁ గలఁడు కాని యా సుందరాంగుని ప్రద్యుమ్నుని పిలువఁడు కదా! అతఁడు స్వయంవరమున కెట్లు వచ్చును? ముల్లోకములందును నతని గుణశీల పరాక్రమముల కెవ్వరును సాటిరారు." అని యాతనిని పలు విధముల వర్ణించి, యామె మనస్సును చూఱఁగొనినది. ప్రభావతి ప్రద్యుమ్నుని నటకు తీసుకొనివచ్చు నుపాయము తెలుపు మనినది. "నీ దానిని నేను నిన్ను దూతికగా నియమించు చుంటిని. మా యిరువుర సమాగమోపాయమును యోచింపు" మని యర్థించినది.

శుచిముఖి యప్పుడు దానవేంద్రునితో, తన కథా నైపుణ్యములను పొగడుచు తనకాతనితో సమాగమమును కల్పింపుమని కోరినది. ప్రభావతి యట్లేకావించినది. వజ్రనాభునితో శుచిముఖి, "దానవ సత్తమా! మేరుగిరి పార్శ్వమున సాధ్వియగు శాండలినిని గాంచితిని. ఆమె సఖియగు సుమనను చూచితిని. కామరూపముల ధరించు నట భద్రుని గాంచితిని. అతఁడు దేవగంధర్వుల గానమును పాడఁగలఁడు ఆడఁ గలఁడు" అని తెలిపినది. వజ్రనాభుఁడును - ఆ నటుని ప్రదర్శన చూడ నిష్టపడెను. అతఁడు సప్తద్వీపము లందు తిరుగుచున్నాఁడని, వజ్రనాభుని కడకును రానచ్చునని - యాశ్వాసించినది. వజ్రనాభుఁడు 'ఆ నటుని తెచ్చు మార్గమును చూడు' మని శుచిముఖిని పంపెను ఆ హంసి వచ్చి - శ్రీకృష్ణున కీవార్త చెప్పినది.

శ్రీకృష్ణుఁడు ప్రద్యుమ్నుని నటుని గావించి పంపినాఁడు. సాంబుఁడు, విదూషకుఁడు. గదాదులు పార్శ్వకులు, ముఖ్యవారాంగనలు నటీమణులైరి. వీరి రాకను విని వజ్రనాభుఁడు నటుల కుత్తమ వసతిని కల్పించెను. ఉత్తమాతిథ్యమును, హారత్నాదులను, వాసస్సులను, కల్పించిరి. వరమును పొందిన ప్రద్యుమ్నుఁ డుత్తమ నటన గావించెను. రామాయణ నాటకము నాడిరి. ఆ నటనను గాంచిన నటు లందఱును నాశ్చర్యమగ్నులైరి. ఆనందముతో ననేకోపాయనముల నొసంగిరి. అప్పుడు శుచిముఖి ప్రభావతితో తాను ద్వారకకు వెళ్ళియుండిన దని, ఏకాంత

ముగా ప్రద్యుమ్నుని జూచి, ప్రద్యుమ్నునిపై ప్రభావతికి గల భక్తి నెఱుక పఱచెనని - ఆనాటి ప్రదోష సమయమునందే ఆమెతో సమాగమము కాంక్షించు చున్నాడని పలికినది. ప్రభావతి యుత్సుకతతో నతని రాకకెదురు చూచుచుండినది. అట - నట వేషధారియగు ప్రద్యుమ్నుని కడకేగి - శుచిముఖి -

"నీవు కాంక్షించిన సమాగమరాత్రి నేడే!" యని చెప్పినది, ప్రద్యుమ్నుఁడు ప్రభావతికడకుఁ గొనిపోఁబడు పుష్పమాలికలో నుండు భ్రమరములలో తానొక భ్రమరమై దాగొని యుండెను పుష్పమాలలోనుండి ఆ భ్రమరము కర్ణావతంసమగు కమలములను చేరినది. రాత్రియైనది. పూర్ణచంద్రుఁడుదయించినాఁడు. హంసితో ప్రభావతి పలువిధముల తన విరహతాపమును తెలుపుకొనుచున్నది. —

"సఖి దహ్యాంతి మేఽంగాని ముఖంచ పరిశుష్యతి
ఔత్సుక్యం హృది చాతీవ కోఽయం వ్యాధి రనౌషధః"

అని ఆమె మన్మథ వేదనతో చెలియగు శుచిముఖితో, - "నేను విమనస్కను నా హృదయము కంపించుచున్నది, దృష్టి తిరిగిపోవుచున్నది. నిశ్చయముగా చనిపోవు చున్నాను." అని పరితపించినది. ఆమె వేదనను విని ప్రద్యుమ్నుఁడు నిజరూప మును ప్రదర్శించెను. అతనినిఁ గాంచినంతనే యామె కామసాగర మభివృద్ధి చెంది యధోముఖి యైనది అతఁడును ఆమెను గాంధర్వ విధిని వివాహమాడి రాగ సాగ రము నందు ముంచెను. ఉదయమైనంతనే నటావాసమును చేరుకొనెను.

వజ్రనాభుని సోదరుఁడు సునాభుఁడు. అతని పుత్రిక లిరువురును ప్రభావతి యంతఃపురమునకు వెళ్ళుచు, ప్రభావతి విషయము తెలిసి, ఆమె యొద్దఁగల మంత్ర ప్రభావముతో సాంబుని, గదుని పరిణయమాడిరి.

కశ్యపుని సత్రము సమాప్తమైనది అనంతరము వజ్రనాభుఁడు త్రిభువన విజయకాంక్షియై కశ్యపునికడ కేగెను. కశ్యపుఁడు వజ్రనాభునితో, 'పుత్రా! నా మాట వినుము, వజ్రపురము నందే స్వజనముతో నుండుము. ఇంద్రుడు నీకంటె నన్నివిధముల నుత్కృష్టుఁడు. నీవాతని జయింపలేవు. సర్పమును పాదముతో త్రొక్కిన వారివలె శీఘ్రముగా నశించి పోవుదువు" ననెను.

వజ్రనాభుఁడు కశ్యపుని వాక్యములను పెడచెవినిఁ బెట్టి త్రైలోక్య విజయమును నకై సన్నద్ధుఁ డగుచుండెను. మొదట స్వర్గముపై దండెత్తఁ దలచెను. ఇంతలో దేవేంద్రుఁడు, శ్రీకృష్ణుఁడు - హంసలను దూతలుగా వజ్రనాభుని కడకు పంపిరి.

వజ్రనాభుని వధించు నిమిత్తమై యోచించు చుండుటను విని, — పురమునందలి ప్రముఖ యాదవులు. ఆవజ్రనాభుని పుత్రిక — అతని సోదరుని పుత్రికలు, తమ బంధువులకు భార్యలై పూర్ణ గర్భవతులై యున్నారని యోచించు చుండిరి. ఈ విష యమై శ్రీకృష్ణునకు తెలియఁ జేసిరి. భయపడవలదని ఆగర్భస్థ శిశువులు వేద వేదాంగ వేత్తలు — కామరూప ధరులును కాఁగలరని, సద్యోయౌవన వంతులగుదురని శ్రీకృష్ణుఁడు తెలిపెను.

బాలకులు జనించి, సర్వజ్ఞులు, సద్యోయౌవన వంతులై విరాజిల్లిరి. ఒకసారి వారట్టాలికపై సంచరించుచుండ, దానవులు గాంచి, వజ్రనాభునకుఁ దెలియఁజేసిరి. ఆ బాలకులు శత్రువులని వారిని చంపించు యత్నములు జరిగినవి. ప్రభావతి భయ పడి యేడ్చుచుండినది. అప్పుడు ప్రద్యుమ్నుఁడు భయపడవలదని యామె నాశ్వాసించి నాఁడు. "నీయనుమతి యైనచో, నీతండ్రిని బంధువులను చంపఁగలను" అని తెలియఁజేసినాఁడు. ఆమె 'విజయము పొందు' మని ఖడ్గము నొసంగినది.

ప్రద్యుమ్నుఁడు మాయతో నొక రథమును నిర్మించు కొనెను, సహస్రమస్తక నాగమును సారథిగా సృజించెను. బాణవర్షముచే దైత్యులను పీడింపఁ దొడంగెను. తుముల సంగ్రామ మైనది. అనేకులు అసురశ్రేష్ఠులు మరణించిరి. దేవేంద్రుఁడు రథమును, మాతలి మొదలగు వారిని సాయమంపెను. ప్రద్యుమ్నుఁడు తనమాయతో కోట్లకొలది ప్రద్యుమ్నులను సృజించెను. దైత్యులు సృష్టించిన అంధకారమును నాశమొనర్చెను.

ఇట్లొక దినమంతయును ప్రద్యుమ్నుఁడే యుద్ధ నిర్వహణఁ గావించెను. రెండవరోజు — గరుడారూఢుడై శ్రీకృష్ణుఁడును, అచ్చటికి వచ్చినాఁడు. ప్రద్యు మ్నుని, అనిరుద్ధుని శత్రువుల చంపవలసినదిగా ప్రేరేపించెను. ప్రద్యుమ్నుఁడు వజ్రనాభుని వక్షముపై గదాఘాత మొనరించెను. వజ్రనాభుఁడు త్వరలో స్వస్థుఁడై కంటకములతోఁగూడిన గంటలు గల గదలతో ప్రద్యుమ్నుని మోదెను. అతఁడు మూర్ఛితుఁడు కాఁగా — శ్రీకృష్ణుఁడు చక్రమంపెను, కొంత తడవునకు తేరుకొని ఆ చక్రమును గ్రహించి — వజ్రనాభుని శిరమును ఖండించెను. గదుఁడు సునాభుని వధించెను. వజ్రనాభుని మరణముతో భీతిల్లిన నికుంభుఁడు షట్పురమునకు వెళ్లెను.

ఇదియు ఎఱ్ఱయ పూర్తిగా వదిలివేసిన ఘట్టము.

ఇది పూర్తిగా 'బాణాసుర కథ'ను పోలినది. ఆ ఉషబాణులను భాషసుని

పుత్రిక. ఈ ప్రభావతి వజ్రనాభుఁడను రాక్షసుని పుత్రిక. అనిరుద్ధుఁడు శ్రీకృష్ణుని పౌత్రుఁడు, పార్వతి యనుగ్రహమున ఈ అనిరుద్ధుని కలలో పొంది విరహముతో తపించినది ఉష. శ్రీకృష్ణుని పుత్రుఁడు ప్రద్యుమ్నుఁడు ప్రభావతి – శుచిముఖి యను హంసిచే విను కలిని ప్రద్యుమ్నుని యందు రాగసాగర మగ్నయైనది.

ప్రద్యుమ్నుడు – భద్రనాభుఁడను నటుని వేషమున వజ్రనాభుని పురమును ప్రవేశించినాఁడు. మాయా రూపుఁడు కావున – ప్రభావతి యంతఃపురమును గాంధర్వవిధిని పరిణయ మాడెను.

ఇచ్చట – బాణాసురుని కథయందు – చిత్రలేఖ యను సఖి తిరస్కరిణీ విద్యచే, అనిరుద్ధుని యుషకడకుఁ గొంపోయెను.

ఇచ్చటను గాంధర్వవిధిని వివాహమాడెను. ఇరువురిది – రాక్షస వివాహము. తలిదండ్రులకు తెలియక చేసుకొనిన వివాహము. అనంతర మా రాక్షసులు లీవిషయ మును తెలిసికొని యుద్ధమును గావింతురు. రెండుకథ లందును రాక్షసులు వివాహ మొనర్చుట గలదు.

శ్రీకృష్ణాదు లచ్చటికి సాయమునకై రెండు కథలందును చేరుదురు. ఇరుచోట్ల సంగ్రామము భయంకరముగా జరిగినది.

అచ్చట బాణుని రక్షించుటకై స్వయముగా మహేశుని గణ మేతెంచినది. బాణునకు ఘోర పరాజయము సంభవించినది

ఇచ్చట శ్రీకృష్ణుని చక్రముచే ప్రద్యుమ్నుని వలన వజ్రనాభుఁడు హతుఁ డైనాఁడు.

ఈ రెండు కథలకును సామ్యమత్యధికముగా నున్నది. కథా సంవిధాన మొక్కటే. వైవిధ్యము గోచరింపదు. కనుక రెండింటిలో నొకదానిని ప్రబంధముగా రూపొందించి, మఱొక దానిని వదలి వేసినాఁడు – ఎఱ్ఱయ.

బాణుఁడు హతుఁడు కాఁడు. పరాజితుఁడైనాఁ డంతియ. వజ్రనాభునకు మరణము సంభవించినది. అదియు ప్రద్యుమ్నుని చేతనే. ఇట్లు వరించిన ప్రియు రాలి తండ్రిని స్వయముగా చంపుట– వీరి దాంపత్య జీవితములో వ్యథ కల్గించుట–

ప్రభావతికి ప్రద్యుమ్నునిఁ గాంచినంతనే పితృహంతకుఁ డితఁడని స్మరణకు వచ్చినచో – నది శృంగార రసపుష్టికే కొఱత యేర్పడును. అదియునుగాక –

ప్రద్యుమ్నుఁడు ప్రభావతి యనుమతిఁ బడసియే యుద్ధ మొనర్చినాఁడు. స్వయముగా ప్రభావతియే "విజయమును పొందుదువుగాక !" అని ప్రద్యుమ్నునకు ఖడము నొసంగినది. ఇది పితృమరణమునకు ప్రేరేపించుటయే. తండ్రియెడ నీ పాత్ర చూపిన కాఠిన్యము నిర్దాక్షిణ్యముగా గోచరించును.

కనుక నట్టి సూక్ష్మవిషయమును గూడ పరిశీలించి, ఎఱ్ఱయ – అందు తాను సమంజసమని తలంచిన కథను గ్రహించి, యనువదించి, మఱొకకథను వదలి వేసినాఁడు.

బాణాసురకథలో – పార్వతీదేవి శ్రీకృష్ణుని ప్రార్థించి, బాణుని చావును దప్పించినది.

ఇట్లు – ఉష – అనిరుద్ధుల ప్రణయమును ఒకదానినే గ్రహించి, సంపూర్ణ ప్రబంధముగా తీర్చిదిద్ది, శృంగార రసపుష్టిని కలిగించి, ప్రాసంగికేతి వృత్తముగా శ్రీకృష్ణుని మహిమను దెలుపుటకై వినియోగించు కొనినాఁ డెఱ్ఱయ.

ఇట్లు పునరుక్తములనే కాక పునరుక్తాభాసములను గూడ తొలఁగించి కావ్య కథకు మెఱుగులు దిద్దినాఁడు.

## —— హంస డింభకుల చరిత్ర ——

## ఎఱ్ఱయ వదలిన సుదీర్ఘ ప్రాసంగి కేతివృత్తము.

హంస డింభకులను రాజకుమారులు శంకరాంశ సంభూతులు. వారిరువురును తపము గావింప నిశ్చయించిరి. హిమాలయ సమీపమునకేగి, వాయు జల భక్షకులై ఏకాగ్రత చిత్తులై, సంయతాత్ములై, దివ్య పరాక్రమమును, అస్త్రములు ప్రాప్తించ వలెనని నీలకంఠుని గుఱించి, తపము గావింపఁజొచ్చిరి. "హర – శర్వ శివానంద" యని నామములను జపింపఁదొడఁగిరి. నిర్మములు నిరహంకారులు, మౌనవ్రత ధారులునై – పంచవర్షములు తపము గావింప, వ్యాఘ్ర చర్మాంబరధారి యగు శూలపాణి దర్శన మొసంగెను, వరము కోరుఁడనెను. వారిరువురును 'ప్రీతు' డవైనచో – దేవాసుర సేనాధిపతుల చేతను, యక్ష గంధర్వ దానవుల చేతను, మేమిరువురము అజేయులమగుదుముగాక ! సమస్త రౌద్రాస్త్రములు సంగ్రహ మగు గాక ! మారక్షణకై మహేశ్వరాస్త్రము, రౌద్రాస్త్రము, దివ్యకార్ముకము, పరశువు నుండుగాక ! యుద్ధమున మాకిరువురు భూతగణము సహాయముగా నుందురుగాక !'

యని వరమును వేడిరి. 'అట్లే యగుగాక!' మని మహేశుఁడు పార్శ్వగణములను నియమించెను. అస్త్ర శస్త్ర సంచయములు కలిగి బలవంతులైరి. శంకరభక్తు లగు నా యిరువురు అజేయులై మహాదేవుని నిత్యోత్సవము గావించుచుండిరి. త్రిపుండ్రక మును ధరించి జటాధారులై యుండిరి. సర్వాంగము లందును రుద్రాక్ష మాలికల ధరించిరి. వ్యాఘ్ర చర్మమును ధరించి, 'నమశ్శివాయ శాంతాయ మహాదేవాయ ధీమతే' యని స్తుతించు చుండువారు.

జనార్దనుఁడు పరమ ధీశాలి. చిరకాల మధ్యయన మొనరించి సంపూర్ణ విద్యా పారంగతుఁడాయెను. అతఁడు పీతకౌశేయ వాసనుఁడగు విష్ణువును విజితేంద్రియుడై, బ్రహ్మైకత్వపరుఁడై నిత్యము నారాధించువాఁడు. హంసడింభకులు జనార్దనుఁడు మువ్వురు పంచయజ్ఞనిరతులు – గురుభజనా పరాయణులు– భార్యానురక్తులు. ధర్మమే పరమ శ్రేయమని తలంచిన వారు.

ఒకసారి హంసడింభకులు జనార్దనునితోఁ గూడి వేటకై వెడలిరి. సింహ వ్యాఘ్ర వరాహములను చంపఁ దొడఁగిరి. పెక్కు క్రూరమృగములను చంపి, యలసిపోయిరి. సరోవర తటమును చేరి, యలసట తీర్చుకొనిరి. అది ముని సిద్ధ సేవితమగు స్థానము. స్నాన మొనర్చి, కమల నాళములను భుజించి, మునులు చర్చించు వేదవాణిని వినుచుండిరి మునులు గావించు యజ్ఞమును తాము చేయ నిష్టపడిరి. రక్షణకై సైన్యమును స్థాపించి, స్వయముగా జనార్దన సహితులై పాద చారులై కాశ్యప మున్యాశ్రమమునకు వెళ్ళిరి. అర్ఘ్యపాద్యాదులచే పూజ లందినారు. "మునిశ్రేష్ఠులారా! మా తండ్రి రాజసూయ యాగమును చేయఁ దలంచినాఁడు. ఆ యజ్ఞాంతమున మీరచ్చటికి వెళ్ళవలయును. మేము దిగ్విజయ మొనర్చి మాతండ్రిచే రాజసూయ యాగమును చేయించెదము. మా యెదుట దేవతలు, దానవులు నిలువ లేరు. కైలాసవాసి వరమును పొందిన వారము". అని పలికిరి. మునులు వచ్చుట కంగీకరించిరి.

అనంతరము వీరు దుర్వాసుని యాశ్రమమునకు వెళ్ళిరి. అచ్చట మునులు మంత్రమయ యజ్ఞము నొనరించు చుండిరి. జపించు చుండిరి. నిర్మములు, నిరహం కారులు, కౌపీనధారులునై యుండిరి. వేదాంత చింతనలో నిమగ్నులై యుండిరి. హంసలు – పరమహంసలు – తర్కజ్ఞానముచే పరమార్థ జ్ఞానమును నిశ్చయ పఱ చిరి. జ్ఞానాలోకముచే వారి యంతఃకరణము నిర్మలమై యుండినది – కాషాయాంబర ధారియై యూర్ధ్వరేతస్కుఁడై యుండిన దుర్వాసుని గాంచి హంసడింభకు లిట్లు

తలంచిరి. "ఈ కాషాయ వస్త్రమును ధరించిన భూతమెవ్వరు? గృహస్థ ధర్మమే ధర్మము. గృహస్థుడే ధర్మాత్ముడు. అతడు ప్రాణులకు తల్లి. జీవితమునకు రక్షకుడు అట్టి గృహస్థాశ్రమమును వదలి వేఱొక ఆశ్రమమున ప్రవర్తించువాడు మూర్ఖుడు. ధ్యాన మగ్నులగు నీ సమస్త మునీశ్వరులను, మందబుద్ధులను, బలాత్కారముగా గృహస్థాశ్రమమున స్థాపించెదముగాక!" అని చింతించి యజ్ఞాన వశమున జనార్దనునితో పాటు యతీశ్వరుల కడ కేగిరి.

ఇంద్రియాతీతుడు దుర్వాసుడు. నియతేంద్రియులు ఋషులు. హంస డింభకులు వారితో నిట్లనిరి – "ఓ ద్విజుడా! జ్ఞానశూన్యుడా? మీ రనుష్ఠించు నీ యాశ్రమ మేది? గృహస్థాశ్రమమును వదలి మీరే సిద్ధిని బొందగలిగితిరి. మీ దంభమే దీనికి మూలముకాని మఱేదియును కాదు "స్వయం నష్టః పరాన్ మూర్ఖః నాశయిష్యతి యత్నతః" "నీ యీ మందబుద్ధిని శిక్షించు వారే లేరా? నీకీ శిక్షణ నొసగిన వాడును పాపియే. ఈ యాశ్రమమును వదలి గృహస్థుడవు కమ్ము. నిత్యమును పంచయజ్ఞముల నొనర్పుము. ఉత్తమ స్వర్గమును పొందుము. జీవింపదలచినచో నిట్లాచరింపుము" – అనిరి. వారి వాక్యములను విని జనార్దనుడు వారికి నమస్కరించి వినీతుడై నాడు. వారితో –

"రాజులారా! మీబుద్ధి, మీ తేజమును మందగించినది. మిత్రులారా! ఇట్టి వాక్యములను పలుకకుడు. బంధు బాంధవులతో సుఖముగా నుండుట కిష్టపడిన ఏ మందబుద్ధియును నిట్టి వాక్యములను పలుకలేదు. మీ యాయుశ్శేషము ముగిసినట్లున్నది. బ్రహ్మదండనుతో హతులైతిరి. ఈ యతివర్యులు జ్ఞానదీపిత చేతస్కులు. పరిశుద్ధాంతరంగులు. ప్రాణములనే ప్రాణ స్వరూపాగ్నిలో హోమము చేయ సమర్థులు. మీ రిద్దఱేకాదు, ఎటువంటి వారును, వీరి యెడల నిట్టి యనుచితములను పలుకలేరు. మీ రిక చచ్చితిరి. రాజులారా!

"చత్వారః ఆశ్రమాః పూర్వం ఋషిభిర్విహితా నృపా!
బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థశ్చ భిక్షుకః"

వీని అన్నిటిలోను నాల్గవ ఆశ్రమమగు సన్న్యాసము శ్రేష్ఠము. ఈ ఆశ్రమము నందెవనికి బుద్ధి కలుగునో వాడు పుణ్యాత్ముడు. మీరు వృద్ధుల సేవ చేయలేదు. తపస్వి మునులవలన జ్ఞానమును పొందలేదు. అందులకే యిట్లు పలుకుచుంటిరి. నాప్రాణముండగా నేనిట్టి మాటలను వినలేను. ఏమిచేయుదును? ఆయినను

మిత్రుఁడను. గురువులవలన మీరు పొందిన జ్ఞానము కేవలము దుఃఖదాయకము ధర్మాచరణముచే ప్రాప్తించు జ్ఞానమే యదేష్ట ఫలము నొసంగ గలిగినది. బలాత్కారముఁగా పొందిన జ్ఞానము పాపవిధాయకమె ! మిమ్ములను వదలి వెడలి పోదును. లేదా ఉన్నత శిలాతలమునుండి పడిపోదును. లేదా భయంకరమగు విషమును త్రాగుదును. మహాసాగర తరంగములలోఁబడి ఆత్మహత్య గావించుకొందును. ఇట్లు పలుకకుఁ"డని జనార్దనుఁడు విలపింపఁ జొచ్చెను.

దుర్వాసునకు కోపము వచ్చినది. లోకమునే భస్మమొనరించు నట్లుగా క్రోధ పూరిత నేత్రములతోఁ గాంచెను. కాని జనార్దనుని మాత్రము సౌమ్యనేత్రములతోఁ గాంచినాఁడు. "ఇచ్చట నుండి వెళ్ళుఁడు, సమస్త మహీపాలురను భస్మమొనరింపఁ గలను. కాని, ఆ శంఖ చక్రగదా ధారియే మీగర్వమును పోఁగొట్టఁగలడు" అని యటనుండి దుర్వాసుఁడు లేచిపోవ నిచ్చగించెను. హంసుఁడు కృతాంతుని వలె నుగ్రుఁడై, దుర్వాసుని బాహువును బట్టి కౌపీనమును చింపెను. తక్కిన యతులు కకా వికలై పాఱిపోయిరి. జనార్దనుఁడును మిత్ర భావముతో 'నిదేమి చేయుచుంటి' రని వారింపఁజొచ్చెను.

దుర్వాసుఁడు, "మిమ్ములను శపించి చంపఁగలను. అయినను యతిధర్మముతో నుంటిని. కనుక నట్లు చేయను. ఆ జగన్నాథుఁడు, యదుకుల స్వామి, శంఖచక్రగదా ధారియే మిమ్ములను శిక్షింపఁగలఁడు. మీ యిట్టి మాటలకు మీ బంధువగు జరాసంధుఁడును క్షమింపఁడు. శత్రువు కాఁగలడు. వెళ్ళుఁడు." అనెను. జనార్దనునితో, "నీకుకల్యాణమగుగాక ! అచిరకాలముననే నీకు శంఖచక్రగదాధారితో సమాగమ మగు"నని యాశీర్వదించెను.

కాల చోదితులై హంస డింభకులు కోపించి, ఆమునుల దండకమండల్వాదులను ఛేదించిరి అదే స్థానమున వ్యాధులచే మాంసమును వండించి, భక్షించి యథేచ్ఛగా వెళ్ళిపోయిరి. జనార్దనుఁడును వారి ననుసరించి వెళ్ళెను. వారు వెళ్ళిన తరువాత పలాయన పరులగు ఋషుల నందఱిని పిలిచి, దుర్వాసుఁడు, — "ఇచ్చట నుండి బయలుదేరి శంఖచక్ర గదాధారిని చూచెదము. అతఁడీ జగత్తును రక్షించుచు ధర్మమార్గమున చరించుచున్నాఁడు — అతఁడే సమస్త పాపులను నాశమొనరించి. అమానిత్వ — అదంభిత్వమున నుండు మనలను రక్షింపఁగలఁడు. ఆ పాపులగు హంస డింభకులు మా సాధనములను చిన్నాభిన్న మొనర్చినారు. వీనిని భగవంతు

నకు చూపించెదము". అని చెప్పఁగా ఋషు లంగీకరించిరి. కౌపీన కమండలాదులను మూఁటఁగట్టి – కేశవుని చూచుటకు బయలుదేరిరి. సుధర్మ సభయం దుపవిష్టుఁడగు కృష్ణుని సందర్శింప నేగిరి.

ఆ సమయమున శ్రీకృష్ణుఁడు సాత్యక్యాదులతో ద్యూతక్రీడ లాడుచుండెను. అందఱును మునులను, వారిస్థితినిఁగాంచి దిగ్భ్రాంతిఁ జెందిరి ఆ అర్ధకౌపీనావస్థలో మండిపోవు చుండు ఋషీశ్వరునిఁ గాంచి భీతి జెందిరి. శ్రీకృష్ణుఁ డాసనము నొసంగి, యర్ఘ్యపాద్యాదులిచ్చి." "కింకరోఽస్మి" యని పలికినాఁడు. "సన్న్యాసులు, వీతకల్మషులు, నిస్పృహులు నగు మీకు నావలనఁ గావలసిన దేమి ? మీ యాగమన కారణమేమి ? మీ రిచ్చటికి వచ్చుటయే విశేష" మని పలికెను.

ఆ మాటలువిని దుర్వాసుని కోపము రెట్టించినది. క్రోధమూర్ఛితుఁడై. 'యాదవేశ్వరా ! నీకు తెలియదని ఎందుల కనుచున్నావు ? నీవు మహాదేవుడవు. దేవతలకు దేవుఁడవు. మాయారూపధారివి. మా స్వామివి స్థూలరూప ధారివి. వీతరాగులును నీస్మరణ మాత్రమున పరమానంద మగ్నులగుదురు. నీకు తెలియనిది ఏదియును లేదు. వేదములు నిన్నే స్తుతించును. ఓంకారరూపుఁడవు నీవు విశ్వము ఎవరివలన జనించునో, ఎవరిలో లీనమగునో అదే నీ తేజము, నీవే కర్తవు. ఏ యే రూపమున స్మరించిన ఆయా రూపమున నా హృదయమున నుందువు. కనుక మా రాక తెలియదని చెప్పవలదు. మా దుఃఖమే నీకు తెలియదంటివి. మందభాగ్యులము వినుము."

"గిరీశ వరగర్వితులగు క్షత్రియ కుమారు లిద్దఱు – హంస డింభకులు – గార్హస్థ్యజీవనమే శ్రేష్ఠమని మమ్ములను మిక్కిలి బాధించిరి. ఇదే ఈ దారుపాత్రను చూడుము. రెండు భాగములైన వేణుకలను చూడుము. బహుధాచ్ఛిన్నమైన ఈ కౌపీనమును చూడుము. నీవందఱిని రక్షించువాఁడవు, అయినను మమ్ము రక్షింపఁ జాల వైతివి. మందభాగ్యులము, ఇంకెవరిని శరణు పొందవలయును. ఇద్దఱును జీవించియే యున్న మూఁడు లోకములు నశించిపోఁగలవు. వారి యెదుట ఇంద్రాది దేవతలును నిలువఁ జాలరు గిరీశ వరదర్పితులగు ఆ ఇరువురను చంపి, లోకములను రక్షింపుము." అనెను.

అతని పలుకులను విని శ్రీకృష్ణుఁడు —

"గిరీశుఁడో, ఇంద్రుడో, ధనదుఁడో, వరుణుఁడో బ్రహ్మయో – ఎవరైనను వరము నిచ్చుగాక ! నేనా హంస డింభకులను జయింతును." అని పలికెను. ఇట్లు

మునీశ్వరులు కృష్ణుని ప్రేరేపించి యాతని గృహమున చతుర్విధాహారములను భుజించి, వెళ్లిపోయిరి.

హంస డింభకులు బ్రహ్మదత్తుని కడకేగి రాజసూయ యాగమును చేయుమని కోరిరి. అతఁడంగీకరించెను. జనార్దనుడు – "భీష్మ జరాసంధాది సమస్తరాజు లుండఁగా, సాత్యకి బలభద్రాదులుండఁగా నిది దుసాధ్యము. దుర్వాసుఁడును – తక్కిన ఋషులును శ్రీకృష్ణుని చూచుటకు వెళ్ళిరి. ఆలోచించి కార్యమును, ప్రారంభింపు"మనినాఁడు.

అపుడు హంసుఁడు – "శ్రీకృష్ణుని కడకేగి; మాకు యజ్ఞార్థము సుందర వస్తువులను, కరరూపమున తేవలయును" – అని జనార్ధనునితో చెప్పెను. జనార్ద నుఁడు – ఆనందముతో శ్రీకృష్ణుని చూచుట కేగెను.

"ఆ శంఖ చక్ర గదాధారిని చూడఁబోవు చుంటిని. ఇది మిక్కిలియదృష్టమే. కాని, కరమిమ్మని అడుగుట ఎట్లు ?" – అని యోచించు జనార్దనుఁడు భగవంతునిఁ గాంచఁ గలనని మిక్కిలి యుత్కంఠతతో వెళ్లెను. "కృష్ణ సందర్శముచే నేను ధన్యుడ నగుదును. నన్ను గన్న తల్లి ధన్యయగును. కాని కరము నొసంగుమని యడుగుటయే కష్టము. అథవా సర్వుల హృదయ భావముల నెఱింగిన కృష్ణుఁడు దీనిని గూడ తెలిసికొనియే యుండును." అని తలంచి వెడలినాఁడు.

శ్రీకృష్ణుఁడు – సుఖాసీనుఁడై నారదదుర్వాసాది ముని సేవితుఁడై యుండెను. అతనినిఁగాంచి, జనార్దనుఁడు హర్షపులకితుఁడై చరణములకు నమస్కరించెను. శ్రీకృష్ణుఁడాతనిని సుఖాసీనునిఁ గావించి, ఆ హంస డింభకులు పలికిన దంతయు, సంకోచములేక చెప్పుమని యడిగినాఁడు. నీవు దూతవు. కావున భయము వలదనెను అపుడు జనార్దనుఁడు – 'అన్నియు తెలిసిన వాఁడవు. తెలియని వానివలె పలుకు చుంటివేల ?, నాస్తికించి దవేద్యంతె సర్వగోఽపి జగత్పతే :" – బ్రహ్మదత్తుఁడు రాజసూయయాగమును చేయుచున్నాడు. అందుకొఱకు – హంస డింభకులు నిన్ను కరముతోపాటు లవణమును కూడా తీసికొని రావలసినదిగా తెలిపిరి" – అనెను.

దూత వాక్యములువిని, శ్రీకృష్ణుఁడు – నవ్వుచు – "నేను తప్పక కరము నిత్తును. అవును. నేను వారికి కప్పము చెల్లించు సామంతుఁడను – కదా ! ఆహా ! ఏమి వారి దౌష్ట్యము ? ఇదెంత హాస్యాస్పదము. బ్రహ్మదత్తుఁడు రాజసూయ యాగము చేయువాఁడా ? హంసడింభకులు చేయించువారా ? నేను కరదాతనా ?

'కరము - కరము' అని అనగా చప్పట్లు చఱచుచు నందఱు సభాసదులు - యాదవులు వికటముగా నవ్విరి. సభాభవనము ప్రతిధ్వనించినది. జనార్దనుఁడు లజ్జతో నధోముఖుఁ డయ్యెను.

అంతకృష్ణుఁడు - "దూతా! వెళ్ళుము. నేను తప్పక నాబాణములతోనో, చక్రముతోనో కరమొసంగెదనని చెప్పుము. మీకు వరమొసంగిన సాక్షాద్రుద్రుఁడే వచ్చి మీ కడ్డపడినను, అతసని జయించి మిమ్ముల చంపఁగలను. పుష్కరము - ప్రయాగ - మధుర - ఇందులో నేది మాసమాగమ స్థానమో నిశ్చయింపుఁడు. దూతా! నీవు వారికి స్నేహితుఁడవు గనుక చెప్పలేవేమో? నీవెంట మాసాత్యకియే వచ్చి చెప్పఁగలఁడు. నీపై నాకు స్నేహముపోదు. నీవు విజయివై నాకథాలాపములతో నుండఁగలవు." అని పల్కెను. సాత్యకితోఁ గూడి జనార్దనుఁడు హంసుని కడ కరిగెను.

హంసుఁడు 'కరము విషయ మేమైన' దని యడుగగా 'సాత్యకియే చెప్పుటకై వచ్చినా' డనెను. కోపించిన హంసుఁడు - జనార్దనుని నిందించెను. శంఖచక్ర గదాధారియగు నాకృష్ణుని మాయలో పడితి' వనెను. "మందబుద్ధివి. ఈ ప్రపంచమున నీయిష్టము వచ్చిన కడకేగు" మనెను. ఆ గోపాలుని జయించి, అనేక యాదవులను చంపెదనుగాక! శత్రుపక్షస్తుతిపరుఁడవు. వెళ్ళుము బ్రాహ్మణ హత్యచేయఁజాలను" అని హంసుఁడు సాత్యకితో వచ్చిన కారణ మడిగెను. అప్పుడు సాత్యకి - "శంఖచక్ర గదాధారి - శార్ఙ్గ నిర్ముక్త నిఖిల శిలాశాతములచే నీకు కరమొసంగఁగలఁడు. మందబుద్ధీ! ఆ జగన్నాథుఁడు దేవదేవుఁడు. అతసని కరమడుగు నాలుకను తెగఁగోయవలయును. గిరీశుని వరదర్పముచే నీ విట్లు పలుకు చున్నావు. యుద్ధ ప్రదేశమును నిర్ణయింపుము". అని అడిగెను. హంసుఁడు-"నీవు దూతవు కావున బ్రదికితివి. నాకు కర మొసంగక ఈ భూమండలమున బ్రదుకు వారెవ్వరు? "ఈశ్వరో నౌ వరందాతా" - అతఁడే మా అస్త్రములకు ప్రభువు మహాభూత గణమును మాకు రక్షకులై యుందురు. ఆ గోపాలుని జయించి, మాజనకునిచే యజ్ఞమును చేయించెదము". అనెను. సాత్యకియు క్రుద్ధుఁడై" నేను దూతగా వచ్చితిని. లేకున్న నిన్ను చంపియే యుందును. ఆ సింహవిక్రముఁ డగు కృష్ణుఁడే నీదర్పము నణచఁ గలఁడు? అని పలికి వెడలిపోయెను.

సాత్యకిచేత విషయమును విని శ్రీకృష్ణుఁడు యుద్ధసన్నద్ధుఁ డయ్యెను. పుష్కరసరోవర తీరమున నిరు వైపుల సేనలు విడిసినవి. ఆ హంసడింభకులు

త్రిపుంద్రమును లలాటమున ధరించి, రుద్రాక్షశోభితులై యపరరుద్రుల వలె లోక సంహారమునకై సంసిద్ధులైరి.

విచక్రుడను దానవుడు యాదవద్వేషి గావున నా హంసడింభకులను వచ్చి కలుసుకొనెను. హిడింబుడను రాక్షసరాజు శిలాశూలములతో ఖడ్గధారియై విచక్రుని సాయమునకు వచ్చెను.

భేరీ నాదములు, పతాకలు, గదాఘాతములు - శరసంఘాతములు - పరిఘా ఘాతనుల అత్యద్భుతములై మహా సంగ్రామము జరిగినది. ద్వంద్వ యుద్ధములు జరిగినవి. శార్ఙ్గధన్వుడు విచక్రునితో యుద్ధమొనర్చెను. బలభద్రుడు హంసునితో సాత్యకి డింభకునితో, వసుదేవోగ్రసేనులు నరభక్షక హిడింబులతో యుద్ధమొనర్చిరి.

బలభద్రుడు హిడింబుని చంపెను. శ్రీకృష్ణుడు హంస డింభకులతో యుద్ధమొనర్చుచుండ మహేశుని భూతగణము రక్షణకై వచ్చినది. శ్రీకృష్ణుడు పాంచజన్యమును పూరించెను. ఆ భూతగణములు శూలముతో కృష్ణుని పై కురికిరి. శ్రీకృష్ణుడు వారిని గిరగిర త్రిప్పించి, కైలాస పర్వతముపై విసరెను.

గాంధర్వ రాక్షసాద్యస్త్రములను శ్రీకృష్ణుడు ప్రయోగించెను. బ్రహ్మ కుబేరాద్యస్త్రములను హంసుడు వదలెను. భయంకరమగు బ్రహ్మశిరోనామకాస్త్రమును జనార్దనుడు వదిలిన, హంసుడును అదే అస్త్రముతో వారించెను. వైష్ణవాస్త్రమును వదిలిన భీతిల్లిన హంసుడు యమునలోని కురికెను.

శ్రీకృష్ణుడును యమునలోనికురికెను. పాదఘాతములతో హంసుని చంపెను. హంసుడు చచ్చెనని కొందఱు, పాతాళమున పన్నగములచే భక్షింపబడెనని కొందఱు తలంచిరి. రుద్రునిచే సర్వాస్త్రములను పొంది లబ్ధవరుడై హంసుడు క్షణకాలములో శ్రీకృష్ణునిచే చంపబడెను.

హంసుడు చనిపోయిన వార్త వినినంతనే డింభకుడు తానును యమునలోని కుఱికి ఆత్మహత్య గావించుకొనెను. వెదకి వెదకి తన భ్రాత దొరకనందున నాలుక లాగుకొని మరణించెను.

ఇది హంస డింభకోపాఖ్యానము.

ఇది ఎఱ్ఱయ వదిలిన ప్రాసంగికేతివృత్తము. ఇచ్చట హంస డింభకులు మహేశుని భక్తులు. నిర్మమ నిరహంకారులై మౌనవ్రతధారులై, రుద్రాక్షమాలలు

ధరించి, 'శివ – శర్వ – రుద్ర' యని రుద్రుడుసిక్తై తపించి వరము బడసినవారు. వారి యింద్రియ నిగ్రహము పక్షపాతయుత మైనది. నిరహంకారము దంభపూరిత మైనది. వారి భక్తి రుద్రుని వఱకే పరిమితము. కనుక దూర్వాసుని వంటి సంయమిని, తక్కిన సంయములను కౌపీనములు చింపి, దండముల భేదించి, కమండలువులను విడిచి, నానా హింసలకు గుఱిచేసిరి. శ్రీకృష్ణుని తిరస్కార పూర్వకముగా కర మొసంగుమని యాజ్ఞాపించిరి. యుద్ధములో శ్రీకృష్ణుని వైష్ణవాస్త్రమునకు భీతిల్లి ప్రాణముల పరిత్యజించిరి. కనుక నిచ్చట శ్రీకృష్ణుని పరతత్త్వనిరూపణము వెల్లడి యగుచున్నది రుద్రుని వరములు తేలిపోవుచున్నవి. రుద్ర భక్తులు నాశనమగుచున్నారు. విష్ణు భక్తుఁడు జనార్దనుఁడు సాధువుగా చిత్రీకరింపఁ బడినాడు. వివేక పూరితుఁడై హంసడింభకుల దుండగముల వారించి, మునీశ్వరుఁను బాధింపకుఁడని బోధించినాఁడు ఇట్లు విష్ణుభక్తుల ముందు శివభక్తులు దుష్టులుగా సాధుజన హింసకులుగా చిత్రింపఁ బడినారు.

ఇట్టి ఉపాఖ్యానములను తెనిగించి, రుద్రమహిమను, రుద్రభక్తులను కించపఱచుట శంభుదాసున కిష్టములేదు. కనుకనే ఈ కథను తెనుఁగించక వదలినాఁడు. ఎఱ్ఱయ ప్రతిపాదించు హరిహరాభేదతత్త్వమున కిది వ్యతిరేకము. కనుకనే ఈ కథను తొలఁగించి తన శంభుదాసతను రుద్రభక్తిని ఎఱ్ఱయ ప్రకటించుకొనెను.

ఇట్లు కథానాయకుఁడగు శ్రీకృష్ణుని మహిమాతిశయమును, తెలుపునదియైనను పక్షపాతయుతమగుటచేత దీనిని ఎఱ్ఱయ తెనిగింపక వదలినాఁడు.

ఇట్లు ఎఱ్ఱయ అనువదింపక వదలివేసిన ఘట్టములను పరిశీలించినపుడు – ఈ క్రింది విశేషములు గోచరించుచున్నవి.

1. తాను స్థాపింపఁ దలచిన తత్త్వ ప్రతిపాదనలకు హానికలుగు పట్టుల వదలినాఁడు

2. పునరుక్తములగు కథలను – పునరుక్తాభాసములను కూడ వదలినాఁడు.

3. కథాగతికి భంగము కలిగించునట్టి యితివృత్తములను వదలినాఁడు.

4. కావ్యత్వమునకు హానికలిగించు సుదీర్ఘ వ్రతవిధానములను తొలఁగించెను.

5. నాయకునకుగాని, కథకుగాని, రసమునకుగాని పోషకములుకాని ప్రాసంగికముల ననువదింపలేదు.

6. కథలలో వైవిధ్యము లేక కథాసంవిధానమున నూతనత్వము లేక యుండు ఘట్టములను తొలఁగించెను.

వ్యాసుని హరివంశమునాటి కత్యవసరమై యుండియు – ఎఱ్ఱయనాటి కట్టిబోధనల కంతటి యావశ్యకత లేకపోయి యుండినట్టి వర్ణనలను తొలఁగించెను.

7. ప్రబంధముగా రూపొందించుటకై కొన్ని సవరణలు చేయవలసివచ్చి కొన్ని వర్ణనలను తొలఁగించెను.

8. ఇట్లు ఎఱ్ఱయ రచన కావ్యశైలితోఁ గూడిన రచన ప్రబంధ ధోరణిలో నడచిన రచన

"ప్రౌఢాంచిత శబ్ద సారులు కావ్యశయ్యఁ గలిగించిన కీర్తిసంగ సుఖలీలకు నేనును కాంక్ష సేసెద" నని వినయముఁగా తెలుపుకొని కావ్యశయ్యలో నడిపిన రచన. ఎఱ్ఱయ దృష్టి కావ్యదృష్టి. కావ్యము ప్రబంధమే కనుక ప్రబంధ రచనాదృష్టి – అందులకై మూలమును సంక్షిప్త పరచిన రచన తెనుఁగు హరివంశము.

# 10. ఎఱ్ఱయ వ్యక్తిత్వము

ఒక వ్యక్తిని రచయితగా అతని స్వభావమును పరిపూర్ణముగ పరిశీలింప వలయు ననిన మొదట —

1) ఆవ్యక్తి అదే రచనను స్వీకరించుటలోని ఆంతర్యమును గ్రహింప వలయును.

2) ఆ వ్యక్తి తన్ను గూర్చి చెప్పుకొనిన విషయములను గుర్తింపవలయును

3) ఇతరు లాతనిని ప్రశంసించిన తీరును గమనింపవలెను.

4) ఆతని రచనలు అనువాదములైనచో— మూలమునుండి గావించిన మార్పులను పరిశీలింప వలయును. అతడట్లు గావించిన మార్పులకు గల కారణముల నరయవలెను.

5) అతనికి గల బిరుదములను గుర్తించవలయును.

అప్పుడా రచయిత గుణములను కొంతవఱకు నిర్ణయింపవచ్చును,

## — ఎఱ్ఱయ రచనలు —

1) రామాయణము 2) హరివంశము 3) నృసింహపురాణము 4) అరణ్య పర్వశేషము.

**రామాయణము :-** అలభ్యమగు గ్రంథము. అలభ్యమగు గ్రంథముల నుండి విషయమును సేకరింపబూనుట గగనము నుండి కుసుమములను తీయుట వంటిది.

**అరణ్యపర్వశేషము :-** ఇది నన్నయ పేరిటనే, "తద్రచనయకా" నని రచించిన భాగము. ఇచ్చట ఎఱ్ఱయ కష్టపడి నన్నయశైలినే అనుకరించి యుండ వచ్చును. నన్నయ భావభంగినే గ్రహించి యుండవచ్చును. ఇందు నన్నయ భావము ఎంతవఱకో అని నిర్ణయించుట కష్టసాధ్యము. కనుక నిది ఎఱ్ఱయ వ్యక్తిత్వమును హపుట కంతగా నుపకరింపదు.

నృసింహపురాణము :- ఇది ప్రస్తుతము పరిశీలనాంశము కాదు. అయినను నిందలి యవతారికను కొంతవఱకు పరిశీలింపఁ గలము. ఎఱ్ఱయ శంభుదాసుఁడు. నిత్యశివరాత్రి వ్రతంబుగాఁ బూని భవ్య యోగామృత తృప్తియై త్రిజగదర్చిత లీలఁ దనర్చు శంకరస్వామి యీతనికి గురువు. ఎఱ్ఱయ తాత ఎఱపోతన సూరి. తాత యెడ ఎఱ్ఱనకు భక్త్యనురాగములు మిక్కిలి. కనుకనే కలలో కనఁబడి నృసింహ పురాణమును వ్రాయుమని ప్రేరేపించెను. ధ్యానమగ్నుఁడై యుండ ఎఱ్ఱన కలలో తాత కనిపించినాఁడు.

"గిరిశ పద భక్తిరస త
త్పర భావము కలిమి శంభుదాసుఁ డనంగాఁ
బరగయు గోవింద గుణా
దర సంభృత సౌమనస్య ధన్యుఁడ వెందున్" అని

నృ. పు. 1-18

శంభు దాసుఁ డయ్యు గోవింద గుణాదరము గలవాఁడ వని ప్రశంసించినాఁడు. ఎఱ్ఱయ గిరీశుని పదముల యందు భక్తిరస తత్పరత గలవాఁడు. శంభుదాసుఁ డనగా ప్రసిద్ధి వడసినవాఁడు. అయినను గోవిందుని గుణముల యం దాదరముతోఁ గూడిన సౌమనస్యము గలిగినవాఁడు. అట్టి ధన్యుఁడు పౌత్రుఁడని ప్రశంసించినాఁడు ఇతని తాత.

ఎంతటి ధన్యులకోగాని శివకేశవుల యందు సమానముగా భక్తితాత్పర్యములు, ఆదరాభిమానములును గలుగవు. అంతటి సమాన ప్రతిపత్తి కలవాఁడు తన పౌత్రుఁ డని తాత ప్రశంస.

ఈ గోవింద గుణాదర సౌమనస్యము పైతామహము, ఆనువంశికము - అని తెలియుచున్నది. ఎఱ్ఱయడి నీలకంఠేశ్వర స్థానమగు గుడ్లూరు నివాసము. ఆ స్థానబలము, తండ్రి సహజాత గుణము, ఎఱ్ఱయను శివభక్తుని గావించినది. పైతామహమగు గోవింద గుణాదరమును ఇతని కబ్బినది. ఈ రెండింటి సమావేశముచే కలిగిన భావపరంపరలే హరివంశ రచన. ఎఱ్ఱయ హరివంశమున శివకేశవులకు సమాన ప్రతిపత్తిని కల్పించినాఁడు.

ఇతని తాత చేసిన మహోక ప్రశంస -

"ఉన్నత సంస్కృతాది చతురోక్తి పదంబులఁ గావ్యకర్తవై
యెన్నికయైఁ ప్రబంధ పరమేశుఁ డనంగ నరణ్యపర్వ శే
షోన్నయ మాంధ్రభాష సుజనోత్సవ మొప్పఁగ నిర్వహించితే
నన్నయభట్ట తిక్కకవినాథుల కెక్కిన భక్తి పెంపునన్"

నృ. పు 1-17

అని వ్రాకుచ్చినాఁడు.

ఎఱ్ఱయ సంస్కృతాది చతురోక్తి పదంబుల కావ్యకర్తయఁట! ప్రబంధ పరమేశుఁడనంగ కావ్యమును రచించినాఁడఁట! అరణ్యపర్వశేషమును నన్నయ తిక్కనలపై భక్తిపెంపున నిర్వహించినాడఁట! ఇది సుజనోత్సవ మఁట!

ఎఱ్ఱయ సంస్కృతాది భాషావిశారదుఁడు. చతురోక్తి పదములతోఁ గూడిన కావ్యమును రచింప సమర్థుఁడు. ప్రబంధపరమేశుఁడు. ఇతఁడు రచించిన యారణ్య పర్వశేష రచన సుజనుల కుత్సవము కలిగించినది. ఇతనికి నన్నయ తిక్కనలపై భక్తిమిక్కుటము. ఇతఁడే నృసింహపురాణమున -

"భాసుర భారతార్థముల భంగులు నిక్కమెఱుంగ నేరమిన్
గాసట బీసటే చదివి గాథలు త్రవ్వ తెనుంగు వారికిన్
వ్యాసముని ప్రణీత పరమార్థము తెల్లము జేసినట్టి య
భ్యాసన కల్పులం దలఁతు నాద్యుల నన్నయ తిక్కనార్యులన్."

నృ. పు. 1-9

తెనుఁగువారు నన్నయ తిక్కనలకు పూర్వము భాసురభారతార్థముల రీతులు నిక్కముగా నెఱుంగ నేరకుండిరి. గాసట బీసటగా చదివి గాథలు త్రవ్వుచుండిరి. అట్టి తెనుంగువారికి వ్యాసముని ప్రణీత పరమార్థమును తెల్లము చేసినట్టి యభ్యాసన కల్పులు నన్నయ తిక్కనలు అట్టిపూజ్యులను తలంతును - అని ఎఱ్ఱయ నన్నయ తిక్కనల యెడ తనకుఁగల పరమాదరమును తెలుపుకొనినాఁడు.

వ్యాసముని ప్రణీత పరమార్థమును భారతము నందలి భావమును తెలియఁ జేయుటకు ప్రయత్నించినవారు నన్నయ, తిక్కనలు. వారినే తనకు మార్గదర్శకులుగా నెన్నుకొనిన ఎఱ్ఱయయు, భారతార్థమును భారత పరమార్థ నిజస్వరూపమును తెలుపుటకు పాటుపడినాఁడు. ఇదియే ఎఱ్ఱయ ఆదర్శము.

గాసట బీసటగా చదువు తెలుఁగువారికి, పంచమవేదసారమును వినిపించుట నన్నయ తిక్కలు చేసిన పని. ఆ పనినే ఎఱ్ఱయయు చేయ సంకల్పించినాఁడు. కృతకృత్యుఁడైనాడు.

ఇతని మతము నందు నన్నయ తిక్కనలు అభ్యాసనకల్పులు. వ్యాసముని ప్రణీత భారత పరమార్థమును గ్రహించిన జ్ఞానులు. అందుకే వారి ననుసరించినాఁడు

నన్నయ తిక్కనల యెడ నింత మిక్కుటమగు భక్తి కలవాఁడు గనుక వారి కవితాదర్శములే తన కవితాదర్శములుగ భావించినాఁడు. నన్నయ కవితాదర్శము పంచమ వేదసారమును ప్రజలకు - తెలుఁగు ప్రజలకు వినిపించుట -

తిక్కన కవితాధ్యేయము- "ఆంధ్రావళి మోదముం బొరయ" - భారతార్థము కర్ణపుటంబుముల నారఁగ్రోలవలయు ననుట -

ఎఱ్ఱయ కవితా లక్ష్యము "సుజనోత్సవ మొప్పఁగ రచించుట"-

ఆనాఁటి సుజనుల కుత్సవమును కలిగించుట ఇతని ఆదర్శము. ఎఱ్ఱయ సర్వంకష ప్రజ్ఞాప్రదర్శనకు క్షేత్రము హరివంశము.

ఎఱ్ఱయ హరివంశమున ప్రోలయ వేమారెడ్డి యితనిని సంభావించి -

"సకల భాషాకవిత్వ విశారదుఁడవు
సాధు సమ్మతుఁడవు నిత్యసౌమ్య మతివి
భవ్యుఁడవుగాన నీమీఁదఁ బరఁగఁ బక్ష
మేను గలిగి యుండుదు నెప్పు డెఱ్ఱనార్య!" హ. వ 1-138

- అని శ్లాఘించినాఁడు. ఇవి యాతని గుణములు. వీనిని రాజు ముఖమున పాఠకులకుఁ దెలియఁజేసినాఁడు. వేమారెడ్డి శ్లాఘించి యుండుటయు సంభవము.

ఎఱ్ఱయ ఆత్మోత్కర్ష లేనివాఁడు. కనుకనే తన స్వభావమును సుగుణముల నితరులు చెప్పినట్లుఁగఁ జెప్పికొనుట. ఇది యాత్మోత్కర్షలేని వినయ విభూషితుల తీరు తెన్నులు.

ఇతఁడు సకల భాషాకవిత్వ విశారదుఁడఁట! సాధువులకు సమ్మతమైన స్వభావము కలవాఁడఁట! నిత్య సౌమ్యమతి. భవ్యుఁడు. ఇది వేమారెడ్డి ప[illegible] తన్ను తెలుపుకొనిన విధము.

ఇతని రచనలను పరిశీలించినను - సకలభాషా వైదుష్యము కలవాఁడనుటయు, సకల కళా విశారదుఁ డనుటయు తెల్లము. సాధువులకు సమ్మతమగు మార్గముననే కవితారచనను చేపట్టినాఁడనుటయు సత్యము. ఇతని రచనల వలన వినయాభరణుఁ డనియు, నిత్యసౌమ్యమతి యనియు తెలియుచున్నది.

హరివంశ పీఠిక యందును -

"నన్నయ భట్టకుంజరం బెన్న నిరంకుశోక్తి గతి నెంమనుఁ గ్రాలుట ప్రస్తుతించెదన్" - అని నన్నయను - 1-8

"వినుతింతుం గవి తిక్కయజ్వ సకలోర్వీదేవతాభ్యర్చితున్"
- అని తిక్కనను - 1-9

"నన్నయభట్ట తిక్కకవినాథులు చూపినత్రోవ పావనంబెన్న" - అని యుభయుల మార్గములను ప్రశంసించినాఁడు. 1-42

తన కావ్యములం దంతటను పూర్వకవులనీ యుభయులనే ప్రశంసించుటనే భారత కవియుగ్మమునందును ప్రమాణబుద్ధి కలవాఁడని తెలియుచున్నది.

నన్నయ భట్టును కుంజరముగా పోల్చుటలో నొక విశేషము కల దందురు. ఏనుఁగు పాదములో నన్ని పాదము లిముడునట్లు - ఇతని కవితాపద్ధతిలో అన్ని పద్ధతులును ఇముడు నని (నిడదవోలు వేంకటరావుగారు) అభిప్రాయమై యుండును. అట్టి నన్నయ కవితా మార్గము ఇతనికి ఆదర్శము.

ఎఱ్ఱయ తనకంటే పూర్వులనే ఇతర కవులను స్మరింపలేదు. కనుక నన్నయ తిక్కనలే ఇతనికి కవితా గురువులు. వారి ఆదర్శమే ఇతనికి ఆదర్శము. వారి మార్గమే ఇతనికి పరమ పావనము.

నన్నయ భారతమున కుకవినింద చేయలేదు. తిక్కన భారతము నందును కుకవి నిందలేదు. ఎఱ్ఱయయు తన గ్రంథమునందు కుకవి నిరసనము చేయలేదు. కనుక పరనిందాసహిష్ణువు ఎఱ్ఱయ అని తెలియుచున్నది. ఇచ్చట ఎఱ్ఱయ కవిసమయమును పాటించలేదు. సత్సమయములనే గ్రహించు గుణగ్రహణ పారీణుఁడు ఎఱ్ఱయ.

విప్రనారాయణ చరిత్రమును రచించిన చదలువాడ మల్లయకవి తాను ఎఱ్ఱాప్రెగడకవి వంశజుఁడ నని యీ క్రింది పద్యములో చెప్పుకొనినాఁడు.

సీ॥ ప్రతిభతో నారణ్యపర్వశేషముఁ జెప్పెఁ
గవులకుఁ జెవుల పండువులు గాఁగ
వల్మీక భవువచోవైఖరి రామాయ
ణంబు నాంధ్ర ప్రబంధంబుఁ జేసె
నారసింహుని పురాణమొనర్చి హరిమెచ్చి
నన్నునెన్నఁడు చూచినాఁడ వనఁగ
ప్రౌఢిమై హరివంశ భాగముల్ రెండును
రచియించె సభలందుఁ బ్రాజ్ఞులెన్న
గీ॥ దురిత హరుఁ బ్రబంధ పరమేశ్వరునిఁ జెద
ల్వాడ నిలయు నాదు వంశకర్త
ధన్యమూర్తి శంభుదాసు నెఱ్ఱాప్రెగ్గ
డను నుతింప బ్రహ్మకునుఁ దరంబె"

ఈ పద్యము వలన నెఱ్ఱాప్రెగడ వ్యక్తిగత విషయములెన్నో తెలియుచున్నవి. ఇతఁడు రచనా విశేషములో పోయిన పలుపోకడలనే పద్యము ఎత్తిచూపుచున్నది. తద్ద్వారా ఇతని వ్యక్తి విశిష్టతను తెలుపుచున్నది.

అరణ్య పర్వము ఎఱ్ఱయ పాండితీ ప్రకర్షకు నికషోపలము. దిగ్గంతుల వంటి నన్నయ తిక్కన లిరువైపుల భారతాంధ్రీకరణము పటిష్ఠముఁగా నొనర్చి పాండితీ మండితుల శ్లాఘలకు పాత్రులైనారు. అంతటివారు తెనిఁగించిన భారతమును తెనిఁగింతునని తానునుఁ జేపట్టినాఁడు. ఇప్పు డాతని రచన పరిహాస భాజనముకారాదు. పేలవముగా తేలిపోరాదు. తన కీర్తికి భంగము కలుగరాదు. ఇందుల కెంతయో జాగరూకత వహింపవలసి యున్నది. మిక్కిలి ప్రతిభను చూపవలసియున్నది. తన దైన యొకశైలిని మఱుగుపఱచి 'నన్నయశైలి'లో రచింపను సమర్థుఁడు కావలసి యున్నది. 'తద్రచనయకా' నని నన్నయ రచనఁగనే ఆ రచనను అన్వర్థనామధేయముఁగ చేయవలసి యున్నది ఇంతటి క్లేశముతోఁ గూడిర రచనను చేపట్టి కృతకృత్యుఁడైన ఎఱ్ఱయ ఎంతటి ప్రతిభావంతుఁడో యూహింపవచ్చును. నన్నయ తిక్కనల కవితామృతమును కర్ణపుటంబులఁ గ్రోలిన పండితుల చెవులకు పండువుగా

వెలసెన దఁట! ఇందుల శ్లోకెంతటి యనన్య సామాన్య ప్రతిభా పాండిత్యములు గల వాఁడో ఎఱ్ఱయ అని తెలియుచున్నది.

ఇఁక "వాల్మీక భవువచోవైఖరి రామాయణంబు నాంధ్ర ప్రబంధంబుఁజేసె" అని తెలిపినాఁడు.

వాల్మీకి వచోవైఖరినే రామాయణము నాంధ్ర ప్రబంధము గావించినాఁడట! ఆరామాయణ మింత వఱకును అలభ్యము. లభ్యముకాని గ్రంథమును పరిశీలించి గ్రంథకర్త నైపుణిని వివరించుట చేతకానిపని.

ఇక నారసింహపురాణము – దీనిని

"హరిఘే మెచ్చి, నన్ను నీవెన్నఁడు చూచితివి?" అని యముఁడు యడుగునట్లు రచించినాఁడఁట!"

భక్తిభావమున పరవశించి, సాక్షాద్ద్రష్టగా తాదాత్మ్యము చెంది నారసింహుని మనోమందిరమున సాక్షాత్కరింపఁ జేసికొని, వర్ణించి నట్లుగ నున్నదఁట అరచన. కనుకనే శ్రీహరి 'నన్నింతగా నెప్పుడు చూచితి' అని అడిగినాఁడట!

ఇందాతని భక్తిపారవశ్యము, తాదాత్మ్యభావము గోచరించుచున్నవి. ఇది యాతని వైయక్తిక స్వభావమును తెలియఁ జేయుచున్నది

"ప్రౌఢియై హరివంశ భాగముల్ రెండును రచియించె సభలందుఁ బ్రాజ్ఞులెన్న"

ఇచ్చట ఎఱ్ఱయ హరివంశ రచనయందు ఎంతటి ప్రౌఢిమను ప్రదర్శించెనో, తెలియుచున్నది.

అది ప్రోలయ వేమారెడ్డిసభ. ఆసభ యందెందఱో ప్రాజ్ఞులు. ఆప్రాజ్ఞులందఱు నెన్నునట్లుగ – ప్రశంసించునట్లుఁగ హరివంశము నందలి భాగములను రెండింటిని రచించినాఁడఁట!

ఈ విధముగ – ఈపద్యమును బట్టి ఎఱ్ఱయ ప్రతిభావంతుఁడగు మహామనీషి యని, పరమభక్తాగ్రేసరుఁడని, భక్త్యంశములతో తాదాత్మ్యభావము కలిగి వర్ణించు వాఁడని, అట్టి భాగవతోత్తముఁడుఁగనే నిత్య జీవితమును గడిపియుండునని, పండితుఁడేకాక, ప్రౌఢకావ్యము రచింపఁగల కవిసార్వభౌముఁ డనియు, తెలియుచున్నది. మహాపండితులుగూడ తలలూపు నంతటి ప్రతిభతో పాండితీ పటిమతో కవితాసృష్టి నొనర్పఁగల దిట్టయనియు తెలియుచున్నది. తా నాదరించి గౌరవించు కవులను

ఆదర్శముగా నుంచుకొని, వారిశైలిలో రచనలు చేయఁగల ప్రజ్ఞకలవాడనియు తెలియు చున్నది.

"దురితహరుఁడు" - పాపనివారణకై పవిత్రగ్రంథముల రచించుట, వినిపించుటయు కలదు - ఇతడి రచన లట్టి పాపనివారక గ్రంథములే యని తెలియుచున్నది. కనుకనే ఈ శంభుదాసుఁడు ధన్యజీవి.

ఎఱ్ఱయ - ప్రబంధ పరమేశ్వరుఁడు. చెదలువాడ నిలయుఁడు. ధన్యజీవి. 'ఎఱ్ఱాప్రెగ్గడ'-ను నుతింప 'బ్రహ్మకును తరంబె' యని రచించినాఁడు.

సామాన్య జీవితావధులను దాటని వ్యక్తికి ఉత్తమ కావ్యరచన సాధ్యముకాదు. మానవజీవితము నందలి బాహ్య సంఘటనలను మాత్రమే చూడఁగలిగిన కవి అలంకార శోభితమై, హృద్యమై, ఇంద్రియోత్తేజకరమైన వర్ణనలను, సన్నివేశములను చిత్రింప సమర్థుఁడు కావచ్చును. పఠితలకు నొకవిధమగు చిత్తవికాసమును కలిగింపవచ్చును. కాని ఆ సంఘటనలకు, సన్నివేశములకు హేతుభూతములై నిగూఢములై బాహ్యేంద్రియముల కగోచరములైయున్న ప్రకృతి తత్త్వములను గ్రహింపనివాఁడు మానవజీవిత తత్త్వమును చిత్రింపలేడు. వ్యాఖ్యానింపనులేఁడు. కావున ప్రకృతికి భాష్యప్రణేతయై, చింతనలో విలీనుఁడై, ధ్యానించు కవిపుట్టుకచేతను, శిక్షణచేతను, ధ్యేయము చేతను, సంస్కారము చేతను కూడ అసాధారణ వ్యక్తియై యుండవలయును. ఆత్మసంయమనము - ఇతనికి ప్రధానము. బాహ్యేంద్రియములను, అంతరింద్రియములను వశపఱచుకొన వలయును. ద్వంద్వముల కతీతుఁడై యుండవలయును అట్టి కవియే ఋషితుల్యుఁడు. ఆతని రచనలు విశ్వశ్రేయము నాపాదించునవి. ఎఱ్ఱయ యందిట్టి భావనా పటిమను, ధ్యాన నిష్ఠను గాంచఁ గలము.

ఎఱ్ఱయ తాను శంభుదాసుఁడనని చెప్పికొనినాఁడు. అయినను, శివకేశవులందు సమానభక్తి ప్రపత్తులు కలవాఁడు. ఈ యంశమున కీత డు వ్రాసిన గ్రంథము లన్నియు సాక్ష్యములు. అన్నియు విష్ణుమహిమను వర్ణించునవియే :

నృసింహపురాణమున - "గోవింద గుణాదర సంభృత. సౌమనస్య ధన్యుఁడ" నని తెలుపుకొనినాఁడు. అదియును ఇందులకు తార్కాణము.

నృసింహ పురాణము నందు -

"అప్రతి మాద్భుతోభయ కవిత్వప్రౌఢ శబ్దార్థ యోగాజ్ఞాసిద్ధి ఘనుండు మజ్జనకు డుద్యత్కీర్తి శ్రీసూర్యుఁడు" - అని చెప్పుకొనిన పద్యభాగము వలనను,

"సూర్యసుకవి మిత్ర సంభవ" – "శ్రీసూర్య సుకవిపుత్ర" యను గద్యభాగమువల ననుఁ – ఎఱ్ఱాప్రెగ్గడ తండ్రియు కవీశ్వరుఁడని తెలియుచున్నది. ఇతని కీ కవితా పటిమ – వంశపారంపర్యముగ సిద్ధించినదనియు తెలియుచున్నది.

"ఎఱ్ఱన" తనగురువును గూర్చి "మునీంద్రుఁడు" "సంయమీశ్వరుఁడు" "శివార్చనావ్రతుఁడు" భక్తవత్సలుడు – అని చెప్పెనేకాని తక్కిన వివరము లేమియు తెలుపలేదు. దీనినిఁ బట్టి ఇతని గురువు "శంకరస్వామి" మహాయోగి యనియు స్పష్టమగుచున్నది

అంతటి మహాశివయోగి సాన్నిధ్యమున శిష్యుఁడై వెలసియు, గోవిందుని గుణముల యం దాదరము స్థిరముగా నిలుపుకొనినాఁడనిన ఇతనిది వివేకముతోఁ గూడిన భక్తికాని, మూఢభక్తికాదని తెలియు చున్నది.

ఎఱ్ఱన స్వప్రశయముగా తన గద్యలన్నింటిలోను "శ్రీశంకరస్వామి సంయమీశ్వర చరణ సరోరుహ ధ్యానానంద ధన్యుఁడ" నని చెప్పుకొనినాడు. నృసింహ పురాణమున నితని పాత భావంబు నం దావిర్భవించినపుడు –

కం. "గురు భజన పరాయణుఁడవు
సరస బహుపురాణ ధర్మశాస్త్రకథా వి
స్తర వేదివి వినయోదయ
భరితుఁడ వతులాను భావ భవ్యుండవుమహిన్"

నృ. పు. 1–19

– అనియు,

కం "కావునఁ బ్రబంధ రచనా
ప్రావీణ్యము నీకు సహజ పరిణత సిద్ధం
బై వెలసిన యదియొక కృతి,
గావింప జగద్ధితంబుఁగా నేఁబనుతున్" 1–20

– అని యనెనాఁడఁట !

ఇది యెఱ్ఱయ స్వభావము. తాతనోట పలికించినాడు ఎఱ్ఱయ. ఇతఁడు గురుభజన పరాయణుఁడు. గురువు లనఁగా – తల్లిదండ్రులు, ఆచార్యులు మఱియు నితరులగు పెద్దలు. వీరిని సేవించుటయే తన జీవితమునకు పరమార్థమని యెంచినవాఁ డెఱ్ఱయ.

"సరస బహుపురాణ ధర్మశాస్త్ర కథావిస్తరవేది" బహుపురాణములు తెలిసిన వాఁడు. ధర్మశాస్త్రముల నభ్యసించినవాఁడు. అభ్యసించినంత మాత్రమున, తెలిసినంతమాత్రమున చాలదు. వానియందలి కథలను చక్కఁగా వివరించుటలో, సరసముగా వర్ణించుటలో నేర్పరి కావలయును. అట్టి చతురుఁడే యెఱ్ఱయ. వినయాభరణుఁడు అతులానుభావ భవ్యుఁడు.

ఇతనికిఁ బ్రబంధ రచనా ప్రావీణ్యము సహజ సిద్ధమని తెలియుచున్నది. ఇంతటి పండితోత్తముండైనను -

"ప్రౌఢాంచిత శబ్దసారులు ... కావ్యశయ్యఁ గీలించిన కీర్తిసంగ సుఖలీలకు నేనునుఁ గాంక్ష సేసెదన్" నృ. పు 1-13

-అని తాను అల్పజ్ఞుఁడనని చాటుకొని తనవినయ సౌశీల్యమును ప్రదర్శించినాఁడు.

ఎఱ్ఱనకు ప్రకృతిలోని సౌందర్యము, సృష్టిలోని విలాసవిభ్రమము తన్మయత్వమును కలిగించును. కనుకనే యితఁడు ప్రకృతితో తాదాత్మ్యమును చెంది పరవశించి నాఁడు. తన హరివంశమున ప్రకృతిని నాయకోత్కర్ష కుపయోగించుకొని నాఁడు. ప్రకృతియే తాను, తానే ప్రకృతియై భావావేశమును పొంది వర్ణించినాఁడు,

కళ యందు కళాకారుని యాత్మీయతాముద్ర ప్రత్యక్షముగనో పరోక్షముగనో. స్పష్టముగనో, అస్పష్టముగనో గోచరించుచుండును.

ఎఱ్ఱన సత్యాభిమాని. ఈ సత్యాభిమానము వలన ఎఱ్ఱన కలవడిన గుణము స్వభావోక్తి. ఇతఁడు నిరాడంబరతకు పెట్టినది పేరు ఇది ఈతని గ్రంథములందు స్వభావోక్తి రూపమున వెలువడుచునే యుండును. సాధారణముగ ఎఱ్ఱన పద్యము లన్నియు స్వభావోక్తి మధురములై "అలఁతి యలఁతి తునియలు" గఁగూర్పఁబడి సుకుమారములై చదువరుల చెవుల కమృతంపుఁ దుంపురులఁ జిలికించుచుండును. స్వభావోక్తితో వర్ణించు కవి సౌమనస్యముపై దృష్టి నుంచ వలయును.

ఇందులకు మూలమున కానరాని కొన్ని పద్యములు మచ్చుతునకలు. బాలుఁడగు శ్రీ కృష్ణుఁడు వ్రజమున పెరుగుచున్నాఁడు. బాల్యలీలలను ప్రదర్శించుచున్నాఁడు.

"పాలుపారఁగా బోరగిలి పాన్పు నాల్గు మూ
లలకును వచ్చును మెలఁగి మెలఁగి
లలిఁ గపోలంబులు గిలిగి లింతలు పుచ్చి
నవ్వింపఁ గలకల నవ్వు నవ్వు

ముద్దులు దొలుకాడ మ్రోకాలఁ గేలనుఁ
దడవుచు నెందునుఁ దారి తారి
నిలుచుండఁ బెట్టి యంగుళు లూఁత సూపఁగాఁ
బ్రీతిఁ దప్పడుగులు వెట్టి వెట్టి
తే॥ గీ॥ యన్నఁ గంటిఁ దండ్రినిఁ గంటి నయ్యఁ గంటి
నిందు రావయ్య విందుల విందవనుచు
నర్థిఁ దనుఁ బిలువఁగ నడయాడి యాడి
యల్లసిల్లెఁ గృష్ణుఁడు శైశవోత్సవముల

హ. వి. 1-5-193

ఇవి బాలురకు మిక్కిలి సహజములగు చేష్టలు. ఎఱ్ఱయ అతి మనోహరముగ నలఁతి యలఁతి పదములలో రచించినాఁడు. తనకు స్వభావోక్తియందుఁ గల అభినివేశమును ప్రదర్శించినాఁడు.

పాన్పుపై బోరగిలి నాల్గు మూలలకు వచ్చుట కపోలముల గిలిగింతలు పుట్ట నవ్వింప కలకల నవ్వుటలు, మ్రోకాలి కేలతడవుచు తారుటలు, నిలుచుండఁ బెట్టియంగు ళులూఁత సూపగా తప్పటడుగులు వేయుటలు – బాలురకు సహజక్రీడలు

'అలఁతి యలఁతి' పదములలో నింతటి స్వభావవర్ణనలను మూలమున లేకున్నను వర్ణించిన ఎఱ్ఱయ స్వభావోక్తి ప్రియుఁడు. ఇతని నిరాడంబర జీవనమున స్వభావోక్తి సహజముగనే చోటు చేసుకొన్నది.

ఇతఁ డపూర్వముగ నెందేని యుపయోగించిన దీర్ఘసమాసములు గూడ చాల వఱకు వ్యర్థములగు కల్పనములును, పదములును లేక చదివి నంతన మనస్సున కర్థము నందించు చుండును.

మూలమునలేని అట్టిదే శిశుశోక భావన –

"నోరం జేతులు రెండుఁ గ్రుక్కికొనుచున్మెల్ల బాష్పాంజన
స్మేరంబై తిలకింప నేడ్చుచు బోరిన్ వీఁచేతులం గన్నులిం
పారం దోముచు లేవఁజాచి పెదుదొయ్యన్మది కల్లార్చుచున్
శ్రీరమ్యాంఘ్రియుగంబు గింజుకొనుచుం జెల్వంబు రెట్టింపఁగన్"

హ. వి. 1-5-171

రెండు చేతులను నోటియందుఁ గ్రుక్కుకొనుట - మోమంతయు బాష్పములతోఁ గూడిన అంజనము వ్యాపింపఁగా ఏడ్చుట - మీఁజేతులతో కన్నులింపార తోముట - లేవఁజూచుట - ఆ లేవసురాకుండుటచే పిఱుదలను మీదికల్లార్చుట - రెండు కాళ్ళను గింజుకొనుట - ఇవి పసిబాలురుచేయు ఏడ్చునప్పటి అతి సహజమగు చేష్టలు.

ఎఱ్ఱన హరివంశ వరణమే అతని వ్యక్తిత్వమును చెప్పక చెప్పుచున్నది. అది పదునాలుగవ శతాబ్ది. అప్పటికి భారతము ఆదిసభాపర్వములు. ఆరణ్యపర్వమున కొంత భాగము, విరాటపర్వము మొదలు స్వర్గారోహణ పర్వము వఱకుఁగల భాగము- తెనిఁగింపఁబడినవి. హరివంశము - భారతమునకు పూరక గ్రంథము. హరివంశాం ధ్రీకరణ పూర్తికానిదే భారతమునకు పరిపూర్ణత సిద్ధింపదు.

అనాఁడు వైదిక మతము నందాస్తిక్యబుద్ధి నశించి పోవుచుండినది. అప్పుడు నన్నయ అవతరించి, పంచమ వేదసారమును, వ్యాసప్రణీత పరమార్థమును ఆంధ్రులకు - జనసామాన్యమున కందించినాఁడు. వైదిక మతము పునస్థాపింపఁ బడినది.

వీరశైవము విజృంభించి. మతము పేరిట మూఢ విశ్వాసము ప్రబలినది. రక్తపాతములు కలుగుచుండినవి. హైందవమతము శివభవరూపమున ఛిన్నాభిన్నమగుచుండినది. తిక్కన యవతరించి హరిహరాభేద సిద్ధాంతమును నెలకొల్పినాఁడు

దేశము యవనాక్రాంతమై, ప్రజలనేక పాపోపాయములచేత పీడింపఁ బడినారు చిరకాలము పండిత భుక్తము లగుచున్న అగ్రహారను లన్నియు మ్లేచ్ఛుల చేత అపహృతములైనవి. దేవతా విగ్రహములు, దేవాలయములు కొల్లగొట్టఁ బడినవి. ఎల్లయెడల భయావహమగు స్థితి యావహించినది. అప్పుడా అంధకారమున ఆశాజ్యోతిని చూపించి ఆస్తిక్యభావమును దృఢపఱచి, అశ్వాసించిన వాఁడు ఎఱ్ఱయ. దీనికి హరివంశమును సాధనము గావించుకొనెను. ప్రజలకు శాంతిని. దేవతావిశ్వాసమును కలుగఁజేయు గ్రంథము హరివంశమే యని నిర్ణయించుకొనెను. తాను శివ భక్తుఁడయ్యు విష్ణుమహిమల నభివర్ణించెను. తనపై గురుతర బాధ్యతను పెట్టుకొనెను

ప్రజలలో ఆవరించిన అశాంతిని, భీతిని పోఁగొట్టవలసి యున్నది. శివకేశవాభేదమును స్థాపించి హిందూ మతమును పటిష్ఠ మొనర్పవలసి యున్నది. తిక్కన ఊహించిన హరిహరాభేద తత్త్వమును గ్రంథమున ప్రతిపాదింపవలసి యున్నది.

ఇందుం కనువగు ఘట్టములు హరివంశము నందున్నవి. వానిని మిక్కిలి నేర్పుతో వర్ణించినాఁడు.

శ్రీకృష్ణుఁడు కైలాసమునకేఁగి శివునిఁ గూర్చి తప మొనర్చినాఁడు. హరుఁడు ప్రత్యక్షమైనాఁడు. అప్పుడు ఆ హరుని హరి నుతించిన తీరు –

కం॥ "చిరతపముల మెచ్చుచు సు
స్థిర భక్తికి వలచి వచ్చి చిక్కుదుఁ ద్రిజగ
ద్వరదా! ప్రభు నినుఁ దక్కఁగ
హర! యన్యునిఁ జెప్పఁ గలవె యామ్నాయంబుల్"

హ. వ. 2-6-47

అని ఆమ్నాయ స్వరూపునిగా హరి హరుని నుతించినాఁడు.

కం॥ భూతి విధాయకుఁ డవఖిల
భూతి నియామకుఁడ నీవు భూతి నిధివి స
ద్భూతిదుఁ డవు నక్రములకును
భూతేశ్వర! నీమహిమ ప్రభూతంబు శివా!"

హ. వ. 2-6-53

ఇఁక శంకరుఁడా హరితో –

చ॥ హరి యన సర్వసంహరుఁడవౌటఁ బ్రసిద్ధుఁడవైతి భక్తులం
గరుణ సుఖాత్మజీవనులఁ గా నొనరించుట శంకరుం డనం
బరగితి బృంహణత్వమున బ్రహ్మయనందగి యీత్రిలోకముల్
వెలవున విక్రమించుటఁ ద్రివిక్రముఁడైతి త్రివిక్రమంబులన్

హ. వ. 2-6-78

కం॥ నీ పేళ్ళెన్నియొ యన్నియు
నాపేళ్ళును నోముకుంద! నాకును నీకున్
రూపింప లేదు భేదం
బేపగిదిని నిన్నుఁ గనుట యెఱుఁగుట నన్నున్

హ. వ. 2-6.84

కం॥ నిను నొల్లక ననుఁ జేరుట
నను మెచ్చక నిన్నుఁగొలుచు నరునకు నరకా
యనములుఁగఁదెలుపు హరిహర
వినిరూపణ తుల్యమతులు విభులే యెడలన్"

హ. వ 2-6-85

ఇవి - శ్రీకృష్ణుఁడు కైలాసమేగినపుడు - శివునిఁగూర్చి తపమొనర్చినపుడు- శివుఁడు ప్రత్యక్షమైన సందర్భమున శివకేశవుల పరస్పర స్తుతులు.

హరివంశము నందొక ఘట్టమిది -

బదరికాశ్రమమును కారణజన్ముఁడగు శ్రీకృష్ణుడు ప్రవేశించినాఁడు అతని యుద్దేశ్యము రుక్మిణి సంతానాపేక్షను తీర్చుటకై, కైలాసపతిని పుత్రలాభము వేడుట ఇది అప్పుడే జరిగిపోయినది. కనుక బాహ్యముగ కనిపించు ఇష్టావాప్తి యిది. కాని అతని అంతరంగము నందలి వాంఛలు వేఱు. కైలాసగమనోద్దేశ్యమును వేఱు.

1) బదరికాశ్రమము నందలి మునులను, ఋషులను సందర్శించుట -

2) మూఢభక్తుఁడగు ఘంటాకర్ణుఁడను రాక్షసునకు విమోచనము కలిగించుట ఇందుమూలమున భక్తియే ప్రధానము, హృదయ నైర్మల్యమే ముఖ్యముకాని బాహ్య విషయములు కావని నిరూపించుట.

3) శివకేశవుల అభేదతత్త్వమును స్థాపించి సంతుష్టుఁడైచనుట.

ఈకార్యము లన్నియు సఫలములు కానున్నవి. ఈ కార్యములు ప్రకృతికి మిక్కిలి ప్రీతిని గొలుపునవి. కనుక శ్రీకృష్ణుని ప్రవేశ సమయమున, బదరీవనమున-

సీ॥ తరు విట పాసక్త ధౌత వల్కలపంక్తి
కమనీయ తోరణ కల్పనముగ
హాయమానంబులై యొండొండ వెలిఁగెడు
త్రేతాగ్ను లభినవ దీపములుగ
దుగ్ధపానంబులఁ ద్రుళ్ళు పెయ్యల నోరి
సురువులు సితపుష్ప విరచనలుగఁ
గోరి నీడంబులు సేరెడి ఖగముల
వాసితంబులు జయ ధ్వానములుగఁ

తే॥ గీ॥ దన సమాగమోత్సవమునఁ దగిన శుభము
లప్రయత్న సిద్ధములుగ నతిశయిల్ల
ముని జనాశ్రమ రేఖ లవ్వనజ నాభుఁ
డర్థిఁ దఱిసి యందొక రమ్యమైనచోట హ. వ. 2-5-152

తరు విటపములందారఁ గట్టిన వల్కల పంక్తులు-తోరణములైనవి. త్రేతాత్ను లందు ప్రజ్వరిల్లు హవిస్సులు అభినవ దీపములైనవి. దుగ్ధపానమొనరించి త్రుళ్ళు పెయ్యల నోటి నురువ్వులు సిత పుష్పరచనలైనవి. పక్షులు కోరి తమ గూడు చేరు కొనుచు ఆనందముగ నొనరించు ధ్వనులే జయ జయ ధ్వానములైనవి.

ఇట్లతని రాక కప్రయత్నముగ సమాగమోత్సవము సిద్ధించినది. ఇట్టి. యాశ్రమ భూములయందు వనజ నాభుఁడు ప్రవేశించినాఁడు. కైలాసమున పలుప్రదేశము లందు తిరుగు చుండినాఁడు. పలు భంగిమల గిరీశుని చర్యల తల పోయుచున్నాఁడు. అతని మహిమలనే యూహించుకొను చున్నాఁడు. ఇది భక్తి భావ తన్మయత్వము. మూలము నందు లేని భక్త్యావేశ మిది

ఒకచోట సెలయేఱులఁ గాంచినాఁడు - అప్పటి యూహలు -

"ఈ కొండ సెలయేఱు లీశ్వరు వృషభంబు
గోరాడు కూలము ల్గూడి యొప్పు"

హ. వ. 2-6-09

నని - భావించుచుండి నాఁడు.

కుంజము లగు పించినవి -

"ఈ గిరి కుంజంబు లిందు శేఖరు దేవి
మెచ్చుపూఁబఱువులు మెఱయు"

నని- ఆ నందించి నాఁడు.

నెత్తమ్ములు దృష్టి గోచరములైనవి -

" ఈ యద్రి నెత్తమ్ము లీశ తాండవ రంగ
భూములై యసమాన భూతిఁ దనరు"

నని-శివ తాండవ రంగ భూములుగా మనోనేత్రములతోఁ గాంచి యానందించి నాఁడు

తోట లగుపించినవి -

" ఈ పర్వతము తోట లిభదైత్య దమను పూ
జకు భృంగి కోయు పుష్పములు పూచు"

-నని భృంగి పుష్పములు కోయుచుండుట నూహాలోకమునఁ గాంచినాఁడు.

భృంగి ఈశ్వరు నారాధించు భక్తాగ్రేసరుఁడగు ఎంటు. అతఁడే తానై ప్రతి నిత్యము పూజకై పుష్పములఁగోయు చుండుటను భావించి పరవశించినాఁడు.

"ఈ నగంబు ప్రకేవలు ప్రమథేశ్వరునకు
రుద్రకన్యా సహస్రంబు రుచిరకేళి
నలరు నెలవులై యెంతయు నమరుననినఁ
బొగడఁ దగదె యీరాజత భూధరంబు"

- అని ఆ నగము నందలి ప్రతి అణువును ప్రమథేశ్వరునికేళీ గ్రహముగా భావించి రుద్రుమహిమ నూహించి, భక్తిభావమున తన్మయత్వము నొందిన కృష్ణుని భావపరంపరలు ఎఱ్ఱయ భావపరంపరలే!

ఇది మూలమున లేని వర్ణన -

ఎఱ్ఱయే శంభుదాసుఁడు. శంభుమహిమల తిలకించు పట్టుల తానే తానై యనుభవించును. ఊహించును. ఆనందించును ఇట్టి తాదాత్మ్యభావనా స్రవంతి యేపాఠకుని నైతము భక్త్యావేశముల వర్తింపఁజేయునది. ఇదే ఎఱ్ఱయ శంభుదాసత.

శ్రీకృష్ణుఁడతి దీక్షగా శంభుని గుఱించి తపమాచరించినాఁడు. ఆతని తపస్సు ఫలించినది. ముక్కంటి ప్రత్యక్షమైనాఁడు. ఆతని చెలువము వింతవేడుకలు కలిగించు చుండినది. ఎఱ్ఱయ కట్టి వర్ణనాసందర్భము లందు చిన్న పద్యములు - కందములు, వృత్తములు చాలవు. ఏరీతిని వర్ణన చేయఁదలంచి నను సీసపద్యమునే చేపట్టును. అప్పటికిఁగాని యాతని భావవైశద్యమునకు చోటుచాలదు. సత్త్వమాధి పరతావర్ధిష్ణుఁడగు కృష్ణునకు మహేశుఁడు ప్రత్యక్షమైనాఁడు. కన్నుఁ డాతనిని చూతము నుండియే గాంచినాఁడు. సమాధ్యవస్థ విడిపోయినది. భక్తిసంభరితుఁడై కేలు మోడ్చినాఁడు. ఫాల నయను మూర్తిని తదేకధ్యానమునఁ గాంచుచు ఉండిపోయినాఁడు. అసమాధ్యవస్థ ఎఱ్ఱయ అనుభూతి. ఆ పారవశ్యస్థితి ఎఱ్ఱయదే.

సీ॥ జాఁదలఁ జదలేటి లేఁదరఁగలు వ్రాలఁ
దగు చందమామ నుయ్యాల లూఁప
నాపవుల తలలఁ జెన్నడరు మానికముల
చాయదిక్కుల నెఱ సంజ వలుపఁ
దోరంపు టేనిక తోలి యేడ్తెఱ కప్పు
కుత్తుక కఱ తోడఁ బొత్తు సేయఁ
దట్టంపు బూతి పూతలు బూది పఱచిన
పునుకల పేరురంబునఁ దలిర్ప

తే॥ గీ॥ మూఁడు లోకంబులనుఁగావ మొనసి నట్లు
చేత ముమ్మొన కయిదువు చెన్ను మీఱ
వేల్పుఁ బదువు చూడ్కికిఁ గడు వింతవేడ్క
సేసె ముక్కంటి యున్నయా చెలువు పేర్మి

హ. వ. 2-6-38

ఇట్టి హరుని హరినిఁగాంచి అందలి ఋషులు, మునులు నందఱును నయ్యిరువురకు ప్రణామంబు చేసి యంజలి ఘటించిరి.

ఇట్టి ఘట్టమున ఎఱ్ఱయ హరిహరాద్వైతము స్థాపించినాఁడు. శ్రీకృష్ణునితో శివుఁడు పల్కిన భావ మత్యంత గమనార్హము.

"నీ పేళ్లెన్నియొ అన్నియు నా పేళ్లు నాకును నీకును రూపింప భేదములేదు. నన్ను మెచ్చక నిన్నుఁ గొలుచువారలకు నరకము ప్రాప్తించును."

"హరిహర వినిరూపణ తుల్యానుతులు విభువే యొడలన్."

ఇదే ఈ ఘట్టమునందలి గ్రహింపవలసిన ఆదర్శము. అద్దానిని స్థాపించి చూపుటయే ఎఱ్ఱన లక్ష్యము.

ఇది — "శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే
శివస్య హృదయం విష్ణు ర్విష్ణోశ్చ హృదయం శివః"

అను శ్లోకభావమునే ఎఱ్ఱయ ప్రదర్శించినాఁడు.

ఇఁక మూలమునందలి శ్లోకములు —

"అహం త్వం సర్వగో దేవ త్వమేవాహం జనార్దన!
ఆవయో ర న్తరం నా స్తి శబ్దై రర్థై ర్జగత్పతే!
నామాని తవ గోవింద! యానిలోకే మహాంతిచ
తాన్యేన మమ నామాని నాత్ర కార్యా విచారణా
త్వ దుపాసా జగన్నాథ! సైవా స్తి మమగోపతే!
యశ్చత్వాం ద్వేష్టిదేవేశ! సమాం ద్వేష్టి నసంశయః"

హ. భ. 88-60 నుండి 88-62 వరకు

— ఈ మూలమున కనువాదమే పైపద్యము. ఇందు హరిహరాద్వైతము స్థాపింపఁ బడినది. ఆనాఁటి సంఘమున కది అత్యంతావశ్యకమై యుండినది. ఎఱ్ఱయయు హరిహరాద్వైత భావము కలవాఁడు గనుకనే శంభుదాసుఁడయ్యు, గోవింద గుణములను ఆదరించి రచించినాఁడు.

ఎఱ్ఱయ సూక్ష్మపరిశీలనా శక్తికి పెట్టినదిపేరు హరివంశమున కొన్నిపట్టుల మూలమునలేని భావములను వర్ణించియు, మూలమున నున్న విషయములను కొన్నింటిని తొలఁగించియు, సమయోచితముగ మార్చియు తనసూక్ష్మపరిశీలనా శక్తిని చాటుకొనినాఁడు. ఉచితజ్ఞుఁడని చెప్పకయే చెప్పుకొనినాఁడు.

గోపాలు రందఱును చూచుచుండఁగనే శ్రీకృష్ణుఁడు ఎవ్వరితోడను చెప్పక కాళియ మడుగున దూకినాఁడు. జలాశయము సంచలితమైనది. కోపించిన కాళియుఁడు

"తన ఫణావళి గలంతయు విచ్చి యెత్తిన
గగనంబు సర్వంబుఁ గబళితముగఁ
దన మిక్కుటపుఁ గోఱదాడలు దెఱచిన
విసపుఁ జిచ్చొండొండ దెసలు ప్రేల్వఁ
దనచూడ్కు లుగ్రంపుఁ గినుకతోఁ బర్విన
నంబర చరకోటి యార్తినొందఁగ
దనమేను మలకలై తనరారి నిగిడిన
యమున యంతయుఁ దన్మయత్వమొందఁ

తే॥ గీ॥ పొడలు, దశఫూత్కృతులనెల్ల బొగలు గవిసి
యబ్జజాండ మూదరవెట్టి నట్లు గాఁగఁ
గాళ కర్కశ కాయుండు కాళియుండు
గవిసె గోపాల బాలుపై కసిమసంగి”

హ. వ 1-7-21

— ఈ పద్యమున నెఱ్ఱయ ఒకానొక క్రమమును పాటించినాఁడు. ఇది సూక్ష్మపరిశీలన లేనిచే వరాప పడదు. సర్పము నీటి యందుండినది. కోపించి హఠాత్తుగా పైకి లేచినది. అప్పుడు మిక్కిలి రోషావిష్టమగు నాగము మొట్టమొదట బుస్సుమనుచు పడగ విప్పును. తనకుఁగల ఫణావళుల నెల్ల ఒక్కసారిగా విప్పినాఁడు కాళియుఁడు. అనంతరము మనకు దృష్టిగోచరమైనవి కోఱదౌడలు. ఫణావళుల తరువాత కోఱలు. ఆ కోఱలనుండి విషాగ్ని కురిపించినది. అనంతరము కన్నులు “తన చూడ్కులు గ్రంపుకినుకతో పర్వఁగా అంబర చరకోటిని” ఆర్తి నొందించినది. అనంతరము మేను మలకలై - వంకరలై తనదారి నిగిడినది. యమున ఎంతయు తన్మయత్వము నొందినది. ఆ కాళియుఁడే కాళియుఁడుగా నిండిపోయినది. అప్పుఁడా సర్పము ఫూత్కారము గావించి పొగలు వ్యాపింపఁ జేసినది. అది అబ్జజాండము నందంతట చంపుటకై వేయు విషము పొగవలె వ్యాపించినది. ఇట్లా కాళకర్కశకాయుఁడు గోపాల బాలునిపై కురికినాఁడు. ఇదొక భయంకర సర్పము కోపించి చేయు చేష్ట. సూక్ష్మాతిసూక్ష్మముగ పరిశీలించి వర్ణింపఁ బడినది.

పోవుచున్న నాగమును దెబ్బవేసినయెడల మొట్టమొదట పడగవిప్పును. కోఱల నుండి విషము గ్రక్కును. మెలికలు తిరిగి చుట్టుకొనును. ఇందొక క్రిమబద్ధమగు చేష్ట కనిపించుచున్నది. మూలమునం దీక్రమము కనిపించదు.

“ఉదతిష్ఠత్ జలాత్ సర్పోరోషపర్యాకు లేక్షణః”

హ. వి 126-4

“స చోరగ పతిర్క్రుద్ధోమేఘరాశీ సమ్ప్రభః
తతో రక్తాంత నయనః కాళియః సమదృశ్యత”

ఇట్లు వర్ణింపఁబడినది.

ఇట్లు కాళియుఁడు పొదివికొని ఆతనికేమి చేయుటకును తెలిపి యాలేదు. ఆపాదమస్తకము భుజగేంద్ర మాతని బంధించి వేసినది తాపాయత్తునిఁగావించినది.

కాళియుని చుట్టలు, వెలుపల సర్పాలు చుట్టుముట్టి భీషణములగు దంష్ట్రలచే కఱవఁదొడంగినవి.

ఈభయానక దృశ్యమును గాంచి, గోపాలురందఱును వ్రేపల్లెకు పఱతెంచిరి. యశోదానందులను తక్కిన వ్రజదాసులను తెచ్చిరి.

ఇచ్చట ఎఱ్ఱయది మఱొక సూక్ష్మపరిశీలన. మూలమున –

"ఏతస్మిన్నంతరే భీతా గోపాలాః సర్వఏవతే
క్రందమానా వ్రజం జగ్ముర్బాష్ప గద్గదయాగిరా"
హ. వి 126-15

"ఏష మోహంగతః కృష్ణో మగ్నో వై కాళియే హ్రదే
భక్ష్యతే సర్పరాజేన తదాగచ్ఛతమాచిరమ్" హ. వి 126-16

– 'ఇంతలో భీతిఁ జెందిన గోపాలురు బాష్పగద్గద స్వరమున నేడ్చుచు వ్రజమునకు వెళ్ళిరి. ఈ కృష్ణుఁడు కాళియ మడుపునందు మునిఁగి మూర్ఛిల్లినాఁడు. సర్ప రాజుచే భక్షింపఁ బడుచున్నాఁడు. శీఘ్రముగా రండు' అని నుడివినారు.

ఎఱ్ఱయ హరివంశమున –

"ఇట్టి బెట్టిదపుఁ జందంబు సర్వంబునుం గనుంగొని గోపకుమారు లందఱుం దలంకి" యచ్చటికి దక్షిణపుదెసం గ్రోశమాత్రంబున నున్న వ్రేపల్లెకు నతిరయం బునం బఱచి"
హ. వ 1-7-27

మూలమున 'వ్రజం జగ్ముః' అని యున్నది. వ్రజప్రదేశమెంత దూరమున నున్నది? కాళియహ్రదము నుండి పరుగున వెళ్ళి చెప్పువారిని తీసికొని రాఁగలిగి నంత దూరమునందున్నదా?ఇవన్నియు మూలమునలేవు. 'వ్రజమునకు వెళ్ళిరి' అనియున్నది.

యశోదానందులను వ్రజవాసులను తేఁగలిగినంత దూరమునం దున్నదా? యను సందేహము రాకపూర్వమే ఎఱ్ఱయ - "అచటికి క్రోశమాత్రమున నున్న వ్రేపల్లెకు వెళ్ళిరనియు, అందునుఁ అతిరయంబునఁ బఱచి'రనియు సవరించి పాఠకు లకు సందేహము రాకుండ చేసినాఁడు.

ఇంతటి సూక్ష్మపరిశీలనా నైపుణ్యము ఎఱ్ఱనది.

తదనంతరము –

"పశుపాల పుంగవుండు వజ్రపాత తుల్యంబగు నవ్వాక్యంబు హృదయము పగిలింప నార్తియు, విస్మయము, శోకంబును ముప్పిరిగొన నప్పుడ "ఎక్కడెక్కడ" యని, యక్కుఱ యా వచ్చిన వారు తెరవుపెట్ట నతిత్వరితంబుగ నరిగె" 1-7-29

ఇవి యార్తితో నిండిన నందుని పరుగులు. ఇంకతరువాత "లావరులగు గొల్లలెల్లం గైదువులు గొని యతనిం దల కడచి నడచిరి." "యశోద తల్లడిల్లి యుల్లంబు మూర్ఛలు పైకొన నాక్రందన పరవశయగుచు, వికర్ణకేశయు, విగళిత బాష్పధారాక్లిన్న విహిత మార్గయునై చుట్టంపు వెలందు లెల్లం దగిలి పొదవికొని పోవం బోయె"

ఇదియొక మాతృమూర్తి దీనావస్థ -

నందుని స్థితి - జనకుండు నందుండు. ఇతండు పశుపాల పుంగవుండు" అయినను పితృవాత్సల్య పరాధీనుండు కనుకనే యతనికా వాక్యములు వజ్రపాత తుల్యములైనవి. హృదయమును ఛేదించినవి. విస్మయమొకవైపు. శోకము మఱొక వైపు. ఆర్తియొకవైపు - ముప్పిరి గొన్నవి. అక్కుఱయివచ్చినవారు మార్గమును చూపుచుండంగా, "ఎక్కడ, ఎక్కడ"యని శీఘ్రముగా పోయినాండు.

తన కుమారుని భుజంగము బంధించినదని తెలిసియు, ఏమిచేయవలయునో, ఏయాయుధములు గ్రహించి పోవలెనో వెనుక ముందు లాలోచింపక పరుగిడు చున్నాండు. దుర్భర వేదనా దూయమాన మానసుండు. సాధనముల తీసికొని మడుగులోనికి నుఱుకు ప్రయత్నములతో పోవలయునని ఆలోచింపండాయెను. పుత్ర ప్రేమ విచక్షణా జ్ఞానమును పోంగొట్టినది. యుక్తాయుక్త వివేకమును తొలంగించి నది. తీరికంగా ఆలోచించు జ్ఞానములేదు. "ఎక్కడ" "ఎక్కడ" అనుచు పరుగిడు చున్నాండు. కాని యాతని పరిస్థితిని గుర్తించిన లావరులగు గొల్లలెల్ల కైదువులంగొని యాతని వెంబడించిరి. వెంబడించుటయేకాదు. "తలకడచి నడచిరి". - ఈ "తలకడచి నడచిరి"-అనుటలో నెంతయో హృద్యచిత్రణమున్నది. ముందుపరుగిడుచున్నవాండు నందుండు. కాని వివేకము కోల్పోయి పరుగిడుచున్నాండు. పుత్రుని యాపద యాతని విచక్షణా జ్ఞానమును పోంగొట్టినది. ఆతండు ముందుగా చేరియు నేమియు చేయలేండు. పుత్రవాత్సల్యము దుఃఖావేశము, భయము, భ్రాంతి - అన్నియుచేసి యాతనిని అంధునింగాంచినవి. ఏమి చేయుచున్నాండో ఏమి చేయవలెనో - ఏమియు తెలియని స్థితిలో నున్నాండు. 'అర్థి అంధుండు - ముందుగా నడచియు ప్రయోజ

వము లేదు :- అని తెలిసి. "పశుపాలపుంగవుఁ' డైనను- "ముందు పోవుచున్నను" తమకు 'అధికారి' అయినను 'తలకడచి' తామే ముందుఁగా పోయిరి. ఇందులో నెంతయో యౌచిత్యమున్నది. అచ్చట భయానక భుజంగముల బారినుండి బాలుని తప్పింపవలసిన ప్రయత్నములు చేయవలసియున్నది. ఇందులకై ఆ ప్రదేశమునకు ముందుగా చేరవలసి యున్నది. కనుకనే వివేకము కోల్పోయిన నందుని "తలకడచి" చనుట ! మఱియు నీ 'తలకడచి' నడచుటలో, వారికి నంద కుటుంబము నందును, ప్రత్యేకించి నందకిశోరుని యందును గల పరమప్రేమ అభివ్యక్తమగుచున్నది.

మూలమున -

"నంద గోపస్తు తచ్ఛ్రుత్వా వజ్రపాతోపమం వచః
ఆర్తస్స్ఖలిత విక్రాన్తః తం జగామహ్రదోత్తమమ్"

—ఆ వజ్రపాత తుల్యమగు వచసము విని నందగోపుఁడు ఆర్తుఁడై పదములు తొట్రుపడు చుండ హ్రదోత్తమమునకు వెళ్ళెను

మూలమున నందుఁ డార్తుఁ డాయెనని యుండఁగా ఎఱ్ఱయ దానిని, "ఎక్కడ" "ఎక్కడ" అని సంభ్రాంతుఁడై వెళ్ళెనని చెప్పి వ్యాఖ్యానించెను. ఆ వెళ్ళుటయు "అహ్హా యి వచ్చినవారు తెరువువెట్ట నతి త్వరితంబుగ నరిగెను. 'తెరువువెట్ట' ఎఱ్ఱయ పరిశీలనాబుద్ధికి నిదర్శనము. దుఃఖావేశమున ఇంద్రియములు పరవశములైన వని నందునకు దారి కానవచ్చుట లేదని తెలియుచున్నది.

"స బాలయువతీవృద్ధ స్సచ సంకర్షణోయువా
ఆక్రీడం పన్నగేంద్రస్య జలస్థం సముపాగమత్"

హ వి. 12-19

బాల యువతీ వృద్ధసమేతముగా, సంకర్షణుఁడు పన్నగేంద్రుని క్రీడాస్థలము నకు వెళ్ళెను. దీనినింత సూక్ష్మముగా పరిశీలించి, సరియైన పదముల పొందికతో, ఆవేదనకు తగిన భావముతో, భావమునకుఁ దగిన పదజాలముతో, వ్యాఖ్యాన రూప ముగా రచించిన ఎఱ్ఱయ సూక్ష్మజ్ఞత మెచ్చి తలలూఁపఁదగినది.

యశోదస్థితి :- కుమారుని యాపదను వినినంతనే తల్లడిల్లినది. మూర్ఛ ఆవరించినది. ఆక్రందన పరవశయైనది. వికీర్ణకేశయు, విగళితాశ్రుధారాక్లిన్న పిహిత మార్గయు నైనది. నిరంతరాశ్రుపాతముచే ముందునకు మార్గమే కానరాదాయెను.

అప్పుడు చుట్టంపు వెలఁదులెల్ల తగిలి పొదివికొని పోవఁగా వారి యాధారముతో తాను నడచినది.

నందుఁడు తనకు తానుగా నడువఁగలిగిన స్థితిలో నున్నాఁడు. 'ఎక్కడ - ఎక్కడ?' అనుచు దిక్కుతెలియని స్థితిలోనైనను పోఁగలిగి యున్నాఁడు. యశోద అబల. స్త్రీజాతి సహజమగు దైన్యముతో, దుఃఖముతో నిండి, నడువఁజాలని స్థితిలో నున్నది. కనుక వెలఁదులెల్ల తగిలిపొదివికొని పోవఁగా పోవుచున్నది. 'తగిలి - పొదివికొని' - అనుపదము లెంతయో సహజములై యా పరిస్థితి కనుకూలములైనవి. కాళ్ళముందునకు పోలేని స్థితి అశ్రుధారలచే నేమియు కనిపించని స్థితి. హృదయ వేదనచే మూర్ఛ ఆవరించి ఏమియు చేయలేని స్థితి. ఇదియొక మాతృమూర్తి గర్భ జనిత శోకమునకు ప్రత్యక్ష చిత్రణము. అంతటితో ఎఱ్ఱయ చిత్రణ ఆగలేదు.

"అబాల వృద్ధంబుగా వ్రేపల్లె యెల్లం గదలి యిదియేమి పుట్టెననువారును, నిట్టవునే యనువారును, గృష్ణుండెప్పుడు కొఱఁత నుఱుకు పిన్నవాఁడును, చిన్న కొలందులంబోయెడు వాఁడు గాఁడను వారును దొంటి చెయ్దంబు లూహింపఁగా శియాహియుఁ దద్భావులకు లోనఁగు వాఁడు కాని యతని కవమానంబు గలుగనేరదు సూడుండనువారునై పెక్కండ్రు పెక్కువిధంబులం బలుకుచుం జనిరి"

హ. వ. 1-7-29

ఇంతటి దృశ్యవర్ణన యొకానొక భయంకరమైనకీడు ఆకస్మికముగా సంభవించి నపుడు, నలుగురు గుమిగూడి నపుడు నెక్కడనైనను సంభవించునట్టిదే:

ఒకరికి భయసందేహములు కలుగును. మఱొకరు ఆశావాదులుగా మంచినే యూహించుచుందురు. ఇంకొకరు పూర్వాపరములను విమర్శించి, భవిష్యన్నిర్ణయము గావించుచుందురు.

పలువురు కలసినపుడు "పుఱ్ఱెకొక బుద్ధి మనిషికొక నాలుక, తలకొకయూహ" అత్యంత సహజము.

ఇంతటి యావేగముతో పసగులిడి హ్రదసమీపమును చేరుకొనిన జననీజనకుల హృదయావేగమును మనసార వర్ణింపకున్న ఎఱ్ఱయకు తనివి తీరదు. మూలమున కతితముగ భావావిష్టుఁడై వర్ణించినాఁడు.

"అసిత ఘనావృతుండయిన యర్కుని మాడ్కి, మహావిధుంతు దో
ల్లసన విషణ్ణుఁడైన మృగలాంఛను పోల్కి, నుదగ్ర ధూమ సం
ప్రసర తిరోహితుండయిన పావకు భంగి, భుజంగ బంధన
వ్యసనము నొందియున్న కమలాక్షునిఁ గాంచి విషణ్ణ చిత్తతన్"

ఏమియు చేయలేని స్థితిలో నివ్వెఱపడి చూచుచుండిరి. యశోదానందుల వాత్సల్యము వెల్లువలై ప్రవహించినది. "హా" యనుచుం బుడమిం బడినారు. సొమ్మసిల్లినారు. ఏజననీజనకులైనను నాసమయమున నంతకంటె మఱేమియు చేయఁజాలరు. బంధుకృత ప్రయత్నమున తెలివిం బొందిరి. ఉల్లంబున నుడుకుచుండిరి. నందుఁడు తన దుష్టవిధిని నిందించు కొనుచున్నాఁడు.

కం॥ ఈ పసిపాపని నిచ్చట
నీ పెనుఁబాముసకు నిట్లు లెరసేసిన యీ
యాపదకు గొలువుఁగాఁ గల
యీపాటునకేమి పాపమేఁ జేసితినో ! 1-7-32

శా॥ రూపంబున్ బలవిక్రమంబులు మహారూఢంబులై యెంతయున్
దీపింపంగల యట్టి పుత్రుఁగనుటన్ దివ్యత్రప శ్కీలుఁడేఁ
గోపాలుండనఁ గీర్తితుండనగు నా గోమిమ్మెయిన్ వమ్ముఁగాఁ
జూపాత్మంగణుతింప దైవము కడుం జూపోపపదయ్యెంజువీ" 1.7.33

"ఇంతటి వ్యధ ననుభవింప నేనెంతటి పాపమును పూర్వజన్మమునఁ జేసితినో" యని వాపోయినాఁడు.

మానవుఁడు నిస్సహాయుడైనపుడు, దుస్తరదుఃఖము నీదఁ జాలనపుడు, తన పూర్వజన్మ పాపపరిపాకమని తన విధిని నిందించుకొనుట భారతీయునకు పరిపాటి.

రూపము నందును, బలపరాక్రమము లందును, మహోన్నతస్థితి నందుకొని ప్రకాశించు పుత్రునిఁగన్న భాగ్యశాలియని కీర్తినిఁబొంది, హఠాత్తుగా నిట్టి యాపదకు లోనైనందులకు దైవమును నిందించుచున్నాఁడు. దైవము కడుం జూవోపదయ్యెం జుమీ !" - యనుట అతి సహజమగు జాతీయము.

ఉ॥ "పూతన కట్లు సేపడియుఁ బోఁడిమిఁ దప్పక పేర్చుటాదిగా
నాతతమైన వీని బల మద్భుత మీ యురగంబువాత ని
ట్లాతురపడ్డ యట్టివిధ మారసి యిట్టనరాదుగాని వీఁ
డే తెరువ్వూదియైనఁ దరియింపఁ గలండను బుద్ధిపుట్టెడున్"
1-7-34

మొదట తన దౌర్భాగ్యమును నిందించుకొనుట - అనంతరము తన మహా భాగ్యము కీర్తి - నిముసములో వమ్మైపోయినందులకు దైవమును దూఱుట, తదనంతరము కొంత విమర్శించిన మీఁదట పూర్వ సంఘటనలపై నాలోచించిన మీఁదట, తనలో తాను ధైర్యము తెచ్చుకొనుట - ఇట్టివి మానవునకు సైజములు.

నందుఁడిట్లు తలపోయు చున్నాఁడు.

"పూతన చేతఁబడినప్పుడు పోఁడిమి చెడలేదు. వీని బలమద్భుతము. ఇట్లాతురముగా నీ యురగంబు వాఁతఁబడిన విధము నరసి చూచిన వీఁడేదో మార్గమున దీని తరింపఁగలఁడను బుద్ధి వొడముచున్నది. ఊరట గలుగుచున్నది. "ఈ యురఁగము వాత నిట్లాతురపడ్డ యిట్టి విధమారసి యిట్టనరాదు" - తానుగా నురగమువాత పడిన ఆతురత గాంచినచో "వీఁడేతెరువు వూదియైనఁ దరియింపఁగలండను బుద్ధి పుట్టెడున్" - పూర్వ సంఘటనలను తలంచి విమర్శించిన మీఁదట తప్పక తరియింపఁ గలండను నాశ కలుగుచున్నది నందునకు. ఈ ఆశ తనకాలంబనమైనది. మఱి తల్లికో

"ఏనుఁ జుట్టపుఁ బెద్దలు నింత తెలివి
గలుగు కతన నెట్టైన నీ యలఁత వెల్లిఁ
గొంత యీఁదెద మక్కటా! కొడుకుఁజూచి
పనపుతల్లి తల్లడము మాన్పంగ వశమె?" 1-7-35

అని యశోద అవస్థను చూచి వాపోవుచున్నాడు నందుడు.

నేనును తక్కిన బంధువులును ఇట్టి పూర్వసంఘటనలపై విమర్శించి, తెలివితో నాలోచించి బాలునకే కీడును కలుగఁ బోదని ధైర్యము వహింపఁగలము. ఈయలఁత వెల్లిని కొంతవఱకీఁదఁగలము. అక్కటా! మాతృదుఃఖమును మాన్ప వశమా! కొడుకుదుఃఖమునుఁ జూచి దుఃఖించు జనని తల్లడమును మాన్పవశముగాదు.

ఇంతటి మనోభావపరంపర ఎఱ్ఱయకే చెల్లినది. ఈ భావన లేవియును మూల మున లేవు. ఎఱ్ఱయ ఊహకు స్వరూప మొసఁగిన రచనా చమత్కృతి ఇది

ఇఁక యశోద దుఃఖము - భావపరంపరలు - మూలమున లేనివి - ఎఱ్ఱయ వర్ణించిన తీరు -

ఉ॥ వెన్నలు దిన్న తప్పులకు వ్రేఁతలు మెచ్చఁగ నాఁడు ఱోలితో
నిన్నటఁగట్టి త్రోచిన యనీతిఁ దలంచియొ నేఁడు నన్ను నో
వెన్నుఁడ యిట్లు సేసెదవు విశ్రుత సత్యుఁడవీవు నీకు నీ
చెన్నఁటి పాఁప పుర్వొకటి సేయఁగనోపెనె యేపుసూపవే!
1-7-37

శా॥ నామీఁదం గృపయెప్డుఁజాలఁ గలదన్నా యేనుశోకాగ్ని యం
దీమాడ్కిం బడఁగా నుపేక్షదగునే యీదిక్కు చిన్నవ్వతో
నీమోమింపుగఁ జూపవే తెఱవవే నేత్రాబ్జముల్ పల్కవే
యీమోదంబుఁగఁ బుత్ర! తల్లులకు నిట్లార్తి గావింతురే!
1-7-38

తే॥ గీ॥ అరయ దెసలేక గోధనం బడవిలోనఁ
జెల్ల చెదరయ్యె నీవింత సేపుఁ గుఱ్ఱ
యిట్టు లేమఱఁ బాడియే యీక్షణంబ
వెడలి చనుదెంచి ననుఁ బ్రోవవే కుమార! 1-7-39

కం॥ కడిఁది విషకంట కాటవిఁ
గడ కండలు చేసి నీఱుగావించితి నీ
పొడపాము నీకు నేటిది
గొడుకా నీకులము వంతఁ గూరుటుడుపవే!" 1-7-40

అంతటి పుత్రఘాతుకమును తిలకించుచున్నను, మూలమున యశోద ఒక్క పలుకు పలుకలేదు. పలవించలేదు.

కాని, ఎఱ్ఱయ యశోద పుత్రుని యవతారతత్త్వమును పరిపూర్ణముగ గుర్తించిన మహాజ్ఞానవతి. అతని పరతత్త్వమును, అలౌకిక శక్తిని, కూలంకషముగ తెలిసికొనిన మహనీయురాలు కనుకనే యామె విలాపమునందు పుత్రుని వినాశమును శంకింప లేదు. "స్నేహః పాపశంకీ" యనునట్లతి ప్రేమ కీడును శంకించును. కాని, ఎఱ్ఱయ యశోద పుత్రుని బలముపై నచంచల విశ్వాసము కలిగియే పలవించుచున్నది. "నిన్నానాడు త్రాటఁ గట్టి నందులకు నాకీ పుత్రశోక శిక్షను వేయుచున్నావా? విశ్రుతసత్త్వుఁడవు. నీకి చెనఁటి పాఁప పురువొక లెక్కయా ? నామీద నీకు మిక్కిలి కృపకదా ? నే నీవిధముగా శోకాగ్ని యందుండ నుపేక్షింతువా ? చిఱునగవుతో నీ మోమును చూపవా ? నేత్రాబ్జములు తెఱచి పలుకవా? పుత్రా! తల్లులకిట్టి బాధలు కలిగింతురా?" యని పుత్రుని శౌర్యముపై సంపూర్ణ విశ్వాసము తోడనే పలుకు చున్నది. "నీవు లేనిదే అడవిలో గోధనము చెల్లాచెదరై తిరుగుచున్నది". యని గోవులపై మనస్సును మరలింపఁ జేయుచున్నది.

"ఆ నాఁ డంతటి విషకంట కాటవిని కండలు సేసిన నీకి పౌడపాముక లెక్కయా? – "కులమునకుఁ గలిగిన దుఃఖమును బాపుము"– అని పలికినది.

ఆ జనని – బాలకుఁడు మహాకాళమునకు గుఱియై మరణించునని భీతి చెంద లేదు. తనకు భీతిని కలిగించుచు శిక్షింప నెంచుచున్నాఁడని తలంచినది. బాలుని యలౌకికశక్తిపై నింతటి యచంచల విశ్వాసము తండ్రియగు నందునకును కలుగలేదు.

ఇంతటి దృఢ విశ్వాసము కలిగినది కనుకనే శ్రీమహావిష్ణు నవతారమును లాలించి, పోషించు భాగ్యమా మహాజననికే యబ్బినది.

అచ్యుతుని పరతత్త్వమును గుర్తించిన పరమ భాగవత శిరోరత్న మా నారీమణి

మూలము నందీ భావములు గూఢముగా నుండఁగా ఎఱ్ఱయ వానికి భాష్య ప్రాయముగా రచన గావించెను.

ఎఱ్ఱయ భావములే యశోద భావములు. ఎఱ్ఱయ విశ్వాసమే యశోద విశ్వాసము. కనుక నీఘట్టమున ఎఱ్ఱయ ఎంతటి భాగవతోత్తముఁడో తెలియు చున్నది.

మూలమున –

"తాసం విలపితం శ్రుత్వా తేషాంచ వ్రజవాసినామ్
విలాపం నందగోపస్య యశోదా రుదితం తథా

హ. వి. 12[illegible]–28

ఏక భావ శరీరజ్ఞః ఏకదేహో ద్విధా కృతః
సంకర్షణస్తు సంక్రుద్ధో బభాషే కృష్ణ మవ్యయమ్" 126.29

వ్రజవాసులందఱును విలపించినారు యశోదయు విలపించినది. నంద గోపుఁడును విలపించినాఁడు.

నలుగురిలో తాము నొకరై విలపించిరేకాని మూలమునందీ యశోదా నందగోపులకు తలిదండులుగా నొక ప్రత్యేకత లేదు.

ఇట్లు పాత్రల మానసిక శోభను సమయానుసారముగా గుర్తించి తారతమ్యానుసారముగ మూలమున లేకపోయినను, వర్ణించిన ఎఱ్ఱయ సమయోచిత భావావిష్కరణము నిరూపమానము. ఇట్టివే భావ్యప్రాయ రచనలు.

ఇట్టిదే మఱొక ఘట్టము. మూలమున లేనిది కేవలము ఎఱ్ఱయ కల్పన. ఇందు మూలమున ఎఱ్ఱయ వర్ణనా వైదుష్యమును, తద్ద్వారా ఆతని వైయక్తిక లక్షణమును గాంచవచ్చును.

గోపికలు శ్రీకృష్ణునే తమ జీవిత సర్వస్వముగా తలంచినవారు. ఆరాధించినవారు ఆడినవారు, పాడినవారు. జీవితమంతయు నాతని సాంగత్యములోఁ గడుప నిష్ట పడువారు,

" ... గోవింద సాంగత్యమున్ గోపశ్రేణికిఁ బాపెఁ దాపభయమున్ ఘోరంపు ఘర్మంబునన్"- అట్టి ఘర్మమునం దాతని సాంగత్యము వీరికిఁ దాపముఁ బాపు చుండినది.

తే సీ॥ తల్లిదండ్రులు మాన్ప భర్తలు మగుడ్పఁ
జెలులు వలదనఁ జుట్టలు సిగ్గు పఱుప
ప్రేమఁత లోకటియె నెఱుఁగ వెన్నువెనుకఁ
దగిలి తమకముతోఁ బోవఁ దనరువారు" 1 8-14

ఇంద్రుఁ డతివృష్టిఁ గావించి నపుడు గోవర్ధన పర్వతమునే ఎత్తి వారిని కాపాడినాఁడు. విషవృక్షమును ఖండించి, విషబాధ నుండి కాపాడినాఁడు.

"కలవరించియుఁ గృష్ణాఖ్య తెలివినున్న
యప్పుడుఁ గృష్ణాఖ్య యేమఱి నట్టివేళ
యందుఁ గృష్ణాఖ్య దక్క నయ్యంగనలకు
రాదు వేఱొక వాక్యంబు రసన తుదకు" 1-8-20

ఇట్లు నిదురించు నపుడు, కలలోను మెలుకువ యందును. కృష్ణనామము తప్ప, ఆ యంగనలకు నొక ధ్యానము లేదు. గోపికలు కృష్ణభగవానుని తమప్రియునిగా భావించుకొని ఆత్మసర్వస్వము నాతని కప్పనవెట్టిరి. అతఁడు సాక్షాత్కరింపఁగా పరవశలై పాడిరి. దూరమైనపుడు దుర్భరవియోగాగ్నిలో నుడికిపోయిరి. ఈ గోపికల క్రీడలన్నియు అంతఃకరణ సంబంధములే కాని కాయజములు కావు.

అట్టి తమ సఖుఁడు – సర్వస్వము – మధురాపురమున కేగుచున్నాఁడు' కంసుని పంపున వచ్చిన అక్రూరుఁ డతనిని తీసికొని పోవుచున్నాఁడు. మూలమున నప్పటి గోపికల భావము మఱుఁగున పడిపోయినది. వారిని గూర్చి యొక్క శ్లోకము కూడలేదు. కాని ఎఱ్ఱయ గోపికలు మిక్కిలి పరితపించినారు.

ఆ రాత్రి నుండియే గోపభామినులు కృష్ణునిఁ బాయుటకు దుఃఖించు చున్నారు హరి విరహమధికమై వారిని పొదివి కొన్నది. కళవళపడు డెందము తో గోవిందుని వెంట తగిలినారు.

"అక్రూరుఁడను పేరు పెట్టుకొని క్రూరాత్ముఁ డొకఁడు పద్మనయనుని మా నుండి ఎడము చేయుచున్నాడు. ఎవరి ననియు లాభములేదు. దైవమే వక్రించినది. దైవమే కడు కీడు సేయఁ దలంచిన శక్రుండైనను తత్సంరంభముడుపఁ జాలఁడు" అని వాపోవుచున్నారు.

"కులము, శీలము, మానము, సర్వమునుఁ గొన్నయీ కృష్ణుఁడు నేడు మా ప్రాణములను సయితము గైకొన సంసిద్ధుఁడైనాఁడు" అని కృష్ణుని నిందించు చున్నారు. "ఏటి సంసారమిది యని మనము తెగువచేసి యితని వెంట పోయితిమా ? లీగ్గే కాని యడవిపులి మానిసుల నాదరించునా ? ఇతఁడు నగరకాంతల వలలందు చిక్కి మనల నాదరించునా ? " యని తెగువచేసి వెంటబడుటకు జంకుచున్నారు. ఇంతలో – శ్రీకృష్ణుఁ డగుపించినాఁడు. ప్రాణములు లేచివచ్చి నట్లయినది. అప్పుడు వారి భావములు –

సీ॥ "అదియిదె నెమ్మొగం బలరు మించులు ముంప
నాకూత కౌతుకి యగుచు నవ్వె"

హ. వ. 1–8–181

— అదో అదో నిండు మొగము ప్రకాశించుచుండ భావగర్భితముగ నన్నుఁజూచి నవ్వుచున్నాఁడని యొకతె సంతోషించినది.

"అదె యిదె చారు దంతావళి జిగిమెప్ప
నాపూర్ణ శృంగారుఁడగుచుఁ బలికె"

— దంత కాంతులు వికసింప శృంగార భూయిష్ఠముగ తన్నుఁ జూచి పలికినట్లుగ పొకతె భావన.

"అది యిదె భావంబు లనుభావముల నూన
నభి మతార్థ ప్రీతుఁడగుచు మెచ్చె"
"అదె యిదె లోలనేత్రాంశులు పర్యంక,
నధికాధర స్నిగ్ధుఁడగుచుఁ జూచె"

తే॥ గీ॥ రండు కూడంగఁ బోదండు మన మ
నోరథ చ్ఛేది గాకుండఁ గోరి యీఁగి
యితనిఁ బోనీక నిలుపుద మింతఁ దలరు
వారిఁగొని పోవ కెట్లు పోవచ్చుఁ దనకు"

— అని శ్రీకృష్ణుని పోనీయకుండ చేయతలపెట్టినారు

ప్రేపల్లె పెద్దలు శ్రీకృష్ణుని పోవిడిచి నందులకు గోపికలు వారిని నిందించు చున్నారు ఇతఁడు వెడలిపోయిన క్రూరులగు రక్కసుల చేష్టలు నెవ్వ రడుపువారని భీతిల్లుచున్నారు. వగరు చున్నారు. వారికి దప్పి జనించినది శరీర మలసిపోయినది. భూషణములు సడలి పోయినవి. క్రొమ్ముడులు వీడనవి ఉజ్వల శిఖామణులు జారి పోయినవి. ఉత్తరీయములు తొలఁగిపోయినవి ఇట్టి వివశస్థితి యందుఁదూలి యాడు చున్నారు. ఇది వియోగావస్థలో పరాకాష్ఠ. నిశ్చేష్టలయి నిలచిరి. చైతన్యవిహీనలై చూచుచు నుండిపోయిరి.

సీ॥ "వెలఁపులు పెకొని వెఱఁగుపాటులు నొంది
చెమటలు పెల్లయి చేష్ట లుడిగి,
వైవర్ణ్యములు సెంది వడఁకులు దొడరి య
శ్రులు మీఱి గద్గదికలు గడంగి,
రోమాంచములు పేర్చి వైమనస్యము లూని
ప్రేమంబు నెలకొని కాచు మఱిరి,

తాపంబు లెసఁగి చింతలు విజృంభించి వం
తలు మాఱుకొలు విముగ్ధతలు బలిసి
తే॥ గీ॥ తనుకరాక గోవిందునిఁ దగిలి చిక్క
వడిన చూపులు దిగువ నుపాయ మేది
కొరలి మిన్నక నిలిచిరి గోపకాంత
లందఱును జిత్రరూపుల యట్టి కరణి" హ. వ 1-8-134

గోవిందునిఁ దగిలి చిక్కువడిన చూపులు వెనుకకురావు. వెను దిప్పుటకు నుపాయము గానక గోపకాంత లందఱును చిత్రముల పగిది. మిన్నకుండిపోయిరి. ఇది జీవ బ్రహ్మైక్యస్థితి. ఇట్టి సమాధ్యవస్థకు పూర్వము వియోగవ్యథ - అందలి దశావస్థలు.

"చెమటలు పెల్లగుట - చేష్టలుడిగి పోవుట - వైవర్ణ్యము చెందుట - వడఁకుట - అశ్రుపాతము - గద్గదికలు - రోమాంచము - వైమనస్యము" -

ఇట్టి దశవిధ మన్మథావస్థలు వియోగమునఁ గలుగు నట్టిది. ఇంకను వియోగము సంభవించనేలేదు. కృష్ణుని చూచుచునే యున్నారు. ఇట్టి అవస్థ ఎక్కడిది? అనవచ్చును. ఇది భావమున కలిగి నట్టిది. శ్రీకృష్ణుఁ డచ్చటనే యున్నను. వారి మనస్సు లప్పుడే యాతని వియోగము నూహించినవి. అతఁడు వెడలిపోవుచుండుటను, పోయినట్లుగనే తలంచినవి. కనుకనే వారిభావము అందు కృష్ణుఁడచ్చట నున్నను లేఁడు. అతని సాంగత్యము లేదు, ఆ మధురాను భూతులు లేవు. కనుకనే భావము నందేర్పడిన వియోగావస్థచే పరితపించి నారు. చేష్టలుడిగిపోయినవి. వైవర్ణ్యము చెందిరి కనుల నీరు స్రవించుచున్నవి. చూపులు శ్రీకృష్ణునిలో లగ్నములై వెనుఁదిరిగిరావు. చైతన్యస్థితిని దాటిపోయినవి. భగవంతునిలో లీనమైనారు. శరీర మున్నది చైతన్యములేదు. ఆత్మ అతనిలో మగ్నమైపోయినది.

ఈ గోపికల సంయోగము జీవాత్మ పరమాత్మల ఐక్యము. ఈ గోపికల వియోగము జీవుఁడు పరమాత్మ సాంగత్యమును వీడిపరితపించు తాపము. వీరికలయిక ప్రకృతి పురుషుల కలయిక. వీరి ప్రణయము. అలౌకికము అందఱికి అందుబాటులో లేనిది. ఆనందాను భూతిలో అంతుకాననిది. కనుకనే అందఱు నాయికలు (జీవులు) ఒక్కసారిగా (పరమాత్మ)నాయక వియోగముచే పరితపించినారు.

"వాసుదేవః పుమానేకః నార్యశ్చ సకలం జగత్" అనుతత్త్వమును ప్రసాదించు ప్రణయము వీరిది.

ఇంతటి గోపికల భావోద్వృత్తిని మూలమున లేని దానిని ఎఱ్ఱయ గోపికా తాదాత్మ్యము నంది రచించెను సందర్భోచితముగ నెంతవఱకు భవముల నూహింప వచ్చునో అంతవఱకు నూహించినాఁడు. సమయోచితముగ పొందుపఱచి తన వర్ణనా పటిమను ప్రదర్శించినాఁడు. కనుకనే వర్ణనా విశారదుఁడు.

పరమాత్మతత్త్వమును, శ్రీకృష్ణుని సంయోగము నందు వియోగము నందును, గోపికగా (జీవుఁడుగా) భావించిన ధన్యజీవి ఇతఁడు

ఇట్లు పాత్రలతో తాదాత్మ్యమును పొంది రచించుటలో ఎఱ్ఱయ విదగ్ధుఁడు. ఎఱ్ఱయ దాక్షిణ్య వర్తనము కలవాఁడు. పరులను మాటలచే బాధించు వాఁడు కాదని తెలియుచున్నది కనుకనే మూలమున పాత్రలు పరుషముగా వర్తించు కొన్ని ఘట్టములందు ఉచితములగు మార్పులు చేయును.

శ్రీకృష్ణుఁడు కాళియమడువున దూకినాఁడు. ఫూత్కరించుచు కాళియనాగ మాకృష్ణుని బంధించివేసినది. దుఃఖావేశ వివశయగు యశోద అచ్చోటికి వచ్చిచూచి తెలివిఁదప్పి పడిపోయినది అట్టిసమయమున ఆమెను వెంబడించి వచ్చిన బంధువులు ఓదార్చవలసి యున్నది. ధైర్యము చెప్పవలసి యున్నది.

మూలమున వ్రజ పురంధ్రీమణులు యశోదను ఆస్థితియందు ఇట్లనుచున్నారు

"యం పశ్యసి ప్రియం పుత్రం సర్పరాజ వశం గతమ్
స్పందితం సర్పభోగేన కృష్యమాణం యథామృతమ్"
హ. వి. 12-23

"అశ్మసార మయం నూనం హృదయంతే విలక్ష్యతే
పుత్రం కథమిమం దృష్ట్వా యశోదే నావదీర్యసే" 12-24

— 'సర్పరాజ వశంగతుఁడై మరణించునట్లుగా ఈడ్వఁబడు పుత్రుని చూచుచున్నావు. ఈ దశయందు పుత్రునిఁ గాంచియు నీ హృదయము పగిలి పోకున్నదే! నిజముగా నీ హృదయము పాషాణమయము' అని పలుకుచున్నారు.

పుత్రశోకమున పలవించు తల్లిని ఓదార్చుట తగునుకాని, "నీ హృదయము పగిలి పోకున్నదే! బాతిగుండె నీది" అనునట్టి తీక్షణములైన పలుకులు 'పుండుపై కారము చల్లుట' వంటివి.

కనుకనే ఈశ్లోకమును అనువాదమున పూర్తిగా తొలఁగించినాఁడు ఎఱ్ఱయ. గోపికలు యశోదను పొదవి పట్టుకొని నడిపించుకొని పోవుదురు.

"ఇట్టి సుపుత్రుఁడుడింక ఏ జన్మమునన్నైన కలుగునా ? ఇతరులైనను ఇట్టి యాపద కోర్వఁగలరా ? కన్నకడుపు ఎట్లోర్చు కొనుచున్నదో కదా ! ఈ వెల పెట్ట రాని పెంపునఁగల మానికము ఇట్లు బొగ్గయి పోయెనే ? అక్కటా ! యీతల్లి ముప్పు నతు నోమని ముగ్ధ గదా ?" యని యామెతోఁ బాటు తాము విలపింతురు. "నీ హృదయము పాషాణ సదృశము" వంటి మాటలు ఎఱ్ఱయ హరివంశమున లేవు

కనుక సమయ సందర్భముల ననుసరించి, తనపాత్రలతో సంభాషణలు చేయించువాఁడు ఎఱ్ఱయ యని, సంభాషణలలోను తూచి పదముల పొడిగించు వాఁడని తెలియు చున్నది. దాక్షిణ్య స్వభావము కలవాఁడు గనుక పాత్రల స్వభావములను కూర్చి రచించినాఁడు.

అతఁడొరుల కష్టములకు జాలిపడువాఁడు. కనుకనే కఠినములగు బాధ కలి గించు పదముల నుపవదించక తొలఁగించి వేసినాఁడు. ఇవి యాతని సుకుమార హృదయతకు నిదర్శనములు. ఎఱ్ఱయకు మూలము నందు గౌరవము లేదనికాదు. అట్టి వాక్యము లా సందర్భమున, ఆపాత్రలకు తగనివని వదలివేసినాఁ డంతియే. ఇది యాతని దాక్షిణ్య స్వభావమునకు ప్రతీక.

ఎఱ్ఱయ పరమ సాత్త్వికుడు. సాత్త్వికుఁడగు కవిచేయు రచనలు సంయమ ప్రధానములుగా నుండును. అట్టి కవి సంయమము పదజాలము నందు, అర్థమునందు, భావమునందును కనఁబడును.

మూలమున – శ్రీకృష్ణుని చంపుటకై పూతన అర్ధరాత్రి ప్రవేశించినది.

"పూతనా నామ శకునీ ఘోరా ప్రాణభయంకరీ
ఆజగామార్ధ రాత్రౌవై పక్షౌ క్రోధా ద్విధున్వతీ"
... ... ... ... ...
"తతోఽర్ధరాత్ర సమయే పూతనా ప్రత్యదృశ్యత
వ్యాఘ్ర గంభీర నిర్ఘోషం వ్యాహరంతీ పునః పునః"
"నిలిల్యే శకటసాక్షే ప్రసవోత్పీడ వర్షిణీ
దదౌ స్తనంచ కృష్ణాయ తస్మిన్సుప్తే జనే నిశి"

"తతః స్తనం ప్రపౌకృష్ణః ప్రాణై స్సహ వినద్యచ
ఛిన్న స్తనీతు సహసా ప్రపాత శకునీ భువి"

– "అర్ధరాత్రి సమయమున పూతన ప్రవేశించినది. వ్యాఘ్రమువలె గంభీరముగా ఘోషించుచు, శకటము నక్షమున దాగి యుండినది. ఆమె "ప్రసవోత్పీడ వర్షిణి"– ధారా ప్రవాహముగా క్షీరము వర్షించు చుండినది. అనంతరము జనులందఱు నిదురించి యుండఁగా శ్రీకృష్ణునకు స్తన్యమొసంగినది. కృష్ణుఁ డామె స్తన్యముతోపాటు ప్రాణములనుఁ గూడ పాన మొనర్చినాఁడు. ఆమె హఠాత్తుగా భూమిపై ఛిన్న స్తనియై పడిపోయినది".

ఎఱ్ఱయ హరివంశమున – "ఘోరాకారయగు నిశాచరి నిశా సమయంబున నర్భకుల వెదకుచుఁ జనుదెంచినది!

అది నిశాసమయము. అర్ధరాత్రికాదు. వచ్చి వ్యాఘ్రము గంభీరముగా ఘోషింప లేదు అట్లు చేసినచో ప్రజలందఱు ఆకృష్ట లగుదురు. మేల్కొందురు. కార్యము చెడును ఎఱ్ఱయ పూతన కార్యశూరురాలు.

బాలునిఁ గాంచినది. కాంచినంతనే పిఁడెల్లఁబోటిబాలుఁడు గాఁడని నిర్ణయించి నది. నందగోపుని శకటము క్రిందఁ దగు తల్పంబున నుత్తానశాయి యగు బాలునిఁ గాంచినది. కంసునకు కీడు గావించుటకై జనించినవాఁడ యగునని తునుముటకు నిశ్చయించినది. అప్పటి యామె భావములకు దగిన రూప వర్ణన –

"పండులు గొఱుకుచుఁ బదరి హుమ్మని మిడి
గ్రుడ్లుల నిప్పులు గ్రుమ్మరిలఁగ
నదరెడు కటముల నాకుంచితములగు
బొమలును నుదుటిపైఁ బొడము చెమట
మెఱగు కోరలు బేర్చి యొఱపుంట లందందఁ
జల్లెడు బహుళ నిశ్వాసములును
నాగ్రహంబునఁ బోరి నాకంపితములగు
కరములునై భయంకరము గాఁగ

తే॥ గీ॥ జనని పొదిగిట నున్న బాలునిఁ గడంక
నెత్తికొని యొమ్ముపై నిడి యెత్తి విషపుఁ
జన్ను మొనలు తదాననాబ్జమున నదిమె
నమ్ముటయుఁ బాపఁ డార్తుఁడై సట్లు పోలె ”

హ. వ. 1-5-150

ఉ॥ ఎత్తిలి కావుకావురన నేడ్చి తదీయ పయోధరాగ్రముల్
కుత్తుక దాఁకఁ బెట్టికొని క్రోలెఁ గ్రమంబునఁ జన్నుఁబాలతో
నెత్తురు మున్నుగాఁగ గణనీయములై చను సప్తధాతువుల్
పొత్తుగఁ బ్రాణముల్ సనఁటి బొందియ ట్రిక్కఁగ నొక్క వ్రేల్మిడిన్

1-5-151

—ఇది రక్కసి చావు. రక్కసి “పదరి హుమ్మని” పండ్లు పటపట కొఱకుచు, మిడ్రుగుడ్లు సిప్పులు గ్రమ్మఁ గెలఁగ తనకోపమును ప్రకటించుకొనినదే కాని ‘ వ్యాఘ్ర ఘోష’ వంటి ఘోషలను చేయలేదు. ‘ప్రసవోత్పీడన వర్జనీ’ అను మూలమునకు అనువాదము లేదు. రహస్యముగా వచ్చిన రక్కసి స్తన్యమును గ్రవింపఁజేయుచు, సమయమునకై వేచి కూర్చొనియుండుట, ఆసమయమున నుచితముగా ఎఱ్ఱయకు తోచ లేదు.

“విషపుఁ జన్ను మొనలు తదాననాబ్జమున నదిమె” ఇది ఎఱ్ఱయ పూతనచే చేయించిన పని. సాధింప దలచిన కార్యము - అందులో పగ, రోషము ఇమిడియున్న పుడు చేయునటువంటి పని. ఎఱ్ఱయ పూతన అదియే చేసినది.

మూలమున - “దదౌ స్తనంచ కృష్ణాయ” అని తేలికగా పోయిన కార్యమునకు ఎఱ్ఱయ హరివంశమున “విషపుఁ జన్ను మొనలు తదాననాబ్జమున నదిమె” అని బరువుగా పదములు దిగినవి.

ఇదియే ఎఱ్ఱయ సూక్ష్మపరిశీలన. ఆసమయమున అట్టి ద్వేషభావములతోఁ గూడిన రక్కసి చేసిన పనికి సరియైన పదముల కూర్పు. ఇంతటి చిన్న సంఘటనము నింత వ్యంగ్యభావ భరితముగా రచించిన ఎఱ్ఱయ వర్ణనా వైదగ్ధి అనితర సాధ్యము.

తనశత్రువగు బాలుఁడు చావవలయునని చేతికి చిక్కినపుడు కసిదీర చేసిన క్రూరకర్మము. కసిదీర విషపు చనుమొనలను నోటిలోని కదమినది. అనంతరమాతఁ

డామె చనుబాలతోపాటు ప్రాణములను సైతము చూఱఁ గొనినాఁడు. అప్పుడు మూలమున పూతన 'ఛిన్నస్తని' యై పడిపోయినది మరణించినది. 'విపయోధరాం'- పయోధరవిహీన యగు పూతన కళేబరమును జనులనంతరను గాంచిరి.

ఎఱ్ఱయ "ఛిన్నస్తనీం" - "విపయోధరాం" అను పదములను తొలఁగించి నాఁడు.

పూతన నేలఁబడి మరణించినది. అప్పటి ఎఱ్ఱయ వర్ణన - "శకటాంగ మాత్రంబులగు నేత్రంబుల గ్రుడ్లు దిరుగంబడి వికృతంబులై మెఱవ నతిమాత్ర దీర్ఘంబులగు పాణిపాదంబులు విరియంబడి, యొడలు పగిలి యెమ్ములు నలిసి చర్మంబు ప్రోవై యున్న యన్నిశాచరి చందంబునకు ఆశ్చర్యంబును భయంబునుఁ బొందిరి.

ఇట్లు పదప్రయోగము లందు సందర్భోచితప్రజ్ఞను ప్రదర్శించినాఁ డెఱ్ఱయ.

ఎఱ మంటలు వెదజల్లు నిశ్వాసములు, పండులు కొఱుకుట నిప్పులు గ్రుమ్మించుట మిడిగ్రుడ్ల చూచుట, కటము లదరుట, బొమముడి, నుదుటచెమట - మెఱుగు కోరలు, కంపించు కరములు - ఇవి క్రోధావేశముతోఁ గూడిన వ్యక్తిగావించు చేష్టలు.

ఛిన్నస్తని - విపయోధరమూర్తి - చూపఱులకు జుగుప్సను కలిగించును.

కనుక ఎఱ్ఱయ మిక్కిలి జాగరూకతతో పదముల పరిశీలించి కూర్చుఁవాడని తెలియుచున్నది. ఇది యాతని సంయమమునకు నిదర్శనము.

భర్మావేశముల వర్ణించు పట్టుల నితని భావములు పరవళ్ళు త్రొక్కుచు ప్రవహించును.

ఎఱ్ఱయ భక్తిని ప్రదర్శించు సన్నివేశము -

ఘంటాకర్ణుఁడను మూఢ రాక్షసుఁడు విష్ణుభక్తుఁడు. విష్ణుసాన్నిధ్యమునకై తహతహ లాడిన ఘట్టము

శా॥ "వేదాధ్యాయులు గాన లేరు నియమావేశవ్రతుల్గాన లే
ర్వేదాంతజ్ఞులు గాన లేరు బహుసంవిత్తర్క కార్కశ్య సం
వాదుల్ గానఁగ లేరు భక్తి వెలిఁగా భక్త్యేక సంప్రాప్తు నే
మాఁ జేసి స్మారిఁ గానఁ బోయెదము భాగ్యారంభ మెట్లోతుదిన్"

హ. వి II- 5-190

— వేదాధ్యాయులకును, నియమాదిశ వ్రతులకును. వేదాంతజ్ఞులకును బహుతర్క కార్కశ్య సంవాదులకును, కల్పించని ఆ హరి భక్తజన సులభుఁడని ఘంటాకర్ణుని ముఖమున ఎఱ్ఱయ తెలిపినాఁడు.

ఘంటాకర్ణుఁడు పడిన ఆవేదన ప్రతిజీవియు, పరమాత్మ వియోగముచే పడు వేదనయే. ఎఱ్ఱయ హృదయతత్త్వమును గోచరింపఁ జేయునది.

సీ॥ ఎన్ని జన్మములనో యియ్యింద్రియంబులు
నాచేతఁ జిక్కక నీచవిధికిఁ
దిగువంగఁ దిగువంగఁ దగిలి పోయిన మాను
సము చెడ్డి నిష్పాప జన్మమొలసె
నీ జన్మమున యందు నివి గ్రమ్మఱఁగఁ గాసి
సేయంగ నున్నవి చిక్కువడిన
నేమిసేసియుఁ గొఱయేమి పరద్రవ్య
పరదార పరివాద పరిహారణము

తే॥ గీ॥ నాకు నీవిచ్చు వరముగా నాథ వినుము
నాదు శ్రోత్రాది వర్గంబు సలిసనాథ
యంబరాది భూతముల యందదిమి యవియు
నిన్నుఁగలసి నన్నానంద నిష్ఠ మనువు. II-5-197

తే॥ గీ॥ నీకు మ్రొక్కెద నున్నిద్ర నీరజాక్ష
నీకు మ్రొక్కెద ధర్మపునీత రక్ష
నీకు మ్రొక్కెద నిశ్శోక నిగమరూప
నీకు మ్రొక్కెద నిర్వాణ నిత్యదీప

హ వ II-5-198

— అని భక్త్యావేశమున ఘంటాకర్ణుఁడు స్తుతించినాఁడు ఇది భావములకు తగిన పద ములఁ బొందిక. పదముల ఆవృత్తి – 'నీకు మ్రొక్కెద' నని పలుమాఱు పద్యట భక్తి రసావేశమున మునిఁగిన మానవుని జిహ్వనుండి జాలువాఱు పారవశ్యపు పలుకులు

ఎన్నో జన్మము లెత్తినాఁడు. ఇంద్రియములకు వశుఁడైనాఁడు. ఆ యింద్రియములకు చిక్కువడి ఎన్నో పాపకార్యము లాచరించినాఁడు. తిరిగి జన్మము లభించినది. ఆ ఇంద్రియములుగాసి చేయుట మానవు అతఁడా ఇంద్రియవశుఁడై పరదార పరద్రవ్య పరివాదములను మానలేకున్నాఁడు. వానిని తప్పించి శ్రోత్రాది వర్గములను పరమాత్మలో కలుపుకొని యానందనిష్ఠను మనుపుమని ప్రార్థించుచున్నాఁడు. ఒకానొక మూఢునిలో ఇంతటి యావేదన; ఆ యావేదనతోఁ గూడిన భావన ఎఱ్ఱన హృదయావేదనను తెలుపుచున్నది.

శ్రీకృష్ణుని మూర్తిని గాంచినపుడు ఘంటాకర్ణుఁడు అట్టహాసముతో గంతులు వేసినాఁడు.

కం॥ హరిఁగంటిఁ గృష్ణుఁ గంటిం
బరమేశ్వరుఁగంటి భక్తభయహరుఁ గంటిం
బురుషోత్తముఁ డచ్యుతుఁడీ
శ్వరుఁడభవుఁడు వీఁడె వీఁడె సమ్ముఖుఁడయ్యెన్

II-5-213

– ఇవి భక్త్యావేశములకుఁ దగిన పదముల పొందిక. సరియైన నడక "హరిఁ గంటిని నా పరమేశ్వరుఁ గంటిని. భక్తభయహరునిఁ గంటిని" – "కంటిని" "కంటిని" అని యొకేపదము నావృత్తిఁ గావించినాఁడు ఇది ఆనందావేశ లక్షణము. 'ఈశ్వరుఁడు' 'అభవుఁడు' 'వీఁడె' 'వీడె' యను రెండుమార్లు పదములను ఆవృత్తి గావించుట – ఎఱ్ఱయ భవ్యావేశమునకు దృష్టాంతము.

వీప్సయందు, అతిశయమగు ఆతురతను తెలుపు సందర్భము నందు పదములు ద్విరుక్తములగుట అత్యంత సహజము.

ఇవి ఘంటాకర్ణుని పాత్రలో తాదాత్మ్యము నొంది . ఎఱ్ఱయ భక్త్యావేశమున తన్మయత్వము నొంది పలికిన పలుకులు.

సంస్కృత హరివంశమున ఘంటాకర్ణుఁడు నృత్యమొనర్చు హరినిఁగాంచి –

"అయం స చక్రీ శరశార్ఙ్గ ధన్వా
గదీరథీ సధ్వజ తూణీపాణిః
సహస్ర మూర్ధా సకలామరేశో
జగత్ప్రసూతి ర్జగతాం నివాసః" హ. భవిష్య 82-3

"విష్ణుర్విష్ణు ర్జగన్నాథః పురాణః పురుషోత్తమః
విశ్వాత్మా విశ్వకర్తాయ సోఽయమేవ సనాతనః"
హ. భవిష్య. 82-4

"అస్యైవ దేహస్య హరే స్తనాంతరే
విరాజతే కౌస్తుభరత్నదీపః
యస్య ప్రసాదా జ్జగదేతదాదా
విరాజతే చంద్రమసేవ రాత్రిః" హ. భవిష్య 82—5

— అని కీర్తించినాఁడు.

గోపికలు శ్రీకృష్ణుని దుండగములను యశోదతో చెప్పుకొనుట మూలమున లేదు. పోని, భాగవతము నందున్నదికదా! అందుండి గ్రహించె నందమన్న భాగవతము నందలి గోపికలు వర్ణించిన కృష్ణుని దుండగముల వర్ణనలకును హరివంశ మునందలి దుండగముల వర్ణనలకును సామ్యమే లేదు.

పోతన భాగవతమున శ్రీకృష్ణుని యాగడములు వయస్సును, వయసను మీఱి పోయినవి. మర్యాద నతిక్రమించినవి. శ్రీకృష్ణుని యందలి భగవద్భావమును కించ పఱచు నట్టివి.

ఎఱ్ఱయ హరివంశమున — గోపికలు యశోదతో — "నీ వక గారాబు కొడుకుఁ గంటివేము పడు పాటు లరయ" — వని యొక గోపిక — 1-5-212

"కుటిలవు నీవు తనూభవు నిటుపేయఁగ వినచితి" — వని మఱొకతె — 1-5-213

"నాయింటం బదిగడవల నేయిఁబెరుఁగుఁ బాలుఁద్రావె నీకృష్ణుఁ"డని ఇంకొకతె —

"ఇటులైన మాకింకేటి బ్రదు" — కని యొకగోపిక —

"ఏ పొలములు పాడైనవ యీపల్లెకుఁ జిచ్చువెట్టియేఁగెద" — మని మఱొక గోపిక — ఇట్టిదుండగములనే వర్ణించిరి. కాని వయసుమీరిన చేష్టలులేవు. ఎఱ్ఱన ఉచితజ్ఞుఁడు. ఔచిత్యమును సర్వదా పరిరక్షించుటకై యత్నించువాఁడు. శ్రీకృష్ణుని యందలి దైవత్వమునకు భంగము రానీయఁడు.

కాని భాగవతమున (పోతన) శ్రీకృష్ణుఁడు అశ్లీలములగు చేష్టలకు వెనుదియ్యఁడు. భాగవతమునందలి గోపికలు చెప్పిన వానిలో కొన్ని —

కం॥ "ఇమ్మగువ తన్ను వాకిటఁ
గ్రుమ్మఱుచోఁ జేరి నిలువుకొని పేరడుగన్
గెమ్మోవిఁ గఱచి వడిఁ జనె
నమ్మా! యీముద్దుఁగుఱ్ఱఁ డల్పుఁడె చెపుమా!
భాగ X-314

— అని యొక గోపిక చెప్పినది.

మఱొకతె —

కం॥ "మగువా! నీ కొడుకుఁడు మా
మగవారటు వోవఁజూచి మంతనమునకుం
దగఁజేరి పొందు నడిగెను
జగముల మున్నిట్టి శిశువు చదువంబడెనే!
భాగ. X-320

ఆ॥ వె॥ తరుణి యొకతె పెరుగుఁ దఱచుచుఁ దుది వంగి
నెన్నుఁదియ్యనొదిగి వెనుకఁ గదిసి
మగువ! నీసుతుండు మగపోఁడుములు సేయ
సాఁగినాఁడు తగదె చక్కఁజేయ X-325

కం॥ కొడుకులు లేరని యొకసతి
కడు వగవఁగఁ దన్ను మగనిఁగాఁ గైకొనినం
గొడుకులు గలిగెదరని పైఁ
బడినాఁడది రవ్వశిశువు పనులే తల్లీ!" X-317

— ఇట్టివి వయస్సును మీఱిన సభ్యతా విహీనమైన శీలరహితులు చేయు దుండగములే కాని బాలుర చేష్టలుగావు. ఇట్టి అశ్లీలములు మితిమీఱినవి. ఇట్టివి ఎఱ్ఱయ గోపికలు చెప్పలేదు. ఎఱ్ఱయ శ్రీకృష్ణుఁడు బాలురకు తగిన చేష్టలనే చేసినాఁడు

ఎఱ్ఱయ యశోద మనుష్యుల మర్మమెఱిఁగి ప్రవర్తించునది. సమయాసమయములఁ గుఱించి వర్తించునది. ఆ గోపికల ఆవేశముతోఁ గూడిన పలుకులు శాంతముగా వినినది. వారిని వేట్వేఱుఁగా నుసునయించినది. "పసరకుఁడు — మీరులేక

మాకు వేగునా?" యని వారి ప్రాముఖ్యతను వెల్లడించినది. "బొంకాడెడు గరితలె మీరింకటఁ జూచుకొనుఁడు" "ఇతని నెట్లడఁచెదనో" - కినుక, కలంక, శంక వదలి మీమీ గృహములకు వెళ్ళుఁడు" అని నచ్చఁజెప్పు తన నేర్పును జూపినది. వారి ననునయించి పంపినది.

ఈ గోపికలు యశోదతో కృష్ణుని యాగడములు చెప్పుట సంస్కృత హరివంశమున లేనేలేదు.

ఎఱ్ఱయ హరివంశమున మిక్కిలి సంయమనముతో ప్రవర్తించినాఁడు. యశోద గోపికలకు నచ్చఁ జెప్పెడి వర్ణన గాంచినపుడు- ఎఱ్ఱయకును ఇతడు లాగ్రహావేశములకు నశక్తైనపుడు వారి మనస్సుల నెఱింగి ప్రవర్తించు సౌమ్యశీలత గలదని తెలియుచున్నది ఎఱ్ఱయ శాంతగుణ ప్రధానుఁడు కనుకనే మూలమునలేని యీవర్ణనల కాభావములు తావిచ్చినవి.

హరివంశమున ఎఱ్ఱయ శ్రీకృష్ణుఁడు ఆడు ఆటలు ఆంధ్రబాలుర క్రీడలను తలపింపఁ జేయుచున్నవి.

ఉ॥ "ఆడఁగఁదెచ్చి బాలకుల నందఱ నయ్యొయియాట నొక్కమై
నోడఁగఁ జేసి పీపడఁచి యొక్కని నొక్కని నెక్కుఁబల్వురం
గూడఁగఁ గూకటుల్ముడిచి కోయని యార్చుచు గాసిసేయు సం
క్రీడల నెంతలావరియుఁ గీడ్పడి చిక్కఁగఁగృష్ణుఁడుద్ధతిన్
హ. వ. 1-5-210

— ఇది మూలమునలేని అచ్చమగు ఆంధ్రబాలుర క్రీడల వర్ణన. దీని హరివంశమునఁ జొప్పించి ఎఱ్ఱయ తన ఆంధ్రాభిమానమును ప్రదర్శించినాఁడు.

బాలుర నందఱను గుంపుగా కూడఁగట్టుట, ఒక్కమెయి నోడఁగట్టుట' పీపడఁచి యొక్కని నొక్కని నెక్కుట, పలువురను కూడునట్లు కూకటి వెంట్రుకలు ముడివేసి కోయని యఱచుట - కృష్ణుని చేష్టలు.

వామదేవుఁడు, భరద్వాజుఁడు నను మహామునులు తీర్థార్థులై చరియించుచు వటసమీపమున నున్న గోపాలురఁ గాంచి, "ఈ యుత్తమ తీర్థమునకు దిగ్గు తెరు

వెద్ది ?" అని యడుగుదురు. అపుడువారు —

"ఏమెఱుఁగ వీని నడుగుఁ డంచెల్లవారు
నొండొరులఁ జూపిచూపి యొండొండ నరిగిరి"

ఇవి యాబాలుర సహజ చేష్టలు - ఎఱ్ఱయ చిత్రణ.
యశోద శ్రీకృష్ణునకు వెన్న తినిపించు విధానము మూలమున లేనిది.

కం॥ "చాలఁగ నిచ్చలు వెన్నయుఁ
బాలుఁ గుడుకలఁగొని తల్లి పట్టికి నెలవిన్
వ్రేలిడి యింతింతయకాఁ
గ్రోలించును వెఱవుతోడ రుచిగొలుపు క్రియన్"

హ. వం 1-5-196

యశోద నిత్యము వెన్న చిన్న చిన్న గుడకలలో గొని యింతింతయే వ్రేలు పెట్టి ఉపాయముతో శ్రీకృష్ణునకు తినిపించును. 'రుచిగొలుపు క్రియన్' తినిపించును ఇది బాలుడు తినక మొండికిపడినపుడు తల్లులు చిన్న చిన్న ముద్దలుగా తీసికొని, అటు నిటు చూపి, చందమామను పిలిచి, తినిపించుతీరు అందఱికిని తెలిసినదే; దీనిని ఇంత సహజముగా ఎఱ్ఱయ వర్ణించినాఁడు.

ఎఱ్ఱయ సహజమగు తీరుతెన్నులను ప్రేమించువాఁడు. అట్టిస్వభావము కల వాఁడు కనుకనే చిన్న చిన్న విషయములను సైతము పరిశీలించి వ్రాయఁగలిగినాఁడు

అట్టిదే మరొక రచన —

తే॥ గీ॥ "ముదముతోఁ గద్దునకుఁ బెట్టి మూతి బిడ్డ
మోమునకు మేనఁ జమరి యమ్ముదిత యక్కఁ
గలయ నిమురు నేసుఁగుదిన్న వెలఁగ పండు
నాఁగఁనొప్పఁ గృష్ణుఁడు చారునయనుఁ డగుచు"

హ. వ 1.5-197

ఇట్లు తెనుఁగు తల్లులు బిడ్డలను పెంచు విధానమును వర్ణించి తన తెనుఁగుఁ దనమును చాటుకొనినాఁడు ఎఱ్ఱయ.

47)

వెన్నతినిపించి ఆ జిడ్డును మేనంతయును చమురూట - ప్రతి తల్లి చేయు పనియే. చిన్నపాపల చర్మము బిరుసెక్కకుండ బీటలు పాఱి పగులకుండ నుండుటకై జిడ్డు వెన్నవంటి పదార్థములను పూయుట ఆరోగ్యకరమే; వెన్నయు మార్దవమును తెచ్చునది కనుక తినఁగా మిగిలిన దానిని యశోద మేనఁ జమరినది.

ఎఱ్ఱయ పదహారణాల ఆంధ్రుఁడు. ఆంధ్రుల యాచారములను విశ్వసించు వాఁడు. వారివిశ్వాసముల యందు గౌరవము గలవాఁడు. కనుకనే మూలమునందు లేని 'దిష్టి' తీయు విధానమును తన హరివంశమునఁ జొప్పించినాఁడు. చిన్నశిశువు శకటాసురుని ఖండించినపుడు 'దిష్టి' తగులకుండుటకై "అచ్చటి ధూరజంబు వుచ్చి పిడిచివైచి తూపొడుచుట" - హ. వ 1-5-192

పూతన ప్రాణములను చూఱఁగొనినపుడు ఆశవమునుఁ గాంచి బాలునకు 'దిష్టి' తగుల కుండుటకై నందుఁడు బాలు నెత్తికొని -

"గోకరీష మిశ్రితం బగు ధూరజంబు పరఁగఁగొని రక్షాతిలకంబుఁ బెట్టి -"

సీ॥ శ్రీనాయకుండు రక్షించు నీముందర
వేధ రక్షించు నీ వెనుక దిక్కు
వరుసగా దక్షిణ వామ భాగంబులు
రక్షింతు రవ్విరూపాక్ష గుహులు
నీఁవిరాదు దిగువయు నీరజాహితుఁడు వా
సుకియు రక్షింతురు ప్రకట కరుణ
దిక్కులుగాద్వు నీ లెక్కిన చోటులు
రక్షింతు రెప్పుడు నక్షతముగ

తే॥ గీ॥ స్వస్తిగావించు నీకు వృషధ్వజాంక
నాకులైశ్వర్యశాలి పినాకపాణి
నిత్యశివలగు గోవులు నియతపుణ్య
లైన భూమియు నిను నెల్లయెడలఁ బ్రోచు"

హ. వ 1-5-161

— అని బాల రక్షార్థముగ పూర్వముని కల్పిత మంత్రంబులు జపియించుట - మూల మున లేని ఎఱ్ఱయ విశ్వాసములు.

ఎఱ్ఱయ ఉచితజ్ఞుఁడు. ఇతని ఔచిత్య నిర్వహణ హరివంశము నందంతటను కనిపించుచున్నది. రుక్మిణీ కల్యాణ సందర్భమున నారదుని పాత్ర ప్రవేశ మీ యంశమును చక్కఁగా చాటుచున్నది. నారదుఁడు బ్రహ్మమానస పుత్రుఁడు జ్ఞాన సంపన్నుఁడు

భాగవతమున - రుక్మిణి ప్రౌఢయై 'యాప్తుఁడగు బ్రాహ్మణు నొక్కని జీరి' ద్వారకా నగరమునకు పంపినది. ఆ బ్రాహ్మణుని ద్వారా తన ప్రేమను శ్రీకృష్ణునకు ప్రదర్శించినది. తన సందేశమున -

"ఏ నీ గుణములు కర్ణేంద్రియంబులు సోఁక
దేహతాపంబులు తీరి పోవు
నే నీ శుభాకార మీక్షింపఁ గన్నుల
కఖిలార్థ లాభంబు కలుగు చుండు
నే నీ చరణ సేవ లే ప్రొద్దుఁ జేసిన
భువనోన్నతత్వంబుఁ బొందఁగలుగు
నే నీ లసన్నామ మే ప్రొద్దు భక్తితోఁ
జదివిన బంధ సంతతులు వాయు

తే॥ గీ॥ నట్టి నీయందు నాచిత్త మనవరతము
నచ్చి యున్నది నీయాన నానలేదు
కరుణఁ జూడుము కంసారి ఖలవిదారి
శ్రీయుతాకార మానినీ చిత్తచోర"

భాగ. X-1708

అని తన దైన్యమును వెడలఁ గ్రక్కినది. ప్రేమను ప్రదర్శించినది. కడకు తెగించి, శృంగారలీలలనుఁగూడ బహిరంగముగా ప్రకటించినది.

సీ॥ ప్రాణేశ నీమంజు భాషలు వినలేని
కర్ణరంధ్రంబుల కలిమి యేల
పురుషరత్నమ నీవు భోగింపఁగా లేని
తనులత వలని సౌందర్య మేల

భువన మోహన నిన్నుఁ బొడఁ గానఁగా లేని
చక్షు రింద్రియముల సత్త్వమేల
దయిత నీయధరామృతం బానఁగా లేని
జిహ్వకు ఫలరస సిద్ధియేల

ఆ॥ వె॥ నీరజాతనయన నీవనమాలికా
గంధ మబ్బలేని ఘ్రాణ మేల
ధన్యచరిత నీకు దాస్యంబు సేయని
జన్మమేల యెన్ని జన్మములకు" భాగ. X-1709

— ఇట్లు రుక్మిణి పుత్తెంచిన సందేశము నందు క్షీసిగ్గువిడిచిన శృంగారాను భవముల కాంక్ష వ్యక్తమగుచున్నది.

"నీవు భోగింపఁగాలేని తనులతవలని సౌందర్యమేల" "నీయధరామృతం బానఁగా లేని జిహ్వకు ఫలరస సిద్ధి యేల?" — వంటివి పోతన భాగవతము నందలి రుక్మిణి కోరికలు. బ్రాహ్మణుని ద్వారా - పురుషుని ద్వారా బహిరంగ పఱచిన కాంక్షలు. ఇవి కొంత సభ్యత దాటిన పలుకులు. ముగ్ధయగు బాలిక చెప్పరానివి. అనుభవములేని బాలకు అగోచరము లైనవి. కనుకనే యీఘట్టమున ఎఱ్ఱయ మిక్కిలి ఔచిత్యమును పాటించి రచించినాఁడు రుక్మిణి పాత్రకు మిక్కిలి గాంభీర్యమును చేకూర్చినాఁడు. సభ్యతతోఁ గూడిన చిత్రణ యితనిది —

ఎఱ్ఱయ హరివంశమునందు —

ఇచ్చట పూర్వరాగము - వినుకలిచే పరస్పర ప్రేమ ఏర్పడినది. ఆమెయు హరి కనురాగపాత్ర యగు నట్టిది 'ప్రసూన బాణ విస్ఫురిత పుసర్భవంబునకు భూమి'యై వెలసినది. సున్మనీశ్వరుల కర్చనీయ —

కం॥ "ఆ వెలఁది నాప్తజనముల
చేవిని కామించె నాత్మ నిత కమలాక్షుం
డావిభుపై నహ్వాలతియు
భావము గదియించె శ్రవణ పరిచయ లీలన్"

హ. వ. II-3-7

— ఇట్టిది ఎఱ్ఱయ రుక్మిణి. ఆమె శ్రీకృష్ణుని వియోగముచే తపించినది. చెలికత్తెలతో రహస్యముగా చెప్పుకొనినది. దీనిని అంతరిక్ష గతుఁడై విని వచ్చిన నారదుఁడు శ్రీకృష్ణునకు తెలియజేసినాఁడు.

రుక్మి రుక్మిణి సోదరుఁడు. ఆమెను శిశుపాలున కొసఁగ నిశ్చయించినాఁడు. స్వయంవర లగ్నము నిశ్చయమైనది. సకల రాజన్యులు కుండిన పురమున సమావేశమైనారు. కాని శ్రీకృష్ణున కీవార్త తెలుపలేదు. శిశుపాలుఁడు పెండ్లి సింగారముతో నచ్చటికి విచ్చేసినాఁడు. భగవంతునిపై భారమువైచి రుక్మిణి యార్తయై యుండినది.

అక్కడ ద్వారకా నగరమున -

నారదుఁడు శ్రీకృష్ణుని కడకేగినాఁడు. రుక్మిణి శ్రవణపరిచయలీల నాతని భావమునఁ గడియించినది. శ్రీకృష్ణుఁడును ఆవెలఁది నాప్తజనములచే విని కామించినాఁడు. ఇది ఆ ఇరువురిస్థితి - ఆ సందర్భమున -

ఇరువురి తలఁపులు చిక్కజీవువడినవి. తాల్మిలు పెల్లగిల్లినవి. చూడ్కులు ఆకులపడి చూపు పండువులఁ గోరినవి. కోరికలు చేష్టితములకై త్వరపెట్ట సాగినవి ఇట్లు భావనలు బయలుపడు నట్లుగా భావజు భావంబుల తెలియాఁడు చుండిరి.

ఆసమయమున నారదుఁడు ద్వారకకు ఏతెంచినాఁడు. నగరి మొగసాల గవని యందవ తీర్ణుఁడైనాఁడు. దౌవారికుల చేత తన రాకను వాసుదేవున కెఱింగించినాఁడు.

అప్పుడు -

"ఇంపారు సంభ్రమంబున నుగ్రసేన వసుదేవులు పురస్సరులుఁగా వాసుదేవుండు బలదేవ సహితుండై యదుముఖ్యులు తోడరా నెదురువచ్చి నమస్కరించి యమ్మహాపురుషుం దోడ్కొని పోయి సుధర్మాభ్యంతరంబున ధర్మమయంబగు భవ్యపీఠంబున నునిచెను. అర్ఘ్యపాద్యాది వైదిక సత్కర్మ లాచరించెను. తదనుజ్ఞచే నాసీనుండై తక్కినవారిని కూర్చుండం బనిచి విరచితాంజలియైనాఁడు "నీకును లోకములకును క్షేమంబు" యని అడిగి నాఁడు. అందులకు వాసుదేవుఁడు -

"నిత్య స్వతంత్రుండవై యిమ్మాడ్కిని విహరించు నీయేలుకకు అస్వీకారార్థంబులుగాని వేవి ? ఈ యదు కులమును ఖ్యాతిఁజేయ వచ్చితివి గాని నీరాక కొందుదగునననేడీ ? ధన్యులమైతి " మని నుతించినాఁడు.

ఇచ్చట వాసుదేవునకుఁ గల గౌరవాతిశయమును ఎఱ్ఱన చక్కఁగా ప్రదర్శించెను. అట్టి గౌరవ పాత్రుని ముఖమున రుక్మిణీదేవి యవస్థను వర్ణించి ఎఱ్ఱయ తన నాయకుని కార్యోన్ముఖునిఁ గావింపఁ జూచినాఁడు

ఇచ్చట నారదపాత్ర ప్రవేశము ఎఱ్ఱయ సమయస్ఫూర్తికి నిదర్శనము. ఇది మూలమున లేదు.

అంతటితో నారదుఁడు తాను వచ్చిన కార్యమును వెల్లడింపలేదు. ఎఱ్ఱయ నారదునితో ఎదురు ప్రశ్న వేయించినాఁడు. నీవు తలంపగా సర్వజీవాళికి చతుర్యుగములందును సేమము కలుగుట నిక్కము. అట్టిది నీపాదసేవా తత్పరులగు మాకు కుశలమున కొఱంత యేమి? అని యడిగినాఁడు.

ఇచ్చట మఱొక్కమాఱు నారదముఖమున శ్రీకృష్ణుని అతి మానుషతత్త్వమును తడవుట, పాఠకులకు స్మరింపఁజేయుట ఎఱ్ఱయ గావించిన కార్యము.

అట్లని నారదుఁడు –

"నిత్య శుద్ధబుద్ధానంద నిర్మలాత్ముఁడవు. నారాక కింక ప్రాముఖ్యము నొసఁగుట నాపై కృపచేతనే కృతార్థుఁడను" అని వీణావల్లికను చక్కఁ జూసినాఁడు "నిర్వాణానందమును పట్టి చూపుచున్నాఁడో" యను నట్లుగ వాయించినాఁడు. సంగీతమునకు సులభ సాధ్యుఁడు. గానలోలుఁడు. అతనిని తనవశము గావించుకొను తీఱును చక్కఁగా నెఱింగిన వాఁడు ఎఱ్ఱయ నారదుఁడు. ఇది ముందుకాళ్ళకు బంధము వేయుట వంటిది.

నారదుఁడు – ఎడతెగక – శ్రీకృష్ణుని – స్తుతించినాఁడు.

అనంతరము చేతి దండ నటు వైట్టినాఁడు. – 'భక్తిరసం బాత్మముంచికొనఁగ అఖిలవేదాంత విద్యారహస్యబావు కోశి కీర్తించినాఁడు అతని స్తోత్రపాఠములకు యాదవులద్భుత ప్రమోద మేదుర మానసులైరి. శ్రీకృష్ణుఁడు 'పరిపాటి దప్పక మాచేత లెల్ల దడవితివి. ఇప్పటికి చాలు. నీరాకకు విశేషమే' మని ప్రశ్నించినాఁడు అప్పుడు –

ఆయ్యోగీశ్వరుఁ డఖిలేశ్వరునకు చెప్పుచున్నాఁడు. –

"దక్షిణాంభోనిధి తటమున గోకర్ణమున దివ్యలింగాకారుని – శంకరుని –

చారుపీఠారహస్య్వత యగు గీత పూజచే నత్యంత భక్తితో నారాధించి వచ్చుచు నడుమ కుండినపుర ప్రవేశము గావించితి' నని పలికినాఁడు.

అచ్చట గోకర్ణక్షేత్రమును స్తుతింపఁజేసి ఇచ్చట శ్రీకృష్ణుని అతి మానుష తత్త్వమును స్తుతింపఁజేయుట ప్రజలకు శివకేశవుల అభేద తత్త్వమును తెలియఁ జేయుటకే !

ఇట్లు సందర్భము వచ్చినపుడెల్ల ఎఱ్ఱయ తన పాత్రల ముఖమున హరిహరా భేద తత్త్వమును తెలుపుట చూడ - ఎఱ్ఱయ శివకేశవభేదాతీతుఁడని సాకారస్వరూపుని కొలిచినను పక్షపాతదృష్టి లేనివాఁడని తెలియుచున్నది.

అచ్చట కుండినపురమున భీష్మకునిఁ గంటినని నారదుఁడు పలికినాఁడు ఇట్లు చెప్పఁ దొడగినాఁడు.

"ఆతఁడు ప్రియమున నన్నర్చితుఁ గావించెను. భువినిఁగల సకలనృపుల నచ్చటఁ గాంచితిని. జరాసంధునిఁ గాంచితిని. 'మీరేమిటి కిట గుమిగూడి యున్నార లని విదర్భరాజు నడిగితిని. అతఁడాత్మీయకన్య రుక్మిణీదేవిని శిశుపాలున కిచ్చువాఁడై మగధాదుల రావించుట కనుఁ గొంటిని. ఎల్లి రేపౌది లగ్నము. అని తన రాకకు కారణము తెలిపెను.

అంతటితో నారదుఁ డూరకుండలేదు.

శ్రీకృష్ణుని ఆవేశపూరితునిఁ గావించు నట్టిది. కర్తవ్యోన్ముఖునిఁ గావించు నట్టిది. అట్టి వాగ్బాణమును విసరినాఁడు. అది సూటిగా శ్రీకృష్ణుని హృదయమున గాఢముగ నాటుకొను నట్టిది

శా॥ "నీవా కన్నియఁ గోరినాఁడవు మది న్నిక్కేక వైదర్భుఁ డి
ట్లా విద్వేషి మతంబు సేయఁగలవాఁడైనాఁడు తత్కార్యమిం
కే విఘ్నంబును లేక సిద్ధమగు నట్లైనన్ యశోహాని యొం
డీ విశ్వంబున నింతకంటెఁ గలదే యేభంగి నీపేర్మికన్"

హ. వ. II-3-39

శ్రీకృష్ణునిపై ప్రయోగింప వలసి నట్లుగా ప్రయోగించినాఁడు "నీవా కన్నియ కోరినాఁడవు." ఈ వాక్యము నీకు భార్యకావలసిన రుక్మిణి శిశుపాలునకు

భార్యకాఁబోవుచున్నది." అని యాతని పురికొల్పినాఁడు. అదియు. 'అతఁడు నీ విద్వేషి. ఆతనిని నీవెట్లు సహింపఁగలవు" అని అతని నావేశపూరితునిఁ గావించు చున్నాఁడు.

'ఏవిఘ్నంబును లేక యీకార్యము సిద్ధమైనచో — యశోహాని కలుగఁగలదు' అని ప్రేరేపించినాఁడు 'ఇంతకంటె యశోహాని ఏది ?' అనిప్రశ్నించినాఁడు.

"కావున బలదేవ సహాయుండవై ఈ ప్రొద్దుకదలి — అచ్చట ప్రోవైన రాచ పదువుల కుదియించి ముదితను సమ్మోదమున పరిగ్రహించి తెమ్ము" — అని యాతని బాహుబలమును ప్రశంసించినాఁడు.

"నీ బాహుయోగమున సుదర్శనంబుకు దీర్పరాని పను లెక్కడివి ?" అని పలికిన ఎఱ్ఱయ నారదుని వచోవైచిత్రి శ్రీకృష్ణుని అలౌకిక శక్తిని చెప్పక చెప్పు చున్నది.

"సుదర్శన యోగమున నీ బాహువునకుఁ దీర్పరాని పనులెక్క డివి ? అనలేదు.

"నీ బాహుయోగమున సుదర్శనమునకు తీర్పరాని పనులులేవు" అని సుదర్శ నము శ్రీకృష్ణుని బాహుయోగముచే నెంతటి శక్తినైనను పొందఁగలదని చమత్కరించి నాఁడు. అంతటితో నారదుఁడూరుకొనలేదు. శ్రీకృష్ణునకామె దీనావస్థను తెలిపి, "ఆమెయు నీయందనురాగముతో వియోగావస్థలో మగ్గిపోవుచున్న"దని తెలుపు చున్నాఁడు.

నాయకుఁడెంత గాఢమగు ప్రేమలో మునిఁగి యున్నను నాయిక పరాధీన మనస్క యైనచో లాభముండదు. కనుక — తాను రుక్మిణి వియోగావస్థను కనులారఁ గాంచివచ్చితి నని — తెలుపుచున్నాఁడు. ఎఱ్ఱయ నారదుఁడు —

కం॥ "విను మంతరిక్ష తలమున
నసఘా యంతర్హితుండనై చూచితి స
వ్వనితా రత్నము లీలా
వనమున నెచ్చెలుల తోఁడవగఁ బొగులంగన్

హ. వ II-3-41

ఆమె —

సీ॥ పలుక నెంతయుఁ గ్రుయ్యఁబాడిన నునుఁ జెక్కు
లందందఁ దడిపెడు నశ్రువారి
యింకిన చనుదోయి యేకావళీ సూత్ర
భూషితం బైనది పొలుపు దక్కి
పాటన యెడలుటఁ బాపట రూపేది
కడు మాసినది నీలక చభరంబు
వేడి యూర్పుల తోన వెడలునో యుష్ణము
నఁగఁ దూఁగాడెడు నంగవల్లి

తే॥ గీ॥ తలిరు సెజ్జలుఁ జందన సలిల వృష్టి
యబ్జదళ కృత వీజనం బాది గాఁగ
సఖులు గావించు శిశిరోపచార విధులు
గొనక నిగుడెడి తాపంబు వనజముఖికి

హ. వ II-3-43

— ఇది రుక్మిణికి వియోగతాపమునఁ గలిగిన వేదన. సఖుల శిశిరోపచార విధులు. కాని యావియోగ తాపము – శ్రీకృష్ణునికి సంబంధించినదే యని యెట్లు ? ఊరక వియోగావస్థలో నున్నంత మాత్రమున పోయినచో లాభమేమి ? ఆమె మఱొకని యందు లగ్నమనస్కయైనచో హాస్యాస్పదమే యగును కదా :

ఆమె ఎవరిపై మక్కువ కలిగియున్నదో స్పష్టముగా తెలియవలయును కదా! అందులకే ఎట్టి సందేహమును రాకుండుటకై నారదుఁడు శ్రీకృష్ణునితో వెంటనే యిట్లు తెలుపుచున్నాఁడు.

ఆరుక్మిణి చెలులతో పలవించుచుండుటను స్పష్టముగా విని వచ్చినాఁడట; ఆరుక్మిణీ సఖులతో –

చ॥ "హరి నఖిలేశ్వరేశ్వరు దయానిధి నాశ్రిత రక్షణైక త
త్పరుఁ వగఁ బొందఁగన్న దను దాహము గ్రక్కున బాయనొందుదు
ష్పురుషులఁ బేరుకొంచు మది చూడెవరేని లతాంగులార యే
నురువుదు నీక్షణంబ యసురోర్వీజుఁడే యనునింతి బోటులన్"

హ. వ. II-3-44

.. ఆమె తనుదాహము హరి, అఖిలేశ్వరుఁడు, దయానిధి ఆశ్రిత రక్షణైక తత్పరుఁడు - ఇతని పొందఁగలిగినచోఁ బాయునఁట! అపుడే బాయునట్టి తాపమది. ఇది యామె చెలులతో మర్మము విడచి ఏకాంతముగా పలికినట్టి పలుకులు. అంతియేకాని, భాగవతమునందలి రుక్మిణి వలె శ్రీకృష్ణునకు స్వయముగా చెప్పి పంపలేదు.

దాసిని నారదుఁడు వినివచ్చినాఁడు. తెచ్చి యీ వార్తను శ్రీహరి కందించి నాఁడు. తక్కిన దుష్పురుషుల పేరు గ్రహించుట కూడ ఆమె సహించదట! 'ఉసురోర్వఁజుఁడే ఈ క్షణంబ' అని తక్కిన పురుషుల పేర్కొనుటనుఁగూడ వారించినది. ఇది - తన చెలికత్తెలు - శిశుపాలుని పేర్కొని యుండవచ్చును. అప్పుడు తన చెలికత్తెలతో 'తక్కిన దుష్టులఁ పురుషుల పేర్కొనుటఁ గూడ సహించ'నని పలికి యుండవచ్చుచు.

ఇంక - ఇంత తెలిసినమీదట - శ్రీకృష్ణునకు కరుణ నుత్పాదింపఁ జేయుచు న్నాఁడు నారదుఁడు

తే॥ గీ॥ అబల యివ్విధమున నున్న యయ్యవస్థఁ  
గనిన యెవ్వారి మనసైనఁ గనికరమునఁ  
గరగు నైసర్గికాత్యంత కరుణమతివి  
నిఖిల వేదివుపేక్షింప నీకుఁ దగునె?

హ. వ II-3-45

యని యాతని నైసర్గిక కారుణ్యమును పొగడుచునే- అబల దయనీయావస్థను చూచిన నెవ్వారి మనసైనను కరగును. నీవు నైసర్గికముగనే కరుణాళువు. ఆమె నుపేక్షింప నీకుఁ దగునా?" యని 'కారుణ్యముఁ జూపు' మని హెచ్చరించు చున్నాఁడు. ఆమె దయనీయావస్థను వర్ణించుచున్నాఁడు. శ్రీకృష్ణుని హృదయమును ద్రవింపఁ జేయ పాటుపడుచున్నాఁడు.

కం॥ "కావున ముద్దియ ప్రాణము  
గావుము నీవిభుత కింత గడవఁ గృతార్థ  
భావంబున నొందెయ్యది  
భూవినుత చరిత్రయేనఁ బోయెద నింకన్"

హ. వ II-3-46

అని చెప్పి కారుణ్యము గలుగునట్లు వర్ణించి, క్షేత్రార్థి భావమును పొందుమని ఆశించి ఆ తపస్వివృద్ధుఁడు సిద్ధిగతిం జనినాఁడు

ఇది నారదుని పాత్ర నిర్వహించిన కార్యము. ఇది మూలమున లేదు. శ్రీకృష్ణునకు రుక్మిణి యవస్థను తెలియఁ జేయుటకు సంధానకర్తఁగా వ్యవహరించినాఁడు. రుక్మిణి విరహవేదనను మధ్యమపాత్రఁగా వ్యవహరించి వర్ణించినాఁడు.

"నీవాకన్నియ నాశించినాఁడవు. నీకీక బయల కిచ్చుచున్నాఁ"డని శిశుపాలాదులపై యుద్ధమునకు పురి కొల్పినాఁడు. దుష్టనాశమునకై ప్రయత్నించినాఁడు. శిష్టరక్షణ - రుక్మిణిని రక్షించి పరిగ్రహించుట -

ఇట్లు మూలమున నేమాత్రము లేని వర్ణనలతో సందర్భోచిత మగు భావములనుఁ జొప్పించి కథకు సౌందర్యమును చేకూర్చిన ఎఱ్ఱయ ప్రతిభ సాటిలేనిది.

వనితయే తన భావములను, ప్రేమను, అభిలాషను ముందుఁగా తెలుపుకొనుట భారతీయ సంప్రదాయ మంగీకరించుకొనదు. ఒకవేళ అట్లు తెలుపుకొని నపుడు పురుషుఁడు చిత్తగించెనా అంగీకరించెనా, పరిణయము జరుగవచ్చును. అట్లుకానిచో నలుగురిలో నామె హాస్యాస్పద కావలసి వచ్చును. 'వనిత తనంతదాఁ వలచి వచ్చిన చుల్కనగాదె యేరికిన్' అను విషయమును చక్కఁగా గ్రహించినవాఁడు ఎఱ్ఱయ. కనుకనే తన స్త్రీపాత్ర నట్లు చులకనగా చేయలేదు. మూలమునలేని విషయమును రచించి, భాగవతమునవలె స్త్రీపాత్ర చేతనే విషయమును చెప్పింపక, నారదుని ప్రవేశపెట్టి సన్నివేశమున కెంతయును నౌచిత్యము కల్పించినాఁడు స్త్రీపాత్రకు మెఱుఁగులు దిద్దినాఁడు. స్త్రీని 'గడుసుతనము కలది' అని నలుగురును అనుకొనకుండు నట్లు కుదిర్చినాఁడు. ఇట్లు సన్నివేశములను కల్పించిన ఎఱ్ఱయ సూక్ష్మజ్ఞత ఔచితీ నిర్వహణ, దక్షత, స్త్రీ పాత్రల యెడ గౌరవము శ్లాఘార్హమైనది.

అనంతరము - శ్రీకృష్ణుఁడు కుండిన పురమును చేరినాఁడు. అతఁడు పిలువని పేరంటముగా వెళ్ళినాఁడు. అప్పుడతనిని గాంచి పలువురు పలువిధముల భావించినారు ఇదియు మూలమున లేని వర్ణన.

భీష్మకునకు శ్రీకృష్ణుని యెడల నత్యంతప్రీతి, గౌరవములు కలవు. కావుననే అతఁడు 'ఆత్మీయ బంధు సహితుఁడై యతని నెదుర్కొని తోడ్కొనిపోయి, పురబహిరంగణంబున విడియించి. యప్రమేయంబులగు పూజాక్రమంబులం బ్రమదం బొదవు నట్లుఁగా నారాధించె"

'ఆ రాజ సమాజంబులోని కొంచెరితఁడు తన మేనయత్తకొడుకు పెండ్లికిం జనుదెంచెఁ దగునకాదె' యని భావించిరి.

మఱికొందఱు 'గోవిందుఁడు మగధేంద్ర చేదిపతుల దెస నప్రియుం డిట్లేతెంచు టకుఁగతంబేమి యో' యనుచుండిరి.

కొందఱు, "అయ్యిందు వదన చందఁబిమ్ము కుందు నందు సంతుష్ట సంకల్పం బసి విందు మిది యెట్లగునో" యని యూహించుచుండిరి.

ఈ ప్రజాసమూహము నందలి పలుభావములు మూలమున లేవు. ఎఱ్ఱయ అప్పటి స్వయంవరమున చేరి పాత్రలతో తానే తానై భావించి వ్రాసిన భావనా పరం పరలు. ఇంతటి సహజ భావనా చతురుఁడు కనుకనే ఇతఁడు స్వభావోక్తికి పెట్టినది పేరుఁగా ప్రసిద్ధి కెక్కినాఁడు ఇది యెంతయు సందర్భోచిత వర్ణన. శ్రీకృష్ణుఁడు స్వయంవరమునకు అహూతుఁడు కాఁడు. శిశుపాలుఁడు అతనికి శత్రువు. అతనికి రుక్మిణిని ఒసంగుటకై రుక్మి నిశ్చయించి సర్వసన్నాహములనుఁ గావించినాఁడు. అట్టియెడ అసందర్భముఁగా, అనాహూతుఁడై శ్రీకృష్ణుఁ డచ్చటికిఁ జనుట – ప్రజలు పలురకముల మాటలాడుటకు తావొసంగినది. ఇది యెంతయు సహజము.

ఇఁక రాత్రియైనది. తెల్లవారి నంతనే స్వయంవరము. ఆ పూర్వరాత్రి శ్రీకృష్ణుఁడెట్టి భావోద్వేగమునకు గుఱియైనది మూలమునలేదు. భాగవతమున నీ మానసిక క్షోభ కానరాదు. ఎఱ్ఱయ హరివంశము నందు మాత్రమే కల్పింపఁబడినది.

రాత్రియైనది. ఏకాంతము. ఉదయమైనంతనే తనపై గురుతరకర్తవ్యమున్నది. ఆ కార్యము నెట్లు చేయనలెనో నిర్ణయించు కొనవలసి యున్నది. రుక్మిణి యెచ్చట కనిపించునో ? కనిపించినను తాను బలాత్కారముఁగా నామెను కొనిపోఁగలఁడా ? ఆమెను ఏకాంతముగా చూడవలసు పడునా ? ఆమె మనసు నందలి భావము లెట్టు న్నవో ? ఆహూతుఁడుకాకయే అచ్చటి కేతెంచినాఁడు. ఇది పలువురకు పలువిధము లగు సందియములకు తావిచ్చినది. తనకు కన్యనొసంగు ప్రస్తావనయే లేదు. శిశు పాలుఁడు పెండ్లికొడుకై ఏతెంచియున్నాఁడు.

ఏకాంతంబ యేకాంతదెసఁ జింతాభరంబునఁ గార్యాంతరముల యందు నిర పేక్షుఁడై యుండి –

ఉ॥ "ఎమ్మెయిఁ జూతునొక్కొ తరళేక్షణ నక్కటచూచి యెమ్మెయిం
గ్రమ్మన నిర్వహింతు నొకొగైకొని కర్జము వేఁడి శత్రుసం
ఘమ్ముల నెమ్మెయిం దొడరి గర్వము సొంపడగింతు నొక్కొయే
నెమ్మెయి నిశ్చయింతు నొకయింతి దెనమ్మను విన్న చందముల్"
హ. వ. II-3-60

తే॥ గీ॥ "నన్నుఁ బొడఁ గన్నచోట నన్నలిన నయన
చూపుచూపులఁ బ్రేమంబు సొంపు గనిన
యపుడ తఱియంగ నుఱుకుదు నమరు లడ్డ
పడినఁ బట్టుదు నాపాణి పంకజమున"
హ. వ. II-3-61

— ఇది యాతని తీవ్ర మనః క్షోభమును తెలుపు భావపరంపర అంతః పురము నుండి యామె బయటికి వచ్చుట దుష్కరము. వచ్చెను బో ; ఏకాంతముఁగా రాఁజాలదు. వచ్చినను ఆమె మానసిక స్థితి యెట్లుండునో? ఆమెను గాంచినను కార్యనిర్వహణము గావించు టెట్లు? ఆమెను గ్రహించి పలాయితుఁడైనచో – ఒక్కమ్మడిగా బలవంతులగు శత్రువుల సంఘము తనపైఁ బడును. వారిని సంగరమున నడఁగింప వలసియున్నది. అయింతికిఁ దనపై భావము లెట్లుండునో? "నేను పొరబడ లేదుకదా ; నన్నుఁ గాంచినంతనే ఆ నళిననయన చూపులలో ప్రేమ కనుపించెనుబో ! ఇఁక అమరు లడ్డుపడినను వెనుదీయక, ఉఱుకుదును. ఆమెను నాపాణి పంకజమునఁ బట్టఁగలను"

ఇది యానాఁటి రాత్రి ఎఱ్ఱయ శ్రీకృష్ణుఁడు అనుభవించిన భావోద్వేగముల పరంపర. ఇది మూలమున లేదు. పురాణకథకు కావ్యరసాపాదన చేయు ప్రయత్నమిందు సమృద్ధిగా కానవచ్చును.

ఎఱ్ఱయ తీర్చిదిద్దిన రుక్మిణి ముగ్ధ. భగవంతునిపై భారమునైచినది. దైవమునే నమ్మి జగదంబను కొలుచుటకై దేవాలయమున కేఁగినది. అట్టి సంపూర్ణవిశ్వాసము గల భగవద్భక్తుల కార్యము సఫలీకృత మగుట కాలస్యముండునా ? భక్తి తాత్పర్యములు ఘుప్పిరిగొన– "అక్షత గంధపుష్పచయ మంజలి నర్పణ సేసి నమ్రమై" నది.

"అక్షయ పుణ్యుఁడుత్తము డనంత యశోవిభవుండు పుండరీ
కేక్షణుఁ డస్మదీయ హృదయేశ్వరుఁడయ్యెడుఁ దల్లి నీకృపా
వీక్షణ లీల" నంచుఁ బ్రియమింపెసలారఁగ మ్రొక్కె గన్యకన్.

హ. వ II-3 71

— మ్రొక్కి గుడి వెడలు నపుడు పార్థివాత్మజ నాలో కమలాక్షుఁ బరమ కల్యాణుఁ గాంచినది. విస్మయము, కంపము, హర్షము – ఒక్కసారిగా సాత్త్వికభావము లుదయించినవి.

తే॥ గీ॥ అఖిల సౌందర్యనిధియైన యాదిపురుషుఁ
జెందు చూడ్కితో మదిలోనఁ జిక్కుటయును
బరమయోగ నిరూఢాత్ము పగిదిఁ దన్ను
మఱచెఁ జెలువ చెలులు సూచి వెఱఁగు పడఁగ

II-3_79

దృష్టి ఆత్మసాయుజ్య ప్రాప్తినిఁ బొంది యానందించినది మూలమున నీవర్ణన లేమాత్రమును లేవు

అచట రామకృష్ణు లిరువురును స్వయంవరమునకు వెడలినారు.

"పితృష్వసుః ప్రియార్థంచ రామకృష్ణా వుభావపి
ప్రయయుర్వృష్ణయ శ్చాన్యే రథై స్తత్ర బలాన్వితాః"

హ. వి. 59-31

అపుడు —

"శ్వోభావిని వివాహేచ రుక్మిణీ నిర్యయౌ బహిః
ఇంద్రాణీ మర్చయిష్యంతీ కృతకౌతుక మంగళా"

హ. వి. 59-33

ఇంద్రాణి నర్చించుటకు కౌతుక మంగళ వేషమును ధరించి రుక్మిణి బయలు వెడలినది. అనంతరము మూలమున కథాగమన వేగమున కడ్డుతగులు సుదీర్ఘమగు రుక్మిణీ సౌందర్యవర్ణన గలదు. దానిని సంక్షేపించి ఎఱ్ఱయ ఒక్క సీసములో ముగించినాఁడు. మూలమున శ్రీకృష్ణుని మానసిక క్షోభ లేదు. స్వయంవరమున

కేతెంచిన జనసమూహ సంభాషణలులేవు. శ్రీకృష్ణుఁడు, రుక్మిణియు పరస్పరము గాంచినపుడు పొందిన ఆనందానుభూతి వర్ణనయు లేదు.

"తాం దదర్శ తదాకృష్ణో లక్ష్మీంసాక్షాదివ స్థితాం
రూపేణాగ్ర్యేణ సంపన్నాం దేవతాయత నాంతికే

హ. విష్ణు 59-35

తాం దృష్ట్వావివృధే కామః కృష్ణస్యప్రియదర్శనాం
హవిషే నానలస్యార్చి ర్మనస్తస్యాం సమాదధత్"

హ. విష్ణు 59-42

శ్రీకృష్ణుఁడు బలరామ సహితుఁడై స్వయంవరమునకు వెళ్ళెను. ఇంద్రాది నర్చించి వచ్చు రుక్మిణిని గాంచినంతనే యాతని కామ మభివృద్ధి చెందినది. ఆమెను గ్రహించి వెళ్ళెను.

ఇట్లు మూలమున సంక్షిప్తముగా నున్న కథను రమణీయ ప్రబంధముగా మార్చెను. భాగవతమున రుక్మిణి భూసురుని పంపి తన ప్రేమను ప్రకటించినది. ఎఱ్ఱయ హరివంశమున నారదుఁడు సంధానకర్తగా వ్యవహరించినాఁడు. రుక్మిణీ కృష్ణుల పరిణయమునకై పాటుపడినాఁడు.

ఇట్లు కథాగమనమున కూచితములగు పట్టులు, హరివంశమున లేకున్నను ఇతర గ్రంథము లందలి ఘట్టములను గ్రహించెను. వానినే కొంత సన్నివేశమునకు తగినట్లు మార్చెను. సంపూర్ణప్రబంధ మగునట్లుగా కూర్చెను. ఔచిత్యమును పాటించెను. అందుకే ఎఱ్ఱయ వర్ణనా నిపుణుఁడు. ఎఱ్ఱయ హరివంశము వర్ణనాశైలికి ఆద్యమై వెలసినది. అతఁడు ప్రబంధ పరమేశ్వరుఁ డైనాఁడు.

మఱొక ఘట్టము —

ఉష బాణుఁడను రాక్షసరాజు పుత్రిక. బాణుఁడు మహేశుని ప్రార్థించి వరము పడసినవాఁడు. గౌరికి బాణుఁడు కుమారస్వామి యంతటి అనుంగు పుత్రుఁ డైనాఁడు ఉషగౌరిచే వరమును పొందినది. "వైశాఖశుద్ధ దశమినాఁటి నిశాసమయమున సమున్నత సౌధ తలంబు నందు నీవు నిద్రించి యుండఁ గలలోన వచ్చి యెవ్వండు నిన్నుఁ గలిసె నతఁడు నీకుం బతి యయ్యెడు" నని యంబిక ఆమెకు వరము నొసంగినది. ఉష జగన్మాన్యం బగు సౌభాగ్యంబు తనకు భోగ్యం బయ్యెడు సమయంబునకై ప్రతీక్షించి యుండినది.

తన విహరించు సౌధము నందుఁ దల్పముపై ముసు దేవి యానతిచ్చిన నిశి యందు పోటులుఁజేసవ నిదుర పోవఁ దాను నొందెఱుంగని సుఖోచితనిద్రయం దుంపినది. అపుడు మారసమానుఁడగు పురుషాగ్రణి యామెతో భోగించినాఁడు. ఉష ఆడలిపడినది. మేల్కాంచినది ఆర్తినొందినది. చెలులు బుజ్జగించిరి. చెలియగు చిత్రరేఖ యది యంబిక వరమొసంగిన నాఁటి దినమని, వైశాఖశుద్ధ పూర్ణిమ యని, యావఁడే ఉషకు కాఁబోవు భర్తయని ప్రబోధించినది.

ఉష విరహతాపమున కుందుచుండినది. వేఱొండుపాయము గానక ప్రసిద్ధ పురుషుల చిత్రపటముల లిఖించి, చిత్రలేఖ తెచ్చినది. అందామెను కలలోఁబొందిన పురుషుని గుర్తింపుమని పలికినది. అప్పుడు ఉష —

సీ॥ దేవతలనుఁ బూర్వదేవతలనుఁ జూచి
దేవ యోనుల నెల్లఁ దెలియఁజూచి
విహగేశ్వరులఁ జూచి, యహినాయకులఁ జూచి
మనుజ సంఘముజూచి మనుజపతులఁ
జూచి యాదవకోటిఁ జూచుచో నప్పుడు
హరిఁ జూచి పోలిక తెరవు గాంచి
ప్రద్యుమ్నుఁ జూచి సంభ్రాంతయై యల్లన
యనిరుద్ధుఁజూచి యత్యాదరమున

తే॥ గీ॥ విగత సంశయ యగుమాడ్కి వేఱొకటికిఁ
బోక యాకూత కౌతుకాద్భుత విలోక
తారకం బయి నిలుకడఁ దగులఁ దగిలి
మనసు తోడ్తోడ మన్మథోన్మాద మొందు"

హ. వ. II-7-143

తే॥ గీ॥ బిగియఁ జనుదోయి నొత్తిన పేరురంబు
నఱకు మోవి తీపానిన యాననంబుఁ
దనియఁ గురులు దెమల్చి యాడిన కరంబుఁ
దరుణి మెచ్చుచు నెమ్మోముఁ దమ్మియులర

హ. వ. II-7-144

కం॥ నను మఱపి యెందుఁ బోయితి
కనుఁగొంటిచు పట్టువడితి కైతవ మిటు నే
సినఁ బోనిత్తునె యనుచును
దనమదిఁ బలుకుగతిఁ గొంత తడవీక్షించెన్"

హ. వ. II-7-145

ఇచట ఉషమనో భావముల పరంపర చిత్రములో చూపిన మాడ్కి వర్ణించిన ఎఱ్ఱయ మనోవిశ్లేషణాత్మక శక్తి యద్భుతము.

ఉషతన్ను కలలో కల్లిసిన పురుషుఁడెవరో నిర్ణయించు కొనుటకై ప్రతి చిత్ర పటమును దీక్షఁగా గమనించు చున్నది.

అందు దేవతలను, పూర్వదేవతలను చూచినది. దేవయోనుల నెల్లం దెలియఁ జూచినది. మనుజ సంఘమును, మనుజపతులనుఁ జూచినది. విహగేశ్వరులను పరిశీలించినది అమరనాయకులను గమనించినది. ఇంతవఱకు కేవలము చూచుటయే జరిగినది. తన మనోనాథుడు కన్పింపలేదు. యాదవులను చూడఁదొడఁగినది. అందులో హరిని జూచినది అపుడామె కట పోలిక తెరవు కనిపించినదఁట! ఇంతవఱకు పోల్చి చూతమనిన తెరవే కనిపించలేదు. ఇపుడా హరిని చూచిన మీఁదట పోలికకొక మార్గ మేర్పడినది.

హరి కనిరుద్ధుఁడు పౌత్రుఁడు. పితామహుని ఛాయలు పౌత్రునిలో కొంతకు కొంతయైన కనిపించుట కలదు. అట్టి ఛాయలే హరిని జూచినపుడు ఉషకు గోచరించినవి. ఇంతవఱకెన్ని చిత్రపటములు చూచినను, ఎవ్వరిలోను అనిరుద్ధుని పోలిక ఛాయమాత్రమైన గోచరింపదాయెను. నిరాశ చెందిన ఉష కిప్పుడొక మార్గము, ఒక ఆశా కిరణము గోచరించినది. అనిరుద్ధుని ఛాయ యగుపించినది. తరువాత ప్రద్యుమ్ననిఁ గాంచినది. అప్పుడు సంభ్రాతయైనది ఈ సంభ్రాంతికి కారణము ప్రద్యుమ్ననిలో చాలవఱకు అనిరుద్ధుని పోలికలుండుటయే కావచ్చును. అల్లన అనిరుద్ధునిఁ జూచినదఁట! 'అల్లన' అనుటలో సంభ్రాంతి నుండి తేరుకొని, "ప్రద్యుమ్నుఁడే అనిరుద్ధుఁడు" అను భ్రాంతిని తొలఁగించుకొని మెల్లఁగా పరిశీలించినదఁట! అనఁగా ఆతురత లేక భ్రాంతి లేక నిదానముగా చక్కఁగా పరిశీలించినదని అభిప్రాయము. ప్రద్యుమ్నుఁడెంత అనిరుద్ధుని రూపమువాడైనను వయోభేదాదులచే వేఱుగనే యుండును. కనుక నిశితముగా పరిశీలింపవలసి యున్నది.

అనిరుద్ధుని చిత్రపటము చూచినంతనే అత్యాదరము కలిగినది. 'దొరకదు' అని నిర్ణయించిన వస్తువు దొరకిపోయినది. ఆ వస్తువు అమూల్యమైనది. కనుకనే అత్యాదరముతోఁ గాంచుట ధైర్యమేర్పడినది. 'విగత సంశయ' యైనది. ఇంతవఱకు సంశయ ముండినది. ప్రద్యుమ్నుఁడే అనిరుద్ధుఁడేమో అను భ్రాంతి యుండినది. అటు పిమ్మట వయోభేదాదులను గమనించినపిమ్మట సంశయము తీఱినది ఇప్పుడది లేదు నిశ్చయ జ్ఞాన మేర్పడినది. భ్రాంతి తొలఁగినది. ఇతఁడే ఆతఁడను దృఢభావము కలిగినది. కనుకనే –

"విగత సంశయయగు మాడ్కి వేఱొకటికిఁ
బోక యాకూత కౌతుకాద్భుత విలోక
నాదికంబయి నిలుకడ దగుల వగిలి"

హ. వ. II-7-148

నది. నిశ్చయ జ్ఞానమైనంతనే నిలుకడ ఏర్పడినది వేఱొక్క చిత్రపటము చూచు అవసర మిఁకలేదు. పూర్వస్మృతులు మనో రంగమున తెరలు తెరలుగా ఏర్పడఁ దొడఁగినవి. అనేక శృంగార భావములు చెలరేగినవి. కనుక ఆకూత కౌతుకము – అద్భుతము నిండినది.
ఎందుల కన –

కలలోని పురుషుఁడు కనిపించుట సంభవము కావచ్చును. కాక పోవచ్చును. అట్టిది సంభవమైనది. ఆ కలలోని రూపమునకు చిత్రపటములోని రూపమునకు భేదమే లేదు. అంతటి సాదృశ్యమున్నది. కనుకనే ఆశ్చర్యము, అద్భుతముతో నిండిన అవలోకనము. ఆ అద్భుతమున మునిఁగియే చెలియగు చిత్రరేఖతో నిట్లు చెప్పినది.

కం॥ "నీ కౌశల మేమని చెలి
యాకొని యాడుదు మదీయమగు మదికింపై
ప్రాకృతి మును గలఁ గలిసిన
యాకారం బెంతసేసె నంతియు సేసెన్"

హ. వ. II-7-151

ముందు కలలోఁ గలిసిన యంతయే చేసెనఁట! అంతటి కౌశలముతో చిత్రము నిర్మించి యున్నదఁట! అందులకే ఆశ్చర్యము – అద్భుతము. ఆమె

చంచలతారకలు నిశ్చలములగుట, ఆతనిని విలోకించుచు, భావమగ్నయై నిలచిపోవుట? ఇది మన్మథావస్థ. ఆ భావములతో నిండిన ఉష స్వరూపము -

"బిగియ చనుదోయి యొత్తిన పేరురమును
అలరు మోవి తీపానిన యాననమును,
తనియఁ గురులు తెమల్చియూడిన కరమును"

హ. వ. II-7-144

మెచ్చుచు ప్రేమతో నిండిపోయి నట్లుండినది. "నన్నుమరులు గొలిపి ఎందుఁబోయి తివి?" అనియడిగినట్లుండినది. "కనుగొంటిని" "పట్టువడితివి" "ఇఁకకైతవము సేసిన పోనిత్తుమా?" అని పలుకుచున్నట్లుండిన దఁట!

ఇవి ఎఱ్ఱయ నిశిత మనోభావపరంపరా వర్ణనలకు మచ్చు తునక. మూలము నందు ఉష - పరిశీలన ఇంతతూకముగా జరుగలేదు. తేలికగా తేలిపోయినది.

మూలమున - 'చిత్రలేఖ' యను అప్సరస్త్రీ చిత్రపటముల వ్రాసి చూపినది. మూలమున చిత్రలేఖలు ఇద్దరు. ఒకతె కుంభాండ పుత్రి. ఉషకు సఖి. మఱొకతె అప్సరస్త్రీ. ఇరువురు చిత్రలేఖలు అనవసరమని తలంచి, అప్సరస్త్రీని తొలఁగించి ఎఱ్ఱయ ఉషాకుమారి చెలికత్తె చేతనే వ్రాయించి, యామె ప్రేమను చెలివలకే గుప్తపఱచినాఁడు

మూలమున అప్సరస్త్రీ చిత్రపటముల వ్రాసి తెచ్చినది.

"తతః క్రమేణ సర్వాంస్తాన్ దృష్ట్వాసామత్రకాశినీ
దేవదానవ గంధర్వ విద్యాధర గణానథ

హ. విష్ణు 118-68

తత్రానిరుద్ధం దృష్ట్వాసా విస్మయోత్ఫుల్ల లోచనా
ఉవాచ చిత్రలేఖాంతా మయంచోరస్సవై సఖి

హ. విష్ణు 118-69

యేనాహం దూషితాపూర్వం స్వప్నే మార్త్యగతాసతీ
సోఽయం విజ్ఞాత రూపోమే కుతోఽయం రతితస్కరః"

హ. విష్ణు 118-70

మూలమున క్రమముగా సప్త్వలను చూచినది. ఆమత్తకాశిని దేవదానవ గంధర్వ విద్యాధరులను వరుసగా గాంచినది. అచ్చట అనిరుద్ధుని చూచి, విస్మయో త్ఫుల్లలోచనయై చిత్రలేఖతో, "సఖి ! ఆ చోరుఁడితఁడే" యని చెప్పినది.

ఇంత తేలికగా జరిగిపోయిన చిత్రపట ప్రదర్శనము – స్వప్నపురుష నిర్ణ యము – ఎఱ్ఱయ భావపూర్ణముగా చిత్రించి తన భావుకతను ప్రదర్శించినాఁడు. హరినిఁ జూచుట, ప్రద్యుమ్నునిఁ గాంచుట, పిమ్మట అనిరుద్ధుని గనుట - ఇత్యాది క్రమము లేదు. చూచి భావావేశమునకు లోనై తన్నుతాను మఱచుటయు లేదు. ఇది యంతయు ఎఱ్ఱయ వర్ణన.

ఇట్లు ఉచిత భావావేశముతోఁగూడిన యుచిత భావనా ప్రదర్శనలో ఎఱ్ఱయ చతురుఁడు. చిత్రలేఖ నారదుని యనుగ్రహము వడసి తిరస్కరిణీ ప్రభావమున అనిరుద్ధుని ద్వారకనుండి తెచ్చినది. ఇరువురును గాంధర్వ విధిని పరిణయమైనారు

ఆనాటినుండి అనిరుద్ధుఁడు –

కం॥ "ఉష కౌఁగిట నలరుచుఁ దా
నుషస్సు నిశియని యెఱుంగ కుద్దామరసో
న్మిషితుఁడయి రేయుఁబవలును
సుషమములుఁగాఁ గ్రాలుబాణ సూనుఁడు నెమ్మిన్"

హ. వ. II-7-210

ఈ విషయము నెఱింగి కన్యాంతఃపురపు కావలివారు దైత్య వల్లభునకు విన్న వించినారు. అతఁడు కోపించి

"నా పేరును పెంపును కానక ఉన్మాదుండై నావీటిని సొచ్చి నా ప్రియసుతను వంశైక భూషామణిని దూషితను గావించిన వానిని పొదవుఁడు, పట్టుఁడు, సాదిగొ నుఁడు – అని సహస్ర సంఖ్యల కింకరులను బనిచినాఁడు వారలు అసిశరాసనాదుల గ్రహించి బాణజామాతయున్న సౌధమునకు వచ్చిచుట్టును పొదివి కొన్నారు. అనిరుద్ధుఁడును సింహసముఁడై దారుణముగా నిల్చినాఁడు. అప్పటి ఉషమనఃక్షోభ ఉద్విగ్న మానసిక భావనలు – ఎఱ్ఱయ హరివంశమున ——

సీ॥ కన్నియలకుఁ జేయఁగాని చేఁతకుఁ జొచ్చి
 కులనాశ మొనరించి కులటనైతిఁ
త్రైలోక్య నాథుండు తండ్రికిఁ బెడఁ బాసి
 బెడిసితి నింకెయ్యది చేయుదాన
నట మీఁద నాకుఁ గా నాఱడి వెలవెట్ట
 రాని రత్నముఁబోని రాచపట్టి
యువతి వోయెడి జగదంబ యిచ్చిన వరం
 బునకును నొకపాని పుట్టునొక్కొ

తే॥ గీ॥ భాగ్యదేవతలార యీ పాఁ గడవఁ
బెట్టరే యంచుఁ జేతులు పిసికి కొనుచుఁ
గన్నునీరు నించుచు నార్తకంఠియైన
యాత్మ వల్లభుఁ గనుఁగొని యల్ల నగుచు

హ. వ. II-7-212

"నా లావెఱుంగవు. బాధపడుచుంటివి. నేను ఫాలాక్షునయినను జయింపఁ గలవాఁడను" అని యోదార్చినాఁడు.

'కన్నియలు చేయరాని పనిని చేసి కులనాశ మొనరించి కులటనైతి' నని తన తప్పిదమునకు వగచు చున్నది.

భారతీయకన్యలు తండ్రిచాటు బిడ్డలు, 'పితారక్షతి కౌమారే' యని తండ్రి రక్షణలో పెరిగి యాతఁడే వరున కొసంగిన నాభర్తతో గృహస్థాశ్రమ ధర్మమును నిర్వర్తింతురు. సాధ్వీమణులని వాసిఁగాంతురు అట్టి సాధ్వీధర్మమును కాదని తిరస్కరించి, తలిదండ్రుల యెఱుక లేకయే అనిరుద్ధుని పొందినది. కనుక తన తప్పిదమునకై విలపించినది.

ఆ తండ్రియు సామాన్యుఁడు కాఁడు. అతఁ డిచ్ఛగించినచో నెంతటి సమర్థు నైనను పరుసఁగా తేఁజాలినట్టి. కోపించినచో నేమైన చేయఁజాలిన ఉగ్రుఁడు. అట్టి త్రైలోక్య నాథుఁ డగు తండ్రిని తిరస్కరించి చెడితినని విలపించుచున్నది.

ఇటు చూడ, వెలవెట్టరాని రత్నముఁ బోలిన రాచపట్టిభర్త. అటు తండ్రిచాటు ధనమును తెగించి నందులకు, నీటు వెలలేని పురుషరత్నమగు ప్రియుని వెతలముంచి

నందులకు బాధపడుచున్నది. కడకు - జగదంబయే తనకితని పొందును కూర్చినది. గనుక - ఆమె వరమునకును హానిపుట్టునా? యని వితర్కించు చున్నది

అటు కన్నతండ్రి ఇటు గౌరీ కటాక్షముచే తానుఁగా లభ్యమైన ప్రియుఁడు ఎవరికి కీడు కలిగినను సహింపఁజాలని స్థితి.

"ఓ భాగ్యదేవతలారా! యీ దారిఁగడవఁ బెట్టరే" యనుచు భాగ్యదేవతల నర్థించుచున్నది. ఏమియును చేయఁజాలక తుబు పిసికికొను చున్నది. కన్నుల నీరు నింపుకొనుచున్నది. ఆర్త కంఠి యగుచున్నది.

ఇంతటి మానసిక సంతాపము, దైన్య స్థితియు మూలమునందలి ఉషకుఁ గానము బాణు యాజ్ఞచే కింకరులు సన్నద్ధులై అనిరుద్ధ వధార్థ మేతెంచిరి.

"రురోద తద్బలం దృష్ట్వా బాష్పేణావృత లోచనా
ప్రాద్యుమ్ని వధ భీతాసా బాణపుత్రీ యశస్వినీ
హ. వి. 119-86

తతస్తు రుదతీం దృష్ట్వా తాముషాం మృగలోచనాం
హాహా కాంతేతి వేపంతీ మనిరుద్ధోఽభ్యభాషత"
హ. వి. 119-87

"అభయం తేఽస్తు సుశ్రోణి మాభైః త్వంహి మయిస్థితే
సంప్రాప్తో హర్షకాలస్తే నేహాస్తి భయకారణమ్"
హ. వి. 119-88

—— ఇది మూలమునందలి ఉషపరిస్థితి. ఆ బాణ పుత్రిక బాణుని బలమునుఁ గాంచి అనిరుద్ధుని వధయగు నని భీతిల్లినది. బాష్పాకుల నేత్రయైనది. ఏడ్చినది.

"హాకాంత! హాకాంత!" యని ఏడ్చుచు వణకుచున్న ఉషను అనిరుద్ధుఁడు భయపడవలదని ఓదార్చినాఁడు. నే నుండఁగా నీకు భయమువలదు, భయకారణము లేదు. హర్షకాల మాసన్న మయినది" యని యాశ్వాసించినాఁడు. అంతియే కాని. ఆమె తండ్రిని గుఱించి తర్కించలేదు. భర్తను గుఱించి మాత్రమే భయపడినది. తానుగావించిన తప్పిదమునకై పశ్చాత్తాపము చెందలేదు తండ్రి ఔన్నత్యమును కించపఱచితినని బాధ పడలేదు కాని ఎఱ్ఱయ ఉష ద్వివిధములగు బాధలలో మునిఁగి

నది. కనుక ఎఱ్ఱయ భారతనారీ హృదయమును ఉషలో పొందుపఱచినాఁడని తప్పక చెప్పవచ్చును. ఇది యాతని సంప్రదాయజ్ఞతకు నిదర్శనము. భారతనారి తప్పులు గావింపదు. కావించినప్పుడు పరితాపము చెందక వదలదు. ఈ సత్యమును చక్కఁగా గుర్తించిన ఎఱ్ఱయ ఉష పాత్రను మూలము కంటెను భిన్నముగా దిద్దితీర్చినాఁడు.

ఇట్లీ కావ్యము నందలి కొన్నిపట్టుల పరిశీలించుచు బోయినచో - ఎఱ్ఱయ వ్యక్తిత్వమును గుర్తింపవచ్చును. ఇతఁడు సంయమి. మతోన్మాదమునకు ఇతని చిత్తము దూరము. హరిహరులను సమానముగా నారాధించిన భాగవతుఁడు. ఆంధ్రుల ఆంధ్రత్వమును ప్రేమించు ఆంధ్రుఁడు. స్త్రీల కుచితస్థానమొసంగి గౌరవించు ధన్యుఁడు. దాక్షిణ్యధనుఁడు. ఉద్రేక రహితుఁడు. సాత్త్విక గుణములతో, భగవద్భక్తితో శివకేశవాభేద తత్త్వముతో, జీవితమును గడిపినవాఁడు. ఉచితజ్ఞుఁడు. సకల భాషా విశారదుఁడు. కవితాధురీణుఁడు. పాత్రౌచిత్యమును చక్కఁగా గుర్తించు ప్రబంధకర్త. భగవంతుని భక్తిలో పాత్రలతో తాదాత్మ్యమును చెంది యానందించు భక్తాగ్రేసరుఁడు. ఆంధ్రుల ఆచారములను, పూజలను, నియమములను, వ్రతములను ఆదరించువాఁడు. గోవులను గోపాలురను ప్రేమించువాఁడు.

గోబ్రాహ్మణ భక్తి ఇతనికి వెన్నతోఁ బెట్టిన గుణము.

ఎఱ్ఱయ హరివంశమును పరిశీలించుచుఁ బోయినచో నాతని వ్యక్తిత్వమును గుఱించి యెన్నియో విషయముల గ్రహింపవచ్చును. మూలము నుండి కావించిన మార్పులను గమనింపవచ్చును. భావములలో వైవిధ్యము, కల్పనలో చాతుర్యము, ఔచితీ నిర్వహణలో దక్షతను గమనింప వచ్చును.

ఉచితజ్ఞుఁడు గనుక ఉచితములని తలంచిన వర్ణనలను గావించినాఁడు, సంయమి కనుక భావము ఉద్రేకముతో కట్టలు తెగి ప్రవహింపక హద్దులు గావించినాఁడు.

దాక్షిణ్యధనుఁడు కావున మనస్తత్త్వములను గాయపఱచు పలుకులను తీసివేసినాఁడు.

సహజ పాండితీ మండితుఁడు. నిరాడంబర జీవి గనుక స్వభావోక్తులను ప్రేమించినాఁడు. స్వభావోక్తితోఁగూడిన వర్ణనలనే రక్తి కట్టించినాఁడు. అతిశయము లగు హాస్యోక్తు లితనికి గిట్టవు.

పరనిందా సహిష్ణువు. సాధువుల సమ్మతి నందిన వాఁడు. పల్లె ప్రజలను పల్లె జీవితమును ప్రేమించువాఁడు.

శివ కేశవుల యందు సమానమైన భక్తిప్రపత్తులు గలవాఁడు. అన్నిటికంటెను వినయాభరణుఁడు.

ఆంధ్రతత్వమును, ఆంధ్రభాషను, ఆంధ్రాచారములను అపారముగా ప్రేమించినాఁడు.

వర్ణనా నిపుణుఁడు గనుక సూక్ష్మాతి సూక్ష్మ విషయములనుగూడ దక్షతతో పరిశీలించి భావించి, అనుచితములను పరిహరించి, పదముల పొందించి, వర్ణించినాఁడు.

ఎఱ్ఱయ పరమ భాగవతుఁడు గనుక అతని భక్త్యావేశములు కట్టలు త్రెంచుకొని ప్రవహించినవి.



# 11. హరివంశము - ధర్మధ్వని

ఎఱ్ఱయ హరివంశమునకు ప్రేరకుఁడు వేమారెడ్డి అతని కాలమున రాజ్యశ్రీ రాజ్యలక్ష్మి స్థిరత లేక యుండినది.

తురుష్కుల దండయాత్రలచే స్థిరత లేక త్రైలింగదేశమును రక్షించు వారెవ్వరును మనసునకు గూడ తట్టక పరాధీనము నందున్నపుడు తెలుగునేలను సుల్తానుల అధిపత్యము నుండి తప్పించినవారిలో వేమారెడ్డి యొకఁడు. ఆనాఁడు రాజులు శక్తిత్రయధౌరేయులు. సుహృదులకు జీవన దాతలుగా యవనసముద్రమున కొర్వాగ్నిగా, భువన ద్వయమున హితమొనఁగూర్చు త్యాగభోగముల కాలవాలముగా నిఖిల పురుషార్థ భోక్తలై ప్రజానురక్తులై, అర్థార్థసదత్తులై యుండువారు.

గోబ్రాహ్మణ రక్షకులు, ప్రజాదరణాసక్తులు, కవిపండిత పోషకులు నగు రాజులకు, రాజ్యలక్ష్మి స్థిరత్వము లేక పోయినది. దేవ ప్రతిమలు లేక పాడఱిన దేవాలయములకు పునఃప్రతిష్ఠలు జరిగినవి. భగ్నము లయిన దేవాలయములు పునర్నిర్మితములైనవి. యజ్ఞయాగాదులు పునః ప్రవృత్తములైనవి. అనవరత ప్రజాపాలన దీక్షాయుతులు పురోహిత కృత సోమపాన బిరుదాంకితులు నగు రాజులకు వారి రాజ్యమునకు స్థిరత్వము చేకుఱఁగలదని యాశ్వాసింపవలసి యున్నది. 'దుష్టశిక్షణ - శిష్టరక్షణ' జరుగగలదు. అవశ్యము భగద్విశ్వాసము గలవారికి కల్యాణకాలము సమీపింపగలదు. కష్టములు, భీతావహపరిస్థితులు సంభవించినను అవి శాశ్వతములు కావు. కలకాల మొకే తీరున నుండదు. సుఖశాంతులు నెలకొనఁ గలవు - అని ప్రజలకు బోధించుటకై హరివంశమునే అనువదించుటకుఁ బూనెను. ఎఱ్ఱయ సందర్భము కలిగినపుడెల్ల ప్రజల కీ విషయమును తెలియఁ జేయుచునే యున్నాఁడు.

"మహామహిమ గల దేవుం డొక్కొక్క కాలమున జగంబుల కుపద్రవంబు వుట్టినచోట్లనుఁ బృథివికి భరంబైనపట్లను, సాధువులకు బాధలు గదిరిన యెడలను, ధర్మంబునకుఁ జలనం బెలసిన నెలవులను విచిత్రంబులగు నాచరించి లోకస్థితి నిర్వహించు నతని యవతారంబులు మున్నెన్నవియు నిక నయ్యెడు నవియు సహస్ర సంఖ్యంబులు. వానిని పురావిదు లెఱుంగుదురు. (పూ. భా 4-13)

ప్రజలలోని నైరాశ్యమును తొలగించి, భగవంతుఁడు తప్పక రక్షింపఁగలఁడను విశ్వాసము కలిగించుటవసరమై యున్నది. విశ్వాసము లేనిదే నైరాశ్యము

ఎఱ్ఱన కాలమందలి పరిస్థితులట్టివి. అమానుషమగు చందములనోపి యత్నించు వారికే తప్ప ఫలితము చేకూరెడిదికాదు. ఆనాఁడు రాజ్యములు ఛిన్నాభిన్నములై, శత్రుహస్తగతములై, దేవాలయములు ధ్వంసములై, దేవప్రతిమలు మాయమై, అగ్రహారములు భ్రష్టములై, అమానుష శక్తిని ప్రయోగించిననే కాని సక్రమ మార్గమునకు రాని స్థితిలో నుండినవి. కనుకనే కంసునివంటి నియంత చేత – ఎఱ్ఱయ ఈ వాక్యములను పలికించినాఁడు. అమానుషంపు చందముల నోపి యుద్యోగ మొనరించిన తప్పక దైనము ఫలము నొసంగఁగలదను విశ్వాసము, కార్యదీక్ష – పెంపొందింపవలసి యున్నది. అప్పుడు కార్యమెంత చెడుదశ యందున్నను ఫలింపఁగలదని ధ్వనించుచున్నది.

వామదేవ భరద్వాజులు – శ్రీకృష్ణుడు నెఱిఁగి స్తుతించునపుడు –

కం॥ పుట్టువుఁ బేళ్ళుం గ్రియలును
నెట్టన యేవెరవులందు నిన్నుఁగదియ వె
ప్పట్టున లోకహితార్థం
బిట్టిఁడ వయ్యుగ్రపబూనుదీ యఖిలంబున్"

1.6-193

ఇది ఎఱ్ఱయ ప్రజలకందించు భగవదవతార కారణము. ఆ భగవంతుఁడనాది జన్మరహితుఁడు, నామరహితుఁడు, క్రియారహితుడు అయినను, నొక్కొక్కప్పుడు లీలామానుషశరీరమును ధరించి, జన్మ యెత్తి నామము వహించి క్రియలాచరించును. ఈ క్రియలు, లోకహితార్థము గావించునవి. సాధు సంరక్షణకై, పరతత్త్వ స్వరూపుఁడవతారము గ్రహించి కృపాదృష్టితో ప్రజలను రక్షింపఁ గలఁడని యాశ్వాసించుచున్నాడు.

ఘంటాకర్ణుఁడను పిశాచవీరుని ముఖమున – ఎఱ్ఱయ ఆర్ధించిన విధానము ప్రజలలో భక్తి, జ్ఞాన, వైరాగ్యముల నుద్బోధింపఁ జేయునవి.

సీ॥ "ఎన్ని జన్మములనో యియ్యింద్రియంబులు
నాచేతఁ జిక్కక నీచవిధికిఁ
దిగువంగఁ దిగువంగఁ దగిలిపోయిన మాన
సము చెద్ది నిష్పాప జన్మమొలసె

నీ జన్మమునయందు నివిఁ గ్రమ్మఱఁగ గాసి
సేయంగ నున్నవి చిక్కువడిన
నేమి సేసియుఁ గొఱయేమి పరద్రవ్య
పరదార పరివాద పరిహరణము

తే॥ గీ॥ నాకు నీవిచ్చువరముగా నాథ వినుము
నాదుశ్రోత్రాది వర్గంబు నలిన నాభ
యంబరాది భూతముల యందదిమి యవియు
నిన్నుఁగలపి సన్నానంద నిష్ఠమనుపు

II-5-197

తే॥ గీ॥ నీకు మ్రొక్కెద నున్నిద్ర నీరజాక్ష
నీకు మ్రొక్కెద ధర్మప్రణీత పక్ష
నీకు మ్రొక్కెద నిశ్శోక నిగమ రూప
నీకు మ్రొక్కెద నిర్వాణ నిత్యదీప

హ. వ II-5-198

ఈ ప్రార్థన యందలి యార్తి ప్రతిజీవి హృదయమును కదలించునట్టిది. ప్రతిజీవి యాత్మ గావించు ఘోష. ఇట్టి వైరాగ్య సంపదను "నాదుశ్రోత్రాదివర్గంబు అంబరాది భూతములందు కలిసి వానిని నీలో కలిపి సన్నానంద నిష్ఠమనుపు' మని ప్రార్థించుట - భగవదైక్యమును ప్రార్థించుట - ఈ శరీరము పంచభూత నిర్మితము వీనిని పంచభూతములందే కలిపి, ఆత్మకు నీలో సాయుజ్య మొసంగుమని ప్రార్థించుట ఘంటాకర్ణుని ముఖమున ప్రతి దైవ భక్తుఁడును కోరు చరమ వాంఛ.

ఎన్నో జన్మలనుండి. యీ యింద్రియములు నాచేతికిఁ జిక్కక నీచవిధికి పాల్పడినవి. అవి గావించిన కర్మఫలమే ఈ పాపజన్మ. ఈ ఇంద్రియములకు లోనుఁడై మానవుఁడు చేయని కార్యమేది ? పరదార, పరద్రవ్య పరివాదములిక వలదు. నన్ను నీలో కలిపికొనుము" అని తిరిగి తిరిగి మ్రొక్కుట, జీవితము క్షణ భంగురమని భగవదవతార జ్ఞానమే బ్రహ్మానందము నొసంగఁ జాలినదని, యతనిలో సాయుజ్యము నొందుటయే సత్యశాశ్వత సౌఖ్యమని గ్రహించుట - ప్రతి మానవుఁడు శాశ్వతానందమునకై చేయవలసిన కార్యము.

తన అంగములను వెనుకకు లాగుకొను కూర్మమట్లు విషయ వాంఛలనుండి మాన వుఁడు తన యింద్రియములను పరాఙ్ముఖ మొనర్చుకొని – తనయందే కామమును నశింపఁజేయఁగల ధన్యచిత్తుఁడానంద తత్త్వమును పొందునని విషయపరాఙ్ముఖతకై యుపదేశించు చున్నాఁడు.

తృష్ణవలన విరతి కలుగదు. కామము శాతించుననుట మిథ్యావాదము అజ్యము పోసినట్లెల్ల అనలమధిక మగును కాని యాఱదు కదా!

విషయ విముఖులై భోగముల సంయమనమును పాటింప వలయునని, ధన ధాన్యములు – కాంతాకనకములు తృప్తినొసంగలేవు. కనుక తృష్ణవలన విరతి పొందవలయునని 'కామిగాక మోక్షకామిగాఁ'డని తలంచి, భోగభాగ్యముల నభివృద్ధి పరచు కొనుచుండుట తగదని బోధించుచున్నాఁడు. ఇది ఎఱ్ఱయ యయాతి ముఖ మునఁ గావించిన నీతి బోధ.

కంసుఁడు రాక్షసాధిపతి – నియంత అతనినోటినుండి కొన్ని ధర్మములను పలికించినాఁడు. దేవకి యష్టమ గర్భమును చంప నుద్యుక్తుఁడుకాఁగా యోగమాయగా ఎగిరిపోయినది. అప్పుడు పశ్చాత్తప్తుఁడైనాఁడు దేవకీదేవికి కృతాంజలియైనాఁడు. "ప్రాణ రక్షణకై యెంతయు పాపముసేసి గర్భసంతాన విఘాతి నైతిని. నిష్ఫలదం చిత శోకపయోధి ముంచితిని. ప్రయత్నించిన కార్యములన్నియు వృథ యయినవి విధాతచేయి ఎవ్వానికి మాన్పఁగా నకట వచ్చునె మానుషతుచ్ఛయత్నతన్" అని కంసునిచేత పలికించినాఁడు. మానుషయత్న మతితుచ్ఛ మైనది. విధాత తలపెట్టిన కార్యమును తుచ్ఛమానుషయత్న మేమియు చేయలేదు. అని సర్వకార్యసాఫల్యము నకు భగవంతుని కృపతోడై యుండవలయునని – అప్పుడే పురుషకారము ఫలించునని బోధించు చున్నాఁడు –

కం॥ "వినుచంపఁ జెఱుప మనుపను
ఘనతరమగు కాలమొకడకర్త మనుష్యుం
డు నిమిత్తమాత్ర మింతయు
యనయమ్మున్కు గాలపాకమైన క్రియలకున్"

హ. వి. 1-5-134

కాలమొక్కడే – మానవుల సర్వశుభాశుభఫలములకు కర్త. ఏయేకాలమునం దేయే సుఖదుఃఖములు ఫలించునో – అవి జరిగి పోవుచుండును. అంతియేకాని

మానవుఁడేమియు చేయఁజాలడు అతండు నిమిత్తమాత్రుఁడేకాని కర్త కాఁడు. కాన దుఃఖము అపజయము, అనర్థము సంభవించినపుడు, కృంగి, కృశించి పోరాదు. నిరాశ చెందనవసరము లేదు అపూర్వమగు ఘనకార్యముల సాధించునపుడు - విజయము పొందినపుడు ఆ సౌఖ్యములకు తానేకారకుఁడని యుబ్బిపోయి అహంకారముతో విఱ్ఱవీగరాదు. కాలపరిపాకమే యిట్టి మహత్కార్యములు సంభవించినవని నిర్లిప్తుడై యుండవలయును. కర్తవ్యమొక్కటే తనయధీనమని దీక్షాపరుఁడై కార్యమాచరింప వలయును.

"కర్మణ్యేవాధికారస్తే మాఫలేషుకదాచన" - అనునీతిని రాక్షసుఁడగు కంసుని ముఖమున తెలియఁ జేయుచున్నాడు. ఇది ప్రతి మానవునకు కర్తవ్యపథమును విస్మరింపక, నైరాశ్యముచెందక, అహంకారము వీడి చరించుట కుపదేశము. మన ప్రారబ్ధ కర్మఫలము ననుసరించి, సుఖదుఃఖములు సంప్రాప్తించు చుండును. చంపను, చెఱుపను, మనుపను మానవుఁడు కర్తకాడు. కాలము మహత్తరమైనది. కర్మయే కాలరూపమున కర్మల ననుభవింపఁ జేయును. ఇది - కంసుని ముఖమున ఎఱ్ఱయ ఉపదేశము.

కంసుఁడు తన అంతరంగిక పరిచారకులతో పల్కిన పలుకులు -

తే॥ గీ॥ మంత్రముల నౌషధముల సమానుషంపుఁ
జందముల నోపి యుద్యోగమొందుఁ జేయు
నట్టివారికి ననుకూలమై ఫలంబు
నెఱపుఁ జూడుడు దైవంబు నిక్కమింత

హ. వ 1-5-౭౬

దీనికి మూలమునే -

"మంత్రైగ్రామైః స్సువిహితై రౌషధైశ్చ సుయోజితైః
యత్నేన చానుకూల్యేన దైవమప్యానులోమ్యతే"

అను మూలమున కిది ఎఱ్ఱయ అనువాదము 'యత్నేన చానుకూల్యేన' - అనుకూల యత్నముతో అనుటకు బదులు "అమానుషపు చందముల నోపి యుద్యోగ మొన రించువారికి" - తప్పక దైవమనుకూలమైన ఫలము నొసఁగు నఁటః

తొలఁగదు నైరాశ్యము తొలఁగనిదే మానవుఁడుత్సాహము కలిగి కర్తవ్య నిష్ఠుఁడు కాలేడు. ఆనాటి సమాజమున - తిక్కన కాలమువఱకు వీరశైవము కట్టలు తెంచుకొని ప్రవహించినది. భవుల దర్శనస్పర్శనాలాపముల గూగ నిషేధించిరి. మతముపేఁట రక్తపాతములు జరిగిపోయినవి. మహాకవియగు తిక్కన ప్రాదుర్భవించి హరిహరాభేదతత్త్వములు ప్రజలకు బోధింప నెంచి 'శ్రీయన గౌరినాఁబరఁగు చెల్వకుఁజిత్తము పల్లవింప భద్రతాయిత మూర్తియై హరిహరంబగు రూపము దాల్చి'న స్వరూపునకు భారతము నంకిత మొనర్చినాఁడు. కాని యీ తత్త్వము గ్రంథ మధ్యమున నగుపించుట కవకాశములేదు. కాని ఎఱ్ఱయ కావ్యమందంతట నీ హరిహరాభేదతత్త్వము తొంగిచూచుచున్నది. ప్రజలలో మత సమైక్యత సంఘట పఱుప వలసియున్నది. ఆనాటి ప్రజాసమయమున - నాస్తికతా భావము ప్రబలు కాలమాసన్నమై యుండినది తమ ధన ధాన్య, స్త్రీ, దేవతా, దేవాలయ, దేవప్రతిమలు - దేనియందు స్వాయత్తతా భావము లేక మానసికముగా గొప్ప సంచలనమునకు గుఱియై యుండిరి. వారిలో దైవభక్తి ప్రేరేపింపవలసి యున్నది. ఆ యపేక్షతో ప్రోలయ వేమారెడ్డి ఎఱ్ఱనను హరివంశాంధ్రీ కరణకు ప్రేరేపించినాఁడు. రాజప్రభావముచే ప్రేరితుఁడగు ఎఱ్ఱయ అదే దీక్షతో ప్రజలకు బోధింప సమకట్టెను. ప్రోలయ వేమారెడ్డి శైవుఁడైనను పర మత సహనము కలవాఁడు భవాంఘ్రి పూజనాతత్పరుఁడయ్యు గోవిందుని గుణము లందాదరమును కలిగించు హరివంశాంధ్రీకరణకు ప్రేరేపించినాఁడు. ఇట్లీ హరివంశ రచనచే ప్రజలలో సమైక్య భావమును సంఘటిత పఱచుటకై పాటుపడినాఁడు.

సాధువులకు బాధలు తీరఁగలవని ధర్మమునకు చలనము కాఁజాలదని' అధర్మము విజృంభించినను నది తాత్కాలికమేయని హరివంశమూలమున తెలియఁ బఱచెను.

రసానందముతోపాటు, ధర్మబోధగావించుటకై పూనుకొనినాఁడెఱ్ఱయ. మహాత్ముల మహనీయ గ్రంథములు, మానవజాతికి శాశ్వత ధర్మ సందేశము లొసఁగుచున్నవి. ఎఱ్ఱయ ఆనాటి స్త్రీలకు త్వష్టముఖమున నిట్లుపదేశించు చున్నాఁడు.

కం॥ ఎంతయుఁ గ్రూరుండయినను
శాంతుఁడయినఁ బతియ చువ్వె సతికారయ న
త్యంతపు బంధువు తదతి
క్రాంతిఁ దలఁచు కాంత యొందుఁగనునే శుభముల్"

1-1-117

భర్త ఎంతటి క్రూరుఁడయిన సతికిఁ బతియే బంధువు భర్త యెంత శాంతుఁడయి నను సతికతఁడే ఆప్తుడు. అతని నతిక్రమించి, కాదని మీఱి పోవఁదలచు కాంత కెందును శుభములు కలుగవు. భర్త క్రూరుఁడయినను, హింసించినను, అతని కడనే యుండుట సతి ధర్మము. ఇది ఎన్నియనాఁటి ధర్మము. ఆ ఁడట్టి విశ్వాస మత్యవసర మైనది. యవనాక్రాంతమైన రాజ్యమున నప్పుడే స్వాతంత్ర్యయోధులు వశపఱచు కొన్నారు. రాజ్యములను స్థిరపరుప యత్నించుచున్నారు. చుట్టును తురుష్కుల పీడలు ఆక్రమణలు, భార్యాపహరణము లుండనే యున్నవి స్త్రీల ధన మాన ప్రాణ ముల రక్షణ దుష్కరమైనకాల మది. కనుక నిట్టి బోధ అత్యంతావశ్యకము. కనుకనే క్రూరుఁడైనను భర్తనే దైవముగా భావించి యాతని కడ నుండవలసినదని బోధ. మగని యందు యున్న అణఁకువంత తేలికగా శత్రువులు పరిగ్రహింపఁ జాలరు. యయాతి పలికిన సుభాషితములు మానవుని విషయవాంఛల నుండి పరాఙ్ముఖుఁ గావింప సమర్థమైనది.

తే॥ గీ॥ అంగములు కూర్మమెట్లు ప్రత్యాహరించు
నట్లు కామముఁ దనయంద అడపఁజాలు
ధన్యచిత్తుఁ డానంద తత్త్వంబు నొందు
నితరులెల్లఁ గాల్రగస్తు లింత నిజము

హ వ I-3-61

కం॥ పసిడియు, పశువులు, భామలు
వసుమతి నిండగలయంత వట్టునొకఁడ యుం
పెసఁగగఁ బడసియుఁ దనియదు
విసువవలదే తృష్ణవలన విరతిప్రాప్తిన్

హ. వ 1-3-62

కం॥ సముధిక భోగంబులచే
సమయుం గామమనునది మృషావాదం బా
జ్యముసం దోడ్తో ననలం
బమితంబై యొదవుగాక యాఱునె యెందున్

హ. వ 1-3-63

ఇట్లు పరదార పరద్రవ్యముల యందలి వాంఛను ఆశించనివాఁడు, ప్రతి వ్యక్తి పరివాదమును వదలి, ఇంద్రియములను జయించి భగవదనుగ్రహమునకై వాంఛించిన నాఁడు తప్పక లోకకల్యాణము, విశ్వశాంతి చేకూరఁగలగు.

విశ్వకల్యాణమే సత్కావ్య ధ్యేయము. అది ఈ హరివంశమూలమున కాంక్షింపఁబడినది.

శివుని ముఖమున ఎఱ్ఱయ – శ్రీకృష్ణుని మహిమ తెలియఁ జేయుచున్నాఁడు.

కం॥ నీ పేళ్ళెన్నియొ యన్నియు
నా పేళ్ళును నో ముకుంద నాకు న్నీకున్
రూపింప లేదు భేదం
బే పగిదిని నిన్నుఁగనుట యెఱుఁగుట నన్నన్

II-6-84

కం॥ నిను నొల్లక నను జేరుట
నను మెచ్చక నిన్నుఁగొలుచు నరునకు నరకా
యనములుగఁ దెలుపు హరిహర
వినిరూపణ తుల్యమతులు విభులే యెడలన్

II-6-85

అని శివకేశవులొకే భగవదవతారమని, యిరువురకు భేదము లేదని, శివునొల్లక కేశవునిఁజేరుట, కేశవుని మెచ్చక శివునిఁ గొలుచుట – నరక ప్రాప్తికి మార్గములని ఎఱ్ఱయ తెలియఁ జేయుచున్నాఁడు. ఇట్లు శివకేశవుల కభేదము తెలుపుమనే —

కం॥ దేవ దనుజ మనుజాదిక
జీవచయంబులకు నెల్ల శ్రీవిభవములుం
గైవల్యము నొసఁగెడు పర
దేవత మఱి గలఁడె విష్ణుదేవుఁడు దక్కన్"

అని సమస్త ప్రాణికోటికిని సంపదలను, సౌభాగ్యమును మోక్షమును విష్ణు దేవుఁడొక్కఁడే యొసంగ సమర్థుఁడని సూచించు చున్నాఁడు.

ఇట్లీ కావ్యముఖమున ఎఱ్ఱయ - రాజులకు వర్ణాశ్రమ ధర్మరక్షణను ప్రజలకు మతసామరస్యముతోఁ గూడిన భగవద్భక్తిని, వైరాగ్యభావమును, జ్ఞానమును బోధించుచు, ఉత్సాహపూరితులై ధర్మమార్గమున చరించిన తప్పక భగవంతుఁడే ఆయురారోగ్యైశ్వర్యములను సుఖశాంతులనే గాక మోక్షమును గూడ ప్రసాదింపఁ గలడని యుపదేశించు చున్నాఁడు.



# ఉ ప సం హా ర ము

ఈ హరివంశమొక మహాసముద్రము. ఈ మహాసముద్రమున నాసాద్యమయిన లోతునకు దిగి గుణ రత్నములను వెలికిఁదీయ ప్రయత్నించితిని.

వ్యాసుని హరివంశమొక పురాణము. ధర్మప్రబోధము నీత్యుపదేశము, ఆస్తిక భావాభివృద్ధి – పురాణముల చరమ ప్రయోజనము. ధర్మప్రబోధము గావించు పట్టుల పరవశించి చెప్పినదే చెప్పుట పురాణ కర్తలకు పరిపాటి. కనుక – కొన్ని అనౌచిత్యము లున్నను – ఆస్తిక్య భావమును పెంపొందించుటకై పురాణకర్తలు వానిని సరకుగొనరు కథా గతికి, రసపోషణకు. భంగములగు వ్రతవర్ణనలను నీత్యుపదేశములను వారు వ్రాయుచునే యుందురు. వ్యాసమహర్షి యంతటి వశ్యవాక్కు గ్రంథము నందలి గుణదోషములు పరిగణించు సామర్థ్యము నాకులేదు. అయినను, తులనాత్మక పరిశీలనఁ గావించు తఱి వ్యాసుని హరివంశమున లేనివి – ఎఱ్ఱయ హరివంశము నందలి కావ్యశోభా హేతువులు, మెఱుఁగులు చూపఁబడినవి.

అపార సాహిత్య పారావారమునందలి యసంఖ్యాకములగు విశిష్ట గుణరత్నము లెక్కడ ? నాయీ అల్పమతి యెక్కడ ? ఈ పారావారము నందింకను దిగవలసిన లోతు మిక్కిలిగా కనుపించుచునే యున్నది. నా చేసినయత్నము సరస్వతీ సమర్పనమున 'చంద్రుని కొక నూలుపోగు' అన్నట్లుగ నత్యల్పమని భావించుచున్నాను.

అయినను, నా యీ పరిశోధన విషయమువలన సహృదయులకు ఏ కొంత హృదయాహ్లాదము కలిగినను – జిజ్ఞాసువులకు – ఏ కొంత జ్ఞాన విశేషము కనిపించినను పాఠకుల కే సదుపదేశము లభించినను – నా యీ ప్రయత్నము సఫల మైనదని ఈ పరిశోధన సార్థకమైనదని భావింతును.

"జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి తేషాం యశఃకాయే జరామరణజం భయమ్"



# ఉపయుక్త గ్రంథ సూచిక


**A.** కావ్యములు :-

(సంస్కృతము)

1. హరివంశము - వ్యాస భగవానుఁడు
2. మహాభారతము - వ్యాస భగవానుఁడు

(తెలుఁగు)

1. హరివంశము - ఎఱ్ఱయ
2. భాగవతము - పోతన
3. భారతము - తిక్కన
4. నృసింహపురాణము - ఎఱ్ఱయ

**B.** చారిత్రక విమర్శ గ్రంథములు :-

1. ఆంధ్రకవుల చరిత్ర - శ్రీకందుకూరి వీరేశలింగం పంతులుగారు
2. ఆంధ్రకవి తరంగిణి Vol. 3 - చాగంటి శేషయ్యగారు
3. ఆంధ్రసాహిత్య చరిత్ర - ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు
4. సమగ్రాంధ్ర సాహిత్యము - ఆరుద్రగారు
   (Vol. 3. పద్మనాయకయుగము)
5. ఆంధ్రవాఙ్మయ చరిత్ర - డా॥ దివాకర్ల వేంకటావధానిగారు

**C.** అలంకార శాస్త్రగ్రంథములు :-

(సంస్కృతము).

1. సాహిత్యదర్పణము - విశ్వనాథుఁడు
2. ధ్వన్యాలోకము - ఆనంద వర్ధనుఁడు

(తెలుఁగు)

1. కావ్యాలంకార సంగ్రహము - భట్టుమూర్తి
2. ఆంధ్ర ధ్వన్యాలోకము - శ్రీమాన్ వేదాల తిరువేంగళా చార్యులు

**D.** సిద్ధాంత వ్యాసములు :-

1. తెలుగులో హరివంశములు - **Dr.** పి. యశోదారెడ్డి
2. ఎఱ్ఱయ - అతని కృతులు - **Dr** వి. విశ్వనాథశాస్త్రి
3. భారత ధ్వని దర్శనము - **Dr.** శలాక రఘునాథ శర్మ
4. ప్రబంధ వాఙ్మయ వికాసము - **Dr.** పల్లా దుర్గయ్య
5. ప్రబంధములలో ప్రకృతి వర్ణనలు - **Dr.** అంతటి నరసింహం
6. ప్రథమాంధ్ర పురాణము - **Dr.** జి. వి సుబ్రహ్మణ్యం
7. వ్యాసభారతము - నన్నయ పరిష్కారము } **Dr.** జొన్నలగడ్డ మృత్యుంజయరావు

(సంస్కృతము)

1. పురాణ పర్యాలోచనమ్ సమీక్షాత్మకోభాగః
2. పురాణ పర్యాలోచనమ్ గవేషాత్మకోభాగః

**Dr.** శ్రీకృష్ణమణి త్రిపాఠి

## E. Articles :

1. విజ్ఞాన సర్వస్వము **Vol. 3.** ఎఱ్ఱాప్రెగ్గడ **Page 733**
2. సారస్వత వ్యాసములు, - కవిసామ్రాట్ నోరి నరసింహశాస్త్రిగారి వ్యాసములు

ద్వితీయభాగము

a) ఎఱ్ఱయ కవిత - **Page. 192**

b) ఎఱ్ఱయ హరివంశములో గ్రామజీవనము - **Page. 249**

3. సాహితీ మంజూష - ప్రబంధ పరమేశ్వరుఁడు.
**Dr. G, V.** సుబ్రహ్మణ్యం
4. ఆంధ్ర సాహిత్య వికాసము - 'ఎఱ్ఱాప్రెగ్గడ'
**Dr. P.** యశోదారెడ్డి

## F. English :

1. Essays in Sanskrit Criticism
Dr. Krishna Moorthy
Karnataka University


